శ్రీమద్

# రామాయణేంద్రధనుస్సు

( అను శతక రామాయణము )

## బాలకాండము

( వాల్మీకి ననుసరించి )



డా॥ వి. వి. కుటుంబరాయశర్మ, ఎం.ఏ;బి.ఇడి;పిహెచ్.డి;

శ్రీమద్

# రామాయణేంద్రధనుస్సు

( అను శతక రామాయణము )

## బాలకాండము

( వాల్మీకి ననుసరించి )



డా॥ బి. వి. కుటుంబరాయశర్మ, ఎం.ఏ;బి.ఇడి;పిహెచ్.డి.

ప్రకటనకర్త : డా॥ వి. వి. కుటుంబరాయశర్మ

ముద్రణము : లక్ష్మీ ప్రింటింగ్ వర్క్స్, విద్యానగర్, హైదరాబాదు-500 044.




ప్రథమ ముద్రణము : వేయి ప్రతులు, 3 ఏప్రియల్ 1990
(శ్రీరామనవమి)



గ్రాయల్టీ ప్రకటనము : మూల్యము, రూ॥ 76 లు

ప్రాప్తిస్థానము : డా॥ వి. వి. కుటుంబరాయశర్మ, 1-9-295/13/ఎ/.
విద్యానగర్, హైదరాబాదు-500 044. (ఆం. ప్ర.)



మత గ్రంథ ప్రకటనల నిమిత్తమై
యార్థిక సాహాయ్యము
అను ప్రణాళి ననుసరించి

శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారు
ఒసంగిన ధన సాహాయ్యముతో
ఈ గ్రంథము ప్రకటితము

# వాఙ్ముఖము

శ్రీమద్రామాయణమును శతకరూపములో రచింపుమని శ్రీరామచంద్రుని యాజ్ఞ యగుటనుగూర్చి ముందుగా నా సుందరకాండము వాఙ్ముఖములో జెప్పి యున్నాను. శ్రీరామానుశాసనమైనతరువాత రెండేండ్లు దానినిగూర్చియే యాలోచించుచుఁ గాల యాపనము జేసితిని. దీనికిఁ గారణము తత్కార్యభారమును వహించుటకు ధైర్యము చాలమియే! అందుకొఱకే 'సంగ్రహబాలకాండ' మొకటి కూర్చితిని. దాని నీ బాలకాండాంతమున సంధానింపఁగలను. సంగ్రహబాలకాండ మొసఁగిన ధైర్యము చాలక 'శ్రీరామచన్ద్రప్రభు త్రిశతి' నొకటి రచించుట జరిగినది. ఆ త్రిశతిని సుందరకాండ ప్రకటనము తర్వాతఁ బ్రకటించుటయు నయ్యెను. ఇంతకుఁ జెప్పునది, నన్నీ రామాయణ రచనము ఏతావత్కాలమును దఱుముచునేవచ్చిన దను విషయమే.

మానవులకుఁ దమతమ పూర్వ జన్మ కర్మఫలముగనే నిర్ణీతమైన పరిమితిలో, నిర్ణీతకాలములో, చతుర్విధ పురుషార్థములను లభింపఁగలవు. నాతనేనై యీ రామాయణమును జెప్పఁగల సామర్థ్యముగలవాఁడను గా నని నా విన్నపము. "తిక్కనార్యునకుఁ గల వచ్చెను; మీకును వచ్చినది; పోతనార్యుఁడుఁ 'పలికించెడివాఁడు రామభద్రుం డట' యనెను; కాళిదాసుఁడు, 'మందః కవి యశః ప్రార్థీ' అనెను; మీరును నట్లను చున్నారు;" అనినచో, నే నేమియుఁ జెప్పలేను. ప్రాసంగికముగఁ గర్మఫలముసంగతి వచ్చినదిగాన, దానిని గుఱించి యించుక ప్రస్తావించుట నా కర్తవ్యము.

భగవత్సృష్టిలో జీవరాసులందుఁగల వ్యత్యాస వైవిధ్యమును బరిశీలింపఁగా, వాని యన్నిఁటికిని గారణ మా యా జీవాత్మ పూర్వజనిలో జేసికొనిన కర్మయే యని విదితము; పురాణేతిహాస శాస్త్రములును నట్లే బోధించుచున్నవి.

అగుచో, నిట్టి కర్మ స్వరూప మెట్టిది? పురా జన్మకృత పుణ్య పాప రూప కర్మ, సుఖ దుఃఖ ఫలద మగుటవలన, నూహ్యమేగాని, దృగ్గోచర మగునది కాదు. కేవలము పుణ్యమును మాత్రమేగాని, కేవలము పాపమును మాత్రమేగాని, యే వ్యక్తియు సల్పియుండఁడు. అందువలనఁ గత జన్మలో

జేసిన పుణ్య పాప కర్మ ఫలముల ననుభవించుటకొఱకే ప్రతివ్యక్తియు నిహ లోకమున జన్మింపవలె ననునది ప్రకృతి ధర్మము.

'కర్మ' మనునది తులా సదృశము (త్రాసు వంటిది). తులాదండమున కిరు వైపుల వ్రేలాడుచుండు పళ్లెములలో నొకదానియందు మన పుణ్యమును మఱి యొకదానియందు మన పాపమును నుంచినచో, పుణ్యమెక్కువగ నున్నయెడల, నా దండెకు నడుమనుండు ముల్లు, పుణ్యమున్నవైపు మ్రొగ్గును. అట్లే, పాప భారమునుబట్టి పాపమున్నవైపు మ్రొగ్గును. అందుచే తులా దండమునకు నడుమ నుండు ముల్లును, మనచే గర్మఫలము ననుభవింపజేయునట్టి తటస్థుడగు భగవంతునిగా భావింపగలము. భగవానుడు మన కర్మ ఫలమును మనచే ననుభవింపజేయునట్టి మధ్యస్థుడు; తా నేదియు మనకు దెచ్చియీయడు. మనము చేసికొన్నదానిని మనచే ననుభవింపజేయునట్టి మధ్యస్థుడు. అందు చేతనే "న మేహం సర్వ భూతేషు, న మే ద్వేష్యోస్తి న ప్రియః" - అని భగవద్గీతలో పరమాత్మ చెప్పకొనెను. "తాజేసినయది పడకపోవ శివునకు వశమే?" అనునది తిక్కన సుడి.

పుణ్య పాప రూపముగనున్న జన్మజన్మాంతర కర్మలను, వానివలన లభించు సుఖ దుఃఖానుభూతులనుబట్టియే మనమూహించుకొనదగును. అవి ప్రత్యక్షములు గావు. మనము నేడనుభవించువానికి దొల్లిటిజన్మ కర్మలే కారణము లని మఱియొకచెప్ప నక్కఱలేదు. అందుచే పూర్వకర్మానుభూతికిని నేటి వ్యక్తికున్న యాచరణమునకును సంబంధ ముండదు. కావున నేటి దుఃఖ ఫలములకు గతజన్మలోని పాపాచరణమే కారణ మని గుర్తించి, దేవతా నిందచేయక, యాస్తికుడై బావిలో నైనను పేల్కొని, జాగృతి వహించి యథాశక్తి నిశ్శ్వరార్పణబుద్ధితో సత్కార్యాచరణ దగ్గ మానవుడు, రాగల జన్మలో సుఖ భోగముల ననుభవించితీరును. అంతేగాక, యట్టి పుణ్య పాపము లత్యుత్కటము లైనచో, నిహ జన్మమునందే వాని వాని ఫలము ననుభవింప గల్గుదు మని మహర్షుల పలుకు.

ఇక ననుభవించినగాని, పాప విమోచన మని లేదా? యని ప్రశ్నించి నచో, జప తప పఠన పారాయణ ప్రార్థనాదులవలన బాపమున రింనక

నెరలింపఁగలుగవచ్చు నని సమాధానము. కావుననే భారత భాగవత రామాయణములు పఠన పారాయణముల కుపయుక్తము లగుచున్నవి. ఈ మూఁడిటియందును పారాయణ విషయమున రామాయణము శిరోధార్యము. 'ఉమా సంహిత' లో రామాయణ మహిమ వర్ణింపఁబడినది. శ్రీమద్రామాయణము లోని యాయా ఘట్టముల పారాయణమువలన నాయా కోరికలు మనవి నెఱవేఱఁ గల వని చెప్పుట కొరకు క్రమముగ పట్టిక నేర్పాటు చేయవచ్చును. ప్రకృతమున కొక బాలకాండమునుగూర్చి మాత్ర మట్టి పట్టిక నేర్పఱచి చెప్పుదును:-

| క్రమ సంఖ్య | సంకల్పిత కార్యము | కాండము సర్గములు | పారాయణ ఘట్టము పేరు | పారాయణ కాలము, విధము | నివేదన ద్రవ్యములు |
|---|---|---|---|---|---|
| 1 | వివాహము జరుగుటకు | బాల-73, | సీతా కల్యాణము | ఉదయవేళ | సద్యః క్షీరము |
| 2 | పుత్రసంతాన ప్రాప్తికై | బాల-15, 16 | పుత్రకామేష్టి | ఉదయము (ఇరువది దినములు) | ఘృతమిశ్రిత పాయసము |
| 3 | శుభ ప్రసూతి నిమిత్తము. | బాల-18- | శ్రీరామావతారము | గర్భిణికి వినఁబడు నట్లు. | ఆవేళకు దొరకిన నివేద్యవస్తువు. |
| 4 | సకలాభీష్ట కార్యసిద్ధికి | బాల-75, 76 | భార్గవ విజయము | ఉదయము | పాయసము అప్పములు. |

పఠన మనఁగా, నర్థమును గ్రహించుచుఁ బంక్తులు గ్రంథమును జదువుట. పారాయణమనఁగా, నర్థముతో సంబంధములేకయే భక్తిపురస్సరముగఁ జదువుట. ఇందు దేనికైనను నా యా సంప్రదాయముల ననుసరించు నా యా విధము లున్నవి.[1]

"శుక్లాంబరధరం విష్ణుమ్" – అనుచు నుపక్రమించి శ్రీవాల్మీకి స్తుతియు హనుమత్ స్తవమును శ్రీరామాయణ ప్రార్థనమును శ్రీరామచంద్ర ధ్యానమును సలిపి, 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్' అనుచుఁ బారాయణ సమాపన క్రమమును జెప్పుకొనుట శ్రీస్మార్త సంప్రదాయము, [స్మార్తులు భారతదేశమున నూటికిఁ దొంబదిమంది కలరు.]

అట్లే, "రామానుజ దయా పాత్రమ్", "శ్రీశైలేశ దయా పాత్రమ్" - ఇత్యాదిగాఁ బ్రారంభించి, "శ్రీభాష్యకారోత్తమ దేశికాయ, శ్రీశైల పూర్ణాయ నమోనమస్తే" అనుచు, "కూజంతం రామ రామేతి" యనుచు, "వైదేహీ సహితం సురద్రుమ తలే" మున్నగు శ్లోకములతో యథా శక్తిగ నారాధనము చేసి పారాయణ సమాపన క్రమమును జెప్పుకొనుట, శ్రీవైష్ణవ సంప్రదాయము.

అదే రీతిని 'శుక్లాంబరధరమ్' అని ప్రారంభించి, యాంజనేయ స్తవము సలిపి, "వైదేహీసహితమ్" మున్నగు శ్లోకాళిని బఠించి, "హయగ్రీవ, హయగ్రీవ, హయగ్రీవేతియో వదేత్ తస్య నిస్సరతేవాణీ, జహ్ను కన్యా ప్రవాహవత్' అని పారాయణ సమాపనక్రమమును జెప్పుకొనుట శ్రీమాధ్వ సంప్రదాయము.

మొత్తముమీఁద, శ్రీమద్రామాయణము సర్వ మతానుయాయులకును, నారాధనీయ మనుటస్పష్టము. అందును విశేషించి బాలకాండమును సంతానార్థులు నిత్యము పఠించి, పారాయణముచేసి, పుత్త్రసంతానవంతు లగుట నా యెఱిఁగిన విషయము. గౌరవము ప్రతి గౌరవమును చేతను వలె, విశ్వాసము, ప్రతివిశ్వాసముచే రాణించును గదా!

---

1 వావిళ్లవారి రామాయణ ప్రకటనము (19 )
చూడఁగును.

నా రచనా ప్రక్రియనుగూర్చి సుందర కాండములో నెంత విస్తరించి చెప్పిన, నిప్పటఁగూడ నించుక తద్విధానమునుగుఱించి యుటంకింపక తప్పదు. ఒక్క బాలకాండమును మాత్రమే చదువు వా రుందురు గదా!

నా యీ కావ్యము శతక పద్ధతిలో గొనసాగుటవలనఁ, బ్రతిపద్యమునను చివరి చరణములో నే నించుక విమర్శకు దిగక తప్పదాయెను. విమర్శయుఁ గవితయు నను నీ యుగళము బాగుగఁ గూడివచ్చినచో సహృదయుల కానందము కలిగించుటకై యవి హృదయంగమ మగు రసమును నిష్పాదనము సేయఁ గలవు. విమర్శకుఁడగు కవికంటెఁ, గవితాశాలి యగు విమర్శకుఁడు భిన్నుఁడు కాఁడు. కావున విమర్శకుఁడగుకవిని స్తుతించుటకు కవియైన విమర్శకుఁడే యోగ్యుఁడని నా మతము.

| | |
|---|---|
| హైదరాబాదు. | విబుధ విధేయుఁడు |
| ప్రమోదూత | డా॥ బి. వి. కుటుంబరావు |
| వైశాఖ, శు ౨ | (గ్రంథకర్త) |
| గురువాసరమ్. | 26-4-1990 |

# వాల్మీకి ప్రాశస్త్యము

రామాయణ ప్రాశస్త్యమును జెప్పిన పిదప, వాల్మీకి ప్రాశస్త్యమును జెప్పక మానలేము. రామాయణమునకును వాల్మీకికిని గార్య కారణ సంబంధ మున్నది. రామాయణ రచయితగాని వాల్మీకికిని, వాల్మీకి విరచితముగాని రామాయణమునకును, గుర్తింపు తక్కువ. అన్వయ సహచారము, వ్యతిరేక సహచారమునకు మూలము. కావున గారణములేని కార్యముండదు. కార్యమును సాధింపనిది కారణమేగాదు. కీర్తి విషయమున రామ వాల్మీకులకును నన్యోన్యత సంగీకరింపకతీరదు.

ఓంకారము వేదములకు వలె, మనువు మానవులకువలె, వాల్మీకి మునీంద్రుఁడు కవులకుఁ బ్రథముఁడు. తత్ప్రథమత కేవలముఁ గాలముచేతనే గాక, గుణముచేతనుగూడ నగుట ముదావహము. వాల్మీకి 'మా నిషాద' శ్లోకము నుండి శ్లోక ముద్భవించు టొక వింతగాదు. మా నిషాదమైన (లక్ష్మీ నిలయమైన) పద్మము, కాదము (బురద)నుండి యుద్భవించుట లేదా?

భారతము పంచమవేదము. రామాయణము కావ్యము. ప్రభు మిత్త్రసమ్మిత మగు (సాటియగు) భారతముకంటెఁ, గాంతా సమ్మిత మగు రామాయణ శ్రేష్ఠ కృతి, 'కవిరామాయణుఁ'డే పుట్టియుండనిచో, నెట్లు పండిత పామర సుసేవ్య మయ్యెడిది? వారి కానందోప లబ్ధి యెట్లు కలుగఁగలదు? అద్దము ప్రత్యక్ష వస్తువునే ప్రతిబింబించును. కేవలము నామ మాత్రావశిష్ఠ మగు వస్తువునుగూడఁ జక్కఁగఁ జూడఁగల భాగ్యము, వాల్మీకియే లేనిచో, లోకుల కెట్లు లభించును? తా నెఱుఁగనివానిని వర్ణించుటలో సైతఁ, మాతఁడు చూపుచాతుర్యము, వానివానితోఁ బ్రగాఢ పరిచితి గలవారినిగూడ సిగ్గుపడఁ జేయఁగలదు.

కాలము గడచుకొలఁది శోభను గోల్పోవు చిత్రమువలెఁ గాక, కాలముతో బాటు సౌందర్యము పెంపొందు రామాయణకావ్యమును వాల్మీకి వినా, యెవ్వరు రచింపగలరు?

ఎప్పటికైనను జీర్ణతను బ్రలయమును బొందు బ్రహ్మసృష్టిని ధిక్కరించు రామాయణ సృష్టి, వార్ధక విలయ రహితమైనది, యెవ్వరు కావింప గలరు?

బ్రహ్మ సృష్టిలోఁ బ్రాణులకు శోక క్రోధ భయ జుగుప్సాదులు గల్గించుచుఁ ద్యాజ్యములగు వస్తువులు, వాల్మీకి సృష్టిలో ముద మానందముచే గల్గించుచు భోజ్యము లగుచున్నవి. ఆ మహర్షియే పుట్టియుండనిచో, నా యా వస్తువులు, సిద్ధాశ్రమమునం దున్నవానివలె, మక్కువతో నెట్లు భోజ్యము లగును ఎట్లానందమును గల్గించును?

బ్రహ్మ సృష్టితో రామ రావణు లొకానొకప్పుడు మాత్రమే యుండిరి. ఆ రామ రావణులను దన కావ్యసృష్టిచే నెల్లప్పుడు నుండునట్లు చేయఁగల సామర్థ్యము వాల్మీకి మహర్షికే గలదు. ప్రాచేతసియే గలుగని నాఁడు, లోకయాత్ర యందుఁ ద్యాగమయ జీవి యగు శ్రీరాముఁ డెవరో, దయాశీలిని యగు సీత యెవరో, పరదారాభిలాషి యగు రావణుఁ డెవరో, మనకు విదిత మగుట కుపకరించు భారతీయ కవి వరేణ్యు లెట్లు పుట్టియుందురు? మన కవుల కప్పు డిక వంశకర్త యేఁడి?

రాముఁడు కొందఱకే రక్షకుఁడు; రావణుఁడు కొందఱకే శత్రువు; కాని, యా యా రామరావణులను లోకులెల్లరకు రక్షకులుగను, శత్రువులుగను జేయఁ గల కవులకు వాల్మీకి పుట్టనిచో, గురుస్థాన మేది?

శ్రీరామభద్రుఁడు విశ్వస్థితి కారణుఁడు. తత్స్థితి వాల్మీకుని యధీనము. దైవముకంటె, నా దైవ దర్శన మిప్పించు గురువు మహనీయుఁడని కొందఱు పల్కుగదా!

వాల్మీకిమహర్షియే లేనిచో, నెందఱు పుణ్యులమై మిగిలి పోయెడివారమో! కాన వాల్మీకుని ప్రాశస్త్య మెంతని యెంచింపఁగలము?

భావి కథమునుగూడ దృష్టిలో నుంచుకొని శ్రీమహావిష్ణువే, యాత్మ చరిత్ర రచించుటకై తన యాస్థాన కవిని వాల్మీకుని, వైకుంఠమునుండి తనతో దెచ్చుకొనెను. కాదేని నేఁటికిని నాదికవికి సాటియైనవా రేరి? కవు లెల్ల రాతని కధమర్ణులే! వారి నా ఋణవిముక్తులుగఁ జేయుటకు మహాత్ములగు భూపతులే సమర్థులు.

వాల్మీకి మహామునియే పుట్టకున్నచో, నేఁడు కవి వరేణ్యులును, మహా కావ్యములును, కావ్యానందమును, శ్రీమహావిష్ణువు నవతార మగు శ్రీరామ చంద్రుఁడును, రామ భక్త పరులును నుండెడివారు కారని యొక్క మాటలో చెప్పవచ్చును. లోకమున నెల్లెడ నజ్ఞాన ముండెడిది. ఇం టింట రావణుఁడు నుండెడివాఁడు. అట్లు గాకుండఁ జేసిన ప్రాచేతసునికి మన మెల్లరము కృతజ్ఞు లము. తన కావ్య నాయకుఁ డగు శ్రీరామచంద్రునికంటె, వే తొక రెవ్వరును వాల్మీకికి సాటువ కాఁజాల రని నాదృఢ ప్రత్యయము.

| | |
|---|---|
| హైదరాబాదు. | విబుధ విధేయుఁడు, |
| ప్రమోదూత | డా॥ బి. వి. కుటుంబరావు. |
| వైశాఖ శు ౫. | (కృతికర్త) |
| శ్రీశంకరాచార్య | 29-4-1990 |
| జయంతి | (భానువాసరము) |

శ్రీ

# ఇష్ట దేవతా ప్రార్థనము

శ్రీసీతాసతి యంకపాలిగతయై చెన్నార, సౌమిత్రియున్
వాసిన్ బ్రమొక్కఁగఁ, దక్కుఁ సోదరులు సేవాలోల సహ్యానసో
ల్లాసోపస్థితిఁ జామరంబు లిడుచున్ రంజిల్ల, పీఠాసనా
ధ్యాసుండు, గేసరినై నిమున్ వలతుఁ గొల్వం బ్రీలి, రామప్రభూ!

శ్రీ

## పూర్వ కవి స్తుతి

హృదయ బ్రహ్మరథంబు నన్నయను నే నెక్కింతు; సద్యన్ సము
ద్యద్దుదదంతా[1] వృత మ న్మరు ద్ధృదయ సద్మంబందు సేవింతు నిం
పు దలిర్పన్ బుధుఁ దిక్క యజ్వను; మనో మూర్ధాగ్ర సంచారిఁ జే
సెద నెఱ్ఱన్నను; దే త్రి హృ న్మధురిలో శ్రీనాథు; రామప్రభూ!

1. శ్రిత;

## కృతిపతి సంబుద్ధి

అనుగృహ్ణాత్సవితు ర్వరేణ్య మగు భర్గాకార గాయత్రి రూ
ప నిరూఢుం డయి కూడ, నా దశరథ ప్రాజ్ఞాని పుత్రుండవై
జనకళ్యాణ నిమిత్తమై సలుపు నీ సత్కార్య సల్లాపముల్
విన, నీవే దలపోయువాఁడ! కృతి [3]శిల్పి స్వామి! రామప్రభూ!

2. శ స్తుతి; 3. కర్మి, కర్త;

# శ్రీ రామాయణేంద్రధనుస్సు

## అవతరణిక

శ్రీభూపుత్రిని గూడివచ్చి కలలో రెం డేండ్లనాఁ డెప్పుడో!
బాధాసి స్థిర దీర్ఘ రూప శతకా వ్యాభిరామాయణ
శ్రీకావ్యంబును నిల్పు మంటివి ననున్;-సి గ్గేది యిన్నాళ్ళకున్
నీ భావం బెఱుఁగంగనేరకయెయుంటిం దండ్రి! రామప్రభూ! 1

పరికింప వచియింతు? నీదుచరితం బెన్నాళ్ళు యోజించియున్;
పారావారము నంతయున్ ఘటిని నింపన్ నేను వాల్మీకినే?
సౌరుల్ మీఱిన తన్మహర్షి రచనన్ సాకల్య మీక్షింతునే?
భారం బంతయుఁ దాల్చు, నాస్తుతిని దీర్పన్ నీవె! రామప్రభూ! 2

శ్రీనారాయణుఁ డీవుగా భువిని మూర్తీభావముం బొందఁ, ద
న్నానా ధర్మగుణ ప్రకర్ష కథనోత్పాదియంబు వేదంబు తా
నానందంబున నాదికావ్యమయి నిన్నగ్గించె నం చంద్రు; నే
నా సేవ్యల్ గనఁగల్గ, నీవ యయిపోనా? మాన్నె; రామప్రభూ! 3

ఇలపై నాదికవీంద్రుఁ డెంచినవి నీ యాద్య ద్గుణ ప్రౌఢ రీ
తు లనవ్యాదృశమై కనంబడుచుఁ గీర్తుల్ మోయు టూహింప, ని
స్తులమై లౌకికమై యపూర్వమగు ఛందోవృత్తి చేఁగల్గె; దా
ని లసన్మూర్త్యవతార హేతువయి వన్నెంగూర్తు; రామప్రభూ! 4

శార్యోదారుఁడ వౌటెగాక, ధృత సంస్కారంబు పుంజింపఁగా
మర్యాదాపురుషుండ వౌటను భవన్మాహాత్మ్యమునం దందునన్
గార్యాకార్య విచక్షణత్వ మొకటే గాకుండ లక్షింపఁ ద్రు తా
రార్యుల్ గావ్యకృతప్రయోజన సుసామగ్ర్యంబు; రామప్రభూ! 5

జయదేవుండు, మురారి, భోజుఁడును నీ చారిత్రమున్ మానుకొం
ట యసంభావ్యము చెప్పకే యనెదు నాటల్ గా దనంగాని, వి
స్మయమునుం గొల్పెడి భారతీయ గృహ యా వల్లీవితతి కథన్
ప్రియ మారం బ్రతిబింబితం బగుట, తృప్తిం గొల్పు; రామప్రభూ! 6

తలిదండ్రుల్, పతిపత్నులున్, సుతులు, భ్రాతల్, సేవకుల్, తిర్యగ్జీ
తులు, మిత్త్రుల్, గడు శత్రువుల్, వదినెలుం, దూలించు దుస్సేవికల్,
వలపింపంగలభక్తులున్, గురువులున్ వందించు శిష్యాగ్రణుల్,
దలఁపింపం దమ జీవితంబు క్షయవృద్ధుల్ బొందు; రామప్రభూ! 7

నీచారిత్రము నాకళించుకొనుచో, నిర్వ్యాజ్య లోకజ్ఞతో
ద్రేకుండై నెగడంగఁజాలెడు నయత్నుండున్; మహా దుఃఖ సం
శోచామంగలముల్ బ్రుటిం గెడపఁగల్గున్; లౌకిక క్లేశ ని
ర్మోచానందము నొందెడుం గళిత కర్ముం డౌచు; రామప్రభూ! 8

వరలున్ నీదు ప్రసిద్ధ వృత్త మిటు, యావద్భారత క్షోణిన్
స్థిర సత్సంపదయై, యుదాహరణమై దీపించుచుం గూడ; సుం
దర సుస్పష్ట భవత్కఠోర నియమాదర్శ ప్రవాళ చ్ఛవుల్,
వెరఁ గొల్పున్ జగ మెల్ల మెచ్చ నటు, వ్యాప్తిం జెంది; రామప్రభూ!

ఉద్దీపించు గుణంబులం బొనరు-ధీరోదాత్త సామ్యంబు తాఁ
గర్థించున్ నిను సుద్ధిసేయ జగదాకర్షి ప్రసంగం బెటుల్
బద్ధింపం దగు? నీచరిత్రమె గవుల్ బల్మాఱు చెప్పంగఁ దా
ముద్దేశించుట, నీ గుణావగుణమే యోజింప; రామప్రభూ! 10

తనరన్ నీతలిదండ్రిదమ్ములయెడన్ దారాసుహృత్సాళితో
డను, బంధు ప్రజ భక్త సేవకులతోడన్, నీవు చూపించు మ
న్ననలెన్నంగలవారె లోకులు? భవ ద్వ్యాన్య ప్రవృత్తుల్ సదా
ననుపుం గొల్పెడి యొజ్జబంతు లగు టానందంబు; రామప్రభూ! 11

ఒకచోఁ గోడలు నొక్కచో సుతయు వే రొక్కింటఁ దా భార్యయై
యొకచో సాధ్వియు నైన సీతయును, దా నొక్కింట సోదర్యులై
యొకచోఁ బుత్త్రులు భర్తలున్ మఱఁదులై యొప్పారు నీ భ్రాతలున్,
సకలాదర్శులు లౌటఁ గూర్తురు ప్రశంసల్ నీకె; రామప్రభూ! 12

సాయం బాపము లెల్లఁ బాతకులకున్, బ్రహ్మోపదేశంబునం
దే యే యక్షరముల్ వినంబడునో! వానిం గూర్చి, వాల్మీకి తాన్
గాయత్రిం బగు రామ సత్కథ యనంగాఁ ద్వచ్చరిత్రంబులో
వ్రాయం బూనుట నీ ప్రశస్తతకె దాఖ్యానంబు; రామప్రభూ! 13

వర సత్త్వుండును సుందరుండు, గుణవ ద్వరిష్ఠుఁడున్ భక్తిబం
ధురమధ్యేస్థుఁడు, నిర్జితేంద్రియుఁడు, సిద్ధుండుం గృతార్థుండుఁ గే
సరి పుత్త్రుం డగుఁగాక, వానికి శివ త్వం సేవయే లేనిచోఁ,
బరమోత్కృష్ట సుపూరుషత్వ మెటు సంప్రాప్తించు? రామప్రభూ! 14

హనుమంతుం డొగి నిన్నుఁజేరి పరిచర్యల్ సేయుటంబట్టి నీ
వును, నీవుం దన సేవలం గొనుటచేఁ బూతాత్ముఁడైనట్టి హా
వనియున్ సర్వ మతానుయాయుల కిలన్ వంద్యాత్ము లైనార; లం
దున నన్యోన్యము మీ రలంకృతులరై తోతెంత్రు; రామప్రభూ! 15

సీవా! సుందరులందు సుందరుఁడ; వా నీ వృత్తమా! సుందరం
బై వెల్గొందును; నీదు మంత్ర మది యష్టాక్షర్యమా! సుందరం
బై వర్తిల్లును; నీదు భక్తవరుఁడా! యన్నిందునున్ సుందరుం;
డేవి? సుందరులం దసుందరము లన్వేషింప; రామప్రభూ! 16

సరిగా వైష్ణవ సంప్రదాయమున నీచారిత్ర్యమున్ దీర్ఘ సం
శరణార్థుల్ గల దందుఁ జెప్పుదురు; కౌసల్యా శబర్యాదులున్
భరతుండున్ హనుమ ద్విభీషణ దశప్రస్యందనుల్, సీతయున్
గురుగాథేయుఁడునుం దథాగతులు నీకుం గారె? రామప్రభూ! 17

సీచారిత్రముఁ జూడఁజూడ శరణుల్ నిర్ధారయద్భక్తిమై
సీచోపుల్ వినతుల్ బ్రజామమును తా సీకవ్ నమర్పించుటల్
జూ.చా. తప్పక చెప్పునట్టి చరితోద్ఘోషం బసం జెల్లెడున్;
బాబాతూరని పేరు నా దెటులఁ దొరసం దోఁచు? రామప్రభూ! 18

శరణార్థుల్ నిను మున్ బరంపరగ సంస్కారాత్మతన్ సేవచే
సిరి యస్నట్టి యుదంతముల్ దెలిసి, రాశీభూత ధర్ముండవై
పరమాత్ముం డగు నిన్ను మా దృఢులునుస్ భక్తి బ్రపన్నాత్మతన్
స్థిరులై కొల్చిన నీ దయం బడయుటల్ సిద్ధంబు; రామప్రభూ! 19

పద విన్యాసముచేత నెంతగ రస ప్రాధాన్యముం బొందిన
ద్రిదా! నీ దివ్య చరిత్ర, మంత మతకోటిం గూడసున్ నేర్పంగ
వ్యనవి, యాచార సుబోధకం బగుచు; దాసన్ రెంతుగా నిర్వ్యళిస్
విదితాచారముఁ గూర్చునట్టి దీక్ష సుల్వం గద్దె? రామప్రభూ! 20

భార్యా భర్తల జీవితంబులు సమప్రాధాన్యముం బొంది, ని
ర్వార్యంబై యఖిలీనమౌ, ప్రణయ పారస్పర్యముం గల్గి, గాం
ధీర్యంబుల్ దృఢతల్ సుధీరతలు ము ప్పేపై పెనంగొంచు, నై
ధుర్యం బొర్చిన వేవి? విశ్వమున మీతోఁ దోల్ప; రామప్రభూ! 21

గుణ వీర్యాదిక శోభతా మహిమచే గుర్తొందు పుణ్యాత్ముఁడై
తనరం జాలిన పూరుషుం దెలియఁ బ్రస్తావించి వాల్మీకి తాన్
బ్రణతుండై కమలాసనుం గని పరిప్రశ్నింపఁగా, నారదున్
ప్రణతియై నిన్ నుడివెం; ద్వదీగ్గ యశమా! కీదృక్కు? రామప్రభూ! 22

చరితార్థుండు ప్రచేతసుండు తమ [illegible] చెప, సం
దరుడై తోఁచిన క్రౌంచ దంపతి [illegible] ,  [illegible] తా
సురు కావ్యంబును జెప్పఁగల్గుట, పుడరోన్ పక్షులుల్ గూర్పుటల్
ధరపై నీ చిర కీర్తి నిల్పుటకె గాదా! చెప్పు; రామప్రభూ! 23

కవిరామాయణు నోట వెల్వడిన వాక్యంబుల్ మనం బందుఁ జా
ల వగం గూర్చుచుఁ బాద బద్ధములు, సారస్యప్రమాణాక్షరో
ద్రవ తుల్యంబులు, తంత్రికాది లయ సంబద్ధంబులై యొప్పఁ గ
స్నవి వ్యంజించుఁ బ్రతిష్ఠ కెవ్వరి వనేకార్థాప్తి? రామప్రభూ! 24

సకలార్థందపు పీఠ్యగానియెడలన్ సాక్షాత్కృతుండైన బ్ర
హ్మకు వాల్మీకిమహర్షి కహ్వ మిధున వ్యాపారమున్, దాను శో
క కుపశ్రింబద నద్ది శ్లోక మగుటల్ గంతోక్తముం జేయ, వా
గరా కంజుంగుసు సీతకథన్ నుడువ నేలా? పంచె; రామప్రభూ! 25

అపి వాల్మీకి నమస్కృతం బెటువుసయ్యా! యన్న, పీయోగ్యతన్
విదితంబుం బొనరింపదా? యనెడి సందేహంబు కాదింయ; నె
య్యదియుం గాదు, రసజ్ఞు లందఱికి భాగ్యం బన్న, ధీరేశరుల్
పదరం జూతురు; కాన నెట్టిరిడియున్ భాగ్యంబు; రామప్రభూ! 26

ఆమరుల్ రాజుబుదాదులుం బనుచ దైన్యం బార విన్ వేడఁగాఁ
బ్రమదం బొప్పఁ బ్రభిబ్రతుకుం బగుదుఁ ! బారంభింప నే దయ్యెఁ, దాన్
గమనింపన్ సుషమా సమన్వితమె గాకన్ సమ్మితం బౌట వ్య
క్తము సీధర్మ దయోష్ప జీవిత కథా కార్యంబు; రామప్రభూ! 27

# బాలకాండము
# కథా ప్రారంభము

నారదాగమనము—౦—వాల్మీకి ప్రార్థనము

సిద్ధమై యెల్లఁ దపస్సు సేసి, మహా శ్రేష్ఠుండు వాగ్విత్తము
స్థితులం బూజ్యుఁడు మౌని వర్యుఁ డని కీర్తిన్ మెంసె నెవ్వండు, వే
ద రహస్యంబుల నిరతోరుయోగపరుఁడౌ నా నారదున్ మ్రొక్కి, సుం
దర వాల్మీకి మహర్షి, యొక్కయెడ సాధ్యంబందు; రామప్రభూ! 28

మునివర్యా! సకలోచ్చ సద్గుణ సుసంపూర్ణుండు, వీరాగ్రణీ
ప్రణుతోపక్రమ ధుర్యుఁ, డార్య మత ధర్మజ్ఞుం, డుదారుండు, స
త్య నిరూఢుం, డచల వ్రతుండు, సమదీర్ఘాచార సంపన్నుఁ, డెవం
డునె? యొక్కండిల, నందుఁ దాఁ దెలియ వేడుం జెప్పు; రామప్రభూ! 29

వసధి ప్రావృత మేదినిన్, సకల జీవ ప్రీతి యుక్తుండు, స
ర్వ నిగూఢాంచిత శాస్త్ర సంవృతుఁడు, సర్వ శ్రేష్ఠ కార్యజ్ఞుఁ, డ
త్యనపాయ ప్రియదర్శనుండు, ననసూయా మానసోర్జస్వలుం
డును, దేజస్వియు నున్నె? నే ననె నొకండుం దాను; రామప్రభూ! 30

మనమునం గారణహీనకోపమున కేమాత్రంబునుం దార్పకుం
డినవాఁడున్, సురలైననున్ మొనల నోడింపంగనౌవాఁడు, గాం
తి నధృష్యుం డగువాఁడు, నెల్లయెడలన్ ధీరుండునౌవాఁడు, సుం
డునె? యా ధాత్రి, నటంచు నారదుని వేఁడున్ మౌని; రామప్రభూ! 31

పరమోత్కృష్ట దెవంబు నేని నిలలో దుష్యుండు సున్నాఁ డనన్
నడు, నవ్వానినిగూర్చి మీ రెఱుఁగకుండన్ రాదు; సమ్మోద ని
ర్భరుఁడై విందును; మీ రెఱుంగునెడఁ జెప్పం గోరుదున్; వానికై
యొరసేయుం, డని వాల్మీకుంసు మని నెంతో వేఁడు; రామప్రభూ! 32

విను, నీ తెలిసిన సర్వ సద్గుణ సుసంపృక్తుండు భూలోకమం
దు నలభ్యుం; డయినం గలం డొకఁడె యిందున్ నేఁడు నిక్ష్వాకు సం
భవ జన్మించిన రామచంద్రుఁ డను పుణ్యుం; డంచు వాల్మీకికిన్
ముని చెప్పెన్, రఘువీరు కళ్యాణ కథ సంపూర్ణంబు; రామప్రభూ! 33

—౨—

విని వాల్మీకి మహర్షి యెల్ల కథయున్; శిష్యుంబుసుం బొందెఁ; బూ
జనలన్ నారదుఁ దృప్తినిం జలిపె, శిష్య శ్రేణి సంయుక్తుఁడై;
చనుచున్ నారదుఁ డా ప్రచేతసుఁ బరిష్వంగంబుఁ గావించి, వీ
డ్కొని వైహాయస వీథిఁ జేరుకొనె వైకుంఠంబు; రామప్రభూ! ౩౪

మఱఁగెన్ వాల్మీకి మౌని యంతట నిఁకన్ [1]మాధ్యాహ్నిక స్నానమున్
సలుపంగాఁ, దమసా నదీ నవిధ భూబాంచ త్తటీ వాటికిన్;
విలస న్నిర్మల పూరముల్ సుబుసు వ్యబీథిఁ దలంపించుటల్
దెలిపెం ద న్నదిఁ జూపి శిష్యులకుఁ బ్రీతిన్ మౌని; రామప్రభూ! ౩౫

పనసొచున్న దకర్దమస్థలి, భరద్వాజా' యిదే చూపు వే
పున దీనిం; గలశంబుఁ గ్రిందనిడు మిప్పుడ్; నాయనా శప్మ నా
పనొకంతుం దగు వల్కలంబు బిచటఁ గ్రుంకుల్ వెట్టువాఁడం దరం
గి[2]ణిలో హాయిగ, నంచు శిష్యునకుఁ బల్కెన్ మౌని; రామప్రభూ! ౩౬

తన కందీయఁగ వల్కలంబును భరద్వాజుండు, వాల్మీకిఁ దా
నిని జేతంగొని యా వనీ రుచిర కాంతిన్ మెచ్చుచున్ ముందు సా
గిన వేళం, గనిపించెఁ గ్రౌంచ మిథున క్రీడాపరత్వంబు, షెం
డిని టో తప్పుకు తక్కలం బొదువు సూటిం దెల్పి; రామప్రభూ! ౩౭

విడదీయంగనురాని పక్షు లవియున్ విం తెంతయుం గొల్పుచున్
వడిఁ గూజింపదు; నెఱ్ఱజుట్టుగలదై పక్షుల్లు నా పోతు, క
న్పెపుఁ[3]జుమ్మి! రతి పారవశ్య మెలయం బెంభిన్ గరు ధ్ధువ్వ మే
ర్పడఁ, గూకిపలు కొప్ప బెక్కుగలదై పైకొంచు; రామప్రభూ! ౩౮

పాపాత్ముం డొక బోయ, దగ్గఱగనే వాల్మీకి సన్మౌని తా
నేపారన్ నిలుచుం[4]డి యుండె ననియేనిన్ లెక్కలేకుండ, నా
బోపాటోపము లొక్కనాటుగనె యాటోపింప, మోహాకరే
కాపూర్ణం బగు పోతు నేసె; నది త్రెయ్యం గూలె; రామప్రభూ! ౩౯

---

1. మాధ్యందిన: 2. లోఁదుష్టిగ; 3. దెఁజుమ్మి; 4. జంకు;

ఒడ లెల్లం గను ముద్దగట్టి నటులై యుండంగ, నా పెంటి పెన్
దదతో వెంటనె నేలఁ గూలిపడ రక్త స్రావ ముప్పొంగె నా
పుడమిం; బెంటియు జాలిపుట్టి వగవం బూనెన్, భువిన్ నెత్తుటన్
బడి పొర్లాడెడుఁ దోతుఁ జూచికొనుచుం బైనుండి; రామప్రభూ! 40

కనెఁ బ్రాచేతసుఁ డట్లు నేలఁబడు నా క్రౌంచంబు; సద్ధార్మికున్
మన మొందెం గరుణాతిరేక; మతఁ డిబ్బందిం [5]బడెం; జెంతినగ
కనె నూచెన్; బహు విహ్వలించు పులుఁగుం గన్నంత, నా పోటు మ
త్తుననుండన్ నెఱిగాదు [6]చంప నను స్ఫూర్తిల్ గల్గె; రామప్రభూ! 41

తగ దీ వుండఁగ నీ యిలా స్థలి నిషాదక్షుద్ర! క్రూరంపుఁ జేఁ
త గదా! నీయది; కామ గోచరమునౌఁ ద క్రౌంచ యుగ్మంబునన్
మగదానిన్ హత మార్చితీవు; బ్రదుకన్ భావ్యంబె చూపంగ నీ
వగ నీ నీచత? నంచు వాల్మికుఁడు శాపం బిచ్చె; రామప్రభూ! 42

అనుకంపాగ్రహముల్ పెనంగొనఁగ మున్యగ్రేసరుం డట్లు దా
ననె, ఛందో వినిబద్ధ వై ఖరి నయత్నారోపిత చిత్రంబునన్;
మన మా పిమ్మట నక్కుఱుం... ... ...
ననుటన్ మౌనిక్షి; యోజన ... వెలిగెఁ దా మంతంత; రామప్రభూ! 43

మతిమంతుండు, మహాతపఃబలుండును, మహాప్రాజ్ఞుండు వాల్మీకి, స
మ్మిత వాక్యార్థ విశారదుండు, మనిఁ గావించెన్ వినీతుండు, సం
స్తుతమా నిశ్చయ; మంత వింతమెయి శిష్యుంతో భరద్వాజుతో
గతమున్ భావనఁజేసి వాకొనె సమీక్షా ప్రౌఢి; రామప్రభూ! 4

ఖ[7]ర శోకార్తుఁడనై పఠించినటి వాక్యం బెన్న [8]సమ్యక్త్వమా
క్షర పాద ప్రవిబద్ధమై తనరు శ్లోకం బయ్యెఁ; దంత్రీ లయ
స్థిర నిష్ఠం బగు గీత మయ్యెఁ; స్వసవృక్ శ్రీదంబునై ఛందమై
పరగెన్; దీనిని శ్లోక మందు ననియెన్ వాల్మికి; రామప్రభూ! 45

5. గనెం; 6. త్రుంప; 7. ఖర దగ్ధుం దగుటన్; 8. సమ్యగ్వమా;

వినయోత్కృష్టత యొక్క-టే యతనిలో శ్రేష్ఠం బసన్ రాదు, శా
స్త్ర నిరూఢాతి సమగ్రుం డాతఁడు శరద్వాజాంచు; వాల్మీకి నో
టను వెల్వడ్డ ప్రసిద్ధ వాక్యమును నోటం దానును బల్కెఁ; బ
ల్కిన యా వాక్యము వించు మోదమునఁ దేరెన్ మౌని; రామప్రభూ! 46

తమసా స్నానముఁ జేసి సంయమి యదృశ్యంబై, యయత్న ప్రసి
ద్ధమునై యొప్పెడు వాత్మవాక్య [10]ఘటనా ధైర్యంబునుం గూర్చియున్,
సమభివ్యాహృతమౌఁ దదర్థ మహిమా సామగ్ర్యముంగూర్చియున్,
సమచిత్తుండయి యోజనల్ సలుపుచున్ సాగారె; రామప్రభూ! 47

సరసిన్ మెల్లఁగ నాశ్రమోన్ము[11]ఖుఁడునై సాగార వాల్మీకి, త
ద్గురుదేవున్ వెనువెంటనే కలశముం దోయంబుతో నింపి, సు
స్థిరతం బూనుచు శిష్యుఁడున్ నడచెఁ బ్రీతిం; గొంతసేపైనఁ జే
రిరి వా రిర్వురు నాశ్ర[12]మంబునకు జాలిం దూలి; రామప్రభూ! 48

అల వాల్మీకి మహర్షి పర్ణ కుటియం దాసీనుఁడై యుండి సం
ధిల మాధ్యాహ్నిక కృత్యముల్ నడపినన్ ధీ[13]యంతయుం గ్రౌంచ ప
క్షులవల్లిం దన నోట వెల్వడిన యా శ్లోకంబుపై, బోయపై,
నిలిపెం గారణ మేమియుం దెలియకే నిష్ఠించి; రామప్రభూ! 49

సరి యా వేళకె బ్రహ్మదేవుఁ డట సాక్షాత్కారమైనన్, ఋషీ
శ్వరుఁ డాశ్చర్యమునన్ మునింగి యెటులో జయ్యన్ నిలం జాలుచున్
బరిశుద్ధాశయుఁడై కర ద్వయము మోడ్పుం గల్గినేగాని, వా
క్కురమై పల్కెడనేరకె, దళని కోహా తితి; రామప్రభూ! 50

మునిదేవుండు విరించిదేవుని మొగంబుం దేఱిపాఱంగఁ [14]జూ
చెను, నో ర్విచ్చి యొగావిగం; దుదకుఁ బాసెన్ మౌని వ్యామోహంబు; వెం
టనె యర్ఘ్యంబును బాద్య మిచ్చు నతఁ; డోటన్ యుక్త మౌ నాసనం
బునఁ గూర్చుండఁగఁజేసి [illegible] రామప్రభూ! 51

9. దీప్త; 10. రచనా; 11. ఖముగా; 12. మ స్థగిత; 13. వ్యక్తచిత; 14. గాం;

పడి సాష్టాంగము బ్రహ్మ పాదములకున్ భక్త్యంతరంగుండునై
నుడిగొన్నట్లు ప్రదక్షిణంబు నిడఁగన్ శుద్ధాత్ముఁడౌ మౌని; యా
నడిగెన్ బ్రహ్మయు వాల్మీకిం గుశల మత్యంతాదర ప్రేమ లే
ర్పడఁ గూర్చుండ నియోగమున్ సలుపుచుం బ్రాంతాన; రామప్రభూ! 52

కనుకుం జెందెను నట్లు బ్రహ్మ యెదుటం గూర్చుండెనే గాని, యా
తని చిత్తం బటు క్రౌంచ [15]దంపతిపయిం, ద క్ర్వారవశ్యంబుపై
నను, [16]దల్లుబ్ధుని పాప కృత్యముపయిన్ వర్తింప శోకాత్ముఁడై
మనసంబుం దొనరించె శ్లోకము నదే! వాల్మీకి; రామప్రభూ! 53

మునినే జూచుచునున్న బ్రహ్మ చిఱునవ్వుల్ మీఱఁగా, 'నీవుచె
ప్పిన యా వాక్యము శ్లోకమే యగును సంవిత్తింప గనన్; దీర్ఘ యో
జన సేయం బనిలేదు; నావలననే సంభూతి యా [17]వాణి పొం
దెను నీనోట;' నటంచుఁ [18]బల్కె గవియుం [19]దేకొంద; రామప్రభూ! 54

'చిని యా శ్లోకములందె రామచరితం జెప్పన్ వలెన్ నీవు; రా
ముని వృత్తం బిహమందునన్ మన కలభ్యం బెందు; నీ వా కథన్
వినినట్లుగ వివరింపు; మొక్కనికె యుక్తిన్ నీ కింకం గోచరిం
చు [20]నిగూఢార్థము లెన్నియే;' నను వినంచున్ బ్రహ్మ; రామప్రభూ! 55

"అనృతం బుండదు నీవు సెప్పు కృతిలో నాదంతయమున్; నీవియే
మునుఁ బల్కిమ్మీ! భువి నాదికావ్యముగ; నేమం బారఁగా నచ్చియే
గను సత్కీర్తిని బృథ్విపై నిక మహా కావ్యంబనం; బుణ్యఁపున్
గని యాఁ గావ్యముగూడ నట్టి;" యనియెం గంజుండు; రామప్రభూ! 56

"ఘన లోకంబున నెంత కాలము సరిత్సంఘంబులున్ ధాతుభృ
త్సంఘముల్ నిల్చునో! యంత కాలమును నీకావ్యంబునున్ నిల్చు; భూ
మినిఁ బై లోకములందు శాశ్వతముగాఁ బే రెన్నికం గందు నీ
వును నీ కావ్యమువెంట;" నంచు [21]విధుఁ డేగెన్ మౌని; రామప్రభూ! 57

15. యుగ్మము; 16. త ద్వ్యాధుని, త ద్విందుని; 17. బ్రాహ్మి; 18. బల్కెనతఁడుం; 19. చేకొనెన; 20. నిగూఢాంశము; 21. విధియోమున్, విధుశోమున్;

తను దీవించి విరించి తత్క్షణమె యంతర్ధానమున్ బొంద, నా
మునియున్ శిష్యులు మోద మొందె; రఘు దేవుం జూపె తద్బృంద మె
ల్లను వర్ణింపను 'మా నిషాద' యని యాలాపించె; నా [22]ఛంద మా
పునరావృత్తిని శ్లోకమై నిజముగాఁ బొల్చార; రామప్రభూ! 58

చనఁ దుల్యాక్షర పాద బద్ధ మగు నా ఛందంపు [23]టావృత్తి విం
చునె వాల్మీకికి బుద్ధిపుట్టినది యా శ్లోకాన నారాట్కథన్
వినిపింపంగ జగంబువారలకు, గాంభీర్యంబు బోధింపఁ జా
లిన దౌటం, బద బంధ మందలివి నేర్పుం జూప; రామప్రభూ! 59

విరచింపం దను నిశ్చయించుకొనె, గంభీరార్థ యుక్తంబు, సుం
దర శబ్దాతిశయంబు, సంగత లస ద్వ్యాఖ్యానుషక్తంబు, మా
ధుర సుశ్లోక సమన్వితంబుగఁ బ్రచేతుం డంతఁ గావ్యంబుగాఁ
జరితన్ దాని సుదాత్త వర్ధిత [24]మనస్కారంబు; రామప్రభూ! 60

---

22. వాక్య; 23. వల్లింత; 24. మనస్కార్యంబు;

కలి మౌనీంద్రుఁడు సెప్పియున్న కథయే గాకుండ, వాల్మీకికిన్
దలఁపుల్ సందడిచేసె నాథునర చింతల్ పెల్లుగాఁ జేయుటన్;
మెఱఁగెం జెక్కు విశేషముల్ బలిఁది జ్ఞప్తిన్ [25]బోధ్యమై; యాదటన్
మఱఁగెన్ దర్పణ యానసంబున ఋచిన్ వాల్మీకి; రామప్రభూ! 61

పెనఁటిం బుచ్చక కాలమున్ ఋషియుఁ బ్రాచీనాగ్ర దర్భాసనం
బునఁ గూర్చుండెను, జేతులన్ మొగిచి నిర్వ్యాఘ్రంపు ధ్యానంబునన్;
మనమందుం బలితల్లిదండ్రులును, [26]ధామా యుక్త నాథుండు, నా
యనుజుల్, తోడిప్రసంగముల్ వొడమె నిర్వ్యాజంబు; రామప్రభూ! 62

తమి నవ్వారి ప్రవర్తనల్ నడ[27]తలుం, దా మొందు మేల్గిశ్శ, ని
శ్రమ పూరణ్య నివాసముం, బ్రబలుఁడౌ గ్రవ్యాత్తు పౌలస్త్య పిం
చమునున్, బ్రహ్మ యనుగ్రహంబువలనన్ సర్వంబు, వాల్మీకి చి
త్తమునన్ హత్తెను; గల్గ కట్టెదుట నింతం గట్టె; రామప్రభూ! 63

ముని యహా పిమ్మట శ్రోత్రపేయము, మనోముగ్ధంబునౌఁ దత్కథన్,
గొన ధర్మాదుల విస్తరంబు, సుచిరం గూలంకష ప్రజ్ఞమై,
ననుబద్ధాను[28]భవాళి సంచయముతో నన్వర్థపౌ రత్న గ
ర్భను బోలంగల యాదికావ్యముగ మర్త్య ప్రీతి; రామప్రభూ! 64

25. బోధ్యమై; 26. రామా; 27. క; 28. మలరత్న;

## వాల్మీకి కావ్య నిర్మాణము - రామ సభలో లవ కుశ గానము

—·—

ఆకసమున్ బీజి, యయోధ్యకున్ మరలి, రాజ్యం బేల నాధుండవు, వా
ల్మికి మౌనీంద్రుఁడు తచ్చరిత్రమును గల్పింపంగఁ గావ్యంబుగా
సకలారంభము సేసె; నావల భవిష్య ద్వృత్తమున్ జెప్పె నిం
కొకమా ఉత్తర కాండ మన్ ప్రథను, [29]నార్యుల్ మెచ్చ; రామప్రభూ! 65

నీధ శ్రేష్ఠుఁ డతండు, నాదు చరితన్ శ్రుత్యర్థ సంస్థాపన
ప్రౌఢిం జాతుర యుక్త వింశతి సహస్ర శ్లోకముల్ గూడఁగా,
గాథత్వాంచిత షష్ఠ కాండ యుతమై క్రాలంగఁ గల్పించె, ని
ర్వ్యాత్తిం బంచ శతంబు సర్గలుగఁ [30]గావ్యోద్భూతి; రామప్రభూ! 66

కమనీయంబగు నా చరిత్రకు మహాకావ్యోల్లసత్ సంభవం
బమరన్ సర్వ రసోద్ధు[31]రం బగుటచే, నాసంద సంధాయక
త్వము గూడం, బఠియించినం బయికిఁ, జేతంబలచునం బాడినన్,
శమతన్ గానముచేసినన్ గళము విస్తారించి; రామప్రభూ! 67

ద్రుత మధ్య [32]ప్రవిలంబిత స్వరగతుల్ దోద్భాటుగాఁ బాడినన్,
సుత సప్త స్వర యుక్తిఁ బల్కినను, వేణు ధ్వాన వీణా క్వణ
స్తుత తాళాత్త మృదంగ నాదముల మెచ్చుల్ గూడ నాలాపముల్
వితతిన్ సల్పి నటించినం, [33]గృతి ప్రదీప్తిం బొందు; రామప్రభూ! 68

ఆ కావ్యంబు ప్రచార మెవ్వరికిఁ జేయం గూడునో గాదె! భూ
లోకాంత స్థ్సలి నందు వాల్మీకి కడున్ లోలాత్ముఁడై దైవమున్
సోహాతంబుగ ధ్యానమున్ జలుపుచో, నాలోన నెవ్వారలో
లోకన్ నోఁకుట [34]యాత్మ పాదములఁ దోఁచుం బుమ్మి; రామప్రభూ! 69

ముని విప్పెం గనుదోయి; వార్ గుశ లవుల్; పూర్వంబునందుండి యా
యన యా యాశ్రమమందునం బెరుఁగుచున్నా రన్నయుం దమ్ముఁడున్,
ముని పుత్రుల్ వలె; వారు సాంగముగ నేర్చెల్ మీఁట వేదాదులన్
ముని శుశ్రూషవులై యెఱింగికొని రామూలంబు; రామప్రభూ! 70

---

29. లోకుల్; 30. గావ్యోద్వేగి, గావ్యోద్యోత; 31. ల్బణం; 32. స్థ;
33. గథ; 34 స్వియ;

ఒకఁ డా కొల్వున ధర్మ పత్నులరలో సన్యాసి యుపాసిపై
యొక పూర్ణోదర కుంభ మీయ, నెన నింకొక్కండు పుష్పాంజలిన్,
కొకఁ డా వెంటనె పల్కులంబు, మఱి వే ఱొక్కండు తా మాంజి, యిం
కొకఁడున్ జందెము నిచ్చి, పల్కి రొగి నాయు ర్వృద్ధి; రామప్రభూ! 77

రవలారా! రఘురామచంద్రుకథ వీక్ష్య ప్రాపకం; బద్దియే
కవి బృందంబున కొను భావిని మహాకావ్యంబు; మీ రన్ననో!
భువి నాపా[37]త మనోజ్ఞ గీతిఁ బ్రకటంబుం జేసి రిద్దాని; నా
యుపునుం బుష్టియు నిచ్చు నిద్ది, యని రార్యుల్ మెచ్చ; రామప్రభూ! 78

తెలిసెన్ నాథున కంతయుం; గుశ లవుల్ రేఁటన ప్రౌఢులై
విలసత్ స్వీయక రాజధానిని గడున్ వేడ్కం బ్రవేశించి, ర
థ్యాలలోనన్, బహు పట్టహట్టములలోఁ దా రిర్వురుం గానమ్ము గా
న లస న్మాధురు లొల్కుచుండి రని, వింతన్ విన్న; రామప్రభూ! 79

పిలుపం బంచెను రాజు వారలను దెల్విం గొల్వుకూటంబులో
పలికిం; బిమ్మట సత్కరింపఁ బతి; ప్రేమన్ మంత్రి మిత్త్రాళితోఁ
గొలువుం దీర్చి కావ్య గానము వినం గోరంగ నాథుండు, వా
రలు నా [38]కోర్కెకు[39] సమ్మతింతు రవలలన్ [40]సత్త్రి; రామప్రభూ! 80

అనామ్యాగ్ని పవిత్ర దీప్తి సములౌ నా దివ్య వర్చస్కులున్,
వీణా వేణు మృదంగ తాళ విలస ద్విస్పష్ట వాద్యాళితో,
గానానంద నిమగ్నులై యఖిలయోగ్యాళంపు టాలాపనల
బూనం, దత్ చరితంబు నెంతొ సరసం బొల్కారె; రామప్రభూ! 81

మున మున్పొంగుచు గాన వైఖరికి సభ్య శ్రేష్ఠ సందోహముం
దిన యా వేళను, దమ్మయత్నమును [41]దాటిం బూని యా బాలురన్
గనుచున్ 'మార్గగతిం బదీయ చరితన్ గానంబుఁ గావింపుఁ' డం
చును [42]బ్రార్థించుఁ దదీయ రాజు, జనముల్ సొక్కొందు; రామప్రభూ! 82

37. క; 38. కోర్కెను స్వీకరింతు; 39. కుపల్లె యందు; 40. బంది
41. దాచిం; 42. సూచింపుఁ;

‘మునివేషంబున నుండియుం దెలియఁగాఁ గొల్పాటెనన్ రాజ ల
క్షణులై బాలురు; గాయకోత్తములుగాఁ గాన్పించియుం బొల్చి చూ
పినచోఁ దోఁతురు తాపసోత్తములుగాఁ జెన్నారి వీరలే, మహా
జనులారా!’ యని రాజు సభ్యులకు నాశంసించు; రామప్రభూ! 83

‘వినుఁడీ! మంత్రి [43]సుహృత్పురోహితులు! సావిష్కార సద్ధర్మ నై
పుణ మూర్తిత్వమైన బాలకులు, మత్ పుణ్యంబు పండింపఁగాఁ,
దనివిం గొల్పు మహా ప్రభావ యుత సీతా సాధ్వి [44]సంపచ్చరి
త్రను విన్పింపఁగనుండి;’ రం చతఁడు నుత్సాహించు; రామప్రభూ! 84

ద్విగుణో త్సాహము తోఁ గుతం గుశ లవుల్ దీపించుచుం బాట సొం
పుగఁ దా మందుకొనం గడంగిరి, త్వరం బూరించుచున్ గొంతు, వీం
పుగ నాలాపము నేక కంఠులయి సమ్మోహంబునుం గొల్పునం
తగ సాగించుచుఁ జూచువారలకు నేత్ర ద్వేళ; రామప్రభూ! 85

కనులంగట్టినయట్లు పాడుకతనం గాఢ్యంబు విస్పష్టమై
దనరన్, రా జపు డున్న యాసనము మీఁదం గూరుచుండంగఁ జా
లని యట్లై, చని చప్పుడున్ సలుపనొల్లంబాటునం జేసి, మె
ల్లన గూర్చుండెను సభ్యులం గొలువుసాలం గూడి; రామప్రభూ! 86

43. పురోహితుల్ హితులు!; 44. సంవిచ్చరిత్ర;

కల, వం[౬౪]దెక్కడి కక్కడంగుటపముల్, గ న్విందగున్మావితోఁ
టలు, శ్రీ నాటక శాలలున్; గలయ నల్ మూలల్గనన్[౬౫]దట్టమై
వెలయున్ గేహము లెన్ని వెంటలను; గాన్పించున్ విపర్ణిల్లి తం
డులముల్, బావులు, నెల్ల గేహముల యందుం జింవి; రామప్రభూ! 100

అల యా పట్టణమంత నిత్యమును మ్రోయున్, విం దగుం గాదె! వీ
నులకున్, దుందుభి నిస్వనంబులవి చెన్నుల్, మర్దళ ధ్వానముల్,
విలస ద్వీణల నిక్వణంబు, పణవావిర్భూత నాదంబు,లు
ల్లల దంబోధి తరంగ పంక్తులను బోలం గల్గి; రామప్రభూ! 101

ఇది త న్నిర్మితి యందు లోప మన వీ తే మాత్రమున్ లేక యు
న్న దయోధ్యా నగరంబు కోసలములోనన్; దానినిన్ దీని సు
చ్ఛ దశం గాన్పఁగఁ జేసె నా దశరథ క్ష్మా జాని, విల్ విద్యలోఁ
దుది ది గ్ధాముడు, భోగమందుఁ బురుహూతుం డౌచు; రామ ప్రభూ! 102



౬౪. దెచ్చటి కచ్చటన్; ౬౫. సాంద్రమై;

—౬—

బల శౌర్యంబులె రక్షలై తనను గాఁ బ్రోవన్ మహారాజు శ
త్రుల నెల్లం దమియించి మించు జగమందున్; వీరులన్ శూరులన్
బలు విద్వాంసులఁ జేర్చి తత్ పురిని సమ్మానించు; సైన్యంబులోఁ
గల దెంతో చతురంగ యుక్త బల సంఘాతంబు; రామప్రభూ! 103

చెఱువుల్ బావులు త్రవ్వఁ జేసె; సుకృతుల్ సేసెన్ మహా కార్యముల్;
సిరవై నిల్చె ననేక ధర్మములకున్; నెట్టించె మె ప్పొక్క మా
దిరిగా జానపదాళి పౌరులకు; సందేహంబు లేకుండ నె
ల్లరినిన్ పక్షులఁ జేసికొంచు నృపుఁ డేలం గల్గె; రామప్రభూ! 104

అనవచ్చిన్న హిరణ్య రత్న [66] చయ భూషా కల్ప భోగాది రా
శిని దేవేంద్రుఁ, గుబేరునిన్ నిధుల నిక్షేపాదులం బోలుచున్,
ఘనుఁ డా వేద విదుండు, యజ్వ, ఋషి, దీక్ష ప్రౌఢ సందర్శి, పొం
దెను ముల్లోక జితేంద్రియుం డను ప్రసిద్ధిన్ వృద్ధి; రామప్రభూ! 105

అనయం బాతఁడు ధర్మ సమ్మతముగా నర్థంబుఁ గామంబుఁ దా
నను భోగించె; నయోధ్య, యొప్పటకు శక్యం బెటికిం గా దనన్
జన, న ట్టిక్కుల యోజన ద్వయి పయిన్ సామర్థ్య [67] మొప్పారియుం
డెను, సార్థక్యము గన్న నామ మని పోఁ డిం బొంది; రామప్రభూ! 106

పురిలోనం బ్రజ లెల్లరున్ ముదితులై పొల్పారు ధర్మాధికుల్,
బరమోత్కృష్టులు, సత్య వాదులును, లోభ క్రోధ దూరాత్ములున్,
నిరతాహ్వాన బహు శ్రుతుల్, ధనికులున్, నిర్దుష్ట కామోప భో
గ రతుల్, [68] భూరి కుటుంబులున్, సొగసు మోకల్ జోక; రామప్రభూ! 107

ధన ధాన్యంబులు, పాడి యావులును సద్మంబందు లేనట్టి గే
స్తును, గుట్టుంబులులేని యొక్కఁడు గృహస్థుం, బెండ్లమున్ బిడ్డలన్,
బస తోఁ బుట్టులఁ బీడసేయు నతఁడున్, దరోద్ధతుం డెందుఁ బ
ట్టణమందుం గనరాఁడు; రాముకుఁడె వీటన్ లేఁడు; రామప్రభూ! 108

---

66. మయ; 67. మేపారి; 68. ప్రాజ్య;

కనిపింపం డొక క్రూరుఁడేనియును; యుక్తజ్ఞాన శూన్యుండు, వం
చన సేయంగలవాఁడు, నాస్తికుఁ, డవిజ్ఞానం, బవిద్యాదులున్,
ధన తృష్ణాదులు గల్గువాఁ, డెట స యోధ్యన్ లేఁడు; స్త్రీ పూరుషుల్
ఘన పుణ్యాత్ములు, నైజ సాత్త్వికులు, లోకజ్ఞేంద్రులు; రామప్రభూ! 109

డిన మత్యంగము; మంచి గంధమునఁ బ్రీతిం, గస్తురిం జర్చ; మే
నున బూదండలు, మూర్ధ కర్ణములయందున్, బాహు హస్తంబులం
దున, వక్షస్థలిలోన, భూషణము లొత్తుల్ గల్గఁగా ధారణం
బు, నయోధ్యా పురవాసు లెల్లరకు నొప్పున్ [69]మప్పు; రామప్రభూ! 110

ధన ధాన్యంబులఁ దేలిచూడెడు పురీ ధన్యాత్ములం దెల్లవా
రును, [70]ధామంబులు త్యాగ భోగములకున్; లోలాత్ము, లా పట్టణం
బునఁ జోరాదులు, వర్ణ సంకరులు, మూసల్ [71]దెచ్చు నీచాత్ములున్
గనరా రెండును, మందులోని కయిసన్ గాలింప; రామప్రభూ! 111

ముని తుల్యుల్, విజితేంద్రియుల్, వితరణుల్, పూర్ణవ్రతుల్, స్వ స్వక
ర్మ నిరూఢుల్, పర దార దర్శన పరాక్రాంతుల్, షడంగాధ్యయ
ప్రణుతాత్ముల్, [72]విహితాహితాగ్నులును, సద్బ్రాహ్మణ్య పుంభావులున్
మను కల్పుల్, పురిలోని బ్రాహ్మణు లనల్ప ప్రౌఢి; రామప్రభూ! 112

క్షితిపుల్ ఖడ్గ మహారథుల్; చదువులం జేపం బ్రగియావంతు; లం
చిత శస్త్రాస్త్ర సమస్త విద్యల సమీచీన ప్రతిష్ఠాపరుల్;
జితులన్ యుద్ధ పలాయిత ప్రముఖులం, జేవాఁడి నేకాకులన్
హతులం జేయ రయోధ్యయం; దవి సదభ్యాసంబు; రామప్రభూ! 113

విదిత ప్రస్ఫుట శబ్ద వేధు లయియున్ వేసన్ సడింబట్టి యా
పదఁ గూర్పంగను మాటుపెట్టుకొనుచున్ బాణ ప్రయోగంబు ధు
ష్ప్రదుపై సైతము సేయఁబోరు జనముల్; రెట్టించుచో సింహమున్
మద మార్పంగల, రా పురీ జనులు [73]స్థామ స్ఫూర్తి; రామప్రభూ! 114

---

69. గప్పు; 70. స్థానంబులు; 71. గూర్చు; 72. నిరతా; 73. దమ్మ. సత్త్వ;

ఁనముల్ నిప్పులవంటి వారలు; సు శిక్షా దక్షు; లంతర్గిరి
ప్రణుతామేయ గుహా [74] మృగేంద్రములుగా మార్కొంటకున్ సైప రెం
డు సమా ధ్యాపురి; నాతిథేయులుగఁ గీర్తుల్ పొసి యున్నారు; మే
లును దా మెన్నఁడు నేమరం జనరు వేరున్ వారు; రామప్రభూ! 115

కుల మే దైన జనంబు లర్థులకు సాకుం జూపి యే మాత్రమున్
బలుకం బోవరు లేదు గా దని; జన వ్రాతంబునన్ లేరు వ్యా
కుల చిత్తుల్, గడు వ్యాధి పీడితులు, వీకున్ [75] పాలి చింతిల్లు దీ
నులనున్ రూప విహీను, లా పురమునందుం జూడ; రామప్రభూ! 116

అల విప్రాను సృతిన్ నృపాలురు, నృపాలానూకముంబట్టి వై
శ్యులు, నీ ముప్పురఁబట్టి శూద్రులును, మెచ్చంగొల్చ వర్తిల్లుచున్
నిలుపంగల్గెగ రాసుకూల్యమును వర్ణింపంగరా నంతగా;
నిల సాకేతులఁబోలు వార లెట లేనేలేరు; రామప్రభూ! 117
రకమున్ రాణయుఁద్రాణయుం దెలుపుచున్ [76]రంజిల్లు కాంభోజ బా
హ్లిక [77] సింధూచ్ఛ వనాయు దేశములవౌ హేమల్ గడుంగల్గు వా
రక సాకేతమునందు; వారుపము లెల్లం దాము నుచ్చైశ్రవ
ప్రకరంబుం బురణించి మించు, నని చెప్పం జెల్లు; రామప్రభూ! 118
ఇఁగ, వింధ్యాద్రి హిమాద్రి సంభవములై హేవాకముం గొల్చ నే
నుఁగులుం, జేవఁగలట్టి కొంద లనఁగా నో ర్నోరఁ బేర్గన్నయే
నుఁగు, లైరావత వామనాదిక సమానోత్కృష్టఁ పున్‌జాతి యే
నుఁగులున్, భద్ర మృగాది భేదములు, నందుం బొల్చు; రామప్రభూ! 119

అల సంకీర్ణ హ యేథ వర్గములు పెక్కైయుండు టట్లుండ, నె
ద్దులు, నొంటెల్ చిరమేహి జాతులును బంతున్ మీఱుచున్ మందమం
దలుగా భారి [78]విధంబులై సవి యయోధ్యాపత్తసంబందునన్
మెలఁగున్ [79]స్వస్థ విధుల్ సమస్తము సహాస్తింపంగ; రామప్రభూ! 120

---

74. గుహాశయములై; 75. మాని; 76. రంగిల్లు; 77. ధ్యాది;
78. రకంబు; 79. వాని;

జన సంచారము, జంతు చారమును, స్వచ్ఛ ప్రాణి సంచారమున్,।
వన సత్కారము, శ్రీప్రసు యాన లస దంభ స్సారముం గల్గి ప
త్తన రాజం బగు నా యయోధ్య వెలయుం, దారా పథం బట్టు; నిం
ద్రుని వోకిప్ వెలుఁగొందు నా దశరథేంద్రుం డందు; రామప్రభూ! 121



—౭—

మతిమంతుండు వసిష్ఠ మౌనియును, ధీమ ద్వామదేవర్షియున్,
హితులన్ ముఖ్య పురోహితుల్ నృపతికిన్; హేజీలు లున్నారు సం
చిత పుణ్యుల్, విజయార్థ సాధకులునున్ సిద్ధార్థ ధృష్టాఖ్యుల్; ల
ద్భుతుఁడై యందు సుమంత్రుఁ డొప్పుఁ బతి కాప్తుం డౌచు; రామప్రభూ! 122

గుణవంతుండు జయంతు డొక్కఁడు, నశోకుం డొక్కఁడుం బ్రేముడిన్
గణనీయుం డగు మంత్రపాలుఁ డును లోక ఖ్యాతులౌ మంత్రులై।
జననాథాగ్రణి నష్ట దిగ్గజము లన్నట్లందాన సేవింప, నొ
ప్పెను రాజ్యం బది కోసలంబు బ్రథివిం బెంపారి; రామప్రభూ! 123

ఆ మంత్రుల్ వినయాది సద్గుణులు; విద్యా జ్ఞాన సంపన్నులున్;।
శ్రీమంతుల్ [80] నియతేంద్రియోత్తములు; సుర్విన్ నీతి ధౌరేయులున్;
ధీమంతుల్; బహు శాస్త్ర విత్తములు; పృథ్వీనాథ ప్రేమాస్పదుల్;
స్తోమం బొప్పెడు నద్వితీయ రణ కీర్తిం బొల్చిరి; రామప్రభూ! 124

స్థిర మంత్రాంగ సుపాలనా [81] నిపుణతం [82] దీరౌఁ బ్రతిష్ఠాపరుల్;।
గరమున్ జంకెడివా రకార్య కరణ క్రౌర్యం బనన్ వారు; హె
చ్చరికం దాల్చుచు, నోర్పు నేర్పులు ప్రశస్త ప్రౌఢ శౌర్యాదులున్,।
జిరునవ్వున్ మురిపెంబుఁ జూపుదుర [83] వాసిన్ వన్నె; రామప్రభూ! 125

కనఁబో మెన్నఁడు వారిలోఁ గొఱకొఱం; గామార్థ హేత్వాది వ
ల్లను గూడన్ బుత భాషణంబు విడ నొల్లం జాల; రే రాష్ట్రి వా
ర్తను నైనం దమ వేగులం బనిచి తేరం గల్గు నుత్సాహ ముం
డిన సర్వ వ్యవహార దక్షు లని [84] ప్రోజిం గంద్రదు; రామప్రభూ! 126

---

80. ఏజితేం; 81. చతురిమం; 82. ఢీటౌ; 83. వజ్జిరంద్రదు;
84. పోడన్, పాటన్, పాడిన్;

అపరాధం బొనరింపవారియెడ మిత్రామిత్ర క్షామంబునన్
నెపముం జూపఁడు; దోష, పుత్త్రుఁడయినన్ నే సైనసున్ [85]దండమే।
నృపవిష్టం బగు; దోషి కాని యెడ నై మత్యుండునన్ వారి స
త్కృపకుం బాత్రుఁడు; వారె మంత్రులు [86]వివేకింపంగ; రామప్రభూ! 127

నృప భండారము వృద్ధిసేయు పనిలో నిర్నిద్రులై యుండుటల్,
విపులంబుం బొనరింప వాహినిని సంప్రేక్షించుటల్, పెంపలే
నపరాధంబులు సేయ దండనము లర్హా వృత్తుగా నిచ్చుటల్,
విపదల్ [87]మాన్పుట యోగ్యులందుఁ, దమకున్ [88]ఖ్యాతంబు; రామప్రభూ! 128

ధన దండంబు విధించువార, లపరాధం బెత్తుపైఁ జేయఁజూ
చిన యా తంటల మూరు లెల్లరకు నిశ్శేషంబుగాఁ దారత
మ్య నియచ్ఛత్ పరిపాటి బట్టి; తమ రత్యం త్రైకమత్యంబుతో
వినియోగించిరి రాజ తంత్రములను నేర్మిన్ వారు; రామప్రభూ! 129

తమ నీతిజ్ఞతవల్ల నా పురమునం, దక్కైన త ద్దివ్య రా
జ్యమునందెల్ల, నసత్యవాదులును మోసన్ జేయు నవ్వారలున్,
భ్రమనైనం బరదార తత్పరులుఁ గాన్పం బోరు; వా రన్య దే
శములన్ సైతము నీతి నిష్ఠకుఁ బ్రతిష్ఠల్ గాంత్రు; రామప్రభూ! 130

మృదు [89]తేజోమయ కాయ హాయనములన్ వి స్ఫీత పెర్గొంపు నా
యుదయాహస్కరుఁడై, యుపస్కృతి లసత్ వ్యుత్పన్నత న్మంత్రి [90]సం
పదుఁడై, యొప్పు నయోధ్యలో దశరథ క్ష్మాజాని, రాజ్యంబు పెం
పు దలిర్పం బరిపాలనం బలుపుచుం [91]బ్రోదండు; రామప్రభూ! 131



85. శిక్షయే; 86. నిపక్షింపంగ; 87. మాపుట; 88. విద్యోత్తు, విశ్వాంబు;
89. తేజః కమనీయ; 90. సంపదుఁడై; 91. మహిమ్మతె, పూజ్యుండు;

ప్రవుఁ దేశాద్య గశేష తేజుఁడయి వన్నెం గాంచియుం గాంచఁబోఁ
పసారం జనసత్య దోషమయ ఈహాపా [92] పారమం దుండుటన్,
పఠింపన్విధి; వంశ వృద్ధిపరమౌ గాఢాభిలాషంబె తా
పదేశించిన దశ్వమేధమును జేయుం బూన్కి; రామప్రభూ! 132

సు నాలో [93]చన చేసి చూచె; సచివోత్తంసంబులన్ సంప్రదిం
సు; దర్వాత సుమంత్రినిం బిలుచుచున్ 'శీఘ్రంబుగా నొజ్జలన్,
న పౌరోహితమున్ ధరామర కలాపంబున్ సమావేశమౌఁ
ని నిర్వర్త్యము సు', మ్మటంచుఁ బలికెన్ మన్నీఁడు; రామప్రభూ! 133

మ మన్నీని యనుజ్ఞఁ దెచ్చెను సుమంత్ర శ్రేష్ఠుఁడంతన్, వశి
మహర్షీంద్రుని, వేద పారగతులౌ జాబాలినిం గాశ్యపున్,
ంమన[94] స్స్వామ్యని వామదేవుని, యశ[95]శ్శుద్ధున్ సుయజ్ఞాహ్వయున్
ఘములౌఁ బెక్కుర బ్రాహ్మణోత్తముల నింకన్ వేగ; రామప్రభూ! 134

పనుతెఁ డెల్లర యా గత మార్గమున సమ్మానించి, "ఓ"! బ్రాహ్మణా
సున బృందారకులార! నా మనము నోయన్ నందనుల్ లేమిచే
కను, మి మ్మి గతిఁ బిల్వసంపితిని; శ్రద్ధం జేయఁగాఁ గోరుచుం
టిని, నే నిప్పుడె యశ్వమేధ", మనెఁ, బాదింబట్టి; రామప్రభూ! 135

మనమం దయ్యది శాస్త్రయుక్తముగ సల్పం గోరుచుం గావునన్,
నను ధన్యాత్మునిఁ జేయుఁ డంచును ననన్యాసక్తిఁ బ్రార్థింతు మీ
ఘనతన్; వే నెఱవేర్పఁజేయుఁ డది విఘ్నం బేమియున్ లేకయు
ఁడ,' నటంచుం బతి యా మహామహుల వేఁడం[96] జొచ్చె; రామప్రభూ! 136

---

92. వార; పాయ; 93. చయమానుఁడయ్యెన్; 94. నోతుల్యుని; 95. ప్రభు;
96. జెల్ల.

చనుఁజూమీ! యని ధర్మ బుద్ధి యనుచున్ క్ష్మాకాంతునిన్ బ్రాహ్మణా
యను లెల్లన్ వినుతించి దీవనల నీయంజొచ్చి, "రీ వింక నం
దనులం దప్పక పొందువాఁడ" వని; యంతన్, "యజ్ఞ సంభార మే
మేనయం దొప్పఁడుఁ డీ" రటం చనిరి వా రెల్లారు; రామప్రభూ! 137

"తరువాతన్ మన వారువంబు విడు"న్ ధర్మంబు యోజింప నే
చరువాతన్ శుభవేళనైన;" నను నా బ్రహ్మర్షులన్ వించు సం
బర మొందెం బతి; రాల్చెఁ గన్నొగిచి బాష్పశ్రేణి; యా పిమ్మటన్
"గురులన్ వింటిరె! మంత్రులార!" యని యొయ్యంబాడె; రామప్రభూ! 138

సమకూర్పన్వలె వెంటనే దమ డిఁకన్ సంభార సర్వస్వమున్,
సుమతుల్ వీరు గురూద్వహుల్, పరమ పూజ్యుల్ దేనినిం జెప్పినన్,
సమర [97]స్థైర్య విధాన; బుత్విజులతో, సైన్యంబుతో, నశ్వమున్
గ్రమతన్ దేశము మీఁద వీడుద; మనెన్ [98]రా జంత; రామప్రభూ! 139
"సరయూ నిర్ఝర ముత్తరంబుననె నీ జన్నంబు సాగం దగన్;
గరమున్ శాంతులు సల్పఁజేయఁ జనుఁడీ! క్ష్మాకాంతు లెల్లారలున్
జరుపన్ రా దిది యశ్వమేధ మన; దోషం బందు రాఁ గూడ; దీ
బరువున్ మీపయి మోపినాఁడ;" ననియెన్ క్ష్మాభర్త; రామప్రభూ! 140

అపచారం బెపు దేమి కల్గినను నా యజ్ఞంబు పొందుం జామీ!
యపుడే నాశము; నెల్లయుం దెఱు పగన్; యజ్ఞంబునం గొంచియం
బెపుడా కల్గు నటంచు రాక్షసులు నన్వీక్షింత్రు; చేయింపుఁడీ
కృప నాచే నిది మీ; రనెన్ నృపతి తా నెల్లారి; రామప్రభూ! 141

"తెలియున్ సర్వము మీకు; నీ క్రతువు శాస్త్రీయంబుగా సల్పఁగా
గలుగం జేయుఁడు న" న్నటన్న ధరణీ కాంతుం గనుంగొంచు వి
ప్రులునున్ మంత్రులు, "మీ యనుజ్ఞయటులే బూర్ణంబగున్ వేల్మి; పో
నలు నమ్ముం;" డని దీవనల్ సలిపి చింతల్ మాన్చిరి; రామప్రభూ! 142

97. స్థిమ, 98. ఋత్త్రిండు.

మునులన్ విప్రుల వీడుకొన్న పిదపం బూజ్యాత్ముడు, భూపాలుం డొ
య్యన, "ఋత్విక్కుల సాధనంబులను నాయత్తంబు సేయుండు వెం
టనె మీ రెల్ల;" రనెన్ సుమంత్రులకు; వేడ్కం బిమ్మటన్ వారినిన్
బనిచెం జేరంగ వారి వారి గృహముల్ మన్నించుడు; రామప్రభూ! 143

తన యభ్యంతర సౌధమున్ బరమ మోదం బారంగాం జొచ్చి, ప్రే
మమునం గాంతల వేఱువేఱంగని, చెప్పంజొచ్చె, సంతానయా
గముం దాం జేయంగం బోవుచుంటి ననియుం, గాంతామణుల్ వారు యా
గముదీక్షం గొనియుంట యోగ్య మనియుం గాంతుండు; రామప్రభూ! 144

కుల కాంతల్ హృదయాధి నాథునివి వాక్కుల్ వించు మోదించుటన్
గలంతల్ వారివి వాసె; హేమము విధం [99]గంజాత మే రీతి భా
సిలు, వర్షస్విను లట్లు భాసిలిరి, సుశ్రీ శోభితంబైన మో
ములతో, స్మేరముఖంబు లతిన్ ముదమునన్ ముంపంగ; రామప్రభూ! 145



99. గంజంబు తే ఖాతి భాసిలు, గంభీర మే మేర;

నృపునిం గాంచి సుమంత్రుఁ డా దినమునం దేకాంత, "మో! రాజ! వం
శపు వృద్ధిం దమ కొందు పద్ధతి భవిష్యద్వేది, మౌనీంద్ర జా
తఁపు టాస్థాని సనత్కుమార ముని [100]విస్తారించె మున్; దాని చా
టుపునం జెప్పెద నద్ది మీ;" కనుచు వేఁడుం బన్ను; రామప్రభూ! 146

పసుపుం బన్పడి, చెప్ప నాతఁడు, "ధరా ప్రాణేశ! మున్ గాశ్యపుం,
డనుఁగుం బుత్త్రి [101]విభాండకుం బడయఁగా, నాతండునుం బొందె నం
దనుగాఁ బూజ్యుని ఋష్యశృంగుని, మహాధర్మజ్ఞునిన్ వత్త్ర సే
వన ధౌరేయు," నటంచు నా నృపతికిన్ వర్ణించి; రామప్రభూ! 147

వనిలోఁ బుట్టి వనంబులోఁ బెఱిగె వత్తన్ దండగాఁ గొంచు, నా
ఘనుఁ డేకాకిగ ఋష్యశృంగుఁ; డగుటం గాంతార మేగాని, వే
రిని నేరండు వయస్సువచ్చియును సుర్విన్ శుద్ధ ముగ్ధుండు, తా
తను, ద్వైధంబగు బ్రహ్మచర్య నిరతిం దప్పించి; రామప్రభూ! 148

సెగతేనిం దనతండ్రినిన్ సతతమున్ సేవించుచున్ బ్రహ్మచా
రిగఁ గాలంబు నతండు గెంటునెడ, నేలెన్ రోమపాదుండు, భీ
తిగ ఘోరుండయి యంగరాజ్యమును బ్రాతిం ద్రుంచి; యా కారణం
బుగ వానల్ గొఱపడ్డ క్షామమునఁ బంబున్ శోభ," రామప్రభూ! 149

అతి ఘోరుండు, బలాఢ్యుఁడౌఁ గతన, రాజ్యం బేలుటన్ ధర్మమున్
వ్యతిరేకింప నతండు, భూతజగతిన్ వ్యాపించె భీతావహ
స్థితి; యద్దాని నెఱింగి నెమ్మనమునం జింతించుచున్ విప్ర సం
హతి నర్థించెఁ, దదీయ దోషమును బాయం జేయ; రామప్రభూ! 150

నగఁ గల్పించిన క్షామ మేది, కురియన్ వర్షంబు, వేదార్థ పా
రగులం బిల్చి, 'మదీయ పాప పరిహార [102]ప్రాప్తిచే క్షామమున్
దెగఁగోయుం' డని రోమపాదుఁ డడుగన్ 'దీటౌ నుపాయంబు' వా
రు' గవేషించుట కష్ట మయ్యెఁగతకున్ రూపొందె; రామప్రభూ! 151

100. ప్రస్తావించె; 101. విభండకున్; 102. స్ఫూర్తి;

రాజా! మీరలు ఋశ్యశృంగు నిటకున్ రావించి సద్భక్తిమై
పూజల్ సల్పి, భవత్కుమారికను నేర్పుల్ మీఱ నుద్వాహమున్
బ్రాజ్ఞ ప్రీతిని సల్పి, నేర్పడును వర్ష ప్రాప్తి; సౌభిక్షమౌ
దేశోపంతునివల్ల దేశ:' మని రంటిన్ వారు రామప్రభూ! 152

మీరే వేవట ఋశ్యశృంగ తపసిన్ మీనేర్పు సంధిల్లఁగా,
గారామీరఁగ, నంచు రాజు పలుకంగా విన్న, పౌరోహిత
ప్రేరితత్వంబు కలంగె, మంత్రి కులముం బ్రేషించె నాకాశమున్,
ధీసం డా ముని, తంత్రికోపి, యని సందేహించె; రామప్రభూ! 153

కని యా విప్రులు రోమపాద ధరణీ కాంతుం, "ప్రభూ! ఋశ్యశృ
గుని రప్పించు నుపాయమైనయెడ మాకుం దోఁచు; నత్యంతకో
పనుఁడై నట్టి విభండకుం[103] గనుటకున్ మా కెల్ల నుల్లంబునం
దున జల్లల్లను; గానఁ బో; మనికి[104] కుందుం జెంది; రామప్రభూ! 154

నిరపాయంబగు నా యుపాయమున వానిందేర వేశ్యాంగనో
త్కరముం బంపుఁడి యంగదేశమున; కా కాంతామణుల్ వోయి తె
త్తురు త న్మౌనిని హావ భావములఁ జేతో మోదనిం జేయుచున్;
బరమానందము నొందు దేశ; మనె విప్ర శ్రేణి; రామప్రభూ! 155

మునులున్ విప్రులు సెప్పు మాటలు వినెన్ భూకాంతుఁ; డా యూహచొ
ప్పునఁ దెప్పించిన ఋశ్యశృంగుపలనన్ ముంచెత్తె వర్షంబులున్
దన దేశంబునఁ; దానఁ బుత్త్రికను శాంతాదేవి నమ్మౌని కి
చ్చెను [105]బాణౌకృతియందు; లోకమును మెచ్చెన్ వాని; రామప్రభూ! 156

గమకంబుం గొని పిమ్మటన్ దశరథ క్ష్మాపాలుచే ఋశ్యశృం
గ మునీంద్రుం డొక కొన్నినాళ్ల కొగి యాగం బొండు చేయించుఁ; జి
త్రము శాంతత్వము నొంద నాతనికి సంతానంబునుం గల్గు నం
చు మునీంద్రుండు సనత్కుమారుఁ డనె నంచున్ వింటె; రామప్రభూ! 157

---

103. కుండనినచో; 104. క్రందున్; 105. వాధూక్యమునందు;

విని సాకేత పురాధినాథుఁడపు డా వృత్తాంత మెల్లన్, సుమం
త్రునివల్లం, దను రోమపాదుఁ డెటులం దోతెచ్చె నా ఋష్యశృం
గుని నంగాపని, కల్గి [106] తేటపడ నాకుం జెప్పుమీ! యంచుఁ బ
ల్కిన; విన్పించె [107]నతండునున్ విశద ఫక్కిన్ దాని; రామప్రభూ! 158



106. స్పష్టముగ, తెల్లముగ; 107. సుమంతుఁడున్;

-౧౧-

తమలోఁదాము పురోహితుల్, సచివు లాత్రం బేర్పడంగా, నపా
యము లేనట్టి యుపాయ మొం దనుచు మంత్రాలోచనం జేసి రూ
పము గల్పించుచు రోమపాదునకుఁ జెప్పం బూని రద్దాని భూ
ప, మనం దా విని దానినిన్ దశరథ క్ష్మాజాని; రామప్రభూ! 159

(రౌద్రి-విజయదశమి-అని కొందఱు)

వడుగై యుండిన ఋశ్య శృంగ ముని నేమం బొప్ప జీవించినాఁ
డడవిం; బుట్టువు నొందె నా యడవినే; [108] యా హేతు వట్లుంట నె
ప్పుడు వేదాధ్యయనంబు, నుత్కట తపంబుం దప్ప, నేర్వండు తాఁ
బడఁతుల్ వారి మనోగతంబు లనియెన్ మం తంత; రామప్రభూ! 160

ఆయ శీలుండగు ఋశ్య శృంగముని యేకాంతంబు నందుంట, నై
షయికా నంద మటన్న నేమొ! యెఱుఁగం జాలండు; [109] రూపాదు లెం
తయు క్షోభం గలిగించు నెట్టి ముని చిత్తంబందునంగాని యిం
ద్రియ [110]సంతృప్తినిఁ గొల్పు; యం చనియె మంత్రీంద్రుండు;రామప్రభూ! 161

అవి దేహేంద్రియ సర్వ సౌఖ్యముల నీయం జాలుటన్, వానిని
జవి చూడఁ మది ఋశ్యశృంగముని వాంఛల్ వెంచి, యా పట్టణం
బు వడిన్ రాఁగలయట్లు జేయఁదగు నేర్పుల్ [111]సూపఁగా నా ప్రగుస్
జవరాం! డ్రం చని మౌని యంట వినిచెం బాత్రుండు; రామప్రభూ! 162

మన మెక్కంగ నలంకరించుకొని పోవన్ వేశ్య, లవ్వారికిన్
ముని పుత్త్రుండు వమాయికుం డగుట నల్పున్ సేవ లెంతేని; వం
చనచే నాతనిఁ దోడితేఁ గలరు వేశ్యల్ పెక్కుపాయాది, నం
చనియెన్ మౌని, యటంచు నాడె సచివ ప్రాగ్ర్యుండు; రామప్రభూ! 163

108. యా పైన మ; 109. శబ్దాదు, స్పర్శాదు; 110. సౌఖ్యాదుల గొల్పు;
111. సూడనౌ నెంతయున్;

తమ కి[112] సంగతి కియ్యకొం డనిరి యేత న్మంత్రు; లద్దాని కం
గ మహీపాలుఁడు మెచ్చ, 'వల్లె' యనె; నింకన్ మంత్రి పోతాదు లు
త్తమతం బూనిరి ఋశ్యశృంగు నటకున్ ధైర్యంబుతోఁ దేరఁగా,
శ్రమ మం దెంచక, యం చమాత్యుఁడిటు ప్రస్తావించె; రామప్రభూ! 164

విలసద్రూపము రేఖయున్ మెఱయఁగా వేశ్యాంగనల్, సర్వభూ
షల కై సేఁతలు సంగరాగములు బెల్పం దాల్చి, ఘోరాటవీ
తలముం జొచ్చి విభాండ కాశ్రమము ప్రాంతంబునం జేరి, లో
పలికిం బోవఁగ భీతలైరి; యనియెం బాత్రుండు; రామప్రభూ! 165

అటనే నిల్చిడి ఋశ్యశృంగుని గనన్ యత్నించి యత్నించి, చూ
చుటకుం జాలక. కార్య మా గతిని గమ్మన్ విచ్చుగా నౌటకున్
బుట క్రొవ్వెల్లి సదంగ రోవెలఁదుకల్ పోరాములం బొందె, త్రో
క్కుటపా లౌటయు నూఁకొనెన్ దశరథ త్మాజాని; రామప్రభూ! 166

గురు శుశ్రూషలు సల్పుటల్, సతము నగ్న్యుద్ధార సేవాదులన్
బరమాసక్తి నొనప్పుటల్, దనకు ధర్మం బంచు భావించి, వే
డౌరవుం బూనని ఋశ్యశృంగుఁడు చనం డొంటెన్ బహిర్ద్వారమున్
బరగన్ దాఁటి, యటన్నమాట వినిచెం బాత్రుండు; రామప్రభూ! 167

తన తండ్రిం దన యాశ్రమంబును వినా, తక్కొండియుం జూడఁబో
వని యాతం డొక స్త్రీనిగాని, పురుష వ్యాఘ్రంబునుం గాని ప
త్తన పల్యాదులఁగాని, యెన్నఁడును సందర్శింపఁగా లేదు; వే
నిని గామింపఁ; డటంచు వాకొనియె మంత్రీంద్రుండు; రామప్రభూ! 168

ఒకనాఁ డాతఁడు తండ్రిలేని తఱితో నొంటింపునుంబట్టి, పైఁ
టకు వచ్చెం దన యాశ్రమాస్పదము దాఁటంగల్గి, దైవంబుచే
ష్టకు లోనై; యట రోమపాదపుర వేశ్యాకన్యలా మ్ముగ్ధకం
టికిఁ గాన్పించిరి, చక్కఁజో యనెడి సూచిన్ గొల్చి; రామప్రభూ! 169

112. పద్ధతి.

కని రా చిత్రవిచిత్ర వేషములతోఁ గాంతామణుల్ ఋశ్యశృం
గుని; వేగంబ మనోహరంబులగు సూక్తుల్ గల్గు గానంబుచేఁ
తను, [113]నాట్యంబు విలాస విభ్రమ లస దర్శంబుచేతం, దదా
ననముం బ్రిప్పకయుండఁ జేసితిరి కాంతల్ వారు; రామప్రభూ! 170

వటుగా! యెవ్వరివాఁడ? వెవ్వరవు? నీ వాసస్థలం బిందు నె
క్కడ? ఘోరాటవి నేల త్రిమ్మరెద వేకాంతఁబు? [114]నారుండు క
న్పడఁ డీ ప్రాంతమునందు నెచ్చటను; దానన్ భీతి యేమాత్ర మే
ర్పడదే నీ? కని [115]యంచు, వా రిడిరి కైలాటంబు; రామప్రభూ! 171

గణికల్ సుందర కామ్యమాన [116]వపుషల్; గానం బతం డెన్నఁడున్
వినిలోఁ దాదృశ సుందరాంగులను దత్ప్రాంతంబులన్; వారిపై
ననురాగంబు చిగిర్చె నాతనికి నత్యంతంబుగా నెట్టి కా
రణముం గన్పడకే; యటం చనియెఁ దీక్షస్వామి; రామప్రభూ! 172

పలికెన్ వారలకున్ వచింపవలె నన్ వాంఛా లతల్ సాగ మి
క్కిలి, 'మా తండ్రి విభండకుం డనెడు వాగ్మిష్ఠుండు, మౌనీంద్రుఁడున్;
గలిగెన్ నాకును ఋశ్యశృంగుఁడను సంజ్ఞా ఖ్యాతి; నే సర్వ క
ర్మలునున్ నేర్త' నె ఋశ్యశృంగుఁ, డనియెం బాత్రుండు; రామప్రభూ! 173

మన యీ లోకములో సమస్త విధ కర్మల్ వ్యక్తముం జేసి కొం
టిని. యో! చక్కని చుక్కలార! పరిపాటిన్; మా [117] కుటీరంబు నిం
దునసే కద్దు సమీపమందుఁ; జన నందున్ మీరు నాతోడ న
ద్దిని సత్కారము సేతు; నం చనె ననెం దీర్ఘుండు; రామప్రభూ! 174

---

113. లావణ్య; 114. మర్త్యుండు; 115. వారు సల్పితిరి సంప్రశ్నంబు;
116. తనువుల్; 117. దుష్ప్రవఙ్యయిం;

'ఇదె! మీరల్ సనుదెంచుచో నచట శాస్త్రీయంబుగా సత్కరిం
చెద రండీ!' యని ఋశ్యశృంగుఁడన నా చిన్నారి వేశ్యాంగనల్
మదిలో నాతని యాశ్రమంబుఁ గనఁగా వాంఛల్ గదల్గొంటచే,
'పదు' మం చాతని నంపె; రం చనె వనం బాత్రుండు; రామప్రభూ! 175

'ఇదిగో! యర్ఘ్యము; పాద్య మిద్దియె; కొసుండే! కందమూలాశుభున్
స్వదమే;' యం చని యాతఁ డీయ, నమితోత్సాహంబునన్ సత్కృతిన్
ముదితల్ గొంచున, వాని తండ్రికి భయంబుం బొందినారల్ [118]పడిం
బడిగా, నంచని మాని చెప్పె ననియెం బాత్రుండు; రామప్రభూ! 176

తరలంగా వలె నాశ్రమంబు విడి; లేదా, యే క్షణం [119]బేనియున్
ద్వర రావచ్చు విభాండకుం డనుచుఁ గాంతల్ సింతిలం జొచ్చి యి
చ్చిరి తా రందులఁ దెచ్చియున్న ఫలముల్, సేకోవతెం జుమ్మి' యం
చు రయాసన్ ముని, కంట, మం తనియె రాజుం దేర్చ; రామప్రభూ! 177

లినుమీ! నీకు శుభం బగుం; గొలఁది యాతిథ్యంబు మా దిద్ది; జా
గును జేయం దగ దీ యెడాటమున నీకుం జూడ; నం చంగనా
జన మొయ్యొయ్యనఁ గౌఁగిలించి మధు భక్ష్యాళిన్ ఫలశ్రేణి యం
చు నొసంగెన్ ముని, కంట, మం తనియె రాజుం దేర్చ; రామప్రభూ! 178

వనితల్ గూర్చిన కౌఁగిలింతలకు నిర్వాణంబుమై వెన్నయై
ముని పుత్త్రుండు కరంగి, వా రిడిన తీపుల్ దోఁచు భక్ష్యంబులన్
దిని, కొండాడెను వానివైన రుచులన్, దీపించు వైవిధ్యమున్
మనమం, దంచు మహర్షి యంటఁ దెలిపెం బాత్రుండు; రామప్రభూ! 179

తను మున్నెన్నఁడునుం దినండు గద! కాంతారంబునన్ వాని, న
మ్మని గొబ్బండ్లను; గాన వింతగొనియెన్ మూమూచుమని వాని; నా
తని తండ్రిం దలపోసి, 'మా వ్రతము సేఁతల్ గోరి, వే పోదు, మం
చని రా స్త్రీ,' లని యంటఁ జెప్పె సచివ ప్రాగ్ర్యుండు; రామప్రభూ! 180

118. పడిం బడిగా; 119. బందునేన్;

హృదయ స్వాస్థ్యము ఋశ్యశృంగ మునికిన్ హీనంబు గాఁ జొచ్చె; నం
గదయుం బైకొనె, సాకుమై జనిన భోగస్త్రీలనుం[120]గూర్చి; గం
గ దిగుచ[121]గూరెను, వారు కన్పడుదురో! కాన్పింపరో! యంచు నె
మ్మది; నంచున్ ముని యంటఁజెప్పెఁ బతికిం బాత్రుండు; రామప్రభూ! 181

నియతిం గల్గిన బ్రహ్మచారి యని వర్ణింపంగఁ బడ్డట్టి వాఁ
డయునన్, వారిని ఋశ్యశృంగముని చూడంగోరి, మర్నాడు ని
శ్చయ తద్దర్శన భాగ్య వాంఛ మెయి సంచారించె, మున్ వాని కా
శ్రయమౌఁ దావున, [122]నం, టనెం బతికిఁ దీర్థస్వామి; రామప్రభూ! 182

కని, రాత్రిమ్మరువాఁడతండె యనుచుం గన్యల్ మహానంద మొం
దిన చిత్తంబునఁ; బోయియుండి రెమరై దీపించుచున్ వానికిన్;
'నిను మా యాశ్రమ వాటికిం గొనుచు మన్నింపంగ నేతెంచినా'
మనుచున్ [123]వారని రంచుఁజెప్పె సచివ ప్రాగ్ర్యుండు; రామప్రభూ! 183

త్వరగాఁ దప్పక రావలెన్ ముని [124]సుతా! మావెంట మాయాశ్రమ
స్థిర వాసంబున మీ కితోధికముగాఁ జేయంగ సన్మానమున్
బరమోత్సాహము గల్గుచున్న; దని భామల్ వల్క నవ్వారితో
నరిగెన్ [125]వాఁ; డని మౌని యంట సచివుం డప్డాడె; రామప్రభూ! 184

అడుగన్ మోపెనొ! లేదొ! యంగ [126]మను రాజ్యం [127]బందుఁ దస్మౌని య
ప్పుడె కార్మబ్బులు పట్టె; నప్పుడమి నంభోరాశి యుప్పొంగనౌ
పడువుం దెల్పుచుఁ గ్రుమ్మరించె విలసద్వర్షాభ్రముల్ నీరముల్
జడిగా; నం చని మంతుచెప్ప, విని యెన్ క్ష్మాభర్త; రామప్రభూ! 185

జనులానందమునందు మున్కలిడ, వార్షశ్రీని వెన్వెంటనే
గొనిరాఁ గల్గిన మౌని సత్తముని గన్గో జాలు భాగ్యంబుఁ దాఁ
గనుటన్ మోదిలి, రోమపాద ధరణీ కాంతుండు ప్రత్యుద్గతిన్
మునుపుం జన్చె, నటంచు రాజునకుఁ జెప్పెన్ మంత్రి; రామప్రభూ! 186

---

120. జూచి; 121. మీఁత; 122. నంచనెం; 123. వారను బెల్ల వించె నది తా ముంతుండు; 124. వరా; 125. మౌని యటంచుఁజెప్పె సచివ ప్రాగ్ర్యుండు; 126. శుభ; 127. బందునా మౌని;

చని శాస్త్రీయముగాఁగ సర్వస్వమును, మించం బాధ్యముం జల్పి, 'యో!
ముని[128]దేవా! యిటు మా పురంబునకు మిమ్ముం గోరి రావించినం
దున నన్నున్ క్షమియుంచి, మీ జనకు వాదుం గూడ మాన్పింపుమీ!'
యనుచున్ వేఁడెను రా, ఇటం చనె సమాత్యస్వామి; రామప్రభూ! 187

తన యంతఃకరణంబు నిర్మల [129] మనన్ దాక్షిణ్యముం గొల్పి ప
ల్కిన యా పిమ్మట రోమపాదుఁ డిడెఁ బుత్రిన్ శాంతనున్ భార్యగా
మునికిన్, శాస్త్ర విధాన పూర్వక లస ద్భుణ్యోపయామంబు నం
దనె, సాకేత పురాధినాథున కమాత్యస్వామి; రామప్రభూ! 188

పునపుం దంతఃప్రకాంతతం బడసెఁ ద న్మాన్యుండు, దేశంబు నం
దున సౌ భిక్షము వర్ధిలంగ నృపుఁ, డెందుం బోఁక యంతఃపురం
బుననే యుండఁగ రోమపాదుఁడును నేపుంజూపు నల్లుండునై;
యనె, సాకేత పురాధినాథు న కమాత్య స్వామి; రామప్రభూ! 189

తలపఁన్ నేటికి ఋశ్యశృంగ ముని శాంతా దేవితో సౌఖ్య శాం
తులు [130]మీటంగను నంగరాజ్యమునయందుం గాఁపురంబుండె, ము
ద్దుల యల్లుండయి రోమపాద ధరణీంద్రున్ నిష్కటాంతంబునం
దుల, నంచున్ వినుచున్న దా జపుడు మంతుం జూచె; రామప్రభూ! 190



128. వర్యా; 129. మగా; 130. పర్వంగను, నెచ్చిర్లఁగ, నీడేఱఁగ:

-౧౧-

రాజా! మున్ను సనత్కుమార ఋషి సర్వంబెప్పె నా కంత, వి
భ్రాజన్మూర్తి, మహాత్మ [131] సంగతిని; మీరల్ దాని నేకాగ్రతన్
బూజాభావమునన్ వినన్ వలయు సంపూర్ణంబుగా; నంచు నా
తేజోవంతుఁడు [132] మంతు [133] వేఁడికొనె ధాత్రీనాథు; రామప్రభూ! 191

హేమాహేమియు, సత్యవాక్య నిపుణుం డిక్ష్వాకు వంశంబునన్
శ్రీమంతుం, డయి పుట్టెడుం బరమ ధర్మిష్ఠుండు రా జొక్కఁ; డా
కామంగామిని నెల్లరున్ దశరథ క్ష్మాజాని యన్ బేరుతోఁ
బ్రేమం బిల్తు; రటంచుఁ జెప్పె నని చెప్పెన్ మంత్రి; రామప్రభూ! 192

అదియే కాలములోన నంగమను రాజ్యంబందునం బుట్టి, సౌ
హృదుఁడౌ నొక్కఁడు రోమపాదుఁడను ధాత్రీశుండు, విఖ్యాతు సం
పదభి వ్యాపక హేతువౌ దశరథ క్ష్మాభర్త కత్యంతమున్
మృదు చిత్తుండయి; యంచుఁ జెప్పె నని చెప్పెన్ మంత్రి; రామప్రభూ! 193

ఎంతోకాలముదాఁక నా దశరథక్ష్మేశుండు పొందండు తా
సంతానంబును; రోమపాదుఁ గని "రాజా! నేను నిస్సంతునై
చింతం గందును; ఋశ్యశృంగుఁ డెఱుఁగుం జేయింపఁగా జన్నపున్
బంతం బొక్కటి;" యం చతం డనినటుల్ మం తాడె; రామప్రభూ! 194

దానన్ సంతతిగల్గు నాకుఁ బెనుపొందన్ వంశ; మా యజ్ఞ మే
పానం జేయఁగఁ జేయఁజాలు నొకఁడే యల్లుండు నీవాఁడు; నీ
యానన్ వచ్చి యతండు నా పురికి నా యజ్ఞంబుఁజేయించెడిన్
గానన్ వేఁడెద నంచు రా జనె సనెం బాత్రుండు; రామప్రభూ! 195

కనుకం బంపుమి నీదు నల్లుని భవత్కన్యా మణిన్ కాంతనున్,
మనసా కోసల భూమి కం చతఁడు సమ్మానంబుతో వేఁడినన్,
దన యల్లున్ సకుటుంబిగాఁ బనిచె, నేత ద్బుద్ధిమంతుం, డనెన్
ముని నాతో, ననుచున్ సుమంత్రుఁ డనియెం, బూజ్యుండు; రామప్రభూ! 196

131. యంశమును; 132. మంత్రి; 133. వేఁడెఁ గులమెంతే సాగ;

తనకున్ సంతతి లే దటంచుఁ బడు సంతాపంబునుం దీఱఁగా
నను సాకేత పురాధినాథునకుఁ; బంతం జొప్ప నా మిత్త్రుఁ డం

పిన యట్లం దను బూజసేయ, నతఁడున్ వే కామ్య యజ్ఞంబుఁ జ
ల్పు నటుల్ సేసె; నటంచు రాజునకుఁ దెల్పున్ మంత్రి; రామప్రభూ! 197

తనయుల్ నల్వురఁ గోసలావనిపుఁ డొందం గల్గు; వంశప్రతి
ష్ఠను నిల్పంగల శౌర్య ధుర్యులు జగత్సంస్తావ్య సత్కీర్తులై,
మనుపన్ వార లటంచుఁ, గూటమున బూర్వం బందు వాక్రుచ్చె నా
ముని; యా మాటె సుమంత్రుఁడుం గృత యుగంబుం గూర్చి; రామప్రభూ! 198

వినయోపేతత మంత్రి వాకొనియెఁ బృథ్వీనాథుతో, 'దేవ! పెం
పున మీరల్ చతురంగ యుక్తు లగుచుం బుత్త్రార్థితం బోవుటల్
సను, వెన్ వెంటనె రోమపాదపురికిన్, సత్కార పూర్వంబుగా
ననుచుం, దేరఁగ బుష్యశృంగుని, నయోధ్యం జేర; రామప్రభూ! 199

విని యా సంగతి యెల్లఁ, గోసలఁపు బృథ్వీ భర్త తా సంప్రదిం
చెను [134]చెప్పం దపధారణం బని మహర్షిశ్రేష్ఠుఁడౌ నా వశి
ష్ఠునితోఁ; వాతఁడు బుష్యశృంగు నటకుం [135]జొప్పిల్లఁగాఁ దేర ని
చ్చెను ప్రోత్సాహము నెల్లవారును బ్రశంసింపంగ; రామప్రభూ! 200

అంతన్ గోసల భూమినాథుఁడు వశిష్ఠాశీస్సులం బొంది, యా
మంతుల్ పౌర జనంబులున్ హితులు, సేవాతత్పరుల్ గొల్వ ని
శ్చింతం జేరెను రోమపాదపురికిన్, సేవింపుచున్ నిర్ఝరీ
కాంతారోరు మహీధ్రముల్, జనపద గ్రామంబుఁ; రామప్రభూ! 201

తన గేహంబున కట్లు మిత్త్రుఁడు[136] సనం దా రోమపాదుండు మో
దమునం దేలి యథావిధిన్ సలిపి సత్కారంబు, పెన్ హోమకుం
డములోనన్ జ్వలియించు నగ్నివలె నుండం జూపె, నా బుష్యశృం
గ మునిన్, వానికి మ్రొక్కెడన్ దశరథ క్ష్మాజాని; రామప్రభూ! 202

134. జేయుం; 135. శోభిల్లఁగాఁ; 136. దరుగం;

తనకుం గోసల భర్తకుం గలుగు మైత్రి[137]త్యంతముం గూర్చియున్,
ఘన సంబంధముఁ గూర్చియున్ శ్వశురుఁ డుద్భావింపఁగాఁ జెప్పినన్
విని, యా రాజును ఋశ్యశృంగ ఋషి తన్నెం, దాన తానై సప
ర్యను సల్పంగఁ గదంగి గౌరవము మీఱం జాల; రామప్రభూ! 203

కడపెన్ [138] మిత్త్రి సపర్య లందికొనుచుం [139]గౌసల్యకున్ భర్త, య
క్కడ నే డెన్మిది వాస్ల; లా పిదప, 'నే గాంక్షించు నా యజ్ఞమున్,
నడపన్ దక్షుఁడు ఋశ్యశృంగుఁ డొకఁడే! నాడెందు నీ వంప వెం
బడి నా కాతని', నంచు వేఁడికొనె నాప్తశ్రీని; రామప్రభూ! 204

తనియన్ నే నది చేయఁ బూనితిని సంతానార్థినై యుంచి; కా
న, నహోగండ సతీసమేతముగ నానందంబునం బంపు మ
ల్లుని నా వెంట నటం చనన్ సుహృదుఁ, డల్లుం జూచె నా భూపుఁ, డా
యనయున్ సమ్మతిఁ జూపె, మిత్త్రి లపు డాహ్లాదింప; రామప్రభూ! 205

చెలికాం డ్రంత హృదిస్పృశం బగునటుల్ క్షేమ్యంబులోనట్టి కౌఁ
[140]గిలులం జేర్చి రొకళ్ళొకళ్ళఁ; బిదపం గేల్మోడ్చి వీడ్కోలు తాఁ
బలికెం గోసలనాథుఁ డాప్తునకు, భామా యుక్తులై ఋశ్యశృం
గులవారుం దన వెంటనంటి చనఁ, గోర్కుల్ దీఱ; రామప్రభూ! 206

తను రానుంటిని ఋశ్యశృంగుఁడును శాంతాదేవియున్ వెంటరా
ననుచుం బుచ్చెను వార్తఁ గోసల ధరాప్రాణేశుఁ డా భూమికిన్;
జనముల్ పొంగిరి; వీరముల్ దెరువులం జల్లంబడెం; దోఁచెఁ బ
త్తన మెల్లన్ ధ్వజ ధూమముల్ ఘుమఘుమల్ దైవాఱ; రామప్రభూ! 207

137. థిక్యమున్, త్యర్థమున్; 138. బంధు. మిత్త్రి;
139. గ్రకేయికిన్; 140. గిలలన్;

తమ రాజాపురి, శంఖ దుందుభుల ప్రోత్తాల్ ఘూ నభో మధ్య భా
గము దద్దిర్లఁగఁజేయఁ జొచ్చుతఱి, సత్కారంబు తోరంబుగా
గుములై [141]సర్పిరి పౌరు; లా మునిని గన్గొంగల్గి మోదాబ్ధిలో
ప మునుంగన్ మునినిల్పి రా జనులె చింతల్‌వాసి; రామప్రభూ! 208

లన యంతఃపురిలోనికిం గొనుచు, శాస్త్ర ప్రక్రియం జల్పె నా
ముని జాయాపతు లెంతయున్ ముదిసి, నామూలాగ్ర సన్మానమున్,
జననాథుం; డపు డోపరిన్ మెఱఁగు యోషల్ పెద్ద కన్దోయిఁ గ
ల్గిన యా శాంతను దేవి జూచితిరి, పేర్మిన్ మ్రొక్కి; రామప్రభూ! 209

ఎంతో [142]మేమరమైన యాదరముతో నింతుల్ మహా మౌనినిన్
శాంతా దేవిని గౌరవించి తగు పూజల్ సేసి, యవ్వారి సత్
సంతానంబును ప్రేమ మున్కొనఁగ వాత్సల్యంబునం దేల్చుచున్
దాంతిం జూపిరి, సౌధ వీథికలఁ జిందన్ భక్తి; రామప్రభూ! 210

కృతకృత్యుండయినట్లు యెంచుకొనుచున్ హేరాళమౌ భక్తి నా
తత పుణ్యుండగు గోసలాధిపుఁడు సత్కారంబునన్ మౌని దం
పతులం గొల్చెను మించి యెల్లరను; సేవల్ గొంచు భక్తాళిచే
సతితో మౌనియుఁ గాలముం గడపె నా సౌధాన; రామప్రభూ! 211



141. గొల్చి; 142. యాదర పూర్వకంబుగను;

౧౨

హృదయాహ్లాది వసంతకాల మపుడే యేతెంతె; రా జంచుచే
మునితుండై తన యజ్ఞ కర్మ నలుపన్ బుద్ధిం దలంపన్, శుభా
స్పదముం గూడను నైన కాల మగుటన్; [143]సాష్టాంగముంజేసి, యా
చదురున్ మౌనిని వేఁడెఁ బూనుకొన నా జన్మంబు; రామప్రభూ! 212

"మునిదేవా! రఘువంశ మెల్లపుడునుం బుత్త్రీది యోగంబునున్
గనఁగా, సొంగ్రహణేష్టికిం దమరు వేడ్కం బూని బుత్త్విక్కులై
కొనసాగింపుఁ" డటంచు రా జడుగ, మీకున్ యజ్ఞసంభార మెం
డెనె? సర్వంబును సిద్ధమై, యనుచు నాఁడెన్ మౌని; రామప్రభూ! 213

విని యా పల్కులు బుత్విక్ప్రంగునివి పృథ్వీభర్త, "వేవేగమే
గొనిరండీ! మన బ్రహ్మలన్ గురువులం; గొండాడనౌ నెల్ల బ్రా
హ్మణులన్ మీ" రనుచున్ సుమంత్రుని మహామాత్యాళినిం బంచె; వా
రును దోతెచ్చిరి [144]పెద్దలన్ నృపతి పేర్కొన్నట్లు; రామప్రభూ! 214

కని, జాబాలి, సుయజ్ఞుఁ, గాశ్యపుని నింకన్ వామదేవాదులన్,
ముని బృందారకునిన్ వశిష్ఠుని[145], 'నయంబున్ మీఱ నే బుత్విక్పం
గుని దోతెచ్చితిఁ బుత్త్రిలం బడయు కోర్కుల్ [146] దీరు యజ్ఞంబు న
ల్పుసు దస్మాని', యటంచు రా జనియె సభ్యుల్ మెచ్చ; రామప్రభూ! 215

విని, యా మౌనిని నిష్ఠి సల్పుటకు రావించెన్ బలే! యంచు రా
జును, నిక్ష్వాకు కులంబు నిల్పుటకు నెంచున్ మౌని సు మ్మంచు నా
తనినిన్, మెచ్చెను మౌని బృందములు, సంతానార్థమై ధర్మ బు
ద్ధిని రా జూనుట శ్రేయమౌ ననుచు మున్ దీవించి; రామప్రభూ! 216

రాజా! మీ కిఁకఁ గల్గనుంటిరి కుమార శ్రేష్ఠు లత్యంతమున్
దేజోవంతులు, నల్వు'రంచు మునులున్ దీవింప, సంతోష వి
భ్రాజ త్స్వాంతుఁడు పొంగెఁ దా దశరథ క్ష్మాభర్త చిత్తంబులోఁ,
బూజల్ నేఁడు ఫలించెఁగా!' యను దలంపుల్ గూర; రామప్రభూ! 217

---

143. బ్రహ్మంజలిం గూర్చి; 144. పెద్ద లెల్లరను వేరం వేర;
145. వినయం; 146. దీర్చు;

తమ రీ విప్రవరుల్, గురూద్వహుల చెంతం జేరి, 'యో! మంత్రి స
త్తములారా! సమకూర్పంగా వలయు నేత ద్యజ్ఞ సంభారముల్;
క్రమతన్ ఋత్విజవర్య దక్షదళ సంఘాతంబుతో సత్వమున్
[147] సమయాచారత వీడపచ్చు ననియెన్ [148] ఋత్విక్ప్రవృత్తు; రామప్రభూ! 218

రాజాజ్ఞన్‌బడి మంత్రి [149] సత్తములు సర్వక్షేమ కార్యంబులన్
సైజోత్సాహత నిర్వహించుటకుఁ బూనన్, బ్రాహ్మణ శ్రేష్ఠులున్,
దీక్షాధ్యక్ష మహస్స్వరూపులు, పనుల్ [150]పెంపెక్క సాధింపఁగా,
'రోజుల్' పట్టెను సర్వమున్ ముగియ, నాప్యుల్ మెచ్చ; రామప్రభూ! 219

అనుకూలం బని చైత్ర పౌర్ణమిని వా రారంభముం జేసినా
రనఘుల్ సాంగ్రహణేష్టి కర్మమును; మర్నాఁడే నృపశ్రేష్ఠుచే
తను బ్రహ్మాదన ముత్తమాళ్వ వినిబంధశ్రేయ సంప్రోక్షణా
దిని, నిర్మోచన కర్మమున్ [151]నెఱపె ఋత్విగ్వ్రాళి; రామప్రభూ! 220



147. సమయంబున్ గుఱుతించి వీడుద మనెన్; 148. ఋత్విజానీ;
149. పుంగవులు; 150. పెంపార: 151. బఱపె;

౧౩

ఒక యేఁడాది గతించెఁ; గల్గెను వసంతోద్యాతి యింకొక్కసా
రికి; రాజా తఱిలో వశిష్ఠ సుమహర్షిన్ మ్రొక్కి, "యో! దేవ! వా
రక మాకుం గుల దేవతల్ దమరు; శాస్త్రప్రోక్త మార్గంబునన్
సకలేష్టిన్ నడిపింపఁగోరు," దని యాశాసించె; రామప్రభూ! 221

వినుతింతున్ మిము నాదు యజ్ఞమును నిర్విఘ్న ప్రకారంబునన్
గొనసాగింపఁ దటంచుఁ బూనుకొని; నాకుం దాము ముఖ్యాప్తులున్
ఘన సంపూజ్యులు; దీని నిర్వహణ సత్కార్య ప్రమేయంబు నె
ల్లను జూడన్ వలె మీరలే! యనెను రాజస్వాంతుఁడు; రామప్రభూ! 222

రాజా! నీ [152] శివ కార్య నిర్వహణ భారం బెల్లనుం బూనుదే
మాజీవం బగు నా;' కటంచు నతఁడు యజ్ఞాశాల కార్యజ్ఞులన్,
కైజీతంబును బొందు కార్మికుల, యోగ్యద్రవ్య సంగ్రాహక
ప్రాజాపత్య ధురీణులం, బిలువ [153] నిర్ధారించె; రామప్రభూ! 223

ఇటుకల్ మున్నగు నవ్వి చేయుపనివా, రిజ్యాప్రవాహార్థమై
పటు యూపంబులు సల్పువారు, విధులం బ్రాజ్ఞత్వ మేపారఁ బ్ర
స్ఫుట మార్గంబున నిర్వహింపఁగల సుశ్రోత్రితంబునుం గల్గువా,
రటకున్ వేగమె పిల్వఁగాఁబడిరి, గుర్వాజ్ఞాప్తి; రామప్రభూ! 224

గురు వా రీతిగఁ గర్మకారులను, దక్షుల్ శిల్పులన్ మాత్రమే
పరగం గల్పక, చిత్రకారులవి సంభారంబులన్, నాటకో
ద్ధుర సంఘంబుల, నంక సంగణితి సందోహంబులన్, రాజత
త్పర కార్య వ్రజముం [154] ద్వరం గలియ నేర్పాటయ్యె; రామప్రభూ! 225

152. శుభ; 153. సంభావించె; 154. మున్ 'సహా' కలియ;

వినుఁడీ! [155] భూవిభుభక్తులార! మిములన్ వేఁడున్ మహారాజు; మీ
పనులన్ మీరలు చక్కఁగా నెఱపుటల్ భావ్యంబు యజ్ఞంబునం
దున; దేశాధిపు లెల్లరున్ విడియ మున్ముం దీఱ సౌధాళి మీ
యసుపుం జూపుచు నిల్పుఁ, [156] డంచనె సుపాధ్యాయుండు; రామప్రభూ! 226

ప్రావృట్కాల పయోద వర్షములలో, వాతాతపశ్రేణిలో,
లాపై యుండెడునట్లుఁ, [157] జెక్కుచెదరన్ రాకుండు నట్టుల్, మహీ
దేవుల్ వాసముచేయుపట్టులను సంధిష్ట ప్రదేశంబులన్
జీవన్ నిల్పుఁడు వండ, లం చని వచించెం దాను; రామప్రభూ! 227

మన యజ్ఞం బగు వేళ నుండుటకు బ్రాహ్మణ్యంబు, త త్సౌధ పీ
ఠి నిరాయంబునఁ బంచ భక్ష్యములు ప్రీతిం బొందు సౌకర్యముల్
జను సల్పన్; వినసింప నాగరులు వేశ్మంబుల్ గడున్ నిల్పి, పై
పనరుల్ మించ వమర్పుఁడంచనె నుపాధ్యాయుండు; రామప్రభూ! 228

జినుబండారము లన్నియున్ విడుదులం దీర్పన్ వలెన్ నాగరుల్
డినఁగాఁ; ద ద్గతి పల్లెవాసులకునుం దీర్పన్ వలెన్ గేహముల్,
వసరుల్, రుచ్య పదార్థముల్; దినెడి దెవ్వారైన బండంపు వ
ద్దనలోఁ జూడుఁ డ టంచనెన్ గురువు శైశిష్యం [158] బెందు; రామప్రభూ! 229

ఎవరిం జూడఁగరా దనాదరముమై; నెల్లారినిన్ సత్కరిం
ప వలెన్, వంశమునుం గులంబును దలంపన్ రాక, యోగ్యత్వమే
తపులంగా మది మీకు నెల్లరకునుం; దాపంబుఁ గామంబుచే
నవలంబింపకుఁడీ! యపజ్ఞ; యనె [159] నత్యర్భ్యుండు; రామప్రభూ! 230

మన వేల్మిన్ నెఱవేర్చువారలకు నేర్పాటయ్యె పృష్టాన్న భో
జన మిందే; తమ యోగ్యతానుగుణతన్ సమ్మానముల్ సేయుచల్
ధనముల్ గూడను బంచుటల్ జరిగెడున్ ధాత్రీశుచే నిత్యమున్;
బ్రణిధిం గార్యము లెల్లఁ జేయుఁ డనెఁ దీర్ఘస్వామి; రామప్రభూ! 231

---

155. పృథ్విపు; 156. దం చ నియె నిజాజ్ఞగ్ర్యుండు; 157. జెప్కఁ;
158. బెల్ల; 159. నపూర్యుండు;

చను నెల్లారికి నెంత చిన్నపనియుం జక్కంగ, సద్భక్తితోఁ,
బ్రణయార్ద్రత్వముతో నొనర్చ, విడవన్ రాకుండ నెద్దానినిన్
పనిని[160] బొందుచు, నంచుఁ గార్యులకు శ్రద్ధాసక్తులం గూర్చి చె
ప్పెను దీర్ఘుండు, విధేయ ధర్మ మగుటన్, వేమారు; రామప్రభూ! 232

ఆ యా కర్మకరుల్ స్వకర్మముల శ్రద్ధాసక్తి సంయుక్తులై
చేయం గాన, సుమంత్రునిం గని మహర్షి శ్రేష్ఠుఁ, డో! ధర్మ సం
ధాయి జ్ఞాయి! యమాత్యవర్య! ధరణీంద్రవ్యూహ మాహ్వానమున్
జేయంగావలె ముందు మీర అనియెన్ స్నేహింప; రామప్రభూ! 233

ఆ యా దేశపు బ్రాహ్మణోత్తముల, సన్మైత్త్ర క్షత్త్రియానీకమున్,
శ్రేయోఽర్థుల్ బహు వైశ్య సార్థములనున్ సచ్ఛూద్రులన్ శూద్రాలిన్,
భూయస్సంఖ్య అశేష సజ్జనులనుం బ్రోత్సాహముం జేయనౌ
నీ[161] యాగంబును జూడరా; ననియె నా యజ్వుండు; రామప్రభూ! 234

"జనకోర్వీపతి, యో! సుమంత్రుఁడ! మహాశౌర్య ధుర్యుండు, స
త్య నిరూఢుండు, సమస్త శాస్త్ర విదుఁ, డాయా వేద విజ్ఞానియున్,
మన రాజేంద్రునకుం జిరంబు సఖుఁ, డాహ్వానింపఁగ పోయి, యా
యననున్ నీవు స్వకంబుగా;" నని నుపాధ్యాయుండు; రామప్రభూ! 235

మన కాశీ ధరణీ ధరేంద్రు, నటులే మర్యాదపై నీవు ర
మ్మని యాహ్వానము సేయుమీ! స్వతముగా; నాతండు నెయ్యుండు రా
జునకున్ ముఖ్యముగా; ధరాధిపుల వాచోయుక్తి సంపన్నుఁ డా
యన సు; మ్మంచు సుమంత్రుతో నని నుపాధ్యాయుండు; రామప్రభూ! 236

మన రాజేంద్రుని మామ, కేకయ మహీ పాలుండు, ధర్మాత్ముఁడున్
ఘన[162]వృద్ధుం డగు; నాయనం[163] బరమ యోగ్య స్వాంతుఁ డై నట్టి యా
యన పుత్త్రుం, బిలువంగఁ బోవలయు నయ్యా! నీవు తద్భూమికిన్,
వినయోపేతత, నంచు మంతునకుఁ జెప్పెన్ మౌని; రామప్రభూ! 237

---

160. గొల్చుచు; 161. యజ్ఞం; 162. శూరం;
163. నన్, శర సు యోగా దాసుఁ;

మన రాజన్యున కంగదేశపతి చెప్పండగ్గ మిత్రోత్తముం బిలం
దున ముఖ్యుండును, ఋశ్యశృంగ ఋషికిన్ దోషంబు సంధించుచుం
డిన యా మోహము; నట్టి పుణ్యతముఁ దాసిం దిల్వ నీ వేఁగుమీ!
యనియెన్ మౌని సుమంత్రుఁ గన్గొనుచు నొయ్యం బ్రీతి; రామప్రభూ! 238

మీదిన్ మాత్రమె గాక, రాఁ బిలుము, పృథ్వీపాలురన్ సింధు సౌ
వీరప్రాంతములందు బంధుగులతో, మిత్రాళితో; నట్టులే
సౌరాష్ట్రాధిప ముఖ్యులం, గడమ రాజశ్రేష్ఠులం గూడఁ బే
ర్వేరన్, బంధు సుహృత్సమేతుల, ననెం బే రాజు; రామప్రభూ! 239

పిదపం దద్ధుత నాజ్ఞఁగైకొనుచుఁ బంపించెన్ సుమంత్రుండు, శ్రే
యద సౌశీల్య సమర్థులన్ ధరణిపాలాహ్వాన [164]ప్రాజ్ఞులన్;
స్వయమే తాను స్వకంబుగాఁ బిలుపనో క్ష్మాభర్త తెల్లారికిన్
గడలుం దెల్పఁ బ్రయాణమై చనియె, [165]వేడ్కల్ సేసి; రామప్రభూ! 240

సచివుల్ కర్మకరుల్ యథోక్త విధులన్ సాకల్యమున్ సల్పినం
తనె, తా వేఁగి వశిష్ఠమౌనిఁ గని శ్రద్ధా భక్తి సంసక్తుఁడై,
"మునిదేవా! నెఱవేర్చినాము సకలంబున్ మీ యనుజ్ఞం; బరి
క్షణముం జేయుఁడి!" యంచు వేఁడిరి మహా సంతుష్టి; రామప్రభూ! 241

ముని యా యా పనివారు సత్వరముగాఁ బూర్తంబు గావించి నం
దున సీస్వామాజ్ఞల, వారి కౌశలమునుం, దోరంపు భక్త్యాదులన్
మనసా యెంచుచు, యజ్ఞవాటి[166]మును సందర్శించి సల్కాలలన్
గనుచున్ మెచ్చెను రాజ పూరుషుల ముఖ్య శ్రద్ధ; రామప్రభూ! 242

మన యీ యజ్ఞముఁ జూడ వచ్చు నతిథి వ్రాతంబునున్ సత్కరిం
పను, వా రిమ్మను వాని నెల్ల సమకూర్పన్ శ్రద్ధ జూపం దగున్;
మన శ్రద్ధా ప్రథమంబు దాన; మటులం గాకున్న పాపంబు వ
చ్చును దానం; బని కర్మలం గని వచించున్ మౌని; రామప్రభూ! 243

---

164. రారాజ్ఞార్థులన్; 165. వేడ్కన్ మీఱ; 166. కను;

దినములఁ గొన్ని గడించె; వచ్చిరి ధరాధీశుల్, వెసన్ మించు ల
క్ష్మిని రత్నాదిని గాన్కగాఁ గొనుచు సాకేతంబు; తీర్థుండు వా
రిని యుక్తంబుగ నాదరించు పని వర్తిల్లంగ వెన్వెంటనే
జనెఁ, దా వచ్చుటఁ గోరుటన్ దశరథ క్ష్మాజాని; రామప్రభూ! 244

ఘన యాహ్వానము మేర కెల్లరు ధరాపాలావతంసంబులున్
జని యున్నార లయోధ్యకుం, బరమ సౌజన్యంబు నౌత్సుక్యమున్
గనిపింపం; దగ వారి కింపయిన సౌకర్యంబులం గూర్చినాఁ
డ, నటంచుం గురుదేవుఁ డా నృపతితోడం జెప్పెఁ; రామప్రభూ! 245

పను లెల్లన్ మన కార్యకర్త లిదె నిర్వర్తించి యున్నారు; కా
వునఁ దోషింతుమ వారు మీరు పనినేర్పుం జూచి యగ్గించుచోఁ;
బెను నిర్మాణము యజ్ఞశాలది మనో వేగంబుతో సాగె; రం
దనె క్ష్మాపాలునిఁ దద్గురుండు పరమాహ్లాదాన; రామప్రభూ! 246

గురు వర్యుండును ఋశ్యశృంగుఁడును బెక్కుం గూర్చవా రొటచే,
సద్గుణంగొల్పు శుభాహమందు శుభ ధిష్ణ్యంబందు నా యజ్ఞవున్
బరమ ప్రభు: సద ప్రవేశనము నిష్పాదింప, నా రాజు ని
ర్భర మోదంబునఁ దేలె, బంధుజన భార్యాయుక్తి; రామప్రభూ! 247

తన యాధ్వర్యవ మందునన్ ముని జనాదర్శుండు, బ్రహ్మర్షిలం
దనవద్యుండు, వశిష్ఠుఁడే క్రమగతిన్ యజ్ఞంబు శాస్త్రంబు చొ
ప్పున నారంభముసేసె ఋత్విజులతో, మున్ముందె తా నట్లు నే
ర్పున నొప్పింపఁగ ఋశ్యశృంగఋషి, యాలోచించి; రామప్రభూ! 248



ఒక యేఁడాదియునేనియుం దిరిగిరాకుండంగ, దేశంబు మీఁ
దను బంపించిన యశ్వరాజము, మహాధైర్యంబుతోఁ దిర్గివ
చ్చి కడున్ ముచ్చటఁ గొల్పె; నప్పటికె జేసెం బెద్దగా బ్రాహ్మణ
ప్రకరం [167]బిష్టికి బుఖ్యశృంగుని, దపః ప్రఖ్యాతు; రామప్రభూ! 249

సరయూ తీరము నుత్తరంబుదెసగా స్వాధ్యాయ సంపన్ను లె
ల్లరునున్ బ్రాహ్మణ వర్యులా దశరథేలా భర్తృ యజ్ఞస్థలిన్
స్థితులై, సైంధవ మేధ యాగపర సుశ్రీ కర్మముల్ సేయసా
గిరి, శాస్త్రంబులఁబట్టి, వేదమయ పక్కింబట్టి; రామప్రభూ! 250

జరుగం జొచ్చెను గల్పసూత్ర విహితాచారంబునుం బట్టియుస్,
వర మీమాంసక రీతిఁ బట్టియును సర్వశ్రేయ సత్కర్మముల్;
బరగెన్ మున్నె ప్రవర్గ్య కర్మ [169] నికురంబంబున్; యథా రీతిగన్
బురడించెన్ శుభదాయమౌ నుపసదంబుం గూడ; రామప్రభూ! 251

హితులౌ యాజ్యులు సేయఁబూని రపుడే యిజ్యార్థిఁ, గర్మాధిదే
వతలం బ్రీతుల; మూద సంభరితులై వర్త్విజున్ సల్పి రా
తత ప్రాత స్సవనాది కర్మచయమున్ ధర్మప్రకారంబు, సం
భృత ప్రీత్యంతులుగానఁ, బ్రేక్షకులు సంప్రీతిల్ల; రామప్రభూ! 252

ప్రమతం, బింద్ర సుదేవతాకము హవిర్భాగంబు శాస్త్ర ప్రకా
రముగా నర్పణచేసి, సోమమును స్తోత్రంబుల్ పచారించినా
రు [170]మునీంద్రోత్తమ భవ్య యాజకులు; నేర్పుల్ మీఱ మాధ్యందిన
క్రమ యజ్ఞంబుఁ, దృతీయ యజ్ఞమును వేగన్ సాగె; రామప్రభూ! 253

---

167. ని; 168. భంగిం; 169. నికురం; 170. మహీంద్రదక్షభ;

చ్యుతియున్ లోపము గాని, యెయ్యెడలనున్ న్యూనత్వమున్ గాని, వి
స్మృతి వైయర్థ్యము గాని, హోమ సరణిం జింతింపఁగాఁ దోఁప; దం
చిత మంత్రాత్మముగా సమాప్తమును వాసిం బొందె సర్గంబు ని
ర్వ్యతరీతిం బితృ యజ్ఞమంతు, [171]శుచి వాసింపంగ; రామప్రభూ! 254

కనిపింపం దొరఁడే నవపండితుఁడు యాగం బందు; నెవ్వానిఁజూ
చినను వేద షడంగ విత్తముఁడె; స్వస్తిం గూర్చు పుణ్యాత్ముఁడే;
వినుతానుష్ఠిత యోగ మార్గ[172]పరుఁడే; ప్రేకంపు బ్రహ్మజ్ఞుఁడే;
ఘన వాగీశ్వరుఁడే; వితర్క విదుఁడే; [173]గణ్యుండె; రామప్రభూ! 255

ఆ యా కార్మ కలాప మధ్యమున నింతైనన్ విరామంబుఁ దా
నా యాజ్యుం డొదఁగూర్చె నేనియును, జేయం జూతు రా పండితుల్
న్యాయంబందునా! తర్కమందునా! ప్రతిష్ఠాపాది వాదంబులన్,
జాయన్ రాని షడంగ మండలినా! గెల్వన్ స్పర్ధి; రామప్రభూ! 156

తా దృక్పంచిత దండ ముండుటయె గా దా ధర్మవాటంబునన్
వేదాభ్యాస విధేయమైనయది, పృథ్వీపాలు రెవ్వారలున్
బ్రోదిన్ వందకుఁ దక్కువైన పరివారోద్యంబు లేనట్టివా
రై, దై వార; రటన్నఁ గా దది యతథ్యం బందు; రామప్రభూ! 257

కనిపింపం డొకఁడేని, యా క్రతుపు సాగం గల్గినన్నాళ్లు, లా
కొనియున్ దూపిరియున్; దివా నిశలు నెక్కొన్నట్టి సత్త్రంబు నా
లను, బ్రాహ్మణ్యమె గాక, తక్కుఁగల వారల్ మూఁడు వర్ణంబులున్
దనియం జల్పిరి భోజనాదికము [174]శాస్త్రం బొప్ప; రామప్రభూ! 258

అనువై యన్ని కులాల వృద్ధులకుఁ బుణ్యస్త్రీలకుం [175]గూడె భో
జనముల్, బాలురు బాలికల్ గలిసి యోజన్ రాఁగ; మౌనీంద్ర మే
శన మాతిథ్యము నొందె యుక్త మగు రీతిన్; భిక్షుకుల్ గల్గు సం
తసముల్ విందులు బొందెఁ, గొల్లలుగ నేతద్వేళ; రామప్రభూ! 259

171. ధృతి; 172. సరుఁడే; 173. కాప్పుండె;
174. శాంతం; 175. గూరె;

ఎనయన్ వేరికి వారు భోజనము ప్రత్యేకంబుగాఁ జేసినా
రనువేళంబును సర్వజాతి జను; లయ్యై రీతినే బొందినా
రనుపానంబులు, బథ్యపానములు వైద్యాపేక్షితుల్, జబ్బుచే
సినవారల్ శిబిరంబులం, దవి యటన్ సిద్ధింప; రామప్రభూ! 260

పచనంబుల్ బొనరించినార లెలమిం బాటించి పాకాదిక
ప్రచుర ప్రోక్త సమస్త శాస్త్రములు, సామర్థ్యంబునం బాచకుల్;
ఇటి భక్ష్యభోజ్యముఁగల్గు నన్నములు రాసుల్, శాకఁపున్ భక్ష్యఁపున్
నిచయంబుల్ సమకూరుచుండెడివి, నాఁటిం బొప్ప; రామప్రభూ! 261

వినయోపేతు లలం కృతుల్ బరమ సంప్రీతాత్ములై సల్ప వ
ద్దనలన్, వారికి రత్న కుండల రుచుల్ డాకొన్న యవ్వార, లం
దనఁగాఁ బక్వ పదార్థ సంచయముఁ, దేజ స్వాంతు, లందింప మె
చ్చున నన్నార్థులను నన్నదానము రహించున్ మించు; రామప్రభూ! 262

పరదేశంబులనుండి వచ్చిన జన వ్రాతంబులున్, శ్రీలనున్
బురుషుల్ మెచ్చిరి శాక పాకఁపు రుచుల్, బూర్వంబు దా మెన్నఁడున్
వరిసుం బొందిన యిట్టి విందులను సల్పం జూడరే దంచు, న
బ్బరపాటుం బ్రకటించి, వీని నెద నామోదించి; రామప్రభూ! 263

అతివేలంబుగ నన్నదాన మిటులన్ వ్యాపించినం గూడ, స
మ్మతితో[176] హెచ్చరికించెడున్ దశరథ క్ష్మాభర్త, యే లోపమున్
వ్యతిరేకంబును గూడ దంచు; నటులే వస్త్రాది దానంబు యో
గ్యతలం బట్టి యొనర్పఁడం, జదటి మూఁపం జూచి; రామప్రభూ! 264

విదితప్రజ్ఞులు, యజ్ఞకోవిదులు, శిల్పి శ్రేణిఁ బిల్పించి యె
న్మిది యంచుల్ గల యూపముల్ సునువుమై నిక్కంగఁ జెక్కించినా;
రదసీ[177] యాకరమందు మోదుఁగవి యాత్రై యుండె: దూరేడు ల
య్యదియే సంఖ్యవి యుండెఁ; జంద్రవియు[178] నర్త్తై యుండె; రామప్రభూ! 265

176. నె; 177. యౌషుమునం; 178. వాత్తై;

పనివా రంతట నొక్కొటిన్ విఁగిచే వన్ బేరునం బొల్చు క
ట్టను నిర్మించిరి; దేవదారు వసు పేరం గల్గు నా మానితో
చ్చ్రమునిర్మించిరి తక్కు రెండి, నవియుండన్ దీర్ఘ మేతాధికం
బెనయై వింశతి [179] దాఁక వ్యామములు ప్రత్యేకంబు; రామప్రభూ! 266

ఇరువై యొక్కొటియైన [180] యూపముల నిర్దేశ శాస్త్రముంబట్టి పా
శి రటన్ బారెడు బారెడై యెడము వర్తిల్లంగఁ; గై సేసి యుం
చిరి బంగారపు సొమ్ములం దొడిగి వానిన్ శోభకాన్పించు నై
ఖరి సంధిల్లుటఁ గోరి యుత్విజులు యుక్తం బంచు; రామప్రభూ! 267

మనముల్ దన్పఁగ గట్టినా రెడనెడన్ వస్త్రంబులన్ వానికిన్;
బును గున్ గందము మున్నుగాఁ గలిపి నేర్పుల్ సంధిలం బూసినా;
రెనయన్ వాని కతాన సప్తఋషి సం [181]వృత్తాగ్రభాగంబుతో
నెనయై భాసిలె యజ్ఞవాటి, పులకిం పెత్తంగ; రామప్రభూ! 268

కొలఁతల్ సొప్పన శ్రుతే యిటుకలన్ [182]గోపొప్పఁ బేయింప, సూ
త్రుల్ తా న్ బిగియించు బ్రాహ్మణులె, నేర్పుల్ మీఱ నా దాల్పై;
పల శాస్త్రోక్త విధంబునన్ గరుడ పక్షాకార మేపారి సం
ఫలఁగాఁ గట్టిరి రగ్ని వేదిక, నుపాదేయంబు; రామప్రభూ! 269

పసులుం బాములు పక్షులున్ జలచర వ్రాతంబు, లే యే విచో
కసులం గూర్చిచి చెప్పఁగాఁబడినవో! కల్పంబునం, దవ్వి యె
ల్ల సమాయత్తముగాఁగఁ గట్టఁబడె లీలన్ యూపకర్ణాదిక
ప్రసరం బందున, మూఁడు నూర్లపశుకుం [188] బ్రాఁకాద; రామప్రభూ! 270

క్రమ యుక్తంబుగ నాదటన్ దశరథ క్ష్మాభర్త నత్యుత్తమా
శ్వమునుం బానికిఁ గట్టి; రా పిదపఁ గౌసల్యా సుమిత్త్రల వళో
త్తమ కైకేయియు వచ్చి యశ్వమును యుక్తం బారఁగా పల్పలిం
చి మహిష్ఠం బనినారు, గౌరవము సూచింపంగ; రామప్రభూ! 271

179. పెత్తి; 180. మొత్తమును;
181. వృత్తాంతరీక్షంబుతో; 182. సూర్పొప్ప;





ముగురున్ రాణులు స్వర్ణ ఖడ్గములతో మూఁడింటి[184], నద్దానిన
దెగువన్ [185]వాటులు వెట్ట, నద్దియును ధాత్రిన్ [186] వ్రాతెఁ; గొని
బిగియం బట్టుచుఁ జిత్తమున్ నెఱిని నిల్పెన్, దానికిం బ్రక్కఁచే
రుగడన్ రాతిరి యెల్లనుం గడపు నేర్పుల్ మీఱ; రామప్రభూ! 272

పిదపన్ హోతకుఁ బట్టఁపున్ మహిషినిం బ్రీతంబుగా నిచ్చి, పెం
పు దలిర్పం బరివృక్తి నిచ్చె నొకతెం బ్రాజ్ఞుండు నధ్వర్యువున్
ముదితుం జేయఁగఁ గోరి, కోసల మహీపుం; డిచ్చె వావాతనున్
మది నుద్గాతను మెచ్చి యా పిదప నా మాన్యుండు; రామప్రభూ! 273

పలంకిన్, దక్షిణ గంగ బ్రహ్మకు నిడెన్ బాలాకలిన్; బిమ్మటన్
మెలంతల్ నల్వురికోసమై యచటఁ గూర్మిన్ నిల్పు నా యోలి నా
పలువుర్ ఋత్విజులున్ గ్రహింపఁ దమ దాన ప్రాతినిధ్యంబుగా,
మలంగం గైకొనె రాజు నా నలువురన్ వాల్గింట్ల; రామప్రభూ! 274

ఇది, యధ్వర్యువు కార్యదక్షుఁడయి, తా నేకాగ్ర చిత్తుండునై
పమరుం జూపుటవల్ల, నెల్ల యిటులన్ సంపన్నమై చెల్గెవో!
మెద దా వాజిది శాస్త్ర సమ్మతముగా మేపించుచుం దీసి, యొ
ప్పిదమొఁ బక్వము నాతఁడే సలిపె నేర్మిం జూపి; రామప్రభూ! 275

వపనున్ వేల్చిన ధూప మా నృపతి పాప క్షాళనార్థంబుగా
విపులా ఘ్రాణముఁజేసె; నా పిదప ఋత్విగ్వర్యు లెల్లారలున్
నిపుణత్వంబున వారువం బపయవానీకంబు, శాస్త్రంపు బా
దుపునన్ హోమము చేసినారు [187]పొరపాటుల్ లేక; రామప్రభూ! 276

---

183. వ్యాపింప; 184. ఏ స్రామాణికిన్; 185. గంటులు; 186. గూలె;
187. తడబాటుల్;

పుష్టికర్ జుహ్విని కూర్చి హవ్య మను త త్తూప్యాజ్యంపు ద్రవ్యంబు నే
ష్టుడు నే యజ్ఞమునందు నేనియును సంపూర్ణంబుగాఁ బాకమున్
గడఁకం జేయుదు; రశ్వమేధమునవో! గావింతు రా పాక మె
ప్పుడునుం బ్రబ్బలి తీగెలం గొలిపి నిప్పున్ రాజ; రామప్రభూ! 277

పరగన్ బ్రాహ్మణ కల్ప సూత్రములలోఁ బ్రఖ్యాతమైనట్లు స
త్పురి మూన్నాళులు నశ్వమేధమును ద ద్విప్రుల్; చతుష్టోమమున్
సరిగా నుక్థ్యము సాతిరాత్రము సప్త[188]షీమ హోమాదితో
జరిగెన్, లోకమువాపుఁ, బండితులు మెచ్చన్ వాని; రామప్రభూ! 278

కలయన్ మూఁడు దినాలనొ క్రతువులే గాకుండ, శాస్త్రాంతరం
బులలోఁ జెప్పిన వానినిన్ నెఱప నా పూజ్యుల్ ప్రయత్నించి, వ
ర్తిలంగాఁ జూచిరి, ముందు నొక్కటగు జ్యోతిష్టోమముం; బిమ్మటన్
దం బెట్టంబడె నాయురిష్టి యొకఁ, డంతశ్శుష్టి; రామప్రభూ! 279

అతిరాత్రంబులు రెండు, నొక్క యభిజిద్యాగంబు; విశ్వాభిజిత్
క్రతు వొక్కండును, శాస్త్ర చోదితముగాఁ గావించి, యా పిమ్మటన్
బౌతపుం గూర్పఁగ నల్పినార, లొక సాప్తోర్యామముం గూడ, సం
తత పుణ్యాత్ములు, ఋత్విజుల్ మిగుల స్పర్థ్యం బంచు; రామప్రభూ! 280

సతతం బేర్పడ నశ్వమేధ నవకర్మల్ సర్వమున్ సాగఁ, దత్
క్రతు సంపూర్ణ ఫలాభిలాషి యగుటన్ క్ష్మాకాంతుఁ డా బ్రహ్మకున్
బ్రతి రాఁగోరుచుఁ, బ్రాగ్దిశా గత ధరా భాగంబు రాజ్యంబునన్,
ప్రతియై హోతకు నిచ్చె నిష్టపడి నిర్వాపంబు; రామప్రభూ! 281

ప్రణిధానంబుగ రాజు పశ్చిమ దిశా రాజ్యంబు నధ్వర్యువున్
గొను మం చిచ్చెను; దక్షిణంపు దెసయందుం గల్గు రాజ్యంబు ని
చ్చెను దా బ్రహ్మకు; నుత్తరాంశమును జేసెం త్యాగ ముద్గాతకున్;
జనియెన్ జన్నపు గోర్కె. తీనికి యథా శాస్త్రంబు; రామప్రభూ! 282

188. క్షేమ్య;

తన రాజ్యం బిటు దాన మిచ్చి వేఱి శుద్ధ స్వాంతుఁడై భూపుఁడుం
డిన, 'రాజా! యిది యేల? మాకుఁ; బరిపాలిన్ మీర లేలుండు మే
మెని, వేదాధ్యయనంబు మావి; తమ శక్తిం గీర్తినిం బొందఁగాఁ
జనునే? మా;" కని రెల్ల ఋత్విజులు [189]విస్తారించి; రామప్రభూ! 283

'తనఁగాఁ గల్గునె? దీన వైదికుల కాంక్షల్; మాకుఁ దా నే ప్రయో
జనముం గూర్చును రాజ్య? మిద్ది గొని యే స్వల్పంపు మూల్యంబో! యి
చ్చినచోఁ జాలును; మీకు స్వర్ణ మని తోఁచెన్ దానినే యుండు; కా
దనుచో రత్నము లిం;' డటంచనిరి బ్రహ్మజ్ఞులు; రామప్రభూ! 284

కని ఋత్విక్కుల వైపు రాజు, పది లక్షల్ గోవులన్, నూఱు కో
ట్లనొ బంగరు, నాలు గంత లగు రౌప్యం బిచ్చె; నవ్వాని నై
పుణితో నిచ్చిరి ఋత్విక్పుంగవునకునుం, బ్రహ్మాత్ముఁడౌ నా వశి
ష్ఠునకున్ వారలు, పంచుఁ డంచుఁ దమ వాసుల్ సూచి; రామప్రభూ! 285

తమ రా యిర్వురు మౌనులున్ ధనము నంతన్ వారికిం బంచి న్యా
య్యంబుమై నిచ్చిరి; రాజు జాంబవము నీచం [190]జొచ్చె, సభ్యాగత
ప్రముఖ శ్రేణికిఁ గూడఁ దా నతిథి సంభారంబుతోఁ బాటు కో
టి మడుంగుల్ వలువన్, జనంబు [191]తను బాటింపంగ; రామప్రభూ! 286

జగన్నాథుం డపు డన్ని దానములునున్ సల్పంగ, నే సొమ్ము ము
ట్టని నిర్వేద దరిద్రుం డెటులనో యచ్చోటికిన్ వచ్చి బా
లెను జేయుం; దన చేతి కంకణము నిచ్చెన్ వేఱు లేకుంటచే
[192]త, నతండున్, ద్విజ వత్సలుం డగుట మోదం బొందె; రామప్రభూ! 287

తని పెన్[193]బ్రాహ్మణ సత్ర మోత్కరము నంతన్; [194]మ్రొక్కులం గుచ్చి ప్రా
లెను బాదంబుల దానికిన్; శ్రుతుల పేర్మిం దెల్పు సూక్తాళి[195] దీ
వనలన్ నించిరి వేదపండితులు ప్రేమన్ శ్రద్ధనున్ భక్తినిన్
వినయాటిం బచరించి రాజును బ్రజల్ [196]బ్రీతిల్ల; రామప్రభూ! 288

189. ప్రస్తావించి; 190. గళ్గె; 191. తన కోటిన్ మెచ్చ, సూటిన్, ఫాటిన్, ధాటిన్; 192. తను రాజున్; 193. వైదిక; 194. మన్నెలన్; 195. అ; 196. మెచ్చంగ;

మనియింపన్ ఖచసందు వాఁడు; తర మేమాత్రంబుఁ గాకుండె హా
కెదిరింపంగను వాని; బ్రాహ్మణులునున్ ఋత్విక్కులున్, యజ్వులున్,
సదయుల్ మౌనులు, నేమి చెప్పుదుము! కంజాతుండ! గంధర్వు లె
ల్లిదమున్ బొందిరి వానివల్ల; నని రార్తిన్ వారు; రామప్రభూ! 297

ఇనుఁ డొందున్ భయ మొందఁ గాయుటకు, నెంతేఁ ద్రాస మొందుం బ్రభం
జనుఁడున్ వీచుట, కాఁగిపోవు నలలున్ సంద్రంబునన్ వానిఁ జూ
చినచో; వాని, మహా భయంకరు నెటుల్ చేద్పాటు పొందించుటో!
వినిపింపన్ వలె; నంచు వేఁడి [204]రమృతుల్ వేదేశు; రామప్రభూ! 298

విని, 'యో! దేవతలార! వాఁ డెపుడు నన్ వేఁడండు కుండిపచేఁ
దనకుం జావు ఘటిల్లరా దనుచు; నేత ద్దుర్బలత్వంబు నెం
చునా! యేమో! మఱి; కాన మానవునిచేఁ జోద్యంబుగా వానినిన్
దునుమం జేయఁగవచ్చు;' నం చనియె నందున్ బ్రహ్మ; రామప్రభూ! 299

తనకున్ దానవ యక్ష రాక్షసులుచేతన్, దేవ గంధర్వ వం
చనచేఁగాని, [205] మృతంబు రాద దను వాంఛం దెల్పి, నా సమ్మతిన్
గొనియెం; గావున వాఁడు మానిసికి లొల్గున్; వేఱు మార్గంబునన్
దునుమం జాలవ వాని మీ; రనెఁ [206]గజోత్థుం [207]డంత; రామప్రభూ! 300

త్రిదశుల్ మౌనులు, బ్రహ్మచెప్పిన రహోక్తిన్ నెమ్మదిన్ మెచ్చి స
మ్మదమున్ బొంది; రదే క్షణాన ఋతధామున్ దండు వెంచేసి యా
చదువుల్ వేల్పుటాసనంబునకుఁ బజ్జన్ సింహపీఠంబునన్,
గొదరన్ దీధితు లెల్ల దిక్కులను, దాఁ గూర్చుండె; రామప్రభూ! 301

---

204. రమరుల్; 205. సమాప్తి; 206. గజాతుం డంత, సుదార్తుండంత;
207. డందు;

ప్రభవిష్ణున్ హరిఁ గాంచి మ్రొక్కు లిడి కై వారించి యా దేవతా
ప్రభృతుల్, 'లోక హితంబుగాఁ దమరు దేవా! రావణుం ద్రుంచుటల్
శుభమౌ; వాఁ [208]డతిచారి భీకరుఁడుగాఁ జొప్పిల్లుచున్నాఁడు; మా
కు భయంబౌ నెదిరింప వాని,' నని; [209]యాక్రోశింత్రు; రామప్రభూ! 302

కటకుం డిచ్చిన యా వరాళిబలనన్ [210]గర్వించి యున్నాఁడు వాఁ
డటప వ్రాతమునున్ ఋషీశ్వరుల మర్త్యస్త్రీల వేధించుస్,
వ్రజనంబుం దలపోయు నింద్రునకు వైరం బూని; ముల్లోకఁపున్
బ్రజలన్ బాధల నొంచు వాఁ; డనె సుపర్వ శ్రేణి; రామప్రభూ! 303

కినుకల్ సల్పుచు వాఁడు, నందనములోఁ గ్రీడించు నా యప్సరోం
గనలన్ హింసలపాలు సేయుఁ గనియుం గంధర్వులే మాత్రమున్
[211]గినుపుం [212]బూనఁగ లేరు; వాని యెదుటం 'గి' మ్మంటకుం జాల; రే
వనితల్ సిక్కిన దొంగిలించు; నని రవ్వా [213]ర్త్రాణి; రామప్రభూ! 304

అతి భీతాపహుఁడైన రావణుని సైన్య జ్ఞాతి సంబంధి సం
తతితో నాశము సేయఁగా వలయు, బాధల్ మాన్పఁగా మాపి, యో!
బుతధాముండ! యటంచు వేలుపులు మౌనీంద్రుల్ గడున్ వేఁడుచున్
నతులన్ సల్పిరి, వేఱు దిక్కెవరి నెన్నన్ లేక; రామప్రభూ! 305

తను సర్వంబు నెఱింగియుండియును దైత్య ధ్వంసి. యా రక్కసున్
దునుమం గల్గు నుపాయముం దెలుప నార్తుల్ విప్వులం గోర, వా
రును, 'దేవా! మును బ్రహ్మదేవు వరముల్ పూర్ణంబుగాఁ గాచుఁ గా
స నరుండే!' యనినారు, 'వాని నలుపన్ నాశంబు;' రామప్రభూ! 306

---

208. డతిరిక్త; 209. యాఘోషింత్రు; 210. గర్వాంధుఁడై నాఁడు;
211. గినుకన్; 212. జూపఁగ; 213. రెల్ల;

తనరున్ దానవ యక్ష రాక్షసులచేతన్ దేవ గంధర్వ వం
చనచేఁ గాని, [214]మృతంబు కూడ దను వాంఛం దెల్పి, బ్రహ్మగువున్
గొనియెంఁగావున వాఁడు, మానిసికె యొల్లున్; వేఱు మార్గంబునన్
దునుమం జాలరు వాని నే; రని రమర్త్యుల్ [215]విష్ణు; రామప్రభూ! 307

ఇలలో నెవ్వరి యింటఁ బుట్టఁదగునో! యే నంచు విష్ణుండు చిం
తిల, గుర్తించుమ దాని [216]వా రనిరి, 'వర్తిష్ణుం డయోధ్యాపురిన్
సలుపున్ రా జయి యజ్ఞమున్ దశరథ క్ష్మాభర్త పుత్త్రార్థియై,
పలు ధర్మజ్ఞుఁడునున్ వదాన్యుఁ డనుచున్ [217]వర్ణించి; రామప్రభూ! 308

సతు లున్నారలు మువ్వు రాతనికిఁ గౌసల్యాది, దక్షప్రజా
పతి కూఁతుం బ్రదగు బ్రహ్మని, శ్రీని,ఁ దలఁపింపం జాలుచుం గీర్తినిన్;
దతి రూ పొందుచు నాల్గు భాగములుగాఁ ద త్సాధ్వులం దుర్భవ
స్థితిఁ దా నొందఁగ వేఁడికొందు; మని రాదిత్యాది; రామప్రభూ! 309

గురి[218]చేయంగను రావణున్, దశరథ క్ష్మాకాంతునిం దండ్రిగా
వరియించెన్ గరుడ ధ్వజుండు; భయమున్ వద్దంచు [219] మౌనీంద్రులన్
సురలం దేర్చుచుఁ దాను దద్దనుజు, బంధు జ్ఞాతి మిత్త్రాదితో
సురుగంజేయుటఁ దెల్పె, వారుఁ గొన నస్తోకాంతి; రామప్రభూ! 310

మనుజుండై జనియించి యా యసుర నే ప్రమందింతు యుద్ధంబుతోఁ
బనిఁ గొంచున్; [220]సుఖముందఁజేయుటకు దేవ వ్రాత మౌనీంద్ర స
ద్గణమున్ బ్రాహ్మణ వర్యులం; జిరము భూకాంతుండనై యేలి గో
త్రను నుం; దం చని విష్ణు వొందెను విరోధానంబు; రామప్రభూ! 311

---

214. సమాప్తి; 215. పొక్కి; 216. బల్కితి; 217. వారెల్ల;
218. చేయన్ వెస; 219. ఋష్యాదులన్; 220 సుఖియింప;

అనిమేషాధుల కోటికల్ నెఱపఁగా నవ్యక్తుఁ డంగీకృతిన్
మనసా చూపుచు, మేలు సేయఁగ వెలార్పన్ వాంఛ, అవ్వానినిన్
ఏని, యేకాదశ రుద్రు లప్సరసలున్ వేల్పుల్ గవుల్, మోదమున్
గని, యత్యంతము మెచ్చి రాతనిని శ్లాఘల్ సేసి; రామప్రభూ! 312



—౧౬—

పరిపూర్తి గనుచుండ నా దశరథ క్ష్మాపాలు కామేష్టి; తాఁ
బురుషాకారముతోడఁ గుండ మెదలెన్ భూతం బొకం డంతటన్;
బెరయుం బెం గనువార లెల్లరకు మిక్కుట్టుల్ బదీయాంగక
స్ఫుర దత్యర్థ కకు[221]భ్ర్వణంబు [222]వెటి గుప్పొంగంగ; రామప్రభూ! 313

ప్రియభార్యం గవుఁగింట ద్రుచ్చినటు లా పెన్ భూత మెత్తైన గుం
డియకున్ సోఁకఁగ నొంపు పట్టుకొనియుండెన్ గుండిగన్ బాయసా
పయమౌ దానిని; రౌప్య దీధితులు పర్వన్ దానిపై మూతయున్
బలు లెక్కం, గని చూప జొందఁగ స్మయ భ్రాంతంబు; రామప్రభూ! 314

పురుషుం డాతఁ డమేయ విక్రముఁడు; సంపూర్ణ ప్రభా[223]వాధిగో
చరుఁడున్; [224]రక్త ముఖుండు, తామ్ర సిత వస్త్రోద్భాదితుం డెంతయున్
బరుష శ్మశ్రులుఁ, దుచ్చ రోమశుఁడు, గ్రావ ప్రాంశుఁ, దత్యుగ్ర కే
సరి కైశ్యోపమ కేశ శీర్షుఁ డెనసెన్ సంపుష్టి; రామప్రభూ! 315

కడు దివ్యాభరణాళితో, సకల సూక్ష్మ శ్రేయ [225]లక్ష్మాళితోఁ,
బొడగా న్పించినవ్యక్తి సూర్యునిపలెం, బొన్నారి వహ్నిం బలెన్,
వెడ తేజంబున ముందు సాగుచుఁ దరస్మింబ బోలె దర్పంబుతో
నడుగుల్ వేయుచుఁ గోసలాధిపుని చెంతం జేరె; రామప్రభూ! 316

'నను వేదజ్ఞులు నన్ను బిల్వఁ గను బ్రాజాపత్యుఁడం బూరుషుం
డని; నీ కోసమె యిందు వచ్చి' తనఁగా; నా రాజు శబ్దుందుభి
[226]స్వనమున్ వించునె లేచి చేసెను నమస్కారంబు; సుస్వాగతం
బనుచుం జాగిలి, వేగఁ దెల్పఁ దనెఁ దా నాజ్ఞప్తి; రామప్రభూ! 317

---

221. ఘ్గణంబు; 222. భయము; 223. వాభిగో; 2 4. తామ్ర;
225. చిహ్నాళి; 226. స్వనునిన్;

"ముదముం బొందిరి నీదు యజ్ఞముల దివ్యుల్; మెచ్చి వారంపినా
రిదిగో! భాండములోనఁ బాయసము; బర్హిష్కేశ బర్హిర్ముఖుల్
సదయం బాకము సేసి రిద్ది; కొనుమీ! సత్పుత్రి సంపాదన
ప్రదమున్, ధన్య, మహామయాస్పద," మనెన్ భవ్యుండు; రామప్రభూ! 318

"కొని యీ బంగరు భాండ, మిందుఁగల యిక్షుద్రాప సంకాశమై
ఘనమౌ బాయసముం ద్విదీయ వనితా [227]కాండంబునం బంచినన్
జనియింపం గలవారు పుత్రు"లని ప్రాజాపత్య సత్పూరుషుం
డనినన్ శీర్షము నొగ్గె నా దశరథ క్ష్మా[228]భర్త; రామప్రభూ! 319

తలచే మ్రొక్కుచుఁ బాయసాన్నమయ పాత్రన్ [229]రుక్మరోచిస్సుతో
దలనుం గైకొనె, దివ్యపూరుషుని బాహ్వాభ్యగ్ర మందుండి, వ
ర్థిలె నానందము పెన్నిధిం గనుటచే[230] దీపించు నిర్పేద క
ట్టుల, నా రాజున కంతరంగమున[231] గట్టుల్ ద్రెస్సె; రామప్రభూ! 320

కని, యా యద్భుత దివ్యపూరుషుని వంకన్, భూమిపుండుం బ్రద
క్షిణముం జేయుచుఁ జాగిలం బడియె సక్తిం; దమ్మహాపూరుషుం
డును నంతర్హితుఁ డయ్యె; నంతిపురి చోటుం జేరె, నా దివ్య పా
త్రను గౌఁగింటను గూర్చి కోసలము గోత్రాభర్త; రామప్రభూ! 321

చనువేళం బతి, రాణివాసముఁ బ్రకాశంబై శరత్కాల పూ
ర్ణ నిశా [232]కృతిఁ బ్రసిద్ధ మొందినది, వర్ణింపంగ రానంతఁగాఁ
దన సంతోష నితాంత కాంతిమయమై దట్టించుచున్, వేఱు కాం
తిని స్పర్థింపఁగ నీక, యెల్లెడల వ్యాప్తిం జెందె; రామప్రభూ! 322

"హృదయాభీష్టవు నీవు! కోసలధరిత్రీనాథ సత్పుత్రికా!
యిదిగో! పంపిరి దివ్యపాయసము బర్హిర్వక్త్రులే నాకుఁదా
ము దయన్ యజ్ఞము మెచ్చి; యిందున సగంబుం గొమ్మ! నీ;" వంచనెన్,
ముదితుండై యిడుమం దదర్థమును భూపుం డర్థి; రామప్రభూ! 323

---

227. స్కంధంబు; 228. జాని; 229. రుచ్య;
230. చేఁ దేలాడు, వృద్ధిం జెందు; 231. నఁగట్టుల్; 232. భాతిఁ;

మిగులం బాయస భాగముం గొలిచి, పృథ్వీపాలుఁ డందిచ్చెఁ దా
నగపుం బ్రీతి సుమిత్రకున్; మిగులు నా పాయసంబునన్ సామునన్
మిగులం బ్రేమను గైక కిచ్చెఁ; బిదపన్ మిందారు నష్టాంశమున్
వగచెంచెం బతి యా సుమిత్రకిడఁగా పట్టిల్లి; రామప్రభూ! 324

కులకాంతామణులై రి గర్భిణులు మూగుర్ పాయసం బంది; కాం
తిలుచన్ దారలు బాల సూర్య సమమౌఁ దేజస్సురం దాల్చి; రం
దులకుం బొందెను స్వస్థచిత్తతను నాథుం డొయ్యవన్ స్వర్గ పే
థుల వాహ్యాళికిఁ బోవునట్టి పురుహూతుం డట్లు; రామప్రభూ! 325



-౧౨-

చనఁగా విష్ణువు, దివ్యులం గనుచుఁ గంజారుండు. "మేల్సేయఁ గా
మున కెల్లం గమలాక్షుఁడే భువిని జన్మం బొంద నున్నాఁడు గా
వున నారుండయి, వానికిన్ విజయమున్ వ్యూహంబునం గూర్పయో
జన సేయన్‌వలె నెల్లవార;" మని ప్రస్తావించె; రామప్రభూ! 326

త్వరతో నప్సరసాది కాంతలును గంధర్వాంగనల్ గూడ, వా
నర రూపాంచిత పుత్త్రులం గనఁగ యాచ్నం జేయఁగా నౌను; ద
ద్వర పుత్త్రుల్ నెగడన్‌వలెన్ జవము సత్త్వం బొంది; శౌర్యంబునున్
బరగంగా వలె వారియం; దనియె విశ్వస్రష్ట; రామప్రభూ! 327

గుణ సంపన్ను, లుపాయవంతులును, వాకోవాక్య నిష్ణాతులున్,
వినయోదారులు, వంచనా[233]విదులు, పేర్మిం గన్న నీతిజ్ఞులున్,
గణుతిం గాంచిన బుద్ధిమంతులును, సంగ్రామాజహ ద్వీరులున్,
ఘన ధీమంతులు, వారు గావలె ననెం గంజుండు; రామప్రభూ! 328

అమృతాంధుల్ వలె మృత్యుదూరులు, నజయ్య ప్రౌఢ సత్త్వాఢ్యులున్,
సుమన స్సుందరులున్ సుమంతులును, వాచోయుక్తి సంపన్నులున్,
విమద శ్రేష్ఠులు, సింహ సంహననులున్, [234]విష్ణూర్జితో జస్వితన్
సములుం గావలె వారు సు! మ్మనియె విశ్వస్రష్ట; రామప్రభూ! 329

వికసిల్లన్ భువి యిట్టి వానరులఁ గావింపంగనౌ మీకు; నిం
తకు మున్ జేసితి జాంబవంతుఁడను సత్త్వ స్థైర్య భల్లూకమున్,
ప్రకటిల్లం దగు జృంభణం బొకటి నల్పం గల్గు సంకల్పమున్
వికటత్వంబునఁ[235]బన్ని; యం[236]చనియె నోర్మిన్ బ్రహ్మ; రామప్రభూ! 330

---

233. పరులు; 234. విష్ణూరు శుష్మాఢ్యతన్; 235. బన్నితం;
236. యఁ గూర్మిన్

మొనయన్ బ్రహ్మ వచించినట్టి విషయంబున్ శ్రద్ధతో నందఱున్
విని రా [237]దివ్యులు; పిమ్మటన్ విబుధులున్ వేలాది విద్యాధరుల్,
మునులున్, సిద్ధులు, చారణోరగులునుం బుట్టింపఁగాఁ బూనఁ ఋ
క్ష నికాయంబును, వారివల్ల ధర యెల్లన్ నిండె; రామప్రభూ! 331

వర సత్త్వం బగు వాలి యింద్రునకు జన్మం బొందె, నింద్రాద్రితో
సరిదై; లోకము నెల్లఁ దాపమున ముంచం గల్గు తేజస్వియౌ
సరుణుం డొందెను బుత్త్రిగా బహుఁ బలాఢ్య శ్రేష్ఠ సుగ్రీవునిన్;
ధరఁ బుత్త్రుండయె నా బృహస్పతికినిన్ దారుండు; రామప్రభూ! 332

ధరలోఁ [238]ద న్నెనయంగ ధీమహితునిన్ ధన్యోత్తరుం [239]గూడ, వా
నరులం దుండుటఁ జూడఁ బో వనుట కన్వాదేశ మా దారుఁడే!
వరలెన్ నీలుఁడునుం గుబేర సుతుఁడై; మైంద ద్వివి ద్వయ్యులన్
బెరిమం బొందితి రశ్వినీ సుతుల కావిర్భూతి; రామప్రభూ! 333

వరుణుం డొందె సుషేణునిన్ సుతునిగాఁ; బర్జన్యుఁడుం బుత్త్రిగాఁ
శరభుం గాంచెను; వాయుసూతి యగుచున్ జన్మించె నోజస్వియై
స్థిర కీర్తిం గనునట్టి యా హనుమయున్, దేహంబు వజ్రంబు మా
దిరిగాఁ గాంతియు దార్ఢ్యముం దెలుపుచున్ దీపింప; రామప్రభూ! 334

బల వేగంబులయందుఁ బోలును గరుత్మంతున్ హనూమంతుఁ; డీ
యిలయే యీనినయట్లు బుట్టిపడినా రేర్పాటుగా వానరుల్
పలుచోట్లన్; ఋషులున్ దివౌకసులు రూపం బొందినా రెల్లఱున్
బలు తోఁకల్ గల కొండముచ్చులునుగాఁ బల్వూరి; రామప్రభూ! 335

వరముండై యెవ రే బుధాదులకు జన్మం బొంది రవ్వారివా
వర రూపాదుల, వారు రావణుని సమ్మర్దింప నుత్సాహులై
తిరుగన్ సాగిరి కామరూపు లగుటం దీంద్రించు విక్రాంతి మం
దర ధీరాధికు, లప్రమేయ బలతన్ దర్పించి; రామప్రభూ! 336

237. వేల్పులు; 238. ము; 239. బూని;

విలస ద్భావను లప్సరస్సులకునున్, విద్యాధరస్త్రీలకున్,
వెలయం బుట్టిరి నాగకన్యలకునున్ వీరాగు గంధర్వ కాం
తలకుం గావున, వారు సింహబలులై దర్పించి రత్యంతమున్;
బలులై సత్త్వ [240]సమృద్ధు లైరి [241]కడు నేఁపుం జూపి; రామప్రభూ! 337

ఘన శస్త్రాస్త్ర సమస్త విద్యలను వేగం బాండితిం బొంది, యెం
దును దామై [242]చరియింపఁ జొచ్చితిరి సంతోషంబునం జేసి, పెం
చిన కాయంబులుఁ, గామరూపములతోఁ జెన్నారుచున్ వారు; రు
ద్వినచో దవ్వఁగలారు జాల వలె భూభృద్ధాథ; రామప్రభూ! 338

కనఁబడ్డంతనె వృక్ష శాఖలను వీఁకన్ దాలతోఁ ద్రుంచు నా
పనియం దెల్లరు నారితేరిన మహాబ్రహ్మాండఁపున్ నాయకుల్;
వినియోగింపఁగ నాయుధంబులుగఁ బెద్దిన్ గోష్పలం గోలలన్
ఘను; లుద్దండులు భూమిఁ బాదముల ద్రొక్కుల్ సేయ; రామప్రభూ! 339

కల రే పొటివి కొండలైనను మహా [243]గర్వంబునం గూల్పఁగాఁ;
గల, రా కూకటి వ్రేళ్లతో నగలుపంగా సాల వృక్షములన్;
నురుగుల్ గ్రక్కు మహాసముద్రముల తెన్నుల్ మార్చి యురికింపఁగాఁ
గల రవ్వారు; దివిం గలంచెదరు మేఘశ్రేణి; రామప్రభూ! 340

వనధుల్ దాఁటుటయందు వారలదె సామర్థ్యంబు; మ త్తెక్కుటన్
వనులం బర్వత సానువుల్ మొరయఁగాఁ బర్వెత్తి గీపెట్టు వా
రణ రాజంబులఁ బట్టు దక్షతకు వారల్ సాటి; భీ గొల్పి పోఁ
బనుపం గ్రూర ఖగాళి [244]వారలదియే పైచేయి; రామప్రభూ! 341

తలఁపం దాదృశ విక్రమంబు జవ సత్త్వంబుల్ గడుం గల్గువా
రలు తద్వానరు, లందఱున్ గుములుగా రంధిం బ్రయాణించుచున్
నిలువన్ సాగిరి బుష్యంత మని పర్ణింపంగనౌ బర్వతం
బును మున్నైన నగాళి శృంగములఁ గాఁపుల్ పెట్టి; రామప్రభూ! 342

240. సముత్తు; 241. జవ మెబ్బుం గొల్పు; 242. విహరింప;
243. ఖర్మమ్ము; 244. వానరులదే;

బల సంపన్నులం వాలి మున్నయిన తిమ్మం ద్రండలున్ శౌర్యపం
లుబసుం బుత్త్రిలుగాఁగఁ బొందిరి; మహాత్ముల్ వాలి సుగ్రీవులన్
విలసచ్ఛౌర్యులన్, నలున్, హనుమనున్, వీరుండు నీలున్, గవుల్
సెలఁగన్ నేతలుగా వరించితిరి వాసిం బట్టి; రామప్రభూ! 343

ప్రతి కీళంబు జవోరుశక్తుల గరుత్మంతుండె; యుద్ధంబునన్
బ్రతి యెవ్వారికి వారె; త్రిమ్మరుడు రా ప్రాంతంబునన్ సింహ సం
తతి శార్దూల మహోరగాది కులమున్ దర్పించి మర్దించుచున్,
వితతా వ్యాహత పాద చారమున వేర్వేరౌచు; రామప్రభూ! 344

కప దేహ్యాది విదూర శూరుఁడు ననంగానొ మహాబాహువున్,
గవు, లా వాలిని రాజుగా సలిపి మ్రొక్కన్ సాగి, నానాకృతుల్,
విపులాంకంబులు దాల్చి, భిన్న లనఁగాఁ బే రెక్కి, ధాత్రేయు ని
త్త్రపులై వీర విహారముల్ సలుపుటల్ జంపిల్లె; రామప్రభూ! 345

ఘన జీమూత చయంబు మించిరిగనుం, [245]గ్రైవాలు [246]భూభృత్తుభం
గిని, నీ వానరు లెల్లరుం దిరుగుచుం గేళిన్ ధరామండలిన్,
జెను భీతిం గలిగింత్రు, రాఘవున కార్వేరంబునం దోడ్పడన్
జననం బొందినవారు [247]వీ రగుట, నిష్టంకించి; రామప్రభూ! 346



245. గ్రైవర్థ; 246. గ్రావంబు; 247. తారగు;

హయమేధంబును బుత్త్రకేష్టియును నఖ్యాత్త ప్రపూర్ణంబుగా
నయిపోఁజొచ్చినవేళ, దేవతలు తా షడ్డిన్ హవిర్భాగ సం
చయముం గైకొనినంత, నెప్పు డెవ రే చందంబునన్ వచ్చి రా
నయమారన్ [248]గత తద్గతిం జనిరి ధానందించి; రామప్రభూ! 347

తన దీక్షా నియమంబు చెల్లఁగ ననంతాభర్త, భార్యాళితో
దను, భృత్య ప్రకరంబుతోఁ, జనుచు దండ స్తోమ సంయుక్తుఁడై,
తన యంతఃపురికిం గ్రతుక్రమము సందర్శింప వేంచేసియుం
డిన రాజన్యుల సత్కరించి కొనిపోడెన్ వేడ్క; రామప్రభూ! 348

వినయంబుం బరితుష్టి సంతసము మున్పైన [249] రాజన్యులున్
చనివిం దెల్పుచు, యజ్ఞవాటము దరిం దారొక్కన్న మిత్త్రాళికిన్
వినతుల్ సల్పి, పరిష్వ మౌని కిడి గౌరవ్యస్థున్, మహారాజు వీ
డ్కొనినారల్, పయసింపఁగోరి తమ పాటుల్ గూర్చి; రామప్రభూ! 349

తన సామంతుల సేనకున్ ధవళ వస్త్రంబుల్ మహారాజు చే
సెను దానంబు; విశుద్ధ కాంతులఁ బ్రకాశించెం గ్రతు క్షేత్ర మె
ల్లను; దత్ [250]శుభ్ర దుకూల సంచయము వారల్ దాల్చి, మోదంబునన్
జనఁగోరం దమ పట్టణంబులకుఁ దేజస్స్ఫూర్తి; రామప్రభూ! 350

తనముం దగ్నిముఖుల్ ప్రయాణమయినంతం గోసలేంద్రుండు, చే
రె నయోధ్యం బరివార యుక్తముగఁ బేర్మిం; బిమ్మటన్ రాజధా
నిని శాంతాయుతు ఋశ్యశృంగమునినిన్ నేమంబుగాఁ బూజ సే
సిన, వారల్ సని రంగరాజ్యమునకున్ [251]క్షేమాన; రామప్రభూ! 351

---

248. గను; 249. యాగంతకుల్; 250. స్వచ్ఛ; 251. సేమాన;

తరువాతన్ నృపుఁ డెల్ల స్వస్తిముఖులన్ ధర్మప్రకారంబునన్
బరమానందులు గాఁగ గౌరవము సల్పన్, వారు [౨౫౨]శ్రేయం బటుల్
నెరవొందం జనినాథు స్వస్థలులకున్; నెక్కొన్న మోదంబునన్
బరగం బుట్టను కాల మాదటను తత్ త్న్మాభర్త; రామప్రభూ! ౩౫౨

కడవెన్ వత్సర కల్ప కాలమునఁ ద త్కామేష్టి; యంత్యర్తువున్
నడవం జొచ్చె; నహర్గణంబు పదిపైనన్ రె డు నేలెంచె; న
ప్పడె వచ్చెం దగఁ జైత్రమాసమును; నా ప్రౌ ద్దయ్యె శుద్ధంబునన్
గడు మేలౌ బుధవారఁపున్ నవమి, యోగ్యంబ చౌచు; రామప్రభూ! ౩౫౩

కడు శ్శేత్రజ్ఞతతోఁ [౨౫౩]బునర్వసువు నక్షత్రంబు నాఁ డుండెఁ బ్రే
ముడికిం బేర్వడి; యా [౨౫౪]విశంబి పడసెం బూజార్హ మీ యోగమున్,
గడఁకన్ విష్ణుఁడె యీ ధరాతలమునం, గాంచంగ నున్నాఁడు చొ
ప్పడఁగా మానవ జన్మ; మం చిలకుఁ దెల్పెం జాలి; రామప్రభూ! ౩౫౪

అట పంచగ్రహకూట ముచ్చమునఁజేయం జెల్లె సంచార; ము
దట నా చంద్రుఁడునున్ బృహస్పతియు యుక్తంబైన లగ్నంబు తాన్
గటకం బప్పుడె దోఁచెఁ దూర్పు దెసలో; గౌసల్యయుం గాంచెఁ దా
నిటు పుత్త్రోత్తము, లోకు లొంద ధృతిమ ద్భూద్వ్యాప్తి; రామప్రభూ! ౩౫౫

అరచేతన్ సుతు వజ్రరేఖఁ గని యాహ్లాదించె[౨౫౫] నా తల్లి; ని
ర్భర హర్షంబును వజ్రపాణిఁ గనుటం బ్రాపించు నా దేవకీ
వర ధాత్రీమణి వోలెఁ నా జననియుం బ్రాపించె; స్వస్తస్వి లా
డిరి, గంధర్వులు పాడఁ, బూలజడి మింటన్ [౨౫౬]పీడ; రామప్రభూ! ౩౫౬

---

౨౫౨. పుత్త్రేష్టియున్; ౨౫౩. మై షు; ౨౫౪. విలం; ౨౫౫. చెం గౌసల్య;
౨౫౬. జాల;

వెనువెంటం గయికేయికిం గౌమసఁ దావిర్భావముం జెందె, సి
ద్ధిని గార్యంబుల కిచ్చుఁ బుష్యమిని; వర్తిష్ఠుల్ [257]గుణోద్ధారకుల్
జననం బొందిరి పుత్త్రి లిర్వు రఖిజి త్సంజ్ఞాత లగ్నంబునం
దున, నాశ్లేష మునన్ సుమిత్త్రికును వెన్నుం దన్ని; రామప్రభూ! 357

సరిపోల్పం బ్రతిబింబముల్ దశరథ క్ష్మాభర్త, కవ్వారు స
ల్వురనుం దేజమునం దనూభవులు; త త్పూర్వోత్తరాభాద్రలన్
బురుడింపం దగి, రెండు రెండు [258]జతలై, పొల్పారి యా నందసుల్
దురతిక్రాంత [259]మయూఖులై, యపుడు విద్యోతింత్రు; రామప్రభూ! 358

అపుడున్ నల్వురు పుత్త్రి భూపతి కయోధ్యా పౌరులందున్ మహో
త్సవ మారంభము సూపె; వీథులు ప్రజా సంకీర్ణ మయ్యెన్; మహో
త్సవులం బెంచెడు నాటపాటల తలంపుల్ గూడె శైలూషక
ప్రకరంబందున, గాయకోత్తముల [260]గ్రామంబందు; రామప్రభూ! 359

ఒక పంక్తిన్ రసభావముల్ నట వరుల్ ద్యోతింపఁ, గాంగేయ, వే
ఱొక ప్రక్కన్ వర గాయకుల్ శ్రవణ సౌఖ్యోపాసనం బాడ, నిం
కొక త్రేవన్ జయ వాద్య ఘోషలు సమాయోగంబునుం బొంద, వా
రక సాకేతము తేలియాడె ముదితారావాల; రామప్రభూ! 360

ధనమున్ గోధనమున్ నృపాలుఁడు ధరాద్యైవౌఘముల్ మెచ్చ ని
చ్చె సమేయంబుగ దాన శౌండుఁడగుచుఁ బూజించెం గడున్ వంది సూ
త నికాయంబును, మాగధాది జన జాతంబున్ మహోదారతన్
దనివింజేయుచు, వార లెల్లరును మోదం బొంద; రామప్రభూ! 361

పది యొక్కండవ నాఁడు నామకరణం బన్ గర్మమున్ సల్పఁగాఁ
ముదితుండైన మహాప్రభుం గొసఁగెఁ బన్నుఁన్; జ్యేష్ఠుఁడౌ సూతికిన్
బ్రదియై మౌని వశిష్ఠ వర్యుఁడిడె శ్రీరామాఖ్యఁ; గైకేయి కిం
పొదవం గల్గిన సూనునిన్ భరతుగా నూటించె; రామప్రభూ! 362

257. గుణోద్ధర్తలై; 258. కవలై; 259. మహాత్ములై;
260. వారం, స్తోమం;

తనియన్ లక్ష్మణుఁ దంచుఁ బిల్చెను సుమిత్రాదేవికిన్ జ్యేష్ఠుఁడౌ
చనయున్ మౌని వశిష్ఠ వర్యుఁడు, [261]శుభాధారుండుగా నెంచి; పెం
చనె శత్రుఘ్నుఁ డటంచుఁ బేర్కొనియె రెండౌవాని సౌమిత్రినిన్;
పొసఁగన్ [262]విప్రుల నాఁ [263]డభీష్టములచే మన్నించెను; రామప్రభూ! 363

అల చౌలోపనయాది కర్మములు సేయం గల్గె నా యన్న ద
మ్ములకుం దండ్రి ధరా విభుండు, విధులన్ మీరంగఁ గాల క్రమా
కలనన్; వారలలోన జ్యేష్ఠుఁ డజర గ్రామంబునన్ బ్రహ్మమున్
పఠింపించుం, దన శ్రేష్ఠతాధికముచేతన్ మించి; రామప్రభూ! 364

తన యన్నన్ రఘురామునిన్ విడి, సుమిత్రా పుత్త్రుఁ డా లక్ష్మణుం
డనఘుం డుండక, నిండుగాఁ జెలిమి సేయంబూన సాగె జన్మంబునాం
డినదే యాదిగ; నాతనిన్ సతము హ్లాదింపంగఁ దాఁ జేయుచుం
డును, నిష్ఠుండయి యెల్లవారలకు జ్యేష్ఠుం డర్థి; రామప్రభూ! 365

అనయం బయ్యెను [264]లక్ష్మణుం డిటు బహిః ప్రాణంబు తా రామచం
ద్రునకున్; రాముఁడు లక్ష్మణాఖ్యునకు నెందుం గూర్చెదుం బ్రేముడిన్
దనకుం దా నొడగూర్చుదానికిని నుద్గాఢంబుగాఁ; దమ్ముఁడే
పెనియు క్షుండయి నిద్రయేనియును గావింపఁడు; రామప్రభూ! 366

కడు రుచ్యంబగు నోగిరంబయిననున్ ఖాదంబు గావింపఁ డే
ర్పడఁగా రాముఁడు లక్ష్మణున్ విడిచి ప్రేమన్; లక్ష్మణుం డమ్ములన్
దొడుగం బూనుచు వింట, వెంటఁ జనెడుం దోడ్పాటుగా, రాముఁ డే
యడవిన్ వేఁటకుఁ బోవ, ఘోటకము నొయ్యం బూన్చి; రామప్రభూ! 367

అల శత్రుఘ్నుఁడు, లక్ష్మణుం డెటొ! యటుల్ హార్దిక్యముం జూపు న
న్నలలోఁ గైకజు పట్లఁ బుట్టుక బడిన్ నానాఁటికిం; గైకజుం
డెలమిన్ పీడఁడు వానినిన్ సతము నెంతే [265]నంతి నవ్యానికిన్
గలుగం జేయుచు బాల్య మాదిగఁ బురాకర్మానః రామప్రభూ! 368

---

261. ధానుండు; 262. బాపల,-చెం బాబులు; 263. దక్షిణ్యదుఁడునై;
264. వాఖ్యుఁడు; 265. సంతసం బేర్పడన్;

[266]నలువుం బ్రన్నలుదమ్ములుం గలది రామ్నాయంబులన్; శాస్త్రముల్
దెలియం [267]జాలిరి; పెక్కులైన చరితాదిన్ నేర్చి; రభ్యాసమున్
పెంపం జేసిరి సర్వరీతుల, ధనుర్వేదంబు; సంపాదనన్
బలుసంగళ్లిరి లౌకికం బగు మహాజ్ఞానంబు; రామప్రభూ! 369

నలువుర్ లోక హితైక రీతులకు సన్నాహంబు సంసిద్ధినిన్
గలుగం గూర్చిరి తత్పరత్వమున; సౌఖ్య వ్యాప్తి కవ్వారు సం
ధిలినారల్ జనతా మనోహరులుగా దీప్తాత్మతన్; సప్తి దం
టుం యాశోహ రథాధిరోహణ సమర్థుల్ వారు; రామప్రభూ! 370

చెసుపంగల్గుట సస్త్ర శస్త్రములం దేజోవంతులున్, భీషవో
పని దుర్ధర్ష పరాక్రమ స్థిరులునున్, వ్యాఘ్రంబులం బోలువా
రును విద్వేషులయందు, నౌచు నృపపుత్రీక స్తోత్రముల్ పొందినా
పని యెన్నండును విఱ్ఱవీగరు గురుశ్లోఘాధి; రామప్రభూ! 371

తమ విద్యాధిక నైపుణిన్, సుగుణ సంస్తోత్రయాధిక్యవైవిధ్యవి
త్తమునం, దండ్రిని నందనుల్ నలువురుం దన్పం దగెం గాల సం
క్రమ మత్యంతము; వారు దిక్పతుల జోకం దాల్చు; రందుం గళం
కము లేనట్టి విధుండు జ్యేష్ఠుం [268]డసులుం గావించు; రామప్రభూ! 372

జన సర్వస్వ మనోహరుండును, పితృ స్వాంతాఖిలాషంబులన్
దన సేవన్ నెఱవేర్చువాఁడును, మహాధర్మాధిరూఢుండునున్,
ఘన కోదండ కలా విశారదుఁడునున్, గాంధర్వ హస్తీంద్ర వా
హన సంరోహణ శాస్త్ర వేది, సుతులం దాద్యుండు; రామప్రభూ! 373

---

266, నలువుర్ సోదరు లప్పుడే,........ లెంతయున్; 267. జూచిరి;
268. డుకమున్;

సుకృత స్తోమ మెఱుంగు నా దశరథ క్షోణీంద్రుఁ డా నందన
ప్రకరం బొందుచు నుంటచేఁ దగు పయః ప్రాదుష్యమున్, బంధులన్
సకల స్థేయుల సంప్రదించుకొఱకై [269]చక్కంగ నాహ్వాన పూ
ర్వకతలం బిల్పెఁ, గొమాళ్ల పెండిలులు సర్వం గోరి; రామప్రభూ! 374

అతఁ డాలోచన సేయఁ బూనె హితులౌ నవ్వారితో; వం ఁతో
సతతా జస్వి యమ ధ్యఁజేసుకొని విశ్వామిత్రి మౌనీంద్రుఁ డా
క్షితినాథున్ దరిసింపఁ గోర, నృపుఁడే శీఘ్రంబుగా వచ్చి, యా
చతురాస్యున్ హరి వోలె, మౌనిఁగొనిపో [270]సాగాచె; రామప్రభూ! 375

అతఁ, డా తీక్ష్ణ సుదీక్షతోడను, దపోఽత్యంతోగ్ర పీకాశ సం
పతితోడన్, ద్యుతిమంతుఁడౌ గుశిక పుత్రి స్వచ్ఛమూర్తిం, బురో
హిత వర్గంబులు వెంటరాఁ గొలిచి యెంతేఁ బుల్కలం దాల్చుచున్,
నతులన్ సంస్తుతులందుఁ దేల్చెఁ బరమానందాన; రామప్రభూ! 376

కుల విప్రుంపిఁడ నర్ఘ్య పాద్యములు, "మీకున్ క్షేమమే?" యంచు, వా
రల నెల్లారిని రాజుతో సహ పరిప్రశ్నించి, యా గాధి గా
దిలి పుత్తురిందు, 'నృపోత్తమా! తమరి యీ దేశంబునున్, బాంధవం
బులు, నాగారము, లొందుఁగాదె! యనె సమ్మోదంబు; రామప్రభూ! 377

వినయోపేతతతో మెలంగుదురె? పృథ్వీనాథ! సామంతులున్;
గణనీయాహిత సంచయంబుఁ బరణాక్రాంతంబుఁ గావింతువే?
యనురంజింతే? యుపాయముల్ నెఱపి రాజ్యంబందునన్ నీప్రజన్?
మనుతే? యజ్ఞ సురాతిథి క్రియ, లనెన్ మాన్యుండు; రామప్రభూ! 378

విని, ప్రత్యుత్తర మీయఁగా దశరథోర్వీనాథుఁ, డా గాధినం
దనుఁ, డా కుంభభవార్యునిం గని యథా న్యాయ్యంబుగాఁ బృచ్ఛ చే
సెను, దక్కుంగల మౌనిచంద్రములనున్ క్షేమంబు యోగంబునున్
వినిపింపుం డని; వా రటుల్ సలుపఁ దన్విం జెందె; రామప్రభూ! 379

---

269. వానొందు; 270. సాగించె;

ముని సంప్రశ్నల కెల్ల వారలును సమ్మోదించి; రా పిమ్మటన్
దన కొల్వందునం గూరుచుంటకు యథా న్యాయ్యంబుగా వారికిన్
జన నాథుండు నియోగమున్ సలిపి, విశ్వామిత్త్రునిం జూచి ప్లో
పనముం జెందుచు స్వాగతంబుఁ బలికెం ద ద్వేళ; రామప్రభూ! 380

మునిదేవా! తమరాకవల్ల నమృతంపున్ భాండ సంప్రాపణం
బౌనగూడన్ లభియించు మోద మెదలో నుద్భూతమయ్యెం గడున్;
ఘనహా నూషరభూమియందునను దౌ ల్కాపడం గనంగల్గు నా
యపఘా సందము నొందినాఁడ; [279]ననియెన్ [280]జ్మాభర్త; రామప్రభూ! 381

ఇది సంతాన విహీన [281]కాంతకు సుతాఽహీనాప్తి యన్నట్టు లు
న్నది; నిర్వేదకుఁ బెన్నిధుల దొరికె నన్నట్టుల్ ముదం బేర్చుచు
న్నది; యేదో యొక యుత్సవాతిశయ మన్నట్టుల్ మనం బొంచు చు
న్నది; [282]బ్రహ్మర్షి! యటంచు రా జనియె విన్నాణింప; రామప్రభూ! 382

ఎటులన్ నే నికఁ బ్రశ్నించవలెనో, యీ నాఁడు నాకై తమం
తటఁ దామే యిటు వచ్చినందులకుఁ, బ్రాప్తంబౌ మహానందమున్;
స్పృహితాభీష్టముఁ దావకీనమును నేఁ బ్రేంజూపి సిద్ధింపఁ జే
యుటకుంటెన్ బహుపుణ్యమున్నె? యనె రా [283]జుద్వేగి; రామప్రభూ! 383

నను నాజ్ఞాపితుఁ జేయుఁడీ! తమ ప్రాణాభీష్టముం దీర్పఁగా;
మును రాజర్షులు మాత్రమే తమరు స్వామీ! మీ తపోవృద్ధిచే
తను బ్రహ్మర్షులునై ప్రభావ పటు యుక్త స్వాంతులై నారు గా
వున నే నెంతయు నెం; తనెన్ విభుఁడు తాఁ బూజింప; రామప్రభూ! 384

నను బ్రహ్మర్షులు మీరు చూడఁ బన్నా నాసంతోషంబు సంధిల్లె; నా
కనిపించుం గడు నద్భుతం బనుచు మీ [284]యభ్యాగతిత్వంబు; పం
డిన భాగ్యం బిది; మీదు దర్శనము పాటించన్ భవచ్ఛ్రేయ మీ
జననం బందె ఫలం; బనెం బతియు విశ్వామిత్త్రు; రామప్రభూ! 385

---

279. నవె నిజ్మాభర్త; 280. ........జాని;
281. సాధ్వికి; 282. రాజర్షి; 283. ద్రేశి; 284. యాగంతుకత్వంబు;
285. తేక;

నను భాగ్యంబు వరించె; నే పరమ ధన్యాత్ముండ; పావిత్ర్యమున్
నను గాంక్షించెను; నా గృహం బిపుడు పుణ్యక్షేత్ర మయ్యెం; బ్రమో
జన మెద్దానిని గోరి వచ్చితిరొ! నే నల్పంగ సిద్ధంబు దా
నిని మీ యభ్యుపపత్తి; సం చనియె క్షోణీ భర్త; రామప్రభూ! 386

సెలవీయన్ వలె మీరు కార్యమును; వాసిన్ దానినిం జేయఁగాఁ
గలఁడా? వీఁ డని సంశయింపకుఁడు; మీకార్యంబు నే జేయఁగా,
వలతుం దక్కువపాటురాఁక; తమ దైవం బందు; మీ రాకచేఁ
గలిగెన్ నాకు శుభోదయం; బనియె భూకాంతుండు; రామప్రభూ! 387

వినయంబున్ నయముం బెనంగొనఁగ బృథ్వీకాంతుఁ డీ రీతిగా
ననుటల్, గాధి సుత శ్రవస్సులకు నింపై యొప్పి, గాఢంబుగా
మనసున్ నాఁటఁగ, నాదటన్ ముదముచే మాధుర్య ధుర్యంబు న
య్యెను, ద త్కౌశికు విస్తృ తోన్నత లస ద్ధృ ద్వీథి; రామప్రభూ! 388



—౧౯—

కనుచున్ మౌని నృపాలచంద్రుని, "ధరా కాంతా! ప్రియంభావుకా!
ఘన తౌలీనము గల్గువాఁడవుగు, నిష్కామ ప్రభావాఢ్యుఁడై
చను బ్రహ్మర్షి వతంసముం డగు వశిష్ఠాచార్యకత్వంబునం
దున వర్తిల్లినవాఁడ వీ; వనిచె మున్నుం దెంచి; రామప్రభూ! 389

కనుకన్ నీ వనఁ గల్గినాఁడ విటు లోకం బెల్లనున్ మెచ్చ, నిం
కను నా చిత్తమునం దనన్ మెలఁగు ద త్కార్యంబునుం జెప్పెదన్
విను; దానిన్ నెఱవేర్తు నంటి విపుడే వీఁ కొప్పఁగా; నాటి త
ప్పనివాఁ డన్నయశంబు నీ; [286]దనెఁ దపో వర్యుండు; రామప్రభూ! 390

కనుకన్ మా పనిఁ బూర్తిగా నెఱపి పేఁకన్ సత్య సంధుండు నా
ఘను నీవొందిన పేరు నిల్పుకొని, మమ్మున్ ధన్యులం జేయుటల్
సను; నే నొక్క ఫలంబు సిద్ధికొఱకై సల్పఁగ యజ్ఞంబు, దా
నిని విఘ్నం బొనరింతు రిర్వు; రనె మౌనీంద్రుండు; రామప్రభూ! 391

కనిపింపంగను రాఁక, యజ్ఞమును విఘ్నంబుం[287] బచారించి, నా
కు నిరుత్సాహముఁ గొల్పుచుందురు, వారు కువ్వంగరానంత యో
ధనులున్, స్థైర్యులు, కామరూపులును, నస్త్రామ్నాయ నిష్ణాతులున్,
దనుజుల్ వారు; అటంచు రాజున కనెం దన్మౌని; రామప్రభూ! 392

మన యజ్ఞంబు సమాప్తమౌ పఱకుఁ గ న్మాటొచుఁ గ్రన్నాము వా
రిని మారీచ సుబాహు లంద్రు; కుహనా రీతిన్ వడిన్ వారు నె
త్తున మాంసంబున వేది యెల్ల నపుడే దోఁగింత్రు జన్నంబు పూ
ర్తిని బొందం గనువేళ; నం చనియె[288] నా త్రిన్ మౌని; రామప్రభూ! 393

---

286. దనియెఁ దాపస్యుండు; 287. బున్ సదా సల్పి;
288. యెఁగ స్సిన్;

కనుకన్ మాటికి మాటికిన్ మఘము విఘ్న [289]న్యూనమౌ చుంచె; నా
డు [290]నాగుల్ దీరదు చెప్ప; మత్ప్రియముఁ బొందున్ నిత్య వై ష్ణవమున్;
జన దయ్యేన్ శపియింప వారలను నిజ్యా దీక్షలో నుంటచే
తను, నా శిష్య; దటంచుఁ గౌశికుఁడు చింతన్ మున్గె; రామప్రభూ! 394

నను సుత్సాహము వీడిపోవు కతనన్ నావేయ చింతార్తి వ
ల్లను నే [291]యాగము వాటికన్ విడిచి చేరం జెల్లె నిచ్చోటికిన్;
నిను సత్య వ్రత పాలన ప్రతిభవానిన్ వేఁడి, నీ జ్యేష్ఠ పు
త్త్రుని రాముం, గొనిపోవ వ;" త్తనె [292]మునీంద్రుం డట్లు; రామప్రభూ! 395

మన రాముం డన బాలకుం డనెడు భావం బొందు మెన్నండు, జు
ట్టును జుల్పంబులు గల్గువాఁ డనెడిపాటుం దూరఁగా బోకుమీ!
ఘన బాహాబల [293]శాలి యాతఁడు; తపో౽ఖర్వ ప్రభావంబుచే
తను గాపాడుదు వాని నే; నన దపో ధన్యుండు; రామప్రభూ! 396

తన తేజో మహిమంబుచే నతఁడు విధ్వంసంబుఁ గావించు నా
దనుజార్వ ద్వయమున్; మహాప్రభువ! చింతం బొందఁ గాఁ బోకుమీ!
తనుజాంజస్సును గూర్చి లేశ మయినం; దాశంగ నవ్వారికిన్
జనునే? రాముని ముం; దనెన్ ముని, నృపున్ శంకించి; రామప్రభూ! 397

రఘు వంశంబునఁ బుట్టియుండిన భవ ప్రాముండు ద క్కొక్కఁ డా
యఘు దుష్టాత్ములఁ జంపఁ జాలఁడు; మహా హంకారులై వారు నా
మఘు నాశం బొనరించు చుండినను, బాసప్రాంశు లౌటన్ వినా
శ ఘటా పాశ వశంబు తప్ప దనెఁ [294]దద్బ్రాంతుండు; రామప్రభూ! 398

---

289. న్యూన; 290. నెగుల్; 291. యజ్ఞము;
292. మునీంద్రుఁ డొయ్య; 293. ధుర్యుఁ డా;
294. నె నుత్సంగుండు,విశ్రాంతుండు;

శర సంధాన విధుండు రామునకు నీషజ్మాత్రమున్ వారు [295]జా
లరు శౌర్యాదిని; నేను నీ సుతున కుల్లాసంబునన్ నేర్పుదున్
బరఁగ త్సర్వ కలా విశేషములు; నూర్జ్వా థో జగ త్సంతతిన్
బరగన్ నింతు యశంబు వాని; దనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 399
చిర కైవాత్సక వత్సలత్వ [296]పర సంశ్లిష్టుండవై యోజనన్
జరుపం గూడదు నీవికన్ దశరథ క్ష్మాపాలచంద్రా! హృదం
తర సందేహము మానుమీ! తనుజు నంత[297]స్సత్త్వముం గూర్చి; ని
ర్భరనున్ వారిని ద్రుంచు నీతఁ డని [298]తెల్పెన్ మౌని; రామప్రభూ! 400
ప్రతినం జేయుచుఁ జెప్పుచుంటి విను; ప్రక్యాశి ద్వయిం గూల్చు నీ
సుతులన్ జ్యేష్ఠుఁడు; నమ్ము నాదు పలుకుల్; శూరత్వమున్ సత్య [299]సా
తత వీర్యంబును, నే నెఱుంగుదు మహత్త్వంబున్ భవ త్పుత్త్రునన్
స్థితమై యుండుట; యం చనెన్ ముని, ధరిత్రీనాథు; రామప్రభూ! 401
తెలియన్వచ్చు వశిష్ఠ మౌనికిని, నంతేవాసు లీ తాపసేం
ద్రులకున్, జ్యేష్ఠ పరాక్రమంబు; తమ పుత్త్రుం బంప నా వెంట ని
స్తుల నిశ్శ్రేయస ధర్మ లాభముల సందోహంబు నిన్నొందు; ను
జ్జ్వల [300]సత్యం బగు నీ యశం; బనె మునీ ద్వంద్వుండు; రామప్రభూ! 402
అనుమానం బెడియేని నుండునెడ మీ యాచార్యుఁడౌ నీ వశి
ష్ఠుని, నా యా ముని సత్తముల్ గల సదస్యున్ మంత్రి బృందంబునున్
వినిపింపం దగ వేఁడు; మెల్లరును నిన్ ప్రేరేఁచుచో మాత్రమే
దనయుం బంపు; మటంచు[301] విన్నుకొనియెం ద న్మౌని; రామప్రభూ! 403
పది రాత్రంబులె సాగు [302]నా క్రతువు; త త్పర్యంతమున్ నీకుఁ బ్రీ
తిదుఁడౌ నుద్వహుఁ డున్నఁ జాలు నను వర్తింపన్ నసుం; బిమ్మటన్
స్వదమే [303]బంపెద జాగుసేయ కతనిన్; బం కొండఁగాఁ బోకు, నీ
మదిలో బాలుని బంపుటా! యని; యనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 404

---

295. పోలరు; 296. మున; 297. స్స్వరమున్; 298. పల్కెన్;
299. శాశ్వత; 300. సంబొందుసు; 301. చుఁ జెప్పకొనియెన్;
302. నధ్వరము; 303. దెచ్చెద;

అల నా యాహవ కాల యాపనము సేయన్ రాదు; ఓ పిల్లనిన్
వలయుం బంపఁగ నాదు వెంట; శుభముల్ వర్ధిల్లు; మీ తోంటి నో
ములసుం బండు; నటించు ధర్మ సహితంబున్ సార్థకం బౌనటుల్
వెలియం బల్కుచు నూఱకుండెఁ బిదపం దీర్థుండు; రామప్రభూ! 405

ముని తా నింతగఁ జెప్పినన్ [304]నృపతికిన్ మ్రుందెత్తె ఖేపెంపు; దా
లుని గీలాలప మారణంబునకు నాలోఁ బంపుటా! యంచు; గుం
డెను బ్రీల్చెన్ సుతు విప్రయోగము; దిగుల్ డీలించె నిల్వెల్లఁ; దీ
రిని నున్న బ్లై వణంకె; నావి కొనె సంధినంబు; రామప్రభూ! 406



304. నం బితరకున్;

-౨౦-

షది పొందెన్ వికలత్వ మా పతికి; వర్షం బొందె నిశ్శేషతన్;
దొదలన్ స్వాస్థ్యము కొంత సేపటికిఁ జెప్పన్, "మౌనిచంద్రా! యిఁకన్
బడునాతైనను నింద వేం; ద్దసురులన్ మర్దించు సామర్థ్య మె
ట్లొదవున్ వాని?" కటంచు జ్యేష్ఠసుతు ఐ లూహించి; రామప్రభూ! 407

ఒక యక్షౌహిణి సేన సిద్ధమయి నా కుండున్ సదా; నాదు సై
నికు లత్యంతము శూరు లన్ యశమునన్ నిండెన్ దిగంతంబులన్;
సకలాస్త్రాధిక శస్త్ర విద్యలను వైశారద్యముం గన్న దా
ప్రకటానీకము; దానిఁ దెత్తు; ననె భూపాలుండు; రామప్రభూ! 408

ఇదె మీ వెంట ససైన్యుఁడై యరిగి యా యింద్రారులం గూల్పఁజే
యుదు యుద్ధంబు; ధనుర్ధరుండ నయి మీ యుత్కృష్ట యజ్ఞంబుఁ గా
యుదు నే గావలి; బొంది లోపలను నా కూర్పున్న పర్యంక మో
పుదు నిర్విఘ్నము సేయ యజ్ఞ; మనె నా భూభర్త; రామప్రభూ! 419

విలువిద్యన్ మనవాఁడు సాంగముగ నేర్మిం బొందఁ; డుద్య ద్బలా
బల సంపన్నత శత్రుపక్షముది నేర్వన్ లేఁడు సంపూర్తిగా;
ఖలు లా రక్కసులన్ జయించెడి సమిత్కౌశల్యముం గూడఁ; డెం
దుల కా బాలుఁడు? చెప్పఁ డంచుఁ బిత యాందోళించె; రామప్రభూ! 410

దనుజుల్ కూట సమి ద్విశారదులు; చెంతం జేరి తా మండియున్
గనరా; రెంతయు దవ్వునన్ మెలఁగుచుం గాన్పింత్రు చేర్పై నటుల్;
గనుకన్, వారలఁ గెల్వ బాలుఁ డన శుష్క ప్రీతియా; వానివ
ల్లను మీ కార్యము సిద్ధి నొందద; [305]దనె [306]గోత్రాభిభర్త; రామప్రభూ! 411

---

305. దనియెన్ రాజంత; 306. మెల్లన్ రాజు;

మునిచంద్రా! కడు వృద్ధునై తనయులం బొందంగ లే దన్న చిం
తనచేఁ గ్రుంగి, యదెట్టో! పొందితిని సంతానంబు; నా నల్వురం
దున జ్యేష్ఠుం డగు ధార్మికోత్తముఁడు; పుత్రున్ వీని నే నుండునే?
క్షణ మేనిన్ ధర; నం చనెం దపసితో క్ష్మాభర్త; రామప్రభూ! 412

ఘనమెంతేనిన్ సుతు నొక్కనిం బనుచుటల్ ధర్మంబుగా నెంచ; ను
త్తమమౌ నా చతురంగముల్ గొనుచు నే త ద్యజ్ఞ సంరక్షణ
క్రమ భారంబు వహింతు, రాక్షసుం వీఁకన్ డీకొనంగల్గి; చి
త్తమునా వొక్కనిన్ సుతు నంప; నం చనె ననంతా భర్త; రామప్రభూ! 413

మునిదేవా! యసురుల్ మదంబుమెయి మిమ్ముం గైకొనం జోప రం
చును దామె [307]సెలవిచ్చినార; లెవరా? క్షుద్రుల్; పితల్ పేళ్లు చె
ప్పిన బాసంయసు; వారి రా జెవఁడు? గర్వీభూతు లవ్వారి వ
ర్తన రూపాదులఁ గూర్చిచెప్పుఁ; డనె మర్త్యస్వామి; రామప్రభూ! 414

బల సంపన్నత వారి దెట్టిదగు? నవ్వారిన్ మహాసేనతో
నిలుగం జేయుట యెట్లు? లేవి యెడలన్ నే నే ప్రతీకారమున్
జలుపంగా వలె? యుద్ధమున్ నెఱపుచో సన్నాహమున్ వ్యూహమున్
మలఁగం జేయుట [308]యెట్లో! తెల్పుఁడనియెన్ క్ష్మాభర్త; రామప్రభూ! 415

తమరే సర్వముఁ జెప్పఁగావలె ననెం ద ద్భూపుఁ డా మౌనితో
విపులుం గూర్చి; యతండు రాజ! వినుమీ! పెల్పం బులస్త్యర్షి వం
శమునం బుట్టెను రక్కసుం డొకఁడు; ధిష్ణ్య ప్రౌఢుఁ, డవ్వాని నా
మమునన్ విందుము రావణుం డని; యనెన్ మాన్యుండు; రామప్రభూ! 416

బల సంపన్నుఁడు, వీర్యవంతుఁడు, తపః ప్రాబల్యముం జేసి వి
ద్యలవేల్పున్ వశవర్తి గాఁగ వరముల్ దా నొందె [309]నెన్నేనియున్,
బలుపుర్ మూఁగిరి వాని చుట్టునను గ్రవ్యాదుల్; ప్రభుం డయ్యో వా
రల కీ దుష్టుఁ; డటంచు, భూపున కనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 417

307. పచియించి; 308. యెట్లు; 309. నవ్వానిచే;

వినియుం దీవును వాని దౌష్ట్యమును బృథ్వీనాథ! వాఁ డెవ్వఁడో!
యనుకోఁ బోకుము; వాఁడు విశ్రవ మహర్ష్యగ్ర్య ద్వితీయాత్మజుం
డని విన్నాఁడఁ; గుబేర సోదరుఁ డగున్ సాక్షాత్తు; ముల్లోకముం
దున లే వాతని ముం; దనెన్ ముని, వినన్ క్ష్మాభర్త; రామప్రభూ! 418

అయినన్ రా జగుఁగాన నేమి! చనఁబోఁ డాతండు నా యధ్వర
ప్రముఖోర్వీస్థలికిన్ దనంతటను; బంపం జూచు మారీచునిన్,
సయ దూషా దళు నా సుబాహులవును, వెన్కన్ నిల్చి ప్రేరేఁచుచున్;
రయితం ప్రధంతుడు వారు మజ్జ మనియెన్ క్రాంతుండు; రామప్రభూ! 419

విని యా మాటలు, 'రావణాసురుఁడె యార్వేరంబుమై పైకొనన్,
నను నేనే నిలఁద్రొక్కఁగాఁ గలనొ! సన్నాహంబునం జాలనో;
మునివర్యా! బహుళ ధార్మికోత్తములు, దేవుల్ మాకు; విర్భాగ్యునిన్
నను, నా పుత్త్రు క్షమింపుఁ;' డంచనె ధరా నాథుండు; రామప్రభూ! 420

భువి నెవ్వారును రావణాసురునితోఁ బోరాడ; రా దేవ దా
నవ గంధర్వ పతంగ యక్ష కులముల్, నాగాదులుం గూడ భీ
తి వహుల్; వానినిఁ దేరిచూడ; రసిలోఁ దీక్ష్ణ ప్రతాపుండు, వీ
ర్య వరిష్ఠుండును వాఁ; డనెం దపసితో నారాజు; రామప్రభూ! 421

అనిలోనన్ బహు వీర్యవంతులవి వీర్యంబుల్ సునాయాస ధో
రణి నాకర్షముసేయు నాతఁ డను వార్తల్ వింటి; నా సర్వ సే
నను నే నేకముచేసి యెత్తినను, ద న్నక్తంచరుం గెల్తు నం
చనలే; నంచు వచించెఁ, దాపసునితో నా రాజు; రామప్రభూ! 422

అల మారీచ సుబాహు లన్న సవగాహం బయ్యెఁ; బోరందు ని
స్తుల ంంపన్ వహిఁ గన్న వీరి పితరుల్ సుందోపసుందుల్ మహో
జ్జ్వల శౌర్యాధికు; లట్టివారల తనూజ ద్వంద్వముం దాఁకఁగాఁ
దలమే? బాలున; కం చనెం దపసితోఁ ద త్రాత; రామప్రభూ! 423

సమరంబందు సుశిక్షితుల్, గపట తేజశ్శాలు; రవ్వారితో
యమునిం బోరఁ గలారట! లేఁటా! కడు నాయాసంబునుం బొందియున్;
సముఁడే బాలుఁడు వారితోఁ బ్రతిసమున్ సల్పంగ? నే నెంతమా
త్రమునుం బంపఁగలేను నూను వనె, గోత్రారక్త; రామప్రభూ! 424

బల శౌర్యాఢ్యులఁ బిన్నవాఁ; డొకనినిం బంపింప దెన్నుండునున్
గలుగంబో; దళఁ దారితేరిన సమి ద్గంభీరుఁడే? వాఁడు మా
యుంవేల్పుఁ బయిపెచ్చు; సంయమివరా! యేమైననుం గాని, నే
నొంటియన్ బాలునిఁ బంప; నం చనియె బుష్పుం డొయ్య; రామప్రభూ! 425

అపకర్షంబును బొంది కౌశికుఁడు, హా! పొంగుచ్ఛు రగుల్కొంచు నా
తపముం గొల్పెడి యజ్ఞకుండమున దీప్త జ్వాలలున్ లేఁగఁగా
నపవిస్ఫూర్తి హవిష్య మాహుతిగ వేల్చన్, వహ్ని యే రీతి మం
డిపడుం, దద్గతి గాఁగ మండిపడె వేఁడిం బొంచె; రామప్రభూ! 426



424

—౨౧—

నెరపం గల్గుప నీదు కోర్కి యని యెన్నే పూన్తి నీ వన్న యా
తరువాతన్ నిను వేఁత, మాట [310]గతిపుం దప్పంగ నున్నావు, నీ
సరివారల్ నగ; వ్యత్యయం:బు రఘువంశస్థాయికిం జెల్లనే
ఐరగంగా నిది? యం చనెన్ నృపతితో బ్రహ్మర్షి; రామప్రభూ! 427

విపరీతంబులునున్ విపర్యాసములున్ విస్తారఁపుం బల్కులున్,
ద్రప యేమాత్రముతేక పల్కుటయె నీ ధర్మంబుగా నెంచుచో,
నిపుడే దెల్పుము; తెల్ప [311]లేటు మృషలందే; యంచు నమ్మౌని కో
ప పరీతుం డయి లేచె, భూమిపతి తాపం బొందఁ; రామప్రభూ! 418

సతతం బాసినమాటఁ దప్పుటయె [312]నీ సద్వ్రతనం బంచు స
మ్మతితోఁ జెప్పుము; చప్పుగొని పది నా మార్గంబునన్ నేనునున్
గుతుకం బేర్పడఁ బోదు; నొంపెగ నిటం గూర్చుంతి నీ యిచ్ఛమై
వితథంబుల్ గడు బల్కుచుండు; మనె నావిన్ మౌని; రామప్రభూ! 429

క్షితి కంపించిన దూఁచముట్టుగ, భయ క్లేశత్వముం బొంది దే
వతలుం గ్లీబుల యట్లు శైరి; బహు సమ్మాన్యుండు గుర్తించె నీ
స్థితి [313]సాకల్య మరుంధతీ విభుఁడు; తా ధీరాతిధీరుండు, సు
వ్రతుఁడుం గావున, నిల్పడెన్ [314]దిటముగా మాటాడ; రామప్రభూ! 430

ఇన వంశోద్భవులన్ మహా మహితుఁడా! యిక్ష్వాకు వంశంబునం
దున జన్మించినవాఁడవో! పరమ సంస్తుత్యుండ! యో! పుణ్యుఁడా!
జననాథాగ్రసరుండ! యో! దశరథ క్ష్మాపాల! ధర్మంబె నీ
పనఁగా, నేలితి వింతవ; ట్టనె వశిష్ఠార్యుండు; రామప్రభూ! 431

---

310. ఘనతన్; 311. ముగ్గు; 312. నా;
313. యావత్త యరుం; 314. వు;

అనయంబుఁ సత్యమొందె నీ ధరణితో సాక్షాత్తు నీ రూప మం
దునఁ గా మున్న మెఱంగినాఁడవుగదా యూడ్చ్యాఁడవున్ దీరతా
ఘనిపిఁ గారె! మహాత్మ సువ్రతుఁడునున్ గంభీర ధర్మజ్ఞుఁ డం
చను ముల్లోక యశంబు [315]నీ దనియె, నాచార్యుండు; రామప్రభూ! 432

చనునే నీ కిఁక ధర్మహానిఁ బడ? విశ్వామిత్రు మౌనీంద్రుతో
ననవే? ముందుగఁ దీర్తు నేను దమ కార్యం బను; నీమాటపై
నను నీవే నిలవంగఁ బోనియెడఁ బొవ్వాటొందునేగాని, తాఁ
బోనుఁడా బొంకునె? నీదు పుణ్య మనియెం బూజ్యుండు; రామప్రభూ! 433

మును నీ సల్పిన యశ్వమేధ యజనంబుల్, పెక్కు యాగంబులున్,
ఘన వాపీ జలకూపికావిచయముల్, గోహార సంసత్తులున్,
మనునే? యూడిపపాటఁ దప్పనెడ; విశ్వామిత్రుతో నంపుమీ!
తనయున్; మే లగు; నం చనెన్ నృపతితోఁ దన్మౌని; రామప్రభూ! 434

ఘన శస్త్రాస్త్ర బలంబు బాలునకుఁ గల్గం, గల్గకున్నం, బ్రయో
జన మే మున్నది? దీక్షమై జ్వలిత కృష్ణార్చి చ్ఛటా చక్ర మెం
దును మీయాపఁ సుబంబుఁ గాచు నటులన్ దుర్వారుఁడై కౌశికుం
డును నీ పుత్త్రునిఁ గాచు సు; మ్మనుచు నాడున్ మౌని; రామప్రభూ! 435

అపుడా రక్కసు లేమిచేయఁగల రయ్యా! నీ సుతున్? నేఁడు కా
శ్యపిలోనం బ్రభవించె ధర్మ మిటు విశ్వామిత్రు రూపంబునన్;
నృపవర్యా! పటు శౌర్యవంతులకు వర్ణింపంగ మే ల్బంతి యీ
యపురూపుం డగు గాధిసూతి; యనె నా [316]యార్యుండు; రామప్రభూ! 436

---

315. మోసితనె; 316. చార్యుండు;

జగమం దింతటి బుద్ధిమంతుఁడును, దేజశ్శాలి, శస్త్రాస్త్రయో
గ గరిష్ఠుండును లేఁడు; ప్రాణి మయ లోక శ్రేణిలో నున్న పం
చగు శస్త్రాస్త్ర చయంబు కౌశికుని వం తంచున్ మునీ నమ్ముమీ!
సుగుణ శ్రేష్ఠుఁడ! యంచు మౌని యనె వాచోయుక్తి; రామప్రభూ! 437

అంపుం జెంది శరాశరోర్వరల శస్త్రాస్త్రంబు లిన్నిన్ననన్
డెంపన్ లేరు మహర్షియౌ నితని [317] మాద్రిన్ లోకమం దెవ్వరున్;
బల సంపన్నులు యక్ష రాక్షసపతుల్, స్వాధీనముం జేసికోఁ
గం రవ్వాని ననంగఁ జెల్లఁ దనె యోగశ్రీ జ్ఞాని; రామప్రభూ! 438

మును శస్త్రాస్త్రము లెన్నియో పొడమఁగా భూభాగమందున్ కృశా
శ్వుని పుత్రాకృతి, నన్నిటిన్ శివుఁడు తాఁ బూర్వంబునన్ గాధినం
దనునిం గొమ్మనె, రాజ్యమేలుచును నాతం డుండ; సర్వజ్ఞుఁ డీ
తనితో నందను నంపు; మంచనియె నేతన్మౌని; రామప్రభూ! 439

జయయున్ సుప్రభయున్ సహోదరలు, దక్షబ్రహ్మ సత్పుత్రికల్,
ప్రియ భార్యామణులై కృశాశ్వునకుఁ, బేర్మిన్ సేవలం జేయుచున్
నయతన్ నూర్గురు పుత్రులం గనిరి; కన్నన్ వారిలోఁ బెద్దదౌ
జయ [318]ఖిడ్డల్ జయులై; రనెన్ నృపతి కోజన్ మౌని; రామప్రభూ! 440

జయ యేబం ద్రటు, సుప్రభా సుతులు పంచాశత్తు, 'సంహారక'
ప్రియ నామంబును దాల్చి; రెల్లరును బేర్మిన్ వారు దుర్ధర్షులున్,
భయదుల్, తీవ్ర మహా ప్రభావులును, గామాకారులున్ భవ్య ని
శ్చయ సంపన్నులు; నం చనెన్ నృపతి కోజన్ మౌని; రామప్రభూ! 441

జ ననం బందితి రప్రమేయ బల తేజశ్శాలు రా నూర్గురున్,
దనుమం గోరియు రాక్షసాధముల సంతున్; దాన వా రెల్లనన్
గనినా రస్త్ర సుశస్త్ర రూపములు యుక్తంబైన భాసస్సులన్;
మనె గాధేయు వశాన నవ్వి; యనెఁ ద ద్బ్రహ్మర్షి; రామప్రభూ! 442

---

317. రీతిన్; 318. కుఱ్ఱన్;

తను స్వాధీనము జేసికొన్నవి యనంతం బయ్యు, గ్రొంగ్రొత్తవా
నిని శస్త్రాస్త్రములన్ సృజింపఁగలఁ డెన్నే నీ ఋషిస్వామి; వా
నినిఁ దాఁజేయుఁ బ్రయోగమున్ సయుతమున్; నేనెంతు గాధేయు శ
ర్వాని రూపంబుగ; నంచు రాజునకుఁజెప్పెన్ మౌని; రామప్రభూ! 443

కృత శస్త్రాస్త్రుఁడు; నూతనాయుధములన్ సృష్టింపనుం జాలు; ని
ర్మితి సామర్థ్యమునుం, బ్రయోగపరతల్, మందౌఁ బ్రభావంబునున్
క్షితిలోఁ గౌశికునట్టు లెవ్వరియెడం జెన్నార; నీ మౌనితో
డుత రాజా! సుతు నంపు; మంచు[319] గురుఁ డాడున్; వేఁడు; రామప్రభూ! 444

వినుతామేయ పరాక్రమ స్థిరుఁడు; గర్వీభూత చేతస్కులౌ
దనుజ శ్రేష్ఠులఁ దానె ద్రుంపఁగల సత్త్వస్ఫూర్తి సంయుక్తుఁ; డీ
యన మీ వానికి మేలు సేయుకొఱకే యర్థించుచున్నాఁడు; వెం
టనె పంపందగు; నంచు నాజ్ఞ తెగనాడం జొచ్చె; రామప్రభూ! 445

విని యా మాటలు సంతసంబుఁ గొనె సుర్వీభర్త; శోభించె నా
యన సర్వాంగములున్ ముదావహతచే; హార్దిక్యమున్ హార్దమున్
బెనఁగొన్నన్ మునివెంట నందసుని బంపింపంగఁ దా నిచ్చమై
వనుకూలత్వముఁ జూపె, నెల్లరును నాహ్లాదింప; రామప్రభూ! 446



319. గదువాడున్;

పిలిపించెన్ రఘురామ లక్ష్మణుల సుగ్రీవవల్లభుం, డంత నొ
దలలన్ మూర్కొనె; భార్యలం గలిసి పుత్త్రి స్నేహ మేపారఁగా,
గిలుపెల్లం బులకింప, దీవనలచే నింపెన్ సుత ద్వంద్వమున్,
గళతాళంబు సుఖంబుగా మనుట నాకాంక్షించి; రామప్రభూ! 447

చిదుమై మోదము నెక్కొనన్ గురుపు, నాశీఃపూర్వ సన్మంగళ
ప్రద మంత్రాళిని రాజపుత్త్రికుల ముంపం జొచ్చె; నానంద సం
పద పీఠం దన సూనులన్ దశరథ క్ష్మాపాలుఁ డా గాధిజుం
డు దయం గైకొన నప్పగించె, మని కీడున్ వీడి; రామప్రభూ! 448

తనుపన్ మందము శీతలంబును సుగంధ ప్రాప్తమై గాలి వీ
చిన దా వేళకు; దేవ దుందుభులునుం జిందంబులుం జిందరేఁ
గిన వంతం; గుసుమ ప్రవర్షణము సాగెన్ నాకమందుండి; రా
జ నివాసంబున మ్రోఁగె భేరులు లస చ్ఛంఖాళి; రామప్రభూ! 449

నడచెన్ ముందుగ గాధిసూనుఁ; డటుపైనం గాలపృష్ఠంబుతో
నడచెన్ బాలకుఁ డైన రాఘవుఁడు; వెంటం బ్రక్కనే లక్ష్మణుం
డెడమే లేక శరాస్త్ర ధారి యయి, యెంతే గాకపక్షంబు తో
దృఢఁగా శోభకు, సాగ నూల్కొనె నవష్టంభాన; రామప్రభూ! 450

కొనవ్రేళ్లన్ మణికట్టులందునను దార్ గోధంబులం దాల్చి, చ
క్కనగాఁ దీర్చియలంకరించుకొని, జోకం జాపముల్ మూఁపులం
దును, ఖడ్గంబులు సింహమధ్యములయందున్ వ్రేలఁగా, దివ్య శో
భన రూపంబులు పొలుఁగా, నడచి రాభన్ వారు; రామప్రభూ! 451

జన సత్ప్రాభృతులు త త్సహోదరులు, విశ్వామిత్త్రుతో సాగిపో
వ వితిం గాల్పద సుత్సుకంబున నృపాధ్వం బందుఁ, బుణ్యాగ్ని సం
కల్పలో స్కంద విశాఖు, లీక్షణము లోర్వన్ రాని తేజస్వియో
యనేత్రు లవి సాగినట్టులయె, వాసిన్, వన్నె; రామప్రభూ! 452

జను లెంతయుఁ, దనువారపుట్ పగిది నోందం దత్సహోదర్యు లా
మునిపెంటను నడుపన్ ముదంబుమెయి, నంభోజాసనున్ వెంట నా
శ్రుతులన్, త త్తళ శోభలన్ దళదిశల్ [320] వేఁ గాంద, నందంబుగాఁ
[321] బనివిన్పున్ నడయాడి [322] నట్టయె, ననల్ప ప్రీతి; రామప్రభూ! 453

కొంత ప్రయాణము రెండు మూఁపులను బెల్సైన్ నిక్కి యాడంగ, నో
నా లా కొలది మౌని చంద్రమునితో దర్పంబునన్ సాగ, సుం
దరమౌ మూఁపు సిరాల రెండు బిలువల్ తారాడ్చు నిట్టట్టులన్
[323] నడ ధోగ ద్వయి వేఱువేఱ, యని తోఁపం జొచ్చు; రామప్రభూ! 454

నడువన్ మున్నుగ నాఱుక్రోసులు రయానన్, వారు ప్రాపించి ర
ప్పడు, త ద్దక్షిణ తీర [324] భాగ సరయూ పుణ్యాపగాంభచ్ఛటన్;
పనిసేయగ మ్మ్రదుశంగి జ్యేష్ఠునకు విశ్వామిత్త్రుఁ డ వ్వేళ నే
ర్పడఁగా నాచమనంబు సేయుమని యంభశ్శ్రేణి; రామప్రభూ! 455

అనఘా! యాచమనంబుఁ జేయఁగ, సమస్త శ్రేష్ఠ మంత్రాళి కీ
వనిలో మూలమునౌ బలాతిబల లన్ మంత్ర ద్వయంబున్ విలం
బనము జేయక నేను నీకుఁగఱపన్ భావించుచున్నాను; గా
వున నీ వా యుపదేశ మొందు; మనియెం బూజ్యుండు; రామప్రభూ! 456

ఈ మంత్రంబుల సత్ప్రభావ పటిమం గాఁబోదు నీ కెట్టి వే
దన మెన్నండును; నెట్టి వ్యాధి నిను నొందన్ లేదు; క్రాంతత్వ మం
దవు నేమో యొకింగఁ బో వీకను; నిద్రావస్థ నేనిన్ నినున్
దనుజుల్ దా మెదిరింప నేర; రనియెం ద న్మౌని; రామప్రభూ! 457

---

320. ఒప్పొంద; 321. మనువొప్పన్; 322. నట్టగు;
323. పదధోగంబులు, రెండు రెం డనుచుఁ దోఁపన్; 324. మున్ను;

ఇల సాగారుమ మంత్రములఁ మది జపించితేనిన్, నినుం బొంద వాఁ
కలి దప్పులఁ; భువి నుండఁబోఁ దీక నొక్కండున్ భుజావిక్రమా
దుల నీ [325]సాటువ; బుద్ధి కౌశలమునందున్, సర్వ సామర్థ్య రీ
తుల, నందం దనె మౌని బాలకునకుం దుల్యుండు; రామప్రభూ! 458

అమలుల స్థైతము నీకుఁ గాపు జత, కార్యాకార్య నిర్ధారణ
క్రమ సుజ్ఞానమునందు, వాదముల నిర్వర్తిత్వమందున్, యథా
ర్థములం బోల్పుటయందు, నుత్తరములం బ్రత్యుత్తరంబులఁ నయో
త్తమ మార్గంబున సల్పుటం దనె, మహోదారుండు; రామప్రభూ! 459

నినుఁ బోలంగల వార లెందు నిఁక గాన్పింపంగరా, రందమం
దుననున్; నాయన! విద్య లివ్వి బహు మంత్రోపాస్తికే గాదు, స
ర్వ నయ జ్ఞాన విభూతికిం దలఁపఁగా మాతృత్వముం దాల్చు; సృ
ష్టిని జేసెన్ విధి వీని; నం చనె ముని శ్రేష్ఠుండు; రామప్రభూ! 460

సునయ ప్రాపిత బుద్ధిశాలి [326] నయి, తేజోవంతములఁ మంత్రములఁ
గనినాఁడం గడు దీర్ఘకాలతపముం గావించి యో! పుత్త్రి! వీ
విని [327] నుచ్చారము సేయఁగల్గుట కిలన్ నీ వొక్కఁడే యోగ్యుఁ డౌ
టను, నీకే యివి నేర్పు; దం చనె మునీ ద్వంద్యుండు; రామప్రభూ! 461

కనుకం జక్కఁగ రెండు మంత్రముల నింకన్ నీవె యుచ్చారణం
బును సల్పన్ వలె; వీనివల్ల నెగడున్ ముఖ్యోపయోగంబు లీ
వనిలో నెన్నియొ! పెక్కురీతుల; యశోవంతుండవై వీనివ
ల్లను బొందం గల వీ వనెన్ మునియు నుల్లాసంబు; రామప్రభూ! 462

పసనారన్ మదిపెంపు, బాలకుఁ డుపస్పర్శంబుఁ గావించె సం
తసముం జూపుచుఁ ద న్నదీజలములన్; దానన్ శుచిత్వంబునున్
బొసఁగన్ మంత్రములన్ మహర్షియు మనస్స్ఫూర్తిం బ్రదర్శించి యిం
పెసఁగంగా నుపదేశమున్ సలిపె నెంతే మెచ్చి; రామప్రభూ! 463

325. పోలిక; 326. తను; 327. నభ్యాసము;

మనఃపంబున మంత్రరాజముల నేర్పింపంగల్గి యబ్బాలకుం
దనయంబున్ శత లక్ష కోటి కిరణ వ్యాలీనతా భాస్వర
ప్రణుత ప్రస్థ శర ధ్గ భస్త్రి పగిదిన్ భాసిల్లె; నాలోననే
యినుఁడుం దా నపరాద్రిఁ జేరుకొనియెన్ హేలాతి; రామప్రభూ! 464

కథవంగా గుప్తపంవనాదివము అక్కాలంబునం జీకటుల్
వటియెన్; దగ్గఁ దగ్గఱం దృణమయ స్వాపంబులం దీర్చుచున్
జడకల్ సేరిరి సోదరుల్, గురువు విశ్వామిత్త్రి యుక్తంబుగాఁ
బుడమిన్ మెల్లఁగ, నాఁటిరేన్ జడలికల్ పోఁబెట్ట; రామప్రభూ! 465

గురు గాధేయుఁడు తా, విలాస మయ వాకోవాక్య రూపంబునన్
బరమోదార శుభ ప్రదేశన కథల్ వర్ణించి వర్ణించి సో
దరులున్ మెచ్చఁగఁజెప్పె; నాఁటి నిశి నిద్రం బొందిరా మువ్వు న్
సరయూ దక్షిణ తీరమందునఁ[328] గడున్ [329]సౌఖ్యాన; రామప్రభూ! 466

తెలవాఱంగనునుండె; గడ్డిపఱుపుల్ దేర్పంగ నా యన్నద
మ్ములు తా మింకను నిద్రదేఱుటఁ గనెం బూజ్యుండు గాధేయుఁ; డి
మ్ముల లేపెం దొలిసందె దాఁటె ననియుం, బోవంగనౌ మించి క
ర్మలు సేయం దగు వేళ, యం చనియుఁ, జెప్పం జొచ్చె; రామప్రభూ! 467

కలఁకల్ దేఱుచు లేచి సోదరు లొగిం గాల్యంబులం దీర్చి స్నా
తులునై, పిమ్మట నాచమించి, తమ రందున్ జీవసార్ఘ్యాది సం
ధ్యలు, గాయత్త్రియు సల్పి, యూ పిదపఁ బ్రాతఃకాల సర్వాహ్నికం
బులు దీరం బరపనింతు, రొజ్జకును గేల్మోడ్చొగ్గి; రామప్రభూ! 468

మునివెంటన్ నృపనందనుల్ నడచుచుం, బుణ్యాపగా గంగతోఁ
గనువిం దేర్పడ సంగమించు సరయూ కల్లోలినీ శ్రేష్ఠ ఘో
షణతో[330] నెచ్చోటు, నచ్చటుం గనిరి; త ద్ధ్వామిష్య మందున్న దా
నిని బుణ్యాశ్రమ వాటినిం గనిరి, కన్నేటాన; రామప్రభూ! 469

328. న లసత్సౌఖ్యాప్తి; 329. సంతుష్టి 330. షై;

అది ప్రాచీన తపాశ్రమాచ్ఛపద మం చవ్వారికిం దోఁచినన్
మది నుప్పొంగుచు జ్యేష్ఠుఁ డా గురుని జెప్పంగోరు, నవ్వాటి యే
రిదో! యే పుణ్యుఁ డటన్ నివాసమును బేర్మిం జేయుచున్నాఁడో! తా
నది యెల్లన్ వినుదంచు, నుత్సుకత త [331]న్నాళింప; రామప్రభూ! 470

ఆ పుణ్యాశ్రమ గాథఁ దెల్పుతఱిఁ దా న మ్మౌని, "యీయందు ము
న్నా పూజ్యున్ గిరికం ప్రసన్నత వివాహం బౌటకుం బూర్వ మే
యీ పూతాశ్రమ వాటికిం బ్రమథు లెంతే గొల్వఁగాఁ జేరి, ని
ష్ఠా పూర్వంబు సమాధి నుండె," నని ప్రస్తావింప; రామప్రభూ! 471

చనుదెంచెన్ మదనుండు త త్స్థలికి, వంచాడింపఁగాఁ బోఁక భ
ర్గని నిష్ఠం జెడఁగొట్ట; నందుకు మహా కోపో గ్రదీప్తుండునై
కనువిచ్చెన్ గిరిశుండు [332]హుంకృతిని; ద త్కాముండునున్ దగ్ధమై
క్షణ లేశంబున భస్మ మయ్యె; నని పేర్కొన్ మౌని; రామప్రభూ! 472

భంగం బొందిన మన్మథాధముని సర్వాంగంబులున్ భస్మమై
త్రుంగంగా నతఁ డంగహీనుఁడగు నందుం గానఁ, ద ద్భూమి తా
నంగం బన్ ప్రథఁ దాల్చె; నద్దియును సత్యార్థంబు సంపన్నమై
బొంగారున్ భువి; నంచు [333]శిష్యులకుఁ జెప్పెన్ మౌని; రామప్రభూ! 473

ఈ పుణ్యాశ్రమ వాటియున్ శివునిదై యేపారు; నం దెందఱో
శాపానుగ్రహ దక్షులౌ విషధర చ్ఛాత్రుల్ దపోనిష్ఠలోఁ
బ్రోవుం జెందుచు నుందరే? తరతరంబుల్ గాఁగ, ధర్మాత్ములై
పాప ప్రక్షయ దక్షులై; యనియె నా బ్రహ్మర్షి; రామప్రభూ! 474

మన మీ సంగమ తీర్థమందున సుపస్పర్శంబు గావించినం
తన శుద్ధాత్ములమై జపాహ్నిక లస ద్ధ్యానాదులం బూర్తిఁ జే
సినచో, నాశ్రమమందునం గడపఁగాఁ జేరంగనౌ రాత్రి యె
ల్లను; గంగానది రేపు దాఁటుద మనెన్ శ్లాఘ్యుండు; రామప్రభూ! 475

---

331. తన్నర్థింప; 332. హుమ్మనుచు; 333. నకుఁ;

గురుదేవుం డిటు మాటలాడు తఱి, యోగ్యుల్ వచ్చియున్నారు దా
శరథుల్ గాధిజు వెంట నంటి యని యా స్థాణ్వాశ్రమావాసు లె
ల్లరుసుం జూచిరి దివ్యదృష్టి[334]కలనా హ్లాదాత్ములై; భక్తి సం
భరితుల్ సేసిరి వారి దర్శనము బన్ పైకొంట; రామప్రభూ! 476

పులకల్ మీఱంగ వాస గాధిజునకుం బుణ్యాత్ములౌ రాజ పు
త్త్రులకున్ సత్ప్రీతి దర్ఘ్య పాద్య విధులున్[335] స్తోమ్యంపు టాతిథ్యముల్
బలు గొండాడిరి వారి ముప్వురను; నాపైఁ గౌశికుం డచ్చటన్
జలి పెస్ మేలు ప్రసంగ; మంత మలి సంజల్ దోఁచె; రామప్రభూ! 477

తమ విధ్యుక్తములైన యాహ్నికములన్ స్థాణ్వాశ్రమావాసి బృం
దము మున్ సల్పి సమాహితాంచిత మన స్తత్త్వంబు చేకూర, సం
గమన స్థానమునన్ జపంబుఁ దపముం గావించి యా పిమ్మటన్
గమియింపం దన యాశ్రమంబునకు సంకల్పించె; రామప్రభూ! 478

చనఁ గోరెం దన వెంటఁ దద్గణము విశ్వామిత్త్రునిన్ శిష్యులన్,
మనసా ముప్వురు పిద[336]లేఁగుటకునై మైకోలునుం జూప, భ
క్తినియుక్తిం గొనిపోయె నద్ది; ముని యా తీర్థంబునన్ దూపటిం
చిన దాఁకన్ మురియించెఁ [337]బుణ్యకథలన్ శిష్యాదిఁ;[338] రామప్రభూ! 479

తమ భాగ్యం బభినందనీయ మని త త్స్థాణ్వాశ్రమా వాసులున్
బ్రమదాంతఃకరణ ప్రవృత్తులయి విశ్వామిత్త్రు గాథాదులన్
శ్రమమం బెంచక ప్రొద్దుపోయి విని, రా ధాత్త్రిల్ గొనన్ రంజనన్;
దమి నెల్లారికి నందు తేయి సుఖ నిద్రల్ గూరె; రామప్రభూ! 480



---

334. కలిమిన్, కలలన్; 335. లుం దోరంపు;
336. లందునకునై; 337. రమ్య; 338. శి;

—౨౪—

తెలవారంగనె ప్రాతరాహ్నికములుం దీఱంగ, నా రాచ [౩౩౯]పా
పలు, గాథేయునివెంట నంటి పయనింపన్ సాగి, భాగీరథీ
విలస త్తీరము చేరునంత, మును తోర్మిన్ నావ నొక్కండు సొం
పిల నేర్పాటుగఁ జేసినా రతిథులుం బ్రీతిల్ల; రామప్రభూ! ౪౮౧

'స్వామీ! మీరు సుఖంబుగాఁ జనుఁడు, శిష్యశ్రేష్ఠు లీ క్షత్త్రి తే
జో మూర్తుల్ మిముఁ గొల్వ నీ [౩౪౦]పడవపైఁ; జూపట్టుఁ బ్రొద్దెక్కుటల్;
దా మాలస్యము సేయవ' ద్దనుచు, నా స్థాణ్వాశ్రమావాసు లు
ద్దామ ప్రేమను వేఁడి, రా మునినిఁ బ్రాతర్వేళ; రామప్రభూ! ౪౮౨

ముని యా మౌనుల యాదరంబునకుఁ జల్వం దాఁ బ్రశంసల్; మహా
త్ముని గాథేయునివోలె శిష్యులును నేర్పం జూపి రవ్వారినిన్
గొనియాడన్; [౩౪౧]ముంగు రా యనంతరము వీడ్కోలుం దగం జెప్పి నా
వను జేరం, ద్వర నద్ది చేరెను నదీ మధ్యంబు; రామప్రభూ! ౪౮౩

ఇరువాగుల్ దమలోనఁ దా మితరమున్ హేరాళ వేగంబుతో
నొరయంగా, సురవర్త్మ మంటు నల లా యుల్లోల కల్లోలినిన్
దొరలెన్; వీనులు వ్రయ్య ఘోష మొకఁ డందున్ విస్ఫుడన్ దక్షిణ
స్ఫురితాశ్చర్య వికారులై, కనిరి శిష్యుల్ మౌని; రామప్రభూ! ౪౮౪

గురుదేవున్, 'ధ్వని యేమి యిద్ది' యనుచుం గుత్తుందు జ్యేష్ఠుండు తాఁ
ద్వరమాఱుం దయి ప్రశ్నచేసె; మునియుం 'ద ద్గంగ యెంతేని సు
స్థిర శాంతిం బ్రవహించుచుండ సరయూ దివ్యోదకం బందులో
నురలం బాఱుట యిద్ది;' యం చనెఁ బ్రశాంతోద్భూతి; రామప్రభూ! ౪౮౫

---

౩౩౯. పూపలు; ౩౪౦. తరపి; ౩౪౧. ముపుగా;

మును కైలాసమునందు నొక్క సరసిం [342]బుట్టింప సంకల్పమున్
మనసా చేసె విధాత; తత్క్షణమె నిర్మాణంబు [343]నొందెన్ సరో
వర మొక్కండు; సురల్ దదీయ నళినిన్ శ్రేష్ఠంబుగా నెంచ, న
ద్దరణింబై యది పొందె మానస సరస్సనన్ ఖ్యాతి; రామప్రభూ! 486

చిరకాలోద్భవమైన మానస సర శ్రేష్ఠంబునందుండి తాం
[344]పొరలంబాఱు ప్రవాహ, మయ్యె సరయూ పుణ్య ప్రవాహం బటం చిటుల్;
పర ప్రాశస్త్యము నావహించి ప్రవహింపం జాలు నా దివ్య ని
మ్నగ, లయోధ్యాపురిన్ జేరు నిచ్చట ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 487

ఘనమౌనం గల్గుట బ్రహ్మమానస సరోద్భూతం బనం జిన్ని ప్రా
యిని యయ్యున్ సరయూ మతల్లిక; పవిత్రీభూత మయ్యెం; ద్రివే
దిని దెప్పం బనిలేదు పూజ్య మనుమన్; నీతమ్ముఁడున్ నీవునున్
బ్రణమిల్లన్వలె వీని; కం చనియె, నా బ్రహ్మర్షి; రామప్రభూ! 488

అనవచ్ఛిన్న మహత్త్వ యుక్తములునౌ నా యాపగా ద్వంద్వసంగమున్
గని, యద్దానికి సోదర ద్వయము మ్రొక్కెన్ భక్తి తాత్పర్య యు
క్తిని, స్రోతంబును జేరె దక్షిణ దిశా తీరంబు వేగంబు నొం
దినదై పెల్లున పర్వ, యాత్రికులు ప్రీతిం జెంద; రామప్రభూ! 489

కనదు శిష్యుల్ ముగురుం దరించి తటినిం, గూలంబునన్ దాటి, స
త్వరమే సాగిరి యాగకుండ నెచటన్ బా ద్వద్ద కాంతారమున్
ఘోరతరుచ్ఛాయంగల కాల్నడం బడుచు; క్షేమం బంతఁ బ్రశ్నించె శ్రీ
నీ తత్ వార్తముగూర్చి చెప్పఁ దనుమన్ గాధేయు; రామప్రభూ! 490

'ఎవరున్ మానవు లిందు ద్రిమ్మరరొకో! యెన్నండు? నా చిన్నితే
వపులన్ [345]రావు; భయంకరంబులు గరుత్మంతంబు లెత్తించు నా
రావులన్ గింగిరు; లుగ్ర [346]కట్వరములున్ సింహంబులుం జేయుచు
[347]న్నవి గర్జల్ గురుదేవ!' యనం దమగుఁ బ్రశ్నల్ జట్టు; రామప్రభూ! 491

---

342. బుట్టింప; 343. నయ్యెన్; 344. పొరలం బడ్డ;
345. లేవు; 346. కంటకములున్; 347. న్నవె;

పుడుగుల గ్రందుగ నీలవేయుటను మార్గొక్మగున్ శ్రవో [348]గోళముల్;
దుససై తుమ్మకి, యేఁపుద్ది యునువద్దుల్, రేఁగు, పింరేణులున్,
దరమారం గలిగొట్టుఁ, గ్రిక్కొనెడి వంధ్యా వృక్ష సందోహముక్,
స్థిర తామిస్రముఁ జిమ్ముచున్న; వనియెన్ జ్యేష్ఠుండు; రామప్రభూ! 492

పులుగుల సేయురొదల్, మృగంబులవి[349] పెన్ బొబ్బల్, తరుల్ సీకటుల్
పదపన్, మార్గము దుర్గమం బగుటఁ, జెప్పన్‌రాని క్లేశంబుతోఁ
జరణ ద్వంద్వము సాగుచున్నది; మహాసాంద్రంబు సాంద్రం; బిదె
వ్వరిదో! తెల్పుఁ; డటంచు జ్యేష్ఠుఁ డనె విశ్వామిత్రు; రామప్రభూ! 493

వినుమీ! నాయన! యీ గుహీన కథ నే విన్పింతుఁ; బూర్వంబునన్
ధన ధాన్యాది సమృద్ధమై 'మలదము'న్ దక్కా 'గురూశంబు'నన్
వినుతిం గాంచెను రెండు దేశము లిటన్ [352]వేవేగ వర్ధిల్లి; య
య్యనిమేషుల్ సృజియించి రవ్వి; యని నా యార్యుండు; రామప్రభూ! 494

మును, దేవేంద్రుఁడు, వృత్రు హత్యవలనన్ బొందెన్ మహాపాతకం
బును; దానన్ శుచి హీనతం బొరసె; నొవ్వం గూప్పు క్షుద్బాధయున్
గనియెన్; మౌనులు విష్ణు లాతనిని గంగా స్నాతునిం జేయఁగాఁ
జను నం చిందులఁ జేర్చి; రం చనియె నొజ్జల్ మేటి; రామప్రభూ! 495

ఘనవాహల్యాన్ సురదీర్ఘికన్ మునుచుచున్ గాహంబు సేయించుచున్
మునులున్ దివ్యులు మంత్రపూత జలముల్ మంచెత్తు ఖాండంబులన్
దనియం బోసిరి వాని మూర్ధమున; నంతన్ బ్రహ్మహత్యా‌ను శో
ధనమై, తీరెఁ దదీయ తర్ష, మనియెం ద న్మౌని; రామప్రభూ! 496

---

348. రంధ్రముల్;
349. లిడు; 350. చే; 351. సాగకున్నవి; 352. వేర్వేఱ;

మన మాహ్లాదమునొంద నింద్రుఁడనె, 'నీ ప్రాంతంబు నా కల్మషం
బును బోకార్చెను గావునన్ 'మలద' మౌ'; మోపైన కారూశమున్
దునిమెం గానఁ 'గరూశ' నామమును బొందుం గాత మంచుం, బ్రసి
ద్ధిని దేశ ద్వయ మేర్పరింప; ననె గాధేయుండు; రామప్రభూ! 497

విని దేవేంద్రుని మాటలన్ మునులునున్ వేల్పుల్ ముదం బొంది నే
ర్పున నిర్మించిరి రెండు దేశములనుం బూర్వంబు; తన్నామముల్
ఘనతం జెల్లఁగ, నవ్వి యభ్యుదయముం గాంచన్ సమృద్ధంబుగా
ధనధాన్యాదులం గల్గి; యంచుఁ బలికెం దన్మౌని; రామప్రభూ! 498

సకల శ్రేయము లొందు చూ విషయముల్ సంపన్నమౌచుండఁ దా
టక యన్ రక్కసి యొక్క కాలమున నష్టం బొందఁగాఁ జేసె వా
రక వానిం దన జృంభణన్ నెఱపి; క్రూర స్వాంత, కామప్రవా
శక రూపాభవ, యద్ది యం చనె, ముని శ్లాఘ్యుండు; రామప్రభూ! 499

జననం బందుటయే సహస్ర గజ ధిష్టాధిక్య సంయుక్తయై
జనవం బొందిన దద్ది; సుందుఁడను రక్షత్పుద్రుఁ బెం డ్లాడెఁ; బు
త్త్రుని మారీచునిఁ గాంచె; వాఁడు బలమందున్ మేటి కోటీరుతో
నెనయున్ సాటి, యటంచు వాకొనియె మౌనీంద్రుండు; రామప్రభూ! 500

సువిశాలంబగు మోముతో, గుడియలన్ సోమించు కై దోయితో,
ధ్రువదార్ఢ్య ప్రతిరూపకాజిరముతో, దోశ్శక్తి గర్వంబుతో,
తవణించుం బెదబొబ్బ దిక్తటము లంటన్; [౩౫౪]వాఁడునున్ రాక్షస
ప్రవరంబై, జన హింసఁజేయు; ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 501

ఒకటన్ మించిన యర్ధ యోజనమునం దున్నట్టి దా దుష్ట తా
టక యిచ్చోటికి; నద్ది దారులను గొట్టం గల్గి జీవించుచున్,
బ్రకట [౩౫౫]శ్రీక [౩౫౬]కనత్కరూశ మలద ప్రాగ్భావ [౩౫౭]యావత్స్వమున్
గికురించెం జుమి! కష్టయక్షిణి యనెన్ నిర్దేశి; రామప్రభూ! 502

---

౩౫౩. యానున్; ౩౫౪. టానునున్;
౩౫౫. ద; ౩౫౬. బసత్క; ౩౫౭. మున్ సర్వమున్; ౩౫౮. కష;

కక్షాధారిణివల్ల దేశములు దగ్ధం బయ్యె దాపంబులై ;
రక్షోదక్ష యొనర్చుచున్ క్షణనమున్ రంజిల్లు, దాఁకొంచుఁ దాన్;
దీక్షం బూనుము దానిఁ ద్రుంతు నని; నే దీవించుచున్నాను; నీ
రక్షన్ దేశము లివ్వి [359] దీపిలు; ననెన బ్రహ్మర్షి; రామప్రభూ! 503



359. భాసిలు;

—౨౫—

వనితం [360]ద్రుంపు మటంచు బ్రహ్మఋషి విశ్వామిత్రుఁడే యానతి
చ్చినదానిన్ విని, కౌసలేయుఁడు వచించెన్ నమ్రతన్ మీఱి, 'యో!
మునివర్యా! కడు నల్ప వీర్యంబనుచున్ మున్ వింద నీ యక్షు; లం
గన యౌరా తాటక వారిలో; వసుధ నిష్కర్షించి; రామప్రభూ! 504

'సెలవీయన్వలె, వేయి యేనుఁగుల పుష్టిం బొందు టెట్లయ్యె దు
ర్బలయౌ స్త్రీ'? యని చట్టు వేఁడికొన, విశ్వామిత్రుఁ 'డో! నాయనా!
కలఁ డొక్కండు సుకేత నాముఁ డగు యక్ష శ్రేష్ఠుఁ డాదిన్, మహా
బల సుజ్ఞాన సమగ్రుఁ' డంచు నా కథన్ వాక్రంచె; రామప్రభూ! 505

అనయం బాతఁడు [361]విక్యవిత్తముఁడు, శ్రేష్ఠాచార సంపన్నుఁ డ
య్యును, సంతానములేని హేతువునఁ జేయున్ దారుణంబౌ దపం
బును; గంజుం డవి మెచ్చి యిచ్చెను వరంబున్, "వేయి నాగాభదో
వసుపుం బొందుము గన్య కల్గు" నని యత్యారూఢి; రామప్రభూ! 506

అజుఁ, డా యక్షుఁడు పుత్రుఁగోరంద వర మీయం డాయెఁ దా నేలనో!
గజ సాహస్ర బలం గుమారిక నొసంగం [362]గల్గెనే గాని; తా
ను జనించెం జుమి తాటకాఖ్య, మును హొన్నుం బోలు మైచాయతోఁ,
బ్రజ లెన్నన్ సుతగాఁగ, యక్షున; కనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 507

పెరిఁగెం బెద్దది యయ్యె; బ్రహ్మ వర సంవృద్ధిం బడం తయ్యెనున్,
బరగెన్ వేయి ద్విపాయి శక్తిఁ గలదై; వాల్గంటులన్ మేటియై
వరలెం; జే ర్పడె రూప సంపదకు; సంభావించి పెండ్లాడె సుం
దరిన్ సుందుఁడను యక్ష ప్రార్థన, ననెం దన్మౌని; రామప్రభూ! 508

"మన మూహింపఁగ లేనియంత బలసంపన్నాఢ్యు మారీచునిన్
గనియెం దాటక పుత్రుఁగా; నతఁడు వేగం బెద్దయౌనంతలో
నన, సుందుండు నగస్త్యశాపమున నున్మాథంబు నొందంగఁ, గో
పనయై తాటక రేఁగె," నం చనియెఁ ద ద్బ్రహ్మర్షి; రామప్రభూ! 509

360. ఖంపు; 361. శౌర్య; 362. జాలెనే;

సుతు, మారీచుని వెంటఁ గైకొని, యగస్త్యున్ మీఁదికిం బోయి యు
ద్ధతిమై దాటక మ్రింగఁబోవ, మునియుం దత్పుత్త్రి వేగంబు ను
ద్ధృతియున్ ముంచుగ నావఁగోరి, యనె, 'నారీ! నీవు దైతేయుఁడై,
బ్రతుకొం బొమ్మని; యంచు శిష్యుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 510

విని యుం బుత్త్రిని శాప మామె, మఱియుం బీఁచంబునన్ రేఁగఁ, గ్రో
ఘనుఁడై సంయమి "ధూర్తురాల! యిఁక సౌందర్యంబు దగ్ధంబుగాఁ
గను, కన్ వెక్కు విరూప రక్కసియనై. క్రవ్యాశినీ కీర్తితో
జనభుక్తిం బెరుగాడు," మం చనె నసెన్ సన్మౌని; రామప్రభూ! 511

తను నాతండు శపించినందులకుఁ బంతం బూని యత్యంతకో
పనయై యేమియుఁ జేయలేక, ముని మున్ పైనంబు సాగించె నం
చని రోషంబున నీ కరూశ మలదాఖ్య ఖ్యాత దేశంబులన్
దునిమెన్ ధ్వంసముగాఁగ; నంచు గురుఁ డాందోళించె; రామప్రభూ! 512

ముని యా రీతిగఁ దత్ప్రదేశము వనంబుం జేయు టెట్లయ్యెనో,
వినఁగాఁ జెప్పుచుఁ[363] దాటకా పరమ దుర్వృత్తంబు, "దౌష్ట్యంబునం
మన శౌర్యాధిక గాన, దానిఁ దనయా! త్రుంపంగనౌ నీకు, బ్రా
హ్మణ మాహేయులఁ[364] బ్రోవ" నంచు నిడెఁ దా నాజ్ఞప్తి; రామప్రభూ! 513

'భావంబందున శంకఁ బూనకుము; శాప గ్రస్త నా తాటకన్
నీవే దప్ప[365] మఱెవరు సల్పఁగలదే?[366] నిర్వాపణం, బెద్దెలన్
జేసం జూపి జగత్త్రయంబునను; యోషిద్ధింస యం చెంచుట
సేవాధర్మమె? నాథ,' కం చనె ఋషి శ్రేష్ఠుండు, రామప్రభూ! 514

ధూర్త ప్రాణులఁ ద్రుంచి సాధులగు[367] చాతుర్వర్ణ్యముం బ్రోచుటల్
గర్తవ్యంబగు రాజకార్య చణమౌ క్షత్త్రాగ్రగణ్యాళికిన్;
స్మర్తవ్యంబగు, నీ యుపేక్ష బహుళథా పాపంబుగా భావి భూ
భర్తృ శ్రేణి; కటంచు శిష్యున కనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 515

---

363. చు యక్షిణీ; 364. ల పేర;
365. పఠాండు; 366. గంఁడే; 367. పులఁ;

వినుమీ! పుత్రి! ప్రజా [368]సురక్షణకుఁ బృథ్వీ పాలన ప్రాజ్య భా
ర నియుక్తుల్ బహు పాప మిద్ది, కడుఁ గ్రూరం బిద్ది, నా కెప్డు దే
పనినైనన్ సలుపంగఁ గల్గుటయె భావ్యం బంచుఁ జెప్పన్ సనా
తన రాజాశ్రిత ధర్మ; మంచుఁ [369]దణిమెన్ ద న్మౌని; రామప్రభూ! 516

కడిమిం దాటక తప్పఁ ద్రొక్కె ఋజుమార్గంబుం; బ్రవర్తిల్లెడున్
జెడు మార్గంబున; ధర్మహాని కలుగన్ శీఘ్రంబె, త ద్ధర్మమున్
బుడమిశుల్ నిలఁబెట్టఁగావలెఁగదా! పూర్వంబు వైరోచనన్
మడియింపం గోరె వజ్రి, మంధర ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 517

ధర నాశం బొనరించు టద్ది, యటు లంతం బొట యట్లుండె; సు
స్థిర శౌర్యున్ హరిఁ ద్రుంపఁగా భృగు మహర్షి క్షేత్ర ముంకింప, స
క్షరుఁ డామెన్ వధియింపఁడా? పుడియు నింకన్ భవ్య ధర్మాత్ము లు
ర్వరలో ధూర్తులఁ ద్రుంపరా? యనియె నా బ్రహ్మర్షి; రామప్రభూ! 518



౩౬౮. సురంజనకు; ౩౬౯. బనిచెన్;



పని నాలోచనఁ జేసె రాసుతుఁడు; "విశ్వామిత్త్రు నాజ్ఞప్తులన్
విసుమంచుం బిత చెప్పె; గావున మదిన్ పితానుమానంబునన్
ముని యాదేశము చొప్పునన్ నడుచుటే ముఖ్యంబు నా;" కంచుఁ జే
సెను నిశ్చింతను నిశ్చితం బపుడె, ద చ్ఛిష్యుండు; రామప్రభూ! 519

గురు సాన్నిధ్యమునందు నాజ్ఞ నిడె నాకున్ రాజధానిన్ మహో
ద్ధుర భంగిం, దమరిచ్చు నాజ్ఞల కొలందుల్ సేసు పాటించుటల్
బరమోత్కృష్ట మటంచు నా దశరథ క్ష్మాభర్త; యా వ న్వనా
దరముం జొందునె? యంచు శిష్యుఁ డనియెం ద న్మౌని; రామప్రభూ! 520

గురు నాజ్ఞన్ నెఱవేర్చుటే వ్రతము నాకున్; మీరు బ్రహ్మర్షులై,
పరమోత్కృష్టము తాటకా హనన మన్ భాష్యంబుఁ గా దందునే?
స్థిర ధర్మంబును నిల్పు మీవును బ్రసిద్ధిన్ గోకుల బ్రాహ్మణో
త్కర రక్షం గొని యన్న గాదన ననెం దాఁ బట్టు; రామప్రభూ! 521

అనుబంధుండను; మీ యనుజ్ఞ యిడు కార్యం బిప్పుడే సల్పెదన్
మునిదేవా! యని ధన్వమున్ నడుముఁ దా ముష్టిన్ వెసం బూని, చే
సెను టంకారము మాఱు మ్రోఁగఁగ దిశా సీమాళి, యక్కానలో
వనరాజంబులు కూడ నుల్కిపడిపోవన్ భీతి; రామప్రభూ! 522

విని యా తాటక దిగ్భ్రమంబుఁ గొనియెన్; వీక్షించె న ల్దిక్కులున్;[370]
క్షణ కాలంబు గడెత్తు నల్పెఁ; బలుపెం గా ర్కొన్న క్రోధంబుఁ; ద
ధ్వని విన్పించిన దిక్కుగాఁ బరు గిడెన్ దర్పాద్భుతంబుల్ వెసం
గొనఁగా; నీనిన వ్యాఘ్రి మిక్కిలిగ నాఁకొన్నట్లు; రామప్రభూ! 523

ఒకృతాస్యంబు, వికార రూపమును గాన్పింపంగ లంఘించు తా
టకఁ, దాళాధిక దీర్ఘకాయఁ, గనియుంటం దాను జ్యేష్ఠుండు, "త
ప్పక యద్దానిది భీకరాకృతిని జేపం జూచుచున్నావె? యిం
తకుం దమ్ముండ! వచింపు" మం చనియెఁ గ ర్తవ్యంబు; రామప్రభూ!

370. లన్;

చెలువం జంపుట పాప మం చనెదు దాక్షిణ్యంబుఁ జాలింపఁగా
వలయున్ రాఘవ! యంచుఁ దగ్గుఁ బడు విశ్వామిత్రుఁ డత్యంతమున్
సలిపెన్ బోధము; దుష్టదారిణిని, నీచస్వాంతఁ, బాపాత్మనున్
హరియింపం దగు యజ్ఞహంత్రిణిని, ననున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 531

దరి యేచున్నది నాయనా! యిపుడె సంధ్యాకాల; మత్తైనచోఁ
బెరుఁగున్ మాయలు దీని; వెవ్వరును దద్వేళన్ వధింపంగఁజా
లరు దీనిం; దెగవేయు మిప్పు డవలీలన్ బాణజాలంబునన్
బరువం జేస్తద; నంచుఁ బ్రోచెఁగొలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 532

కనిపట్టెం దను శబ్దవేధి యగుటన్ [377]క్ష్మాపాలకుంబట్టి, య
క్షిణి యెచ్చోటను నున్నదో యపుడు; వేసెన్ బాణముల్ దానిపై
నను; మాయాబల మెంతయుండినను బాణశ్రేణికిన్ జాఁగ చి
క్కెను; గేకల్ పెడబొబ్బలుం జెలఁగె నక్షీణార్తి; రామప్రభూ! 533

తన యావద్బల ముజ్జ్వరించుకొనుచున్ దంభోళియో! నాఁగ, య
క్షిణి, యా క్షత్త్రియ వీరు లిద్దఱిపయిన్ క్షిప్రంబుగా [378] దూఁకుచుం
డెను; జ్యేష్ఠుం డొక యస్త్ర మంతొ పృథగల నాఁటెన్ దానికిన్ వేగ; ధా
రుణిఁ గూలెం దెగి యద్ది నెత్తురుల యేఱుల్ వాఱ; రామప్రభూ! 534

హననం బొందుచుఁ గుప్పఁగూలఁబడఁగా, నా భైరవాకారనున్
గనఁగా వచ్చిరి యింద్రుఁడున్ సురలునుం గన్విందుగా; నవ్వ దా
ముని శుశ్రూషకుపై[379] బళే! యనుచు మెప్పుల్ గుప్పె, గాధేయునిన్
బ్రణుతుల్ సేసిరి వార లెల్లరును సద్భావాన; రామప్రభూ! 535

అలఘుస్వాంత! కృశాశ్వసంతతివి! యా యస్త్రాళి శస్త్రాళి వ
ర్తిలుచుండెన్ నిను జేరి; రాఘవుఁడునున్ ధీరత్వ మేపార వ
ర్తిలుచుండెన్ మిము వెంబడించి; సకలోర్విన్ సర్వ శస్త్రాస్త్ర వి
ద్యలు మీ పెల్లను యోగ్యుఁ డం చనిరి, జియ్యల్ వాని; రామప్రభూ! 536

377. పాలు పుత్త్రుండు; 378. దూఁకనుండెను; 379. షపుపై;

"వలయుఁ బేల్పుల కీతఁ డింక నెఱవేర్పంగన్ మహాకార్యముల్;
వలయున్ మౌని వతంస! శిష్యునకు నేర్పన్ సర్వ శస్త్రాస్త్రముల్
దలఁపుం బట్టి;" యటంచు నా మునులునున్ దైత్యారు లింద్రుండునున్
సెలవీయం, గొని యాడనున్ నెగడె నాశీః పూర్తి; రామప్రభూ! 537

చనినా రెల్లరు; సంజ రాఁ గదఁగె; విశ్వామిత్రుఁడున్ శిష్యులన్
గని, మూర్ధంబులు మూర్కొనెం; దనువులం గైవ్రాలి మిచ్చోటనే
యనె సి[380] రాత్రికి; వేకువం జనుద మొయ్యన్ లేచుచున్ నిద్దురన్
మన పుణ్యాశ్రమ వాటి కంచును సనెం బ్రహ్మర్షి; రామప్రభూ! 538

తొలఁగెన్ నాఁడు మొదల్ మహాటవిని బంతుంగూర్చు నుద్వర్తనం
బులు సర్వంబును; దగ్ధహీనమున నేపుం జూపె విన్నాళ్లలున్
ఫల హీనం బయి ప్రోడుపాఱిన కుజవ్రాతంబుఁ; గౌబేర మం
జుల [381]స్నిగ్ధంబయిపోయెఁ గత మది సంశోభిల్లి; రామప్రభూ! 539



380. నా; 181. నిర్ధం, సాంద్రం;

—౨౨—

కథకం ద న్నిశి రామలక్ష్మణులకున్ గాధేయుఁడుం గాల మ
క్కడనే పుచ్చిరి, నిద్రముంపునను సౌఖ్యం బొంది; వేఁబోకనే
విడిపట్టిందున శ్రద్ధతోడ విహిత ప్రేష్ఠానుకాలంబు ల
య్యెడి [382]కార్యంబులు దీర్చి పేర్చితిరి సంవృద్ధేచ్ఛ; రామప్రభూ! 540

ముని యైక్ష్వాకునిఁ జూచి మంపమగు నవ్యం బొంది, మాధుర్యముల్
దొనఁగన్, "నీదు పరాక్రమంబునకు సంతుష్టుండ నైతిన్; ముదం
బున సర్వాస్త్రము లిత్తు నీ కిపుడె; త త్సర్వాస్త్ర సంపత్తిచే
సనిమేషాసుర లెల్ల లోఁగుదురు నీ" కం చాడె; రామప్రభూ! 541

సయ మేపారఁగ నెప్డు గేరిపయునైనం గాని, యుద్ధంబులో
జయముం బొందఁగఁజేయువాఁ డ నుపదేశంబున్, మహోదార సం
శ్రయుఁడౌ నీ కిఁకఁ ద త్త దస్త్రములు; మించన్ ముందు నే నిచ్చెదన్,
దయివాలుప్ [383]స్పృహదండ. చక్ర; మన నేతన్మోని; రామప్రభూ! 542

"మనసా యిచ్చెద ధర్మచక్రమును, [384]క్షేమం గాలచక్రంబునున్,
ఘన మత్యుగ్రము విష్ణుచక్రమును, శ్రేష్ఠంబైన యైంద్రాస్త్రమున్,
మను వజ్రాస్త్రముఁ, గాలకాల విలస న్మాన్యప్రభూలంబునున్,
గొనుమీ! పుత్రి!" యటంచుఁ ద గ్గురుఁడు పల్కెం,గుల్కఁ; రామప్రభూ! 543

పటువౌ బ్రహ్మ శిరాస్త్ర, మైషికమునున్ బ్రహ్మాస్త్ర మే నిచ్చెదన్;
దిటమం దస్త్ర విశేష మేది యయినన్ దీటౌనె? బ్రహ్మాస్త్ర వి
స్ఫుట దార్ఢ్యంబున కీ యిలా తలమునం, [385]బోనిమ్ము ముల్లోక సం
పుటికం బందున; సం చనెన్ మునియు సమ్మోదాన; రామప్రభూ! 544

కలుగున్ నాకద మోదకీ శిఖరు లన్ ఖ్యాతిన్ గదా దండముల్,
వెలయున్ దీప్తి సముజ్జ్వలంబు లయి; తృప్తిన్ వాని నీ కిచ్చెదన్;
బలు పాశంబులు ధర్మ-కాల—వరుణ ప్రఖ్యాతముల్ గూడ, సర
ధిల మోదం బిడువాఁడ నీ; కనియె రంథిన్ మౌని; రామప్రభూ! 545

---

382 కృత్యంబులు; 383 తృష, రుచి; 384 నాపై; 385 బోల్పంగ;

అడ లొందించు సమస్త లోకములు, శుష్కా ర్ద్రాశనుల్ రెండునున్
బిడుగుల్; వాని బొసంగుదుం గొనుము; పేర్మిం గూర్తు నస్త్రంబు లే
ర్పడ నారాయణ మాదియైనవి; పయిం, బై నాకపుం గూడ నీ
కొప(గూర్తుం గొను; మంచు బల్కె [386] గురు( దత్యుత్సాహి; రామప్రభూ! 546

నిను జేరన్ సమకూర్పువా(డ నిపు డాగ్నేయాస్త్రమున్; దానితో
సనురక్తిం బ్రథనంబునా( బరగు వాయవ్యాస్త్రముం గూర్చెదన్;
దొనరారంగల క్రౌంచమున్, హయశిరంబుం గూడ, నీ కిచ్చెదన్;
దనయా! కై కొను మీవు దశ్శల ననెం ద న్మౌని; రామప్రభూ! 547

వినుమీ! యిచ్చెద, విష్ణు రుద్రము లనం జే ర్మోయు నా శక్తులన్,
మును, గంకాళ కపాల నామ ముసలంబుల్ దైత్య ధార్యంబులన్
నిను సేవింప(గ( జేసి; మానవమునున్, నిర్భేద్య వైద్యాధరం
బను నస్త్రంబును దత్త మిత్తు ననె న య్యాశ్రయుండు; రామప్రభూ! 548

నిదురం బుట్టెడి స్వాపనాస్త్రమును, శాంతిం గూర్చు శాంతాస్త్రమున్,
ముది సౌరాస్త్రము, దర్పణాస్త్ర మన నుబ్బుం గొల్పు నౌష్ణాస్త్రమున్,
మది శోషిల్ల(గ( జేయు శోషణమునున్, బ్రమందించు సంతాపనం,
బొదవింతుం, గొను; మంచు( బల్కె గురు వత్యుత్సాహి; రామప్రభూ! 549

ఎదిరిం జేరి విలాపనాస్త్ర మనిలో నేడ్పించు; నెవ్వారునున్
మదనాస్త్రంబు నెదుర్చ లేరు పగ నమ్మర్దంబునం దెన్న(డున్;
జదుపున్ రాక్షస దేవతాక మెవ(డన్ సమ్మోహనాస్త్రంబు; నీ
కిదె యాయంగలవాడ నీసి; ననె మౌనీంద్రుండు; రామప్రభూ! 550

పిస్ఫురతేజః ప్రభమున్, శమనకము, సంవి త్సత్యమున్, శీత తా
మసమున్, సౌమనమున్, విదర్శనము, ధర్మ ప్రౌఢిమాపేతమున్,
బసి [387] కన్ మౌసలమున్ సుదామనమునున్ మాయాధరంబౌ భగ
ప్రసరం బిత్తును; మానవంబును; ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 551

386 గురు వత్తు, పుని యత్తు; 387 గన్;

అనయం బస్త్రము లివ్వి యన్నియును నిచ్ఛాధీన రూపంబులై
చనరున్; గాఢ బలాన్వితంబు లితరాస్త్ర శ్రేణితోఁ బోల్పఁ; నం
దనసేయన్ జగమందు నెవ్వియును మించన్ రావు; నీ వివ్వి రో
చనమై యొప్పఁగఁ గొమ్మసండెౘ యుపదేశం బొజ్జ; రామప్రభూ! 552

అనుచుం బ్రాఙ్ముఖుఁ డౌచు మౌని శుచియై, యయ్యస్త్ర మంత్రాళిఁ ద
క్షణమే జేసెను బెద్దవాని కుపదేశంబుం; దదీయాస్త్ర దై
వ నికాయంబును వానికిన్ వశముగా వర్తిల్లఁ జేయంగ స
ల్పెను మంత్రాధిమరుజ్జపంబు; మది నిల్పెన్ శ్రద్ధ; రామప్రభూ! 553

అనుశిష్టం బగు దైవముల్ గల మహోగ్రాస్త్రాళి, స్వాధీన మ
య్యెను వేగంబుగ జ్యేష్ఠ శిష్యునకు మౌనీంద్ర ప్రభావంబునన్;
వెనువెంటన్ త దజిహ్మగా[388]గ్నిముఖులున్ వేంచేసి, [389]యా యోధితోఁ
బ్రణతిన్ దాసుల మంచుఁ బల్కిరి, వినమ్రత్వాన; రామప్రభూ! 554

చనవుం జూపుచు రాఘవుండు, తదధిష్ఠానా[390]స్త్రాంధాళినిన్
దన హస్తంబునఁ దట్టి, 'నాదయిన చిత్త ప్రక్రియం బట్టి, చె
ల్లును వర్తిల్లఁగ నింకఁ; దల్తు నదనన్ శోలోన; నిప్పట్టునన్
జనుఁడీ! స్వేచ్ఛను వేల్పు!' లంచుఁ బలికెన్ సద్భక్తి; రామప్రభూ! 555

విని యా వల్కుల నస్త్ర [391]నిర్జరులునున్ వేవేగ సంతర్హితై
చని; రిష్టంబు ప్రకార; మా పిదప విశ్వామిత్ర మౌనీంద్రునిన్
గని, సాష్టాంగ నమస్కృతుల్ సలిపె యోగ్యస్వాంతుఁ డైక్ష్వాకుఁ; డా
నిశిన్ దీవన లిచ్చె నా గురువు యుక్తజ్ఞాన; రామప్రభూ! 556

---

388 గామృతులునున్; 389 యా యోద్ధ, యా శూర; 390 ప్రమేయాళినిన్;
391 పూజితులునున్;

పయనం బొంటను సిద్ధమౌ గురుని విశ్వామిత్రునిం గాంచి, వి
స్మయ చిత్తుం డగు శిష్యుం డాడు, 'తపసీ! సాక్షాత్తుగాం బుణ్య సం
చయులౌ మీరు వియచ్చర ప్రముఖు లెంచన్; నాకు సద్యాస్త్ర ని
శ్చయ దానం బొనరించినా' రని, ప్రశంసల్ మీఱ; రామప్రభూ! 557

వ్యపదిష్టోరు పరాక్రమ స్ఫురణచేఁ బ్రఖ్యాతులౌ నెట్టి వే
ల్పులునున్ న న్నెదిరింపఁ జాల రనఁ జోలున్ మీ కృపన్; నాకు మీ
రుపదేశింపుఁ డికం దదీయ విశిఖ వ్యూహాంబు[392]లె ట్లొందునో!
యుపసంహార; మటంచు వేఁడికొనె శిష్యుం[393]డట్టి; రామప్రభూ! 558

శ్రమ మం చెంచక నిశ్చయించుకొని యేన్ బ్రహ్మర్షి యద్దానికిన్;
సమచిత్తుం డయి ప్రేమమిం గనుచు, 'శిష్యా! సత్యవంతంబు, ధృ
ష్టము, అత్యాక్షము సత్యకీర్తి, దశ శీర్షంబున్, సునాభంబు, స
మ్మ మివెల్లం గొమరుల్ భృశాశ్వున కనెన్ మ న్నుందు; రామప్రభూ! 559

సమచిత్తంబున నింకనుం దెలుప, 'శిష్యా! పద్మనాభంబు లై
త్యము, నైరాశ్య, సరాజ్మఖా, వరణ, ధాన్యంబుల్, దళాక్షంబు, మో
హమునున్ జ్యోతిష, దుందునాభ, దృఢలాభాఖ్యంబులున్, వృత్తిమం
త మివెల్లం గొమరుల్ భృశాశ్వున కనెం దన్మౌని; రామప్రభూ! 560

సమచిత్తంబున నింకనుం దెలుప, 'శిష్యా! సర్వనాభంబునున్
విమలంబున్, రథసంబునున్ విషయముం బేర్మిన్ హరీంద్రంబు, వి
క్రమ మేపారు సునాభకంబు, శత వక్త్రింబున్, మహానాభ సం
జ్ఞ మివెల్లం గొమరుల్ భృశాశ్వున కనెన్ సంజ్ఞాని; రామప్రభూ! 561

విమదున్ రక్తము లెంతవారలకు సాధ్చిక్యాలినీ, కామ రూ
పములం, జూడ; శతోదరంబు, కృశన ప్రోగ్రంబు, సంతానమున్
శమ మిచ్చుం; బ్రతిహారిసంతరము శంసన్ మీఱు; యోగంధర
ప్రమథిన్ మెత్తు; నివెల్లఁ దత్సుతు లనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 562

392 నె; 393 దంత, దొజ్జ;

రుతరంబుం, బిత్ర్యసౌహృదంబు, ధనమున్ రూపొర్చు నస్త్రంబులై

జితగూడున్; ధృతిమాలినీ మకరముల్ చక్రాంకుడు బ్రత్యర్థులన్;
స్తుత కీర్తిం గనె జృంభకంబుఁ; గనుఁ దన్మోకం బగున్ వీరణ
ప్రతిఘాతం; బివి యెల్లఁ దత్సుతు లనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 563

సౌమికల్ నుగ్గొనఁజెంచుఁడూ! ప్రశమనంబున్, వీరణంబున్; విధూ

తము వైరిన్ గిరవాటువెట్టఁగలుగున్ దౌ దవ్వుగాఁ; జాల పం
తమునుం జూపెడునట్టి కామరుచియున్, దర్పారి విధ్వంసలీలవి
త్రమునౌ నా కరవీర మట్టివే! యనెం దన్మౌని; రామప్రభూ! 564

నిపుణుం డైన కృశాశ్వుఁ డిందఱను గాంచెం బుత్త్రులన్; వారలున్
వ్యపదేశంబుగ నిట్టు లానగములై వర్తిల్లి యున్నారు; నీ
కుప దేశించెద నంచుఁ జేసె మునియున్ యుక్తంబుగా వానిపొ
నుప సంహారక మంత్ర బోధనల నెంతో శ్రద్ధ; రామప్రభూ! 565

ఉపసంహారక మంత్రముల్ సయిత మెంతో శ్రద్ధ శిష్యుం డాగిన్
జపమున్ సల్పఁ దదీయ దైవతములున్ సాక్షాత్కృతం బయ్యెఁ; సం
తపనోద్భాసుర దివ్య తేజ విలస త్తత్తనూ దృప్తులున్,
గృప నర్థించిరి జ్ఞాపకుం దెలిసి భక్తిప్రౌఢి; రామప్రభూ! 566

అలుకల్ మోపయి యున్నతంబు నయి వెల్వారంగఁ గన్పించుఁ గొం
దలు [394]వైశ్వానర కోరకంబు లన సౌందర్యంబునన్ మీఱఁ, గొం
దలు సూర్యేందు తనూ విలాసముల నొందం గాంతి దైవాళి, కొం
దలు ధూమచ్ఛట లట్లఁ దోఁచితిరి [395]సౌందర్యాన; రామప్రభూ! 567

కని వా రెల్లరు జ్ఞాపకుం, దగ నమస్కారంబులం జేయుచున్,
వినయంబున్ నయమును బెనంగొనఁగఁ బేర్మిం గొల్పుచున్; 'దేవ! మ
మ్ము నెదన్ మీరు స్మరించినారు ప్రణయంబుం జూపి; మే మిందు వ
చ్చినదానన్ సెలవిందు కార్య,' మని యుత్సేకించి; రామప్రభూ! 568

394 కృష్ణాధ్వని; 395 యంచం బొంచి;

మిము నాహ్వానము సేసినప్పు[396]డు తమిన్ మీ రెల్లరున్ వచ్చి సా
యము సేయన్వలె నాకు నో! విబుధులారా! ప్రస్తుతం బేమియున్
దమతోఁ గార్యము లేదుగాన నరుగన్ ధర్మంబు మీ మీదు చి

త్తములంబట్టి యటంచు వీడ్కొలిపె మేత్రం బట్టు; రామప్రభూ! 569

కము లా పిమ్మటఁ ద త్సహోదరులు విశ్వామిత్త్రు వెంటం బ్రయా
ణము సాగించుచుఁ గొంతదూర మరుగంగా, నొక్క భూభృత్ప్రదే
శము, మార్గంబున వారికిం దగిలెఁ; ద త్సామీప్య[397]మున్ దర్శనీ
యముగాఁ దోఁచును దోఁప నందు నొక యుద్యానంబు; రామప్రభూ! 570

మునివెన్ జ్యేష్ఠుఁడు మౌనివర్యుఁగని, 'మేనుల్ జల్దరింపంగఁ జే
[398]సెడి ఘోరాటవి దాఁటివచ్చితి; మిఁకన్ వృక్షాళి మేఘాళిఁ బో
లెడు రీతిం గనుపించుచున్న దట నెంతే రమ్యమై జింక లా
డెడు నాటల్; దెలుపుం డదేవనమొ! స్వామీ! యంచు; రామప్రభూ! 571

జన సంచారము లేనిచోట, విటులన్ శ్రావ్యంబుగాఁ బాటలన్
వినిపించున్ [399]శుక శారికావివి, మనోవిస్తారమున్ [400]సల్పుచున్;
ఘన పుణ్యాశ్రమ మిద్ది యెవ్వరిదియో! గావచ్చుఁ; జెప్పంగ వ
చ్చునె మీకుం? దెలియంగఁ గోరు; దని శిష్యుం డాడె; రామప్రభూ! 572



---

396 వెలమిన్; 397 మై; 398 డు, 399 విక; 400 గూర్చుచున్;

"బుతధామంబు కొంతకాలమందునఁ దపో వృద్ధి ప్రసిద్ధుఁ గనన్,
[401]నుత మష్టాంగక యోగమున్ బహుయేసున్, నూల్కొన్న చిత్తంబుతో
శతకోట్యబ్దములుండె నిం" దనుచు, విశ్వామిత్రమౌనీంద్రుఁ, డా
గతి, శిష్యాగ్రణికిన్ జెప్పెను కథంతం బూనె; రామప్రభూ! 573
రమణన్ వామన రూప ధారణము పేరం దొల్లిటన్ దేవకా
ర్యము సాధించిన యాదటన్ నయిత మవ్యక్తుండు [402]నిచ్చోటనే
యుమరన్ వాసముచేసె; నట్టులె, తప స్సంసిద్ధికై కాశ్యపో
త్తముఁ డిం దుండెను పెద్దకాల; మనియెం దన్మౌని; రామప్రభూ! 574
ఇది సిద్ధాశ్రమ మంచుఁ బేరుఁగొనె, నా యీ సిద్ధి సం[403]పాదన
ప్రదమౌ హేతువు[404]చేత; విష్ణువు తపోవర్తిష్ణు డిందైన స
మ్మద కాలంబునసే మహేంద్ర విజయోత్పాతంబు సాధించె దు
ర్మదుఁడై యా బలి; యంచుఁ జెప్పఁ దొడఁగెం దన్మౌని; రామప్రభూ! 575
బలి తా మున్ను మహాహవంబు సలుపం బ్రారంభమున్ జేయ, ది
వ్యులు, బర్హిస్సును వెంటనంటి చని, యా పూజ్యున్ మహావిష్ణునిన్
గొలువం జేరి, 'క్రతూత్తమంబు సలుపం గ్రూరుండు వైరోచనుం
డెలమిన్ దేవ!' యటంచు బల్కి; రని మౌనీంద్రుండు; రామప్రభూ! 576
తమకిష్టంబగు నెద్ది, యర్థు లడుగన్ దైత్యుండు తాఁజేయు దా
నము సద్దానిని వారికీ మనుమ నన్మాశ్యుం; ద్వరన్ దేవ కా
ర్యము చక్కంబడఁ బోయి, యందుఁ దమ మాయా శక్తిమై వామన
త్వమునుం జూపుఁ, డటంచు వారని రనెం దన్మౌని; రామప్రభూ! 577
చని యా యధ్వరమందునన్ వినయ యాచ్ఞా శీలముల్ మీఱ, వా
మన రూపంబున నున్నమీరు, మన సామ్రాజ్యంబునేగాక, యీ
చన ముల్లోకములన్ గహించి, పున రస్మత్పౌష పట్టోద్ధృతి
ప్రణుతిం గొం; దని వారు వేఁడి రనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 578

401 స్తుత చొప్పడ చిత్తంబు; 402 తా నిచ్చటే; 403 సాధన; 404 వల్ల; 405 యొక్కపుట; 406 దాని నర్థు; 407 నమమా;

విని తత్ప్రార్థన "మట్టులే" యని మహావిష్ణుం డదట్లుండె; నా
యన కృష్ణోక్తి సముంతు కశ్యపుఁడు భార్యా యుక్తుఁడై యిచ్చటే
ఘనుఁ డా కాలమునందు సల్పి తపమున్ ముక్తాఘుఁడై విష్ణు ద
ర్శనముం గాంచె; న యంచు శిష్యున కనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 579

కని శ్రీవిష్ణుని గాశ్యపుండు, కుతుకాక్రాంతుండు, "నారాయణా!
ప్రణుతాభీష్ట తపోమయుండవు, తపః ప్రాయస్స్వరూపుండవున్,
ఘన సుశ్రీక తపో నికాయమువు, నీ కత్యయ్యమౌ నక్షరం
బు నగున్ జీవ, మటంచుఁ జేసెను స్తవంబున్ భక్తి; రామప్రభూ! 580

నిను దర్శింపఁగఁగల్గుచుంటిమి మహానిష్ఠం దపశ్చర్యచే
తనె; నీ దేహములో సమస్త జగముల్ దర్శించుచున్నాము; నీ
వు నసిర్దేశ్యుఁడ; వాని మధ్యములు నిర్వ్యాఖ్యాంతమున్ నీకు లే
వని, నిన్ దిక్కని వేఁడుచుంటి, మనెఁ దా నా మౌని; రామప్రభూ! 581

ముని సంప్రార్థన దేవదేవుఁడు వినెన్; మోదిల్లె; నో కాశ్యపా!
నిను జేసెన్ ఘనముల్; వరంబు నీక నే నీ కీయ యోగ్యుండ; వం
దున నీ కిత్తును వేఁడుమీ! వర మనెన్ తోషంబునం గాశ్యపుం
డును, లోకార్థము దాసునై వరము వేఁడున్ విష్ణు; రామప్రభూ! 582

వరమా దివ్యులు మున్ను వేఁడికొన, మా వంతయ్యెఁ బ్రార్థింప దే
వరవారిక ప్రకృతంబు; వేల్పులకుఁ దోడ్పాటౌట యుక్తంబు సు
స్థిర వాత్సల్యము మీఱ మీ, రనుచు వాసిం బాసి మున్ వారినిన్
బెరిమెం బ్రోవఁ దపస్వి వేఁడె; ననెఁబేర్మిన్ మౌని; రామప్రభూ! 583

"నిను నెల్లారముగోరునట్టిపరమున్ [408]నిక్కంబుగా నీ దగున్;"
మొనయంగావలె నీవ యీ యదితికిం బుత్త్రుండవున్ గోత్రభి
త్తునకున్ భ్రాతవునై; నిలింపు లిపు డార్తుల్ గాన, వేగంబ లె
మ్మనె యా కాశ్యపుఁ డర్థి వేఁడె ననె నిజస్వామి; రామప్రభూ! 584

408 నేస్తంబుమై;

చినుచుం గాత్కృపుం డ్రాఖ్యసంయుసు. మహావిష్ణుంటు హృష్టాత్ముం డై
యనుమోదంబును జూపె దానిని; నతం డద్దాని కానందమున్
గనుచున్, "స్వామి భవ త్కృపం బడసె నింకన్ సిద్ధి యిచ్చోట నా
ప్రణిపాతం;" బనె నంచు, శిష్యన కనన్ బ్రహ్మన్; రామప్రభూ! 585

తన క్రవ్యాద నిషూదన ప్రవణ సందర్భంబుతో నొప్ప, త
త్ప్రణుతాభీప్ష తపంబు సిద్ధిం బడ సెన్ ధన్యంబుగా నందుం; గా
వున సిద్ధాశ్రమ మద్దియో సను మునిన్ భూజానియున్ మెచ్చెం; బొం
దెను ద న్నామమె యద్ది యం చనియె గాధేయుండు; రామప్రభూ! 586

ఆటు తర్వాత సతోషణుం డ ని తి గర్వా క్షిన్ జనించెం గగన్
గిటి తై; పిమ్మట యజ్ఞ క ర్తను బలిం గిట్టెన్ మహాశాంబరీ
పటుత్రై యాచ్చనకు; మూండు పాదముల విశ్వం గోరె లోకాళి కు
త్కట బాధం దొలంగింప; నంచు గురుం డింకం జెప్పె; రామప్రభూ! 587

ఇనమున్ మెచ్చ, నను స్త లోక హితమున్ సంధిల్లం దా నొంగె మె
ప్పున [409] ఖర్వుండు త్రిపాద ధాత్రి; బలిసెన్ మల్లోకములి మీఱి దా
నను; దైత్యుం దన కాంతి పెంపముల బంధ ప్రాపితుం జేసె; శ
క్రునకుం [410] జేర్చె సను స్త రాజ్య మని యన్నున్ జూని; రామప్రభూ! 588

ఇమలం బ్రోవంగ నర్థియై నిరఖమానోత్కృష్ణుం డైనట్టి దే
వర, యీ యాశ్రమ వాటి, శాంతి నిలయప్రఖ్యా స్వరూపంబు, ని
ర్భర మోద ప్రద మంచు వామనుండుగా వాసముం [411] దా నుండె; ను
ర్వరలో నిద్ధియె గ్లాంతి నాశని యనెన్ బ్రహ్మన్; రామప్రభూ! 589

శ్రమ సంహారిణి యిద్ది గాపున నిటన్ శ్రద్ధా [412] ప్రతీషన్ నివా
సము నేంజెట్టితి భ క్తి నంస్కృతులతో; సంబాధన ప్రౌఢం లా
శ్రమమం జొచ్చుచు రక్కసుల్, ఒలిచి నా జన్నంబు, నిత్యంబు వి
ఘ్నము గావింత; రటంచు [413] గాథిజుండు వక్కాణించె; రామప్రభూ! 590

409 హ్రస్వుండు; 410గూర్చె; 411దాఁజేసె; 412 ప్రతీలిస్, ప్రతిజ్ఞన్;
413 చుం గౌశికుండు;

చలమున్ మానక రాక్షసాళి నిటనే సంహారముం జేయఁగాఁ

ఫలఁగంగా వలెఁ బుత్త్రి! పోవుద మిదే సిద్ధాశ్రమంబుం జేరన్;
దలఁపంగాఁదగు నాదియైనటులె, సిద్ధ ఖ్యాత మీ యాశ్రమ
స్థలమున్ నీ దని కూడ, నంచుఁ బలికెం ద న్మౌని; రామప్రభూ! 591

పలుకుల్ పొంతముగాకముందె, ముని విశ్వామిత్రుఁ డా యాశ్రమ
స్థలిఁ జొచ్చెం దన శిష్యులం గొని; యవశ్యాయంబు వీడంగనే
చలివె ల్గొందుఁ బునర్వసూ గణ లస త్సుందర తేజంబును న్
దలఁపించెన్ మునిచంద్రముం దపుడు, చింతల్ వాసి; రామప్రభూ! 592

మునినిం జూచియుఁ జూడఁగానె యెదురై మున్మున్నె యర్ఘ్యాది పూ
జనలన్ సల్పిరి సిద్ధవాసు లుచిత స్థాయిన్; గురుం గూడి వ
చ్చిన యా వీరుల కర్ఘ్య సత్కృతులునున్ శీఘ్రంబుగాఁ గూర్చి యొ
ప్పునఁ బీఠంబుల నుంచఁ జేసిరి ముదంబుం జూపి; రామప్రభూ! 593

శ్రమముల్ దీఱెనా! లేదా! యత్తఱిని వ్యాఘ్రప్రాయుఁడై తోఁచు సు

త్తమ మౌనిం గని రాజనందనులు జోతల్ గూర్చి, 'బ్రహ్మర్షి స
త్తమ! నేఁ డిప్పుడె పొందుఁ దధ్వరము శ్రద్ధా దీక్ష సార్థం బగున్
దమ సిద్ధాశ్రమ సంజ్ఞ దీని, కని రుద్యద్భక్తి; రామప్రభూ! 594

శ్రుతవంతుండగు మౌనియున్ శ్రుతపడెన్; శ్రోతవ్యమై శత్త్రి సం
తతి యా యాడిన [414]దాని నెమ్మదిని సంధానించి యోజించె; ని
ర్జిత సర్వేంద్రియుఁ డా మహామహుఁడు నర్చిష్మంత తుల్యుండు, దీ
క్షితుఁడయ్యెన్ యజితిం బొనర్ప జగతీ క్షేమార్థి; రామప్రభూ! 595

సుతులౌ స్కంధ విశాఖులం దలఁపునందుం దెచ్చుచున్, జాగరూ
కతతోఁ బుచ్చుచుఁ ద న్నిశిన్ దశరథ క్ష్మాపాల జైవాతృకుల్,
గతియింపన్ నిశి, వేకువన్ జలకముల్ గాయత్త్రినిన్ సల్పి, శు
ద్ధతతో జూడఁగఁబోయి రా గురునిఁ బ్రాత స్సంధ్య; రామప్రభూ! 596

---

414కేరు;

జనదస్ వేకువవేళ లేచి, తొలిసంధ్యోపాసనం దీర్చి, భ
క్తిని గాయత్రి జపించి, హవ్యమును వగ్నిన్ వేల్చి, కూర్చున్న యా
తని గాధేముని, రాజనందనులు సందర్శించి మందస్మితిన్
ప్రణిపాతంబును గూర్చి నిల్చితిరి తాత్పర్యాన; రామప్రభూ! 597



-30-

క్రతు దీక్షం గొను నొజ్జతో నపుడు పల్కన్ రాదు తా ముందు నౌ

చితినిన్ నేర్చిన రాచపుట్టువులు వారిం గూడి, యందున్న మౌ
ని తతిం గన్గొని, 'పుణ్యు లార! యసురానీకంబులుం దేర్ప నే
గతి నెం దుందుము మేఁ?' యటం చడిగి రాఁ గందెల్ప; రామప్రభూ! 598

ముని యజ్ఞంబు సురక్షితం బగుటకై మున్ముందె గీనాశులన్
గనిపట్టం గడు సిద్ధమౌఁ గొమరులం గన్గొన్న మౌనీంద్రులున్
మన ముప్పొంగఁ, 'గుమారులార! యసుర వ్రాతంబు లే వేళ నై
నను రావచ్చును;' జెప్పతేమనిరి నిర్ణాయాన; రామప్రభూ! 599

కనుకన్ సోదరులార! యీ సవనమున్ గాపాడ మీ కౌను నా
ర్దినముల్ నేఁడు మొదల్; ధనుర్ధరులుగా దీపించి రక్షస్సులన్
రణమందున్ హత మార్పఁగల్గుట కహోరాత్రంబు లిం దుండనన్
గనుపెట్టన్ వలె; నంచుఁ దెల్పితిరి, కాంక్షల్ వారు; రామప్రభూ! 600

రణ ధీరుల్, మునిశిష్యు, లా యయిదహోరాత్రంబులున్ నిద్రరా
చినదే గాపుగఁ గాచినారు గురు సంశ్లేమార్థులై యజ్ఞమున్;
మన మారంగ యథా విధిన్ సవన మే మాత్రంబు భంగంబు నొం
దనిదై సాగుచునుండె, ఋత్విజులు శ్రద్ధం జూప; రామప్రభూ! 601

కనుచున్ న ల్దెసలందుఁ గాపుదలగాఁ, గన్గల్గి మెల్గాడు ల
క్ష్మణ! యీ యాఱవప్రొద్దుకూడ, మనమింకన్ వ్యగ్రమైయుండ మీ
ఊన సన్నద్ధత, నంచు నగ్రజుఁడు నొర్మిం బల్కు నాలో, ధ్వనుల్
వినిపింపన్, దివి ! బద్ధలయ్యెనా! యసస్ వ్రేఁగొంది; రామప్రభూ! 602

ఒకటం బాపులు; దర్భలున్ సమిధలున్ హోమార్థముల్, పానపా
త్రికముల్, పెక్కులు హోమనిపాత్రములు, వేల్మిన్ ద్రవ్య సర్వస్వ మం
టకొనెన్ భగ్గన; మంటలున్ పంతభుగాటోపంబునన్ రేఁగె; వా
క్షుతమున్ సావిని మాయమయ్యె అలమెన్ రోదస్సు; రామప్రభూ! 603

షన మాయాభ్రమము లిట్టు లట్టు కడు వేగం బర్వుచుండంగ, జో
రున మారీచ సుబాహువుల్ గురియు నెత్తుల్ వెల్లువల్ గట్టుచున్,
ముని హోమ్యోంచిత వేదిమీఁద,యదునేమో! యన్న యవ్వేళ, భ
గ్గన లేచెన్ మఱియింతగా నలము కృష్ణాధ్వుండు; రామప్రభూ! 604

విసువేధిం బిరుగాడు నా యసురులన్ భీష్మంబుగాఁ దేఱిమా
చిపదే చూపుగఁ జూచె దాశరథి, యచ్చిష్మచ్ఛిఖల్ గ్రక్కుచున్;
దనుజుల్ దూఁకఁగఁ దోవుచుండి రపుడే దర్పాన నా రాజనం
దనులం దాఁకఁగ, భూమిపై నిలిచి యుద్ధప్రీతి; రామప్రభూ! 605

పదలెన్ రాఘవుఁ దప్పుడే పరమ భాస్వంతంబు, నిర్ఘర్షణా
స్పద సిద్ధాత నికాశ మానవ మహాస్త్ర శ్రేష్ఠ మా జ్యేష్ఠుపై,
సెదుతో మ్మొక్కమెయిన్ విదారితముగా; నేసెన్ సుబాహున్ భయ
ప్రద మాగ్నేయముతో సుకంబుఁ దునుపన్ రంహస్సు; రామప్రభూ! 606

సుడి, మేఘంబుల నెట్టివేయుక్రియగాఁ, జోద్యంబు[417] మారీచునిన్
పడిగా నెత్తెను మానవాస్త్రము నకూపారంబునం గూల; న
ప్పుడు చేష్టల్ సెడి, చిర్దిరం దిరుగుచుం బొంగారు సంద్రంబులో
బడెనేగాని గతింపఁ డాయెను రణ[418] ప్రౌఢుండు; రామప్రభూ! 607

కనులన్ మూసియు విప్ప లోపలనె వేగం బోయి యాగ్నేయ మా
దనుజుం గాల్చె సుబాహునిం; బ్రిదిలి యాతంపున్ ధరం గూలినన్
గని, యా సోదర యుగ్మ కానుచరు లాఁగన్ రానివారై పలా
యన సూత్రంబుఁ బఠించి రెల్లరు నధైర్యం బొంది; రామప్రభూ! 608

కని, యవ్వారలు పర్వఁ ద్రొబ్బెదరై కౌసల్యకున్ [419]సూతి, (ల,
క్ష్మణ! క్రూరుల్ సుమి! యీ నిశాచరులు, దుష్టస్వాంతు, లంహో భుసుల్,
మనుజాసృగ్భుజు, లిట్టివారల నిఁకన్ మన్నింపరా;" దంచుఁ బం
పెను నాగ్నేయము నేసి విప్రులను సంప్రీతిల్ల; రామప్రభూ! 609

---

415గాపుగడగా; 416పట్టెల్ల; 417వు; 418 ప్రౌఢుండు; 419 కుం బట్టి;

కనుము లా ద్రక్కొముఁ గాని యద్భుతమునన్ మున్ మున్గి తర్వాత హ
స్తమునం బొంది [420]క్షపాట [421]సంహరణు గోత్రారిన్ సురల్ వొజె, న
ర్పసద్మో [422]మొంచిరి రాఘవున్; [423]శమము నాశల్ వొందె; జన్నంబు నొం
దెను క్షత్రియ సమాప్తి, ఆట్టుల సురల్ దీవింప; రామప్రభూ! 610

పితృపాదుల్ నినుఁ బంపినట్టుల, యశస్వీ! నీవు నా కార్యమున్
సల పీరన్ నెఱవేర్చినాఁడ; విదియొందున్ నేఁడు సిద్ధాశ్రమ
స్తుత నామాంచిత సార్థకత్వము; గృతార్థుండైతి నీవల్ల; సం
చిత పుణ్యుండవు కౌసలేయ! యని మెచ్చెన్ మౌని; రామప్రభూ! 611

420 నిశా; 421 సంహరుని; 422 లన్; 423 శమన మాశల్;

—౩౧—

అమితానందులు రాఘవుల్ దమరి ధన్యత్వంబు భావించికొం
చు సుపిన్, హాయిగ నాఁడు పుచ్చిరి తముస్సున్ సౌఖ్యమౌ నిద్రలోఁ;
దమ[424]తాచార పరంపరీణముగ యుక్తంబైన పౌర్వాహ్ణిక
క్రమ సత్కృత్యము లాదటన్ నెఱపినారల్[425] శ్రద్ధ; రామప్రభూ! 612

గురు [426]సంసేవన సాధనార్థమును, దక్షుం గల్గు నా సంయమో
త్కర సంపన్న సమాగమార్థమును, నైక్ష్వాకుల్ [427]దగం బోయి కాం
చిరి వైశ్వానర తేజు, గాథిజ మహర్షిన్; వెంటనే వారు చాఁ
గిరి బ్రహ్మర్షికి; వంగి రెల్లరకు భక్తిన్ మ్రొక్కి; రామప్రభూ! 613

పర గంభీర మనోహర స్వరములన్ [428]వందారుచున్ వారు "కిం
కురు లింకం దమ కేమి సేయనగునో! కార్యంబు మీ రానతి
త్తురె దేవా!" యన, మౌను లెల్లరును సంతోషించి దీవించి రా
దరమున్ మేదురమౌ నటుల్ గొమరులన్ దర్శించి; రామప్రభూ! 614

గురు గాథేయుని యాన చొప్పునను బల్కున్ మౌని యొక్కండు; "స
త్వరమే యేఁగుచునుంటి మెల్లరమునున్ ధర్మిష్ఠమౌ యజ్ఞమున్
వరలన్ సల్పుచునుండె నా జనకుఁ డన్ వార్తల్ వినంబట్టి; వ
త్తురె? సోదర్యులు మీరునున్ మిథిల మాతో," నంచు; రామప్రభూ! 615

రమణీయం బగునట్టి యొక్కటె ధనూ రత్నంబు దేదీప్యమా
నమునై త స్నృపునొద్ద క; ద్దదియుఁ గానన్వచ్చు తేజః ప్రపూ
ర్ణమునున్, భీ ప్రద మౌచు; సోదరులు మీరల్ దానినిం జూడ యో
గ్యము; రండీ! యనె మౌని, యౌ ననుచు నిష్ఠా [429]పూర్తి; రామప్రభూ! 616

---

424 కున్ వంశ పరంపరల్ విధి నియుక్తం; 425 వారు; 426 పూజావిధి, పూజావిక; 427 వడి 428 న; 429 పత్తి;

మును పొక్కప్పుడు దేవరాతుఁడు మహాపూజ్యంబు యజ్ఞంబు సే
సెనుగాదే! మిథిలాధినాథుఁడయి; యిష్టిన్ మెచ్చి యవ్వాని కా
ఘనపున్ యజ్ఞఫలంబుగా నొసఁగి రా దైత్యారు; లా విల్లు శం
భుని విల్లంచును మౌని చంద్రముఁడు చెప్పెన్ గాథ; రామప్రభూ! 617

అదియున్ మైథిల మందిరంబుల మహార్హ స్థానముం గాంచి, యి
ప్పిదమౌఁ బూజల నాదినుండియును పేర్మిం బొందుచున్నట్టి; దీ
యదనన్ నిత్యము గంధ పుష్పచయ దీపారాధనల పొందు దా
ని విద్రుషక్ నెఱివేలఁ జూత మనె మౌని స్వామి; రామప్రభూ! 618

నవరాత్రంబులు నాయుధార్చనలలోనన్ దానిఁ బ్రత్యేక గౌ
రవ సంపత్తిని బూజసేయుదురు నేర్పం దేజాల రా దేవదా
నవ గంధర్వులు యక్ష రాక్షసులు నా నాణ్యంపు విల్ మోప; మా
నవులం జెప్పఁగ నేల? యం చనియెఁ ద న్మాన్యుండు; రామప్రభూ! 619

బయిసన్ దానిని బూన్పఁగోరుచు మహాహంపూర్వికన్[480] భూపతుల్
ప్రయతింపన్ విఫలార్థులైరి, బల సంపన్నాఢ్యులై యుండియున్;
స్వయమాగంతువునై త దద్భుత ధనుస్సారంబుఁ జూడంగ రా
వె? యటన్ రాఘవుపైపుఁ గ న్గొనుచు మౌనీంద్రుండు; రామప్రభూ! 620

వనకేష్టం గనుఁగొన్నవారలమునున్, శశ్వద్ధనా రాజమున్
మనమారం గనుఁగొన్నవారలమునై, ప్రాపింపఁగాఁ జన్న ట్లో
చన మన్నన్, గుశికాన్వయుం గనుచు నేత త్స్మరఘుంబట్టె. తా
మును భ్రాతల్ చెఱినవ్వఁ జూపఁ, బయనంబుల్ గూరె; రామప్రభూ! 621

వన బృందారకు లందఱన్ మొదట నాహ్వానించి గాధేయుఁ "డో!
వన దేవాధికులార! యిందు సుఖులై వర్థిల్లుఁడీ! కార్యసి
ద్ధిని నే నొందితి; వీడిపోదు నిపు డీ దివ్యాశ్రమావాస భూ
మి. నటంచున్ వని వీడుకోలు పలికెం బ్రేమాస; రామప్రభూ! 622

480 బార్థివుల్;

పసుపుం దుందుడు గాంగ కూలక హిమ వ్యూహంపుఁ గ్రాంతంబునం
దున నే, నంచు వనాధిదేవతలకున్ స్తోత్రంబులం బెక్కు వ
ల్కిన గాధేయుఁడు, శిష్యులన్ మునులు భక్తింగొల్వ, సిద్ధాశ్రమం
బునకుం జేసెఁ బ్రదక్షిణంబు నెన రుప్పొంగంగ; రామప్రభూ! 623

దని రా యెల్లరు నుత్తరాభిముఖులై, సంచారముల్, పీఠిహో
త్రుసిపెల్లన్ శతచక్రపాదములపైఁ దోతేరఁగా వెంట, నం
తన సిద్ధాశ్రమవాస పక్షి మృగ సంతానంబు వేవేగ దా
రిని వెంటాడెను గుంపు గుంపులయి పేర్మిం జూచి; రామప్రభూ! 624

మునియుం జూచుచు వెంటనంటుకొని గుంపుల్ గట్టు నా జింకలన్;
గనియెన్ బారులుదీరి మింట నెగురంగానైన యా పుల్గులన్
దన వెంటం జనుదేరుచుం; దుదకు నాతం డెట్టులో వానినిన్
బనిపెన్ వెన్కకు, వీడుకో ల్వలికి ప్రేమం బార; రామప్రభూ! 625

నియతన్ వారు సుదూరమున్ నడచి శోణ ప్రాంతముం జేరు వే
ళయు, సూర్యాస్తమయంబు నొక్కటయి పర్వెన్ సంజ కెంజాయలన్,
పయనం బప్పటి కాఁపి, యచ్చటనె యామ్యంబుచ్చునుద్దేశ మెం
తయు నవ్వారికిఁ గల్గెఁ, దీరునని[481] యధ్వ శ్రాంతి; రామప్రభూ! 626

అపు డా శోణ నదంబునన్ మునిఁగి హోమాదుల్, శుచిత్వంబునన్
దపముల్, దాము ముగించి, యిప్పటికె సంధ్యావేళయుం దాఁటఁగా,
సుపవేశించిరి గాధి నందనున కెంతో భక్తిమై, చుట్టుచు
ట్టి పరివార సమేతులై మునుఁడు, పాచింబట్టి; రామప్రభూ! 627

ఒనరన్ దాశరథుల్ విశుద్ధతలు, సంధ్యోపాసనల్ సల్పి, త
న్ముని సంఘంబున కెల్ల మొట్టమొదటన్ మ్రొక్కుల్ సమర్పించినం
తన, పాదాభినతుల్ బొనర్చిరి మునీంద్ర శ్రేష్ఠుఁ డౌ గాధినం
దనునిం జేరుచు, నాదిముఖ్యములు ప్రాప్తం బౌట; రామప్రభూ! 628

481 వర్త్మ, పథ్య;

అమితానందము గూర్చుచున్నయది, యీ ప్రాంతంబు శోభాయమా
నమునై; యెవ్వరి దేశమో యెఱుఁగఁగా నా కయ్యెడున్ వేడ్కఁ; యని
చు ముదానన్ రఘువీరుఁ [432]దన్న, ముని, వాచోయుక్తి, గాధేయుఁ, డా
శ్రమి, త ద్గాథయుఁ జెప్పె నిట్లు కడు నుత్సాహించి; రామప్రభూ! 629



---

432 బాడ;

ముని పొక్కప్పుడు బ్రహ్మ మానస లస త్పుత్త్రుండు, తాపస్య వ
ర్ధనుఁడున్, బ్రహ్మజగంబువాఁడు, కుశుఁ డూర్ధ్వం బైన త ల్లోకమున్
మనసై వీడి, యిహంబుఁ జేరుకొనె, ధర్మజ్ఞుండు, ధీరవ్రతుం
డు, నటంచున్ మును వాని [433] గూర్చి కొనియాడున్ మౌని; రామప్రభూ! 630

అతఁ డా వెన్క మహాకులీనను వివాహం బయ్యె వైదర్భ స
త్సుత, నంచున్ ముని యాడి, యాడెఁ గడు నౌత్సుక్యంబుమై, వారికిన్
సుతులుం బుట్టఁ, గుణాంబు డంచుఁ బ్రథమున్ శోభిల్లఁగా బిల్చి, య
ద్భుతునిన్ రెండవవానిఁ బిల్చి, కుశనాభుం డంచు; రామప్రభూ! 631

అనిమేషీయబలుం, డధూ ర్తరజసుం డన్ వాఁడు త న్మౌనిచెన్
జనియించెం బిదపం ద్వతీయ సుతుఁడై; శౌర్యోన్నతుండైన త
జ్జనకుం డొందెను బుత్త్రిగా పసు వనన్ శశ్వద్గుణుండైన యా
తనినిన్ నాల్గవవానిసైల; మని నేత న్మౌని; రామప్రభూ! 632

నలువుర్ పుత్త్రిలు దండ్రితో సము లనన్ నల్వారుచున్, సత్యసం
ధులు, నుత్సాహులు, ధార్మికోత్తములు, పండ్యుల్, సద్గుణోద్భాసులున్
బలు తేజస్వులు నైన, క్షత్త్రియ సుధర్మంబున్ సుతుల్ పూనఁగాఁ
దలఁచెం దండ్రి; యటంచుఁ దెల్పెఁ దొడఁగెం దన్మౌని; రామప్రభూ! 633

ఇల నా నల్వురకున్ సమానముగఁ దా నేర్పాటు గావించి, పు
త్త్రిలకుం దండ్రి, 'భవ ద్విభాగముల నేర్పల్ మీఱఁగాఁ బాలనం
బులు సేయుం' డని, దానివల్లఁ గలుగుం బుణ్యం బనం, దండ్రి ప
ల్కులఁ బాటించిరి వార; లంచు నుతి సల్పున్ మౌని; రామప్రభూ! 634

---

433 నెంచి;

పితృ నిర్యాణన మొంది, పాలనములం బ్రీతాత్ములై, లోక స
మ్మతితో నేరికి వార లేలుబడి సల్పం గోరి, మున్ముందు వి
స్తృతమైనట్టిపి రాజధానులను దార్ శిల్పింపంగా నెంచి రా
తత ధీరాత్ము; లటంచు వారిం బొగడుం ద నమ్మౌని; రామప్రభూ! 635

జనముల్ మెచ్చం గుశాంబుండున్ నిలిపెం గౌశాంబీ మహా పత్తనం
బును దేజోమయ [434]మూర్తి; యంతం గుశనాభుండున్ వినిర్మించెం జ
య్యనం బట్టంబు మహోదయంబుం; దన ధర్మారణ్య మన్ బట్టణం
బును దమ్ముం డసు సృజించె; నంచుం దగం దెల్పున్ మౌని; రామప్రభూ! 636

వసు వన్ వాండు గిరివ్రజం బనుమం జేర్చర్ధిష్ణి యద్భుత
ప్రసరోపస్థితిం [435]గల్గ పట్టనము నిర్మాణంబు గావించె; నా
వసురా డ్రాజ్యములోనిదే మనము క్షేమం బారం గూర్చున్న యీ
వసుధా ఖండ; మటంచు వాకొనియె నా బ్రహ్మర్షి; రామ ప్రభూ! 637

నిజ దేశంబును జుట్టి యైదు శిఖరుల్ నిర్మాణ మౌటన్, గిరి
వ్రజ మన్ నామము రాజధాని గొనె నీ రాజ్యంబునం; దుర్వికిన్
స్రజమై పెన్ జడలోన, సాగు కరణిం గన్పట్టు శోణంబు తా,
నజరంబౌ, ననె మౌని, త ద్గిరులలో నర్తాడి; రామప్రభూ! 638

అధిసంపత్ప్రదమైన శోణ నదమే యయ్యెం దలంపన్ సుమా
గధి యన్ నామముం దాల్చి టిచ్చటను; భాగ్యంబార నీ దేశ మ
త్యధిక ఖ్యాతిం గడింపం జాలె మగధ ప్రాఖ్యం దదీయార్థమే!
బుధులున్ మెచ్చ; నటంచు శిష్యులకుం [437]జెప్పెన్ మౌని; రామప్రభూ! 639

434 మూర్తి, నంత; 435 గన్న; 436 బిఖ్యన్మౌని; 437 నకుం;

వసురాజేంద్రుఁ మహత్త్వ కారణమునన్ వర్ధిల్లు నీ మాగధీ
ప్రస్ఫుతిన్, మేదిని సస్యశాలిని యనన్ రంజిల్లి సుక్షేత్రమై
ప్రసరిల్లెం; బయిగా సుభిక్షమును [438]భవ్యంబైన దేశంబుగాఁ
బరిరింపంబడు; నంచు శిష్యున [439]కనున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 640

తనయా! త త్కుశ తాపసోత్తముని బుత్త్రి ప్రేష్ఠఁ, దత్యంత ధ
ర్మ నిరూఢిం గుశనాథుఁ డయ్యెను ధరన్ రాజర్షి; యాతండు ని
ష్ఠని ఘృతాచిమణి గాఁగ నచ్చర ఘృతాచిం బొందె; నా జంటకున్
జనియించెన్ శత పుత్త్రికా చయ మనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 641

గుణ రూ పోజ్జ్వల యౌవనంబులకుఁ జేర్చుఁ దగ్గ యా పుత్త్రికా
మణు, లొక్కప్పుడు సొమ్ము లన్నిటని, గంధ వ్రాత పుష్పాదులన్
దున పూరంగ నలంకరించుకొని, శంపా వల్లరీ తుల్యలై,
వనిలోనన్ విహరింప నేఁగి; రనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 642

గుబురై యచ్చటనున్న చెట్ల నడుమం గూర్చుండి సంతోషమున్
సొబగున్ మీరఁగ, వీణలన్ మెలపుసంశోభిల్ల వాయించుచున్,
విబుధాసుల్ నుతియింప లాస్యమును గావింపంగ, సంగీతముల్
నిబిరీసంబయి తోఁచె; [440]నం చనియె మౌనీంద్రుండు; రామప్రభూ! 643

కళలం జిమ్ముచు శోభ పిసఁగఁ యంగ వ్రాతముల్ లాస్య భం
గులలోనం గనిపింప, గాల్కొను మొగుల్ గుచ్ఛంబులం దాఁటి తత్
తళలం గుల్కుడు జూక్క లట్లు, మది మేదం గన్పడం జొచ్చినా
రలు వా; రంచును దెప్పఁగాఁ దొడఁగె నా బ్రహ్మర్షి; రామప్రభూ! 644

అనిమేషం దనిలుండు వారిఁగని, డాయన్ వచ్చి, "యో! కన్యకా
మణులారా! మిము నే వరించితిని; ప్రేమన్ నన్ను పెండ్లాడుఁడీ!
మనుజాత్వం బిది వీడిపోవు నిఁక; దివ్యత్వంబు మీ కొందుఁ డ్రో
వన మక్షయ్యమునౌ; నటం చనె ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 645

---

438 దివ్యం; 439 ల కనున్; 440 నంచు నినదించెన్ మౌని;

మము నిట్లాడుట పాడియౌ నొకొ! జగత్ర్పాణుండవౌ నీ ప్రభా
వము నెవ్వార లెఱుంగ రయ్య! యెటు బోవన్ నీ ప్రసారంపు వి
క్రమమే దోఁచెడు; నడ్డు నీ వెఱుఁగ వే కాలంబు; నీ కెల్లరున్
సములేగాద! యటంచు వా రని రనెన్ సన్మౌని; రామప్రభూ! 646

వసనా! యా కుశనాథ పుత్త్రికలమే! మ మ్మేల? యీ రీతిగా
నవమానింపఁ దలంచినావు? భవదీయ ప్రాభవత్వంబు మే
మవకృష్టం బొనరింపఁ గల్గుటయెగా; దా యింద్రుపై నైననున్
జవ దీర్పంగల; మంచు వా రని రనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 647

అలుపాలన్ మన శక్తియుక్తుల నటుల్ వ్యర్థంబుఁగావింపఁగాఁ
దలఁపన్ రా దనిగాని, లేనియెడలన్ త్వద్బుద్ధి మా తండ్రికిన్
దెలుపన్ వెంటనె వచ్చి నిన్ను హత మొందించుం జుమీ! పోను మీ
దలఁపుల్ మా యెడ; నంచు వా రని రనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 648

చులుకం జూడకు మమ్ము; ధర్మము మన శ్శుద్ధిన్ విడం జాల; మి
మ్ముల మా తండ్రియె మాకు దైవ మగు; మమ్మున్ వేరికిం దండ్రి యీ
వలె నం చెంచునొ! వారినే పరమ దైవం బంచు మే మెంచుచున్
మెలఁగం గల్గుదు; మన్న వారి నుడి తా విన్పించె; రామప్రభూ! 649

కలిగెం గోపము పట్టరానియదియై; కారుణ్య కాలుష్యముల్
గలఁచెన్ గంధవహున్; మునీంద్ర సుతలం గారింపఁ గోరెన్ విధే
యల; సర్వావయవంబులం గౌరవణాఁడై బొచ్చె; వా రంతఁ గు
బ్జ, లనాకారలునై; రటంచు నుడివెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 650

అడుగుల్ సాగవు; సాగ యానము, విపర్యస్తంబులై మాటికిన్
దడఁబాటొందును బాదముల్, ముని సుతల్ దర్పంబుఁ గోల్పోవ; వా
రధలుం బొందుచు నెట్టకేలకు సవిత్రావాసముం జేరుచున్
బదమిం గూలి; రటంచు శిష్యులకుఁ జెప్పెన్ మౌని; రామప్రభూ! 651

కనియెం దాఁ గుహనాథుఁ డంపతిని శోకక్రాంతలన్, నష్ట శో
భనలం గూఁతులఁ, గుబ్జలన్, విగత సర్వశ్రేయ సౌభాగ్యలన్;
మన మల్లాడఁగఁ బామసించి యతఁడున్, "మాతల్లులారా! యిదే
మనె?" నంచున్ మని తెల్పెఁ దండ్రిదగు ప్రశ్నార్థంబు; రామప్రభూ! ౬౫౨

ఆపత్కృత్యాపరుఁ డయ్యెనెవ్వఁడు మహా హంకార చేతస్కుఁడై
యపరూపం బొనరించి మీకుఁ; ఐరు శేమైనం గదుంగ్రూరులై
యపరాధ ప్రతికూల ధర్మమును జేయంజూచిరే? యేత్తు; రీ
త్రప మానుం; డని యంటఁ దండ్రి, సుడిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౬౫౩



పరువుం గోల్పడి కన్నె లా పితృ లసత్ పాదంబులన్ ప్రాలి; 'యో!
గురుదేవా! జగ మెల్లఁ ద్రిమ్మరు మహాక్రూరుండు, [441]క్షిత్వంతుఁ, డె
ల్లరనున్ మమ్ము బలాత్కరించుటను నిల్లైపోయినా; మందు నే
ప్సిరి సుప్మీ! యని కౌశికుండు కొనియాడెన్ వారి; రామప్రభూ! ౬౫౪

కుల ధర్మం బవిలంఘ్య మంచనియు, నాకుల్ మాటునం దేమ పిం
చెలు స్వచ్ఛందము లెట్టులో ననియు, గీర్తిం గన్న మాతంద్రి ప
ప్పుల సంపాదనఁజేయు మం చనియుఁ, దన్నుం వేఁడ, వాఁ డిట్లు మ
మ్ములఁ గావించె; నటంచు నేప్సి రని చెప్పన్ మౌని; రామప్రభూ! ౬౫౫

తనయల్ పొందిన భంగపాటు నెఱిఁగెన్ ధర్మాత్ముఁ డా తండ్రి; యోఁ
జనఁ జేసెన్; సుతలం గనుంగొనుచు, 'దుష్ట స్వాంతులన్ సైఁచుటే
పనిగాఁ బూనితి; మీ ప్రవర్తనము గొప్పన్ మెత్తు; మీర్ [442]లోఁబడన్
జన; రోర్మిం గాని;' రంచుఁ బల్కె నవె, మెచ్చన్ మౌని; రామప్రభూ! ౬౫౬

క్షమయే భూషణ మేరికైనను; నశక్యం బౌను దుష్టాత్ములన్
క్షమియింపను; త్రిదివేశులే మఱియు దౌష్ట్యం బూన, శాంతం బశ
క్యము గాదా! నరు లూనఁ? గన్నియలె యేకంబై యిటుల్ వేల్పుల
క్రమముల్ సైఁచుట, తాను విం తనె ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౬౫౭

క్షమయే దానము, యజ్ఞమున్; క్షమయె యోగ్యంబైన సత్యంబు; ధ
ర్మములన్ ధర్మము కన్నెలార క్షమయే!; భ్రాజిల్లు నే వేళ ను
త్తమమైనట్టి యశంబుగా క్షమ; జగత్సర్వంబు రంజిల్లు నీ
క్షమయుం బ్రోపుగ; నంచుఁ దాననె ననెన్ శ్రాంతుండు; రామప్రభూ! ౬౫౮

[441] క్షేపణ్యు వె; [442] గొనన్;

పరువే మూర్తిగఁ గన్యకా మణులకుం; బాటించుచుం బెంచినా
రరయన్ మీరలు వంశగౌరవము నమ్మా! మీ క్షమా శక్తి న

ల్పురు మెచ్చం దగియున్న; దంచుఁ, గుశనాభుం దంత, నాకూఁతు లె
ల్లర నోదార్చె; నటంచు శిష్యుల కనున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 659

తరువాతందన మంత్రి సత్తముల నాతం డొయ్య రావించి, యె
వ్వరి కీ కన్యల నిచ్చి చేయవలయున్ వైవాహికం బంచనున్,
వెరయంగా నెపు డెందుఁ బెండ్లి సలుపన్ వీలౌనాకో! యంచు, వా
విరిగా మంత్రణముం బొనర్చె నని చెప్పెన్ మౌని; రామప్రభూ! 660

అదియే కాలములో సదాచరణ భాగ్య [443]శ్రేష్ఠుఁ డొక్కండు, సౌం
పు దలిర్పంగల యూర్ధ్వరేతసుడు, నొప్పున్ జూళి యన్ బ్రాహ్మణుం
డుచిత శ్రౌత తపో[444]గరిష్ఠుఁ; డత డెంతో నిష్ఠమైఁ బూనె ను
ద్యద్దభిఖ్యం దప మంచుఁ జెప్పఁ దొడఁగెం దన్మౌని; రామప్రభూ! 661

విదిత ప్రఖ్యయు నూర్మిళాఖ్య యగు దన్వీపుత్రి, గంధర్వజా
త్యుచిత శ్రేష్ఠ, తపస్వి చూళికిని జేయుం బ్రీతితో సేవ సో
మద యన్ గన్యక నిత్యముం, దనకు బ్రాహ్మణ్యంబునన్ భక్తి సం
పద పెంపుంగ; నటంచుఁజెప్పఁదొడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 662

మునియౌఁ జూళి తపఃప్రసిద్ధుఁ డయి సమ్మోదంబుతో నొక్క నాఁ
డనిదంపూర్వ కుతూహలాకలితుఁడై యా సోమదం జూచి, యి
ట్లనుఁ, "సంతుష్టుఁడ నైతి నీదు పరిచర్యాప్రీతిం గన్యకా
మణి!యే మిత్తును మెచ్చుగా?" నని వనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 663

మునితో నందుల కామె మోదిలుచు, 'ధర్మస్వాంత! తేజోధిసం
పదలోనం, గడు బ్రహ్మతేజమునసున్ బ్రహ్మర్షులన్ మీర లొం
దుమ రగ్రగత్వము; బ్రహ్మయే తమ రనం దోఁపింత్రు సాక్షాత్తు; గొ
ప్పది యౌదార్యము మీది;' యం చనె నెనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 664

---

443 జ్యాయు; 444 మహిమ్ముఁ;

'నెనరుం బూనిరి గానఁ జెప్పకొనుదున్; నే నైష్ఠిక బ్రహ్మచా
రిణినై యుంటిని [445]నేఁబిడాఁక; మును నేరిన్ భర్త గమ్మంచుఁ గో
రను; నేఁపుం బలిఁగోరఁ; బెండ్లి యడుగన్; బ్రాహ్మణ్య సామర్థ్య [446]యు
క్తునిఁ బుత్త్రిన్ దయసేయుఁ;' డన్న దని పల్కెన్ మౌని; రామప్రభూ! ౬౬౫

చతురంబుల్, భయ భక్తి యుక్తములు, నిశ్శంకంబులున్, స్వాదు స
మ్మిత సారంబులు, మార్దవానుగతముల్, ప్రీత్యుక్తముల్ గానఁ ద
న్నుత వాక్యంబులకుం బ్రసన్నుఁడయి కన్నుల్ మూసి సంకల్పమున్
మతకం బందున [447]సల్పెఁ జూళి; యనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౬౬౬

మద మేపారఁగ బ్రహ్మదత్త సుధి యన్ బుత్త్రిందు తాఁ [448]గల్గి సో
మదకుం, బాలనఁజేయసాగె సుభవ ప్రఖ్యాతిఁ గాంపిల్యమున్;
విదితుం డా కుశనాథుఁ డీయఁ దలఁచెం బెండ్లాడఁగాఁ గూఁతులన్
బదియుం దొంబదిమంది నాతని కనున్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౬౬౭

ప్రణిధానంబున బ్రహ్మదత్త నృపతిన్ రావించి కూఁతుంగ్ర ని
చ్చెను వేగం గుశనాథచంద్రముఁడు వాసిన్ దారకర్మంబులోఁ;
గొనఁగాఁ దత్పతి వారి పాణుల నొగిం గుబ్జత్వముల్ వాసిపో
యెను; దొల్లింటి పసందు లబ్బె; నని మౌనీంద్రుండు; రామప్రభూ! ౬౬౮

తనయాళిం గుశనాథుఁ డంపె నపు డుత్సాహంబుతో బ్రహ్మద
త్తుని వెంటం దన యాజ్ఞికోత్తములనుం దోడ్వెట్టి కాంపిల్యమున్
జనఁగా; సోమద యచ్చటన్ స్నుషలకున్ సంశ్లేషముం గూర్చి శ్లా
ఘనఁజేసెం గుశనాథుఁ; డంచు ముని వక్కాణించె; రామప్రభూ! ౬౬౯

సుకువుం బొంది కుమారికల్ వలన సంపూజ్యుండు, చింతించెఁ దా
నొకఁడుం బుత్త్రుఁడు లేకపోయె గృహమం దుండంగ నం; చందుచే
నొకనాఁ డా కుశనాథుఁ డాత్మజునకై యుత్కంఠచేఁ బూనె, వా
రక పుత్త్రేష్టి; నటంచుఁ జెప్పఁ గడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౬౭౦

---

445 సోమదాఖ్యఁ; 446 భాగ్యుని; 447 (జేసెఁ; 448 బుట్టి;

అటు పుత్త్రేష్టిని బుత్త్రిఁ డూనె నని యూర్థ్వాధ్వంబునం వచ్చి యా
త్రుటి, 'నీయంతవాఁడు నీ కొకఁడు పుత్త్రీం డుద్భవం బొందు నిం
తట నం చుం గుశనాభుతోఁ గుశుఁడు సుద్ధర్షంబునం జెప్పె ను
ద్భటుఁడై ; యంచునుఁ బల్కె శిష్యులకు నా బ్రహ్మర్షి; రామప్రభూ! 671

ఘనుఁ డా పుత్త్రుఁడు గాధిరాజనఁగఁ బ్రఖ్యాతుండునై, వంశ కీ
ర్తిని బెంపొందఁగఁజేసి పొందును బ్రసిద్ధిన్ ధార్మికుం డంచు, నం
దును గూడన్ నిగదించెఁ దండ్రి; యటులే సూనుండు జన్మించె సూ
నున కంచున్ వినిపించెఁ గౌశికుఁడు, పుణ్యుం డంత; రామప్రభూ! 672

అతఁడే గాధి నృపుండు; మా జనకుఁ డత్యంతఁబు ధర్మజ్ఞుఁ డన్
నుతి నొందెం; గుశవంశమందునను నేనుం బుట్టుటం గౌశికాం
కిత నాముం డయినాఁడ; సత్యవతిగాఁ గీర్తింపఁబడ్డట్టి యో
షిత మా యక్క; యటంచు నింకను వచించెన్ మౌని; రామప్రభూ! 673

వినుఁ డా సత్యవతిన్, శుభ వ్రతను, ధర్మిష్ఠన్ అన చ్చుత్కృ శీ
లినినిం, బ్రీతి ఋచీక నామునకుఁ బెండ్లిం జేసి; రా సాధ్వి య
త్యనఘ స్వాంతయుఁ బుణ్యరాలు నయి, భర్తంగూడి దేహంబుతోఁ
జనె స్వర్గం; బని మౌని యామెను బ్రశంసల్ [449]సేసె; రామప్రభూ! 674

దివమునం బొందియు నామె, పొందకయె తృప్తిన్, మర్త్యలోకప్ర సం
భవు లెల్లారికి నిందు నందు సతమున్ వర్ధిల్లు పుణ్యంబులన్

జవి చూపింపఁగఁ గోరి, 'కౌశికి' యనం జానొందు నా సింధువై
ప్రవహించున్ హిమగోత్ర సన్నిధి; ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 675

అవతారోత్కృతిఁ బూని పుణ్య నదియై యత్యంత రమ్యంబుగాఁ
బ్రవహింపంగల కౌశికీ ధుని [451]లసత్ ప్రాంతంబునన్, [452]యామి గా
రవ మేపార వసించునాఁడ మును నే రానప్డు సిద్ధాశ్రమ
ప్రవిభాసేష్టి; కటంచు శిష్యుల కనున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 676

---

449 సత్పై; 450 ఠంబును; 451 కినిన్; 452 జామి;

తనయా! కౌశికి పీడి యజ్ఞ నియమార్థం బేను సిద్ధాశ్రమం
బునరున్ వచ్చితి; యజ్ఞమున్ సఫలమై పొల్పారె నీ శక్తిచే
తను, దైవేచ్ఛను; నేను నేఁటి కయితిన్ ధన్యుండనున్, సిద్ధుఁడన్;
గనుకం గౌశికి కేఁగఁ గోరు; దనియెం గాధ్యుండు; రామప్రభూ! 677

విని, యందుం గల సంయమీంద్ర తతి, "స్వామీ! బాగు! బా గిద్ది; పో
లునెకేమీ వంశము, నెందు నెంత పృథుధర్మల్ వంశముల్ గూడనున్;
ఘన పుణ్యాత్ములు, ధర్మ తత్పరులె గాకన్, లోక సేవా రతుల్
మనవా;" రంచును గాధిజున్ నుతులు సల్పం [453]జెల్లె;.రామప్రభూ! 678

తనయా! నీ వడుగంగ నౌటను, ప్రశస్తంబైన యీ దేశ వ
ర్తన చారిత్రమునున్ గుఱించి, [454]యది యెల్లం జెప్పఁగా నయ్యెఁ బా
వన మ ద్వంశమునున్ గుఱించియును; [455]దావ ద్గాథలోఁ జారిపో
యెను సంధ్యా సమయార్థ మెోర; అనె మౌనీంద్రుండు; రామప్రభూ! 679

మన మింకన్ నిదురింపఁగా వలయు జుమ్మా! లేనిచో రేపు ప్రొ
ద్దుననే సాగుట కష్ట మీ పయన [456]మెందుం; గాంతిమంతంబులై
చను నేత్రంబులు [457]గల్గినట్లు దివి, నక్షత్రాళితో నొప్పచుం
డె, నటంచుం దన యొల్లవారు విన నాడెన్ మౌని; రామప్రభూ! 680

తరు జాతుల్ గదలాడకుండె; మృగ సంతానంబులుం బక్షులున్
నెరపుల్ వీడకయుండె; [458]నేమియును ప్రాణి శ్రేణి సంచారముల్
బరగం దోఁచవు; గుడ్లగూబలును గ్రవ్యాదుల్ మెలంగాడు వై
ఖరి మాత్రం బొక కొంత క; ద్దనెఁ దపో గణ్యుండు; రామప్రభూ! 681

453 బూనె; 454 యిది; 455 యావ; 456 మందుం; 457 బులతోడ నట్లు;
458 నేవి;

ఆదటుం బొందినయట్టి చీకటులఁ జాయం [459]దట్టుచుం జంద్రుఁ డ
ల్లదె మె ల్మెల్లనఁ జల్లనౌఁ గిరణ సంస్త్రాయంబుతోఁ దోఁచి నె
మ్మదికిన్ మోదముఁ గూర్చు వెన్నెలలతో వర్ధిల్లఁగా సాగె; నీ
యదనన్ నిద్దురపోదు మం చనియె, నేత న్మౌని; రామప్రభూ! 882

పయనం బందుననున్న యా దశరథ క్ష్మాపాల దైవాత్మక
ద్వయ, మీ గాథల కబ్బురం పడుచు, విశ్వామిత్రు నౌన్నత్య ము
న్నయముం జేయుచు నిద్రవోయె; మునిమిన్నం బైకొనెన్ నిద్ర త
న్మయునిం జేయుచు, సూర్యు న స్తమయ [461]ధర్మం బట్టు; రామప్రభూ! 883



459 ద్రోయు; 460 పోవ; 461 కర్మం;

ారంగనునుండె; లెమ్మనుచు నాదేశింతు; సేవింపఁగాఁ
ఃసంజన్ సమయంబు; నెల్లరము సంతుష్టిం బ్రయాణంబు మి
। వేఁగన్ నెఱవేర్పఁగా వలయు నక్షీణాభి సంధాయ సం
ం [482]బుత్త్రికులార! యం చనెఁ దపోగణ్యుండు; రామప్రభూ! ౬౮౪

ింపన్ సమకట్టె నా దశరథ క్ష్మాజాని జైవాతృక
ం యా ప్రొద్దున బ్రాతరాహ్నికములన్ వర్తిల్లఁగాఁజేసి, ని
దాచార్య మునీంద్ర యుక్తముగ శోణన్ దాఁటు నుద్దేశ ము
సమ్మె, సమ్ముద ముత్సుకత్వమును మించం బెంచ; రామప్రభూ! ౬౮౫

ీ శోణను బల్చపల్చ నగుచున్ క్షౌద్రంబు; ఖాపింప ని
ముం గూడను వద్ది; యచ్చ టచటం బ్రత్యక్షమౌ సైకత
లీ యాపగ; మీకు నెందుల కిఁకం దర్శంబు; లీ పీటిలో
! గా ల్నడ సాగవచ్చు నని నైక్ష్వాకుండు; రామప్రభూ! ౬౮౬

మన్ శిష్యుఁడు దారికై వెదుకఁగా నా మౌని యెల్లప్పుడున్
సంఘటంబులు దాఁదపోవు తెరువుం జొల్పంగ ముం-దేఁగుదెం
నెల్లారలు [483]నాతనిన్ వెనుకఁ దప్పిన్ సాగి, తీరంబు దాఁ
బ్రత్యక్షము లయ్యె నీవ్రములు సూటిం దారి; రామప్రభూ! ౬87

హనంబుగ బూన్కి వారు పయనంబై ముంతుకున్ సాగి, వె
ముం గొల్పెడి నిర్జనాటవుల వేగన్ దాఁటి డౌ దౌఁ జనన్,
ింపెన్ నడిమింట [484]హేలి; దరిఁజేరంగల్గి రా హంస సా
కూహలా నినదోచ్చ నంత, సురభద్రన్ వారు; రామప్రభూ! ౬౮౮

---

నన్ రాజకులార; ౪౮౩ గాధిజున్; ౪౮౪ ఖేలి;

ముని సంసేవితమున్ బవిత్రతమమున్, బొల్పారు బంగారు కాం
తిని మీఱంగల పంకజాత విలస ద్దివ్యాపగాంభ శ్శ్రీవే
ణిని, బద్మాంచిత వాసనాంధ మధులిణ్ణీరంధ్ర కల్లోలినిన్
గని, వారల్ పులకింత్రు ప్రత్యణువుఁ బొంగన్ మేన; రామప్రభూ! 689

కని, తత్తీరమునందు నాఁగుటకు సంకల్పించి, తా మా నదిన్
మునుకల్ వెట్టినవార లెల్లరును, నోప్పన్ నేప్ప మీఱంగఁ ద
ర్పణమున్ సల్పుచు, నగ్నిహోత్రముల వేల్వంజొచ్చి, హోమించి, క
మ్మని హవ్యంబుల నారగించితిరి, సౌఖ్యం బార; రామప్రభూ! 690

పరమానందముతో ననంతరము విశ్వామిత్రునిం జుట్టుచే
రిరి మౌనీంద్రము; లంత దాశరథి పేర్మిన్ గాధిజుం జూచి, యో!
వర వాచంయమి! మూఁడు పాయలుగఁ బర్వం, బర్వ లోక త్రయాం
తరమున్ దీ సురగంగ; యె? ట్లనుచుఁ బ్రస్తావించె; రామప్రభూ! 691

విసరింపంగదయ్యా! ముజ్జగమునన్ వేర్వేఱుగా నేల తాఁ
బ్రవహించెం జదరేఖ? సర్వతటినీ భర్తృత్వ పుణ్యస్, మిత
ద్రుమ నే రీతిగఁ జేరె? నం చనుచు ఛాత్రుడు గాంచి, గాధేయుఁడున్
నవ్వుచుం జెప్పెఁ గిరాతి గాథ, మును లానందింప; రామప్రభూ! 692

మనసయ్యెన్ వినఁ, గాన విన్ము, తనయా! స్వర్ణాది ధాతూత్కరం
బునకున్ ఖని, హిమాచలుం డనెడి జీమూతప్రభుండొక్కఁడుం
డెను; సౌందర్యపు రాశి యైన ననటోఁడిం దన్నగేంద్రుండు నా
డెను బెండ్లిన్ మనసామనోరమను, గోటిన్ మేరు రా ట్పుత్రికా
మణి, నంచున్ ముని, కౌసలేయునకుఁ జెప్పంబూనె; రామప్రభూ! 693

వనితా రత్నము తన్మనోరమకు, హైమవ్మాభృదగ్రీయున
ల్లును గల్గెన్ దుహితా ద్వయంబుఁ; గడుఁ బోరంబైన సౌందర్యమున్
దున వా రప్రతిమాన; లందుఁ బెనుపొందున్ గంగ తా జ్యేష్ఠయై;
చిన కూఁ తౌండె సుమాఖ్య; యంచు వినిపించెన్ మౌని; రామాప్రభూ! 694

వనితల్ వారలు లోక పూజ్యులు, జగ ద్భవ్య ప్రసిద్ధాంగనా
మణులుం గాఁగ, దివౌకసో హితము సల్పం బూని, యిమ్మంచుఁ గో
రిన యా దివ్యుల కిచ్చె గంగను సవిత్రుశ్రేష్ఠుఁడున్, లోకపా
వనినిన్ మోదముతోడ; నంచుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 695

గణనీయాలక నంద యా యుమ, మహోగ్రంబౌఁ దపం బాచరిం
చిన, నామెన్ బహు రూపవంతునకు నిచ్చెం దండ్రి, కైలాసవా
సున కుద్వాహమునందు; నామెయు మహేశున్ దివ్య భార్యాత్వ మొం
దిన దౌటన్, ముని యన్నటుల్ జగతి నొందెం బూజ; రామప్రభూ! 696

తనివిన్ దివ్యులు భవ్య లొందుచుఁ గృతార్థత్వంబు, స్వచ్ఛంద గా
మిని నా గంగను వెంటఁబెట్టుకొని పేర్మిన్ దేవలోకంబుపో
యిన, నం దామెయుఁ బర్వ వారలవి పోయెం బాపముల్: త్రిపథం
బున జాల్వాఱిన దీమెయే; యనుచుఁ జూపున్ మౌని; రామప్రభూ! 697

కమలాప్తాన్వయదీప! [465]మౌనివర! గంగా గాథ సంక్షిప్త రూ
పమునం జెప్పితి; రద్ది విస్తరముగా వర్ణించుచుం జెప్ప నే
రిమి మీకే దగు; నేల ము వ్విధులఁ బర్వెన్ గంగ? యేమేమికా
ర్యములం జేర్పడె? నంచు [466]దాశరథి సంప్రశ్నించె; రామప్రభూ! 698

వినుమోయీ! రఘునందనా! శివుఁడు మున్ వీరంబుతో [467]ఘోర రీ
తిని సల్పెం దప, మా యుమావరదుఁ బ్రీతిం బెండ్లియాడంగ; మా
నిని యా పార్వతిదౌఁ దపో[468]నిరతి వర్ణింపంగనే లేము; చ
క్కని చక్కంచును నామె యొప్పు ముని వక్కాణించె; రామప్రభూ! 699

---

465 భక్త; 466 రాఘవుఁడు; 467 సుగ్ర; 468 గరిమ;

ఉభయుల్ వొందిరి మోహ విభ్రమను; బుత్త్రోత్పాదనోత్సాహులై,
రత సంయోగ విలాస కేళి నుభయుల్ శోభిల్లి [469]రెన్నాళ్లలో;
క్షుభితం బింతయుఁ గాదు శర్వునకుఁ దేజోమూర్తి; శర్వాణికిన్
బ్రభవం బొందదు గర్భ; మంచుఁ బలికెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 700

పురభిత్పార్వతులందు నిట్లురకుసుమం బుత్త్రోచ్చ యే మాత్రమున్
విరతిం బొందదు; తీరఁబోదు; కడు నెమ్మెన్ సాగెఁ గాలంబు; స
త్వర మేదే క్షణ లేశమందు నిఁక దాల్పన్వచ్చు గర్భంబు కాం
కరి, యన్ సుస్థితి వచ్చు; నంచు మని వక్కాణించె; రామప్రభూ! 701

ఉమకున్ మోహన కెట్టి నిర్భర బలాఢ్యం బుద్భవం బొందునో!
శ్రమగొల్పున్ భువనాళి కంచు, నమరుల్ బ్రహ్మాదులుం బోయి, దే
వ మణిన్ శంకరుఁజేరుచున్ మెలపుమై వంచించి, చిత్తార్తి సం
భ్రమ యుక్తంబుగ వేఁడి; రంచుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 702

సితికంఠా! యివియే గొనం దగును మా చేమోడ్పులన్; మమ్ము దే
వతలం బ్రోవుము; లోక సంగ్రహము సల్పం గోరి మా ప్రార్థనల్
నతులున్ మన్ననఁ జేయుమీ! యిపుడు జన్మం బొందు నీ పుత్త్రి స
మ్మతి లోకంబులు మోవలే; వని రనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 703

తమ తేజోమయ దేహమందుననె యేత త్తేజముం దాల్చి, లో
కములం బ్రోవఁగ బిగ్గఁబట్టుఁ దనఁగాఁ, గైలాస వాసుండు, మో
దముమీఱంగను 'నట్లెగాని, యది రేతస్థానమం దుండి కం
పముగాఁగన్ ధరియింతు రే?' రనె, ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 704

స్ఖలనం బొందఁగనున్న తేజమును వీఁకం దాల్పఁగాఁగల్గు నీ
యిల; యంచున్ సురలాడ, 'నట్ల'యని యా యీశుండు [470]రేతస్సు ని
శ్చలపైజార్చె; నుమా మహేశుల నుతుల్ సల్పంగ నెల్లారు ది
వ్యులునుం బూని; రటంచు [471]మెప్పుగను జెప్పున్ మౌని; రామప్రభూ! 705

469 రెన్నేళ్లలో; 470 తేజస్సు; 471 గాని;

కలిగెం గోపము; గుప్పె నిప్పు కణికల్ గన్దోయి నా సర్వమం
గళ; 'మా పుత్త్రిని సంభవంబుఁ జెఱుపంగానయ్యె మీ కిట్లు; మీ
లలనల్ వొందరు సంతతిం; గటికి గొడ్రాండౌదు;' రం చందఱన్
దులిపెన్ వేల్పుల నామె; యంచు ముని యార్తుం డౌను; రామప్రభూ! 706

తన కోపంబు నడంప లేక, హిమవత్కన్యా లలామంబు, కుం
భినినిం జూచి, 'వసుంధరా! పరమ పాపిష్ఠి స్వభావా! యిఁకన్
మనుమీ! నీవు విపర్యయంబయిన భావం బొంది, పల్ భర్తలన్
గొను; చం చాడె నటంచు శిష్యఁగని పల్కెన్ మౌని; రామప్రభూ! 707

అణఁగన్ లేదు కకోప తుల్య మగు రోషావేశ మా పార్వతీ
వనితా తల్లజయందు; 'నూషరతయుం బాంశుత్వమున్ వంటి దూ
షణ భావంబులఁ బెక్కు రూపములు పెల్చం బొంది, నిస్సంతుతన్
మనుమీ! పాంసుల'! యంట యామె తెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 708

అవనిం బడ్డ శివేంద్రి దియోజ్జ్వనము, లా నా యీ ప్రదేశంబునన్
దవులం బడ్డటుగాక, తలముమీఁదన్ వాలుచున్ వాఁగఁగాఁ
బ్రవహింపం బొడఁ గాంచి దేవతలు సంత్రస్తాత్ములై, పృథ్వియున్
దివముం జూచి దిగాలునొంది; రనె గాధేయుండు; రామప్రభూ! 709

దిగులుం బొందిన దేవతా గణము జ్యోతి ర్మూర్తినిం గాంచి; యో
దుగమోముల్ గల వేల్పు! తెమ్మెరచెలీ! దుఃఖంబు మాదెల్లనున్
దెగఁగా నీవు సమీరుఁగూడి పురభి త్తేజంబునుం గాల్చు, మే
వగచేనైన నటంచుఁగోరె, ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 710

జ్వలనుం డంతటఁ గాల్చినట్టి శివ తేజం బెల్లనుం బెల్లుగా
వెలసెన్ శ్వేత కుభృత్తుగా; నచటఁ బర్వెన్ జెల్లు కాలక్రమా
కలనన్; సూర్య సమాన [472]తేజమునఁ దత్కాండం బరణ్యంబుగా
మలఁగెం; దాన జనించె [473]షణ్ముఖుఁ డనెన్ బ్రహ్మర్షి, రామప్రభూ! 711

---

472 సమ తల్; 473 స్కందుఁ డనియెన్;

జననం బందెను గృత్తికాసుతుఁడు తేజస్వంతులం దేజరి
ల్లినవాఁడై; గత వృత్తమందుఁగల చెల్మిం బల్మి నూహించి సి
గ్గున శీర్షంబులు వాల్చె నా దివిజ వర్గుల్; కర్వరీ శర్వులున్
మనసై యచ్చోటు పీఁడిఁ రంచు మునియున్ వాక్రుచ్చె; రామప్రభూ! 712

చనుదుం బశ్చిమ దిక్కుగా నిరువురున్ శోణ్యాద్రిమాహార్యమం
దునఁ దా ముత్తర పార్శ్వ కాశ్యపులయందుం జేరి, దీర్ఘంబుగాఁ
బొనరం బూని తపంబుఁజేసి; రిటు లొప్పం బార్వతీ గాథ; యిం
కను గంగోద్గతి వి న్నటంచు ముని వక్కాణించె; రామప్రభూ! 713.



ఉమయున్ [474]భర్గుఁడునుం దపో [475]నియతియం దుండఁగ, సేనానిగాఁ
దమ కొక్కం డపు డుండనయ్యెఁ బుమ! దైత్యస్పర్థలం; దండుచే
ధఘనుం డాదిగలట్టి దేవతలు సుత్రామాను [476]గత్యంబునన్,
గమలోద్భూతునిఁ జేరి, రంచు ముని పక్కాణించె; రామప్రభూ! 714

పరమేష్ఠిన్ వలగొంచు దేవతలు, "దేవా! మాకు సేనానిగాఁ
బరమేష్ఠిన్ దయసేసినావు మును; దీవ్రవంబొఁ దవస్యం బరా
త్పరుఁ డుండెంగద! నేఁ డుమా సహితుఁడై; వైనంబు లీ వన్నిటిన్
బరగన్ నేర్పద;" వంటఁ గౌశికుఁడు చెప్పంజొచ్చె; రామప్రభూ! 715

'తెలియన్‌లే మిపు డేమి సేయవలెనో! తెల్పంగదే!' యన్న, ది
వ్యుల నోదార్చుచుఁ, 'బార్వతీ పరమ శప్తుల్ మీరు, నిస్సంతులై
మెలఁగం దప్పదు; సిద్ధ సింధు వదియే మి మ్మెల్లఁ బుణ్యంబువన్
మెలపెం బా మ్మని, బ్రహ్మ పల్కు_టలు తెల్పెన్ మౌని; రామప్రభూ! 716

సుర గంగాంగన యుల్లి మక్కటికచే జొత్తిల్ల నట్లైట్లొ! యీ
షిరుఁ డామెం దగఁ [477]గూడెనేని యును. నర్చిష్మంతుఁడున్ శత్రు సం
హరుఁడౌ ధన్వి జనించు; దాని కగోత్తజా న్యాగువుం, బార్వతీ
పరితోషం, బని బ్రహ్మచెప్పె ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 717

సురలున్ ధన్యుల మంచు నెంచుకొని, వాచోయుక్తి నా బ్రహ్మనున్
గరమున్ స్తోత్రము సేసి, వీడుకొనుచున్ గైలాసమందుం గుశా
కరముం గన్గొని, "యగ్నిదేవ! క్రతు భుక్ కార్యంబుఁ దీర్పంగదే!
కరుణన్‌నీ;" వని రంచుఁ గౌశికుఁడు [478]పల్కంజొచ్చె; రామప్రభూ! 718

---

474 ఉగ్రుఁడు; 475 రతి; 476 సారంబుగా; 477 పొందె; 478 పక్కాణించె;

కదుపున్ సీయెడ భర్గుతేజ; మది గంగా గర్భమం దెట్టులో
వదలంగావలె; నంచు దివ్య లడుగన్ వైశ్వానరుం డా నదిన్
బదిగా వేఁడె సురార్థమై వదయ గర్భం; బామె శ్రీరూపమున్
సదయం బూనె ముదాన; నంచు ముని ప్రస్తావించె; రామప్రభూ! 719

కని దివ్యాంగనయైన గంగదగు శృంగారంబు నా వహ్నియున్
మునింగెన్ మోహమునందుఁ; దన్మయుఁడునై పూఁబోఁడి సర్వాంగ శో
భన లావణ్యమునందు వ్యాపియయి, శైవంబైన తేజంబుచే
వనితన్ నింపె, రమింపె, నంచు ముని చెప్పం జొచ్చె; రామప్రభూ! 720

గంగాదేవి ధరింపె గర్భము; త దంగ వ్రాత మద్దానితో,
నంగారంబుల పాత్రియందువలె భగ్గంచున్ వడిన్ దాహఁపున్
బొంగుం బొందుచుఁ గ్రుంగె; నామె తుద కోర్పుం దక్కి యా వహ్నితో
భంగిం జెప్పెఁ దదీయ తాపము; నసెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 721

శ్రీ కా గర్భము వృద్ధియయ్యెడుకొలందిం దాప మత్యంతమై
శోకం బావహిలంగఁ గన్గొనిన యా [479]శక్రంబు, తద్గంగకున్

బూతుర్మాన హిమాద్రిపాదమునఁ [480]గాల్చున్ గర్భమున్ డించుకో
నాకాంక్ష్యం బని చెప్పెనం చనియె పత్య్రగ్యుండు; రామప్రభూ! 722

కయిసూడెన్ వడి గర్భ నిస్రృపము; త ద్గర్భ ప్రసవంబందుసుం
డ్రియు నంజస్సున మేల్మి బంగరుపు పుట్టెన్; నిర్మలంబైన వెం
డియు నా రోచిత తీక్ష్ణ ధారలకుఁ బుట్టెన్ రాగియున్ లోహ స
న్నయ; మంచున్ వినిపించె శిష్యులకు [481]మునర్యగ్యుండు; రామప్రభూ! 723

అనువుం బొందినయట్టి యా మలమునం దేపాడు సీసంబునున్

జనియించెం; దగరంబునుం గలిగె; హెచ్చం జొచ్చె నచ్చోటనే
గొనబైనట్టి సమస్త ధాతువులునుం; గూడెం దృణ వ్రాత, కు
బ్జ నికుంజాలియు నొబసంబున; నసెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 724

---

479 శక్రుండు; 480 న వెల్చున్; 481 నదు;

పరగం ద త్స్రవమందునుండియును నుద్భావంబునుం బొందె ఖా
స్వరమౌ నొక్క శిశు ప్రకాండ; మపు డా సంతాన సంపోషణం

బరయన్, దుగ్ధము నీయఁ, గృత్తికలఁ జయ్యన్ [482]దివ్యులే యార్వురన్
గరుణన్ నేమముసేసి; రంచు ముని వక్కాణించె; రామప్రభూ! 725

పసిపాపం దమకన్నపుత్త్రికునిగా భావించి గుర్తింపఁగాఁ
గొనరం గృత్తిక లార్వురున్, దివిజులున్ గుర్తించుచున్ లోకఁపున్
విసరంబందునఁ గార్తికేయుఁడనుచున్ విఖ్యాతినిం బొందు నా
కసుగం దంచని; రంచుఁ గౌశికుఁడు వక్కాణించె; రామప్రభూ! 726

తెలివిన్ మీఱెడు నగ్నిహోత్రుపగిదిన్ దేదీప్యమానంబుగా
వెలుఁగం జొచ్చిన పాల సంస్రవము పూన్పింపంగ నా కృత్తికల్
జలకం బార్చిరి; చేపఁగా స్తనములున్ స్తన్యంబు నా యార్వురున్
దల కొక్కొక్క మొగానఁ గుడ్పి; రనె నంతన్ మౌని; రామప్రభూ! 727

తన యార్మోములతోడ బాలకుఁడునున్ స్తన్యంబు లా కృత్తికా
స్తన [483]భారంబుల నుండి యొక్కపరి పెల్చెం ద్రావె; నైజంబుగా
నన పూర్వంబగు మేనివాఁ డయిననున్ నాగాంకు పుత్త్రుండు గా
పున వీరాగ్రణి యయ్యె నాతఁ; డని చెప్పెన్ మౌని; రామప్రభూ! 728

అసమాన ద్యుతిమంతు నాతనిని దా నా యగ్నిహోత్రుండు దే
వ సమూహంబునకున్ మహా దళపతి ప్రాగ్ర్యుండుగాఁ జేసె; ది
వ్య సమాజం బభిషేక మద్ది కని, నిర్వాణంబునుం బొందె మా
నసమం; దంచు గదించె గాధిజుఁడు విన్నాణింప; రామప్రభూ! 729

పిన్నం డన్నటు కృత్తికల్ పెనుపఁ బేర్మిం గార్తికేయుండుగా
వన్నెం బొందుట, వక్త్రషట్కమున, ద్రావన్ దుగ్ధ మార్మోళ్లఁ బెన్
మన్నిఁ డౌటయు, వహ్ని యానతిమెయిన్ మందాకినీ గర్భ సం
స్కన్నుం డాతఁడు స్కంధుఁడౌట, ముని విస్తారించె; రామప్రభూ! 730

---

482 దివ్యులే; 483 వ;

గగనంబందు మెలంగుచుండునది గంగాదేవి వృత్తాంతమున్,
ంగమోహులగలవేలా పద్యుతముగా దోర్బలంబుఁ గావింప నిం
ృగ జన్మించిన కార్తికేయు కథయుం బూర్ణంబుగాఁ జెప్పితిన్;
ఁగదుం గూరిచి విస్మటందు ముని ప్రస్తావించె; రామప్రభూ! 781



—౨౮—

## (సగర చరిత్ర)

తనయా! తొల్లి యయోధ్యలో సగరుఁ డన్ ధర్మ ప్రభుం డొండు పా
లనముం జేసెను జక్రవర్తిగ; విదర్భ స్వామికిం బుత్త్రి కే
శిని యా వీర వరేణ్యు జ్యేష్ఠ సతియై పెన్పొంచె, ధర్మిష్ఠయం
చును, సత్యవ్రత యంచు, నంచు వచియించున్ మౌని; రామప్రభూ! 732

సగరున్ రెండవభార్యయౌ సుమతినిన్ సౌందర్యమం దెన్నఁగాఁ
దగు, నిం కేరును నుండఁ బోరు మణి, యందంబందునన్ మించి యా
యిగురుం బోఁడిని భూతలంబునను; నా యిల్లాండ్రు నిష్పంతులై
వగలో మించిరి భర్త; నంచు ముని చెప్పం జొచ్చె; రామప్రభూ! 733

సగరుం డుం దప మాచరింపఁ దలఁచెన్ సంతానముం గోరి; యా
యిగురుం బోఁడులఁ గూడి శీత నగమం దేర్పడ్డ యుత్సంబు చెం
తగ వాసంబును సల్ప నా భృగు మునిన్ దర్శింపఁ జెక్కెంట్లు పొం
దుగఁ జేసెం దప; మంచుఁ జెప్పె ముని సంతోషాన; రామప్రభూ! 734

సగరున్ మెచ్చి తపోనిమిత్తమునఁ దా సందర్శనం బిచ్చె నా
భృగు మౌనీంద్రుఁడు; నాదటం దెలిపెఁ బేర్మిం "జక్రవర్తీశ్వరా!;
యగు సంతానము నీకు మిక్కుటముగా; నత్యంత సత్కీర్తి నీ
కగు ముల్లోకములందు నం," చనియె మున్యగ్ర్యుండు; రామప్రభూ! 735

కొమరుం డొక్కఁడు వంశవర్ధనుఁడు గల్గున్ నీకు నీ కాంతలన్
ప్రమదం బార నొకానొకర్తుకకు; నర్వే వేల సత్పుత్త్రికుల్
ప్రమనుల్ గల్గుదు రింకొకానొకను; భార్యల్ గోరుకొన్నట్లుగాఁ
జుమి! పీ ర్గల్గుట; యంచనెన్ భృగు; వనున్ శుద్ధుండు; రామప్రభూ! 736

తనకున్ వంశ వివర్ధనుం డొకఁడునుం డాఁ జాలు నం చెంచి కే
శిని కోరెన్ సుతు నొక్కనిన్; సుమతి యాశించెన్ సుత వ్రాతమున్
ఘన కీర్తి ప్రదమైనదానిఁ బడయంగా నర్వదా వేలమం
ది, నటం బాడెను గాధిజుండు, విన సంతేవాసి; రామప్రభూ! 737

భృగు మౌనీంద్రునకున్ సతీ యుతుఁడు పృథ్వీభర్త సేయంగఁ గే
ల్మొగుటల్, వీడ్కొలుపన్ వశీంద్రుఁడు సెప్పన్ మంగళా శాసనం
బుగ నాశాస్యము; లంత నెమ్మదిని నింపుం బొంది స్వస్థాన మా
ముగురుం జేరి; రటంచుఁ గౌశికుఁడు దెల్పెం బుమ్మి; రామప్రభూ! 738

చనఁగాఁ గాలము, సత్యపుంజుఁ డనఁగా జైవాతృకుం డొందు తే
శినికిం గల్గెను; గర్భ పిండ మొకఁడై సిద్ధించెఁ జిత్రంబుగా
ఘనమౌనట్టి యలాబువై సుమతికిన్; ఖండింప నర్థాని నిన్
గనిపించెన్ శిశు గుచ్ఛ; మంచు ముని పక్కం జొచ్చె; రామప్రభూ! 739

అరువై వేల సుతుల్ గణింపఁబడి యుయ్యాన్ నేతి భాండంబులన్
బిరవుం బొందిరి; దాదులందఱును బ్రోదింజేయఁ గాలక్రమాం
తరమం దర్వది వేలమందియును బొందంజొచ్చి రూపాది, సు
స్థిరతన్ యౌవనమై; రటంచు వచియింపన్ మౌని; రామప్రభూ! 740

సగరుం బుత్త్రికుఁ డశ్వమంజుఁ డటు భ్రష్టత్వాన సాకేత స
న్నగరంబందలి [484]బాలబాలికలఁ గొంతం జేర్చి మాయూనియై,
[485]పగతోడన్ సరయూనదిం బడఁగఁ ద్రోపంజొచ్చె, సంతోషమున్
బెగ నొందం గను, వంచుఁ జింతపడె గాధేయుండు; రామప్రభూ! 741

484 చిన్నపిల్లలను; 485 పగ;

నడివీథిం జను సజ్జనోత్తముల నానా బాధలం బెట్టుచుం
దెసివాఁ; డాతఁ డయోధ్యలో జనుల కెంతే నిష్టురుండునై
చెడు గొటన్, సగరుండు జ్యేష్ఠ సుతుఁ డన్ జింతం దిగంద్రాగి తా
బడవుల్ పా లొనరించె వాని; ననె మున్యగ్ర్యుండు; రామప్రభూ! 742

పిదపం దత్సుతుఁ డంశుమంతుఁడు మహావీరుండు నయ్యుం, బ్రియం
వదుఁడున్, సర్వ జగద్ధితుండు నగుచున్ వర్ధిల్లెఁ; దా నందుచే
ముదితుండై సగరుండు సేయఁ దలఁచెం బుణ్యాశ్వమేధంబుఁ; బల్
చదువుల్ యాజ్ఞికు లప్డు చేరి; రనియెన్ [486]బ్రహ్మర్షి; రామప్రభూ! 743

మన ముప్పొంగఁగఁ గోసలాత్మజుఁడు విశ్వామిత్రునిం జూచి, 'యో!
మునివర్యా! ఫలితభు గ్గస జ్జ్వలనయు గ్మూర్తిత్వ రాశీ! తపో
ధన! మా పూర్వుఁడు వాజిమేధ మెటులన్ ధన్యుండుగా నిర్వహిం
చెనొ! చేయఁగదె![487]విస్తరం'; బని వచించెన్ వేగ; రామప్రభూ! 744

నగ వల్పంబుగ మౌని మోమునను సంధానిల్ల. 'నో! నందనా!
సొగసై శీత నగాభిముఖ్యమునఁ బొల్చున్ వింధ్య; మా రెంటనున్
నగముల్ దాము పరస్పరంబు నగుచున్నట్లుండు'; నం చీ విధం
బుగ నశ్వోత్తమమేధమున్ గురించి చెప్పెన్ [488]మౌని; రామప్రభూ! 745

ఇలయుం దద్గిరి మధ్య దేశము మహా యోగ్యంబుగా యజ్ఞ క
ర్మలకుం; దత్స్థలమందునే సగర భూపాలుండు తద్యాగమున్
దలపెట్టెం; దన యంశుమంతుఁడను నప్తం బంపె నశ్వంబుతో
నిల నెల్లం జరియింప; నం చనియె మౌనీంద్రుండు; రామప్రభూ! 746

మనుమం డంతట నంశుమంతుఁడు ధనుష్మంతుండునై యశ్వమున్
దన బాహాబల మొప్పఁ బ్రోచికొనుచున్ ధాత్రీ తలం బంతయున్
బ్రణత ప్రాభవమై వశంబువడ దిగ్వ్రాతంబులం ద్రిప్పివ
చ్చెను జైత్రుం డనిపించుకొం; చని వచించెన్ మౌని; రామప్రభూ! 747

486 రాజర్షి; 487 విస్తరిం పని; 488 దాను;

సడిసన్నట్టిది యుక్తకాలమని యాసన్నంబుగా, నింతలో
నడిపెన్ వేరలెఱుంగకుండ యజనాశ్వంబున్ మహేంద్రుండు, మ్రు
క్కడి కీలాలప వేషధారియయి ప్రక్కన్ నక్కి వంచించుచున్
వడిగా; నంచని యప్పుడొచ్చె నపుడా బ్రహ్మర్షి; రామప్రభూ! 748

యజనాశ్వం బటు పర్వవేళ మటుమాయం బౌటకుం గుంది, ఋ
త్విజు లా యశ్వము నెట్లొ! తత్క్షణమె తెప్పింపంగ వాంఛించి రా
ఘజనుం, డోరుని యంపి; లేనియెడఁ గల్గున్ యజ్ఞపున్ ఛిద్రమం
చు జయార్థిన్ వెదకింత్రు వా; రని వచించున్ మౌని; రామప్రభూ! 749

సవన ఛ్ఛిద్రముచే సమంగళ మవశ్యం బెల్లరుం బొందఁగా
నవు; నీ వంచను మే మటంచు నొక వ్యత్యాసంబు లే దెందునన్;
తపణింపం దగు బూర్తిగాఁ గ్రతువు నాటంకంబు లే నట్టులన్
తపరల్ మెచ్చఁగ; నంట వారు, ముని యాడం జొచ్చె; రామప్రభూ! 750

వినుచున్ హోతలమాట లన్నియును బృథ్వీభర్త, యచ్చో విజ్ఞం
భణ మేపారఁగఁ గూరుచున్న సుతు లత్రై వేలనుం జూచి, నా
యనలారా! బహు పుణ్యులే నడపు నీ యజ్ఞంబు ధ్వంసంబు న
ల్పను గ్రవాద్యదులు చాల; రం చనె ననెన్ [489]బ్రహ్మర్షి; రామప్రభూ! 751

ఇది మాయావి యెవండొ! చేసినదిగానీ, యెల్లరుం జేయఁగాఁ
జదువుల్ గారు; సముద్ర ముద్రిత ధరా చక్రంబు సర్వంబునున్
వెచుకం బొందుదు; ధరం బ్ర యాగ హరి రాన్పింపంగ రాదేని, ఘూ
ర్ణ్యుద్ధరేంబుం జొలుఁ; డంచు బా బసుటఁ జెప్పన్ మౌని; రామప్రభూ! 752

489 రాజర్షి;

మీ రొక్కొక్కరు నొక్క యోజనము భూమిన్ రోసి, యం దెందు నా
క్రూరుం గాననిచో మఖాశ్వముకకై గ్రొవ్వుండు భూగర్భమున్
జేరుందాఁక; హయంబు దాఁచి యిటు వంచింపంగ నెవ్వాఁడు దు
ర్వారుం; డం చని రాజు పల్కె ననియెన్ [490] బ్రహ్మర్షి; రామప్రభూ! 753

కననౌ దాఁకను నశ్వమున్ వెదకుఁ డింకన్ మీర; లీ యాగ దీ
క్షనె ఋత్విక్కులఁ గూడియుండు మిము రాఁగాఁ గోరు చీ యంశుమం
తునితో నిచ్చట నేను; వే వెదలుఁ డొందున్ శ్రేయముల్ మిమ్ము నె
ల్లను నంచున్, నృపుఁ డాడుటల్ దెలిపె నా బ్రహ్మర్షి; రామప్రభూ! 754

శిరసా దాల్చుచు జన్మనుజ్ఞ నెలమిన్ శీఘ్రంబుగా సాగి సా
గరు లెల్లారలు నీ యిలాతలముపైఁ గాన్పించు దేశంబులన్
ద్వరగా రోసి, హయంబుఁ గన్బడమిఁ ద్రవ్వం జొచ్చి రొక్కొక్క రు
ర్వర, నల్వైపుల యోజనంబుగ, ననెన్ [490] బ్రహ్మర్షి; రామాప్రభూ! 755

తమ వజ్రాయుధ తుల్య శూలములతోఁ ద త్సాగర శ్రేష్ఠ సం
ఘము, దీర్ఘోరు మహాయుధాని తలితో, క్ష్మాచక్రముం ద్రవ్వచో
శ్రమముం బొందెడి భూమినుండి వినఁగా శక్యంబు గానట్టి శ
బ్దము విన్పించె; నటంచుఁ జెప్పఁ గడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 756

పొలుపొందంగల దీక్షితో త్తములు జంబూ ద్వీపమందున్న య
ద్రుల నెల్లం జిదుకంగఁ గొట్టిరి; మహా క్రూరంబుగాఁ గుంభినీ
స్థలిఁ బాతాళము దాఁకఁ ద్రవ్వుకొనుచున్ సాగారి రా సాగరో
ద్భులు; లంచున్ వివరించి చెప్పఁ దొడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 7 7

వికట త్వంబును బొంది బొబ్బలిడి రుద్విన్ దాఁగియున్నట్టి యా
సకల ప్రాణులు నాగ రాక్షస లస త్సంఘంబునన్, నొకు దె
బ్బకు నే మాత్రముఁ దాళ లేక; వణఁకెన్ బ్రహ్మాండ మవ్వారి జా
లికి; నంచున్ వివరించెఁ గౌశికుఁడు నోర్మిం జూపి; రామప్రభూ! 758

---

490 రాజర్షి;

వనవంజొచ్చిరి పోయి బ్రహ్మ [491]సవిధం బాదాలపై వ్రాలి దే
వ నికాయంబులు, పన్నగాసురులు, పక్షిజాతుల్ గంధర్వులున్
వినయం బార, విషణ్ణ వక్త్రు లగుచున్, మే మెల్లఁ గంపించుఁ జు
మ్మ; నటంచున్ మునితల్లజుండు నిగదింపంజొచ్చెఁ; రామప్రభూ! 759

భగవంతుండవు! సాగరుల్ పుడమినిన్ భగ్నంబు గావించుచున్,
మిగులన్ హింస్రువులైరి, భూ బిలములం బెక్కేండ్లుగా నుండి తా
మగపడ్డట్టి మహా మహాత్ముల యెడన్ హార్దిక్యమే లేక, ఖల్
పగ; నంచున్ మునితల్లజుండు నిగదింపం జొచ్చెఁ; రామప్రభూ! 760

ప్రతి జీవిం దమ యశ్వ వార్త యనుచున్ రాపాడి రాపాడి, స
మ్మతి సూహించుచు, భూమిగర్భమునఁ గాన్పింపంగనౌ[492]వారినిన్
హత మార్చన్ సమకట్టి సాగరులు భూతానీకమున్ మాపుటన్,
వెతమై విప్రులు బ్రహ్మతో ననుటఁ దెల్పెన్ మౌని; రామప్రభూ! 761



491 యొద్దన్; 492 వారిని

శ్రుతమౌటన్ విషయంబు సర్వమును, విన్మున్ బ్రహ్మ! 'యో! భవ్య దే
వతలారా! భువి యెల్ల విష్ణువుది; ప్రేమన్ దాని నాతండు సం
తతముం బ్రోచుచునుండు; సాగరులునున్ దత్క్రోధ సప్తార్చి ద
గ్ధత నొందంగల;' రంటఁ దాను ముని వక్కాణించె; రామప్రభూ! 762

సగర క్ష్మాపతి పుత్త్రు లెల్ల రిటులన్ క్ష్మామండలిం ద్రవ్వటన్,
వగతో దివ్యులు పేవనక వచుట, యల్పాయుష్కులై [493]రాట్సుతుల్
దెగుటం, బూర్వంపు నిర్ణయంబె యని, యా దేవుండు లేఖాళికిన్
నిగదించెం జుమీ! యంచు వాకొనియె మౌనీంద్రుండు; రామప్రభూ! 763

దివిజుల్ ముప్పది ముగ్గు, రష్ట వసువుల్, దీపించు నా యాశ్వినుల్,
సవతుంగాంచిన ద్వాదశార్కులును, మెచ్చన్ యోగ్యులౌ రుద్రులన్,
నవయస్కంబులు దేవతా గణములున్, నంధిల్లు గంధర్వులున్,
రవులం [494]ద్యుప్తిని, నింద్ల కేఁగి రనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 764

ధరణిన్ సోదరు లొక్కచే గతిని బ్రద్దల్ గొట్టుచుండంగ, స
త్వరమే వారికిఁ జేటుకాల మగుటన్ వ్యంజించుచున్నట్లు దు
ర్భర నిష్ఠాత రవంబువంటి దొక నిర్హ్రాదంబు విన్పించె, సా
గర బృందంబున; కంచుఁ గౌశికుఁడు వ్యాఖ్యానించె; రామప్రభూ! 765

తిరుగం జూచిరి ధాత్రిఁ బ్రత్నమువు; సందేహంబు రాకుండఁ ద్ర
వ్విరి భూమిన్ మఱలం; బ్రయోజనము గాన్పింపంగ లేదయ్యె; నె
ల్లరునుం దం(డిని జేరి చెప్పికొనినారల్ పద్ధపాల్లెల్లనున్
వరుసన్ [495]నిస్స్పృహులై; యటంచు ముని చెప్పం బూనె; రామప్రభూ! 766

---

493 సాగరుల్; 494 దుష్టిని, దేజున; 495 నిస్పృహులై;

సకలంబున్ విని యుగ్రుఁడై, కలుగఁగా సంబాధమున్, నిక్షప్రయో
జకులారా! యని చక్రవర్తి, సుతులన్ సాదించి, వాయొద్ద కేం
దుకుఁ [496] దేఱంజనుచెంచినా రరుగుఁడీ! దుర్మార్గనింబట్టితే
రక మీ; రంచును బారఁద్రోలె ననియెన్ [497]బ్రహ్మర్షి; రామప్రభూ! 767

పదుగుల్ వెట్టిరి సాగరుల్ పుడమిపై: వాతాయనం బెందు నా
యరువై చేఱఁ గానిపింపమిని, బేయంజాల కే కార్యమున్
దిరుగం ద్రవ్వుచు భూమిలోఁ జొరపడన్, దీపించు కొండంత కుం
జరముం [498]జూచిరి వా; రటంచు ముని ప్రస్తావించె; రామప్రభూ! 768

అది యా భూధరమెల్ల [499]మోసెడి విరూపాక్షం బనంబడ్డ భ
ద్రదదంతావళ రాజు; మద్ది యలపుం దాల్పం, దలం గొంపమేన్
గదలింపన్, క్షితిచక్రమందుఁ జోదముం గంపంబు, భూధ్రంబులున్
సమలుం గంపిల; నంచు వాకొనియె ముక్షగ్రగ్రుంథ; రామప్రభూ! 769

కరభిన్ మ్రొక్కి, ప్రదక్షిణించుచుఁ బురస్కారంబులం జేసి, సా
గరులుం బిమ్మటఁ దూర్పుదిక్కున విడి పశ్చిం గల్గు నా దక్షిణం
బరయం జేరి, ధరా విదారణము సేయంగా, మహాపద్మ వి
క్కరి దృగ్గోచర మయ్యె; నంచు ముని వక్కాణించె; రామప్రభూ! 770

కనిపింపన్ గజ మొక్క యుత్తరిని సంకాళంబుగాగం; బ్రద
క్షిణముం జేసిరి వారు దానికిని భక్తిం; దత్ప్రదేశంబునన్
గనరాదయ్యె హయంబుగాని, మఱి భైకాగారిక స్పష్ట ల
క్షణముంగాని, యటంచుఁ గౌశికుఁడు వ్యాఖ్యానించె; రామప్రభూ! 771

భువనం బాదటఁ ద్రిప్పుచుబున పసిం గావించి రవ్వార; లం
దునమం దోఁచవు వాటి కెట్టివియు గర్తుల్, హ ర్తసుం గూర్చియున్
మున బ్రహ్మాంగభువున్ గనింపియును పేర్కం; బర్వతం బట్లు సౌ
మనసం బొక్కటి తోఁప; నంచు ముని ఏర్పం బూనె; రామప్రభూ! 772

---

496 జేరం; 497 రాజర్షి; 498 గాంచిరి; 499 మోయఁగలదౌ ఐరావతం బన్న!

కని యా దిగ్గజ రాజమున్ నయిత మైక్యం బొప్ప వారల్ ప్రద
క్షిణముల్ సల్పిరి; మ్రొక్కి నేర్చి రెలమిన్ క్షేమంబు యోగంబు వేం
టనె యద్దానిది; యంత నుత్తరంపు [600]బాటం బోయి మేనాధనా
థ్రిని ద్రవ్యన్ దొరకొన్నవా రనుచుఁ దెల్పెన్ మౌని; రామప్రభూ! 773

కని రచ్చోట హిమాద్రిచెన్ నవ తనంగా నొప్ప భద్రంబు దం
తిని భూగర్భముఁ జొచ్చి; దానికిని భక్తిన్ వార లెల్లం బ్రద
క్షిణముల్ సేసిరి; తాఁకి చూచి రెలమిఁ; గించిత్తు నే జాడయున్
గనరామిం దలపోఁత కొగ్గి; రనెఁ గల్యన్ మౌని; రామప్రభూ! 774

మనవా రర్వది వేలమందియు స్ఫుర ద్బాహాబలుల్, సాగరుల్,
కన దత్యంత సుతీక్ష్ణతేజులు, మహో గ్ర [601]క్రోద్ధ, లీశాన్య వి
క్కున వేవేగమె త్రవ్వుకొంచు ధరణీ క్రోడంబునం జొచ్చిపో
యినవా; రంచుఁ గథించె శిష్యులకు మౌనీంద్రుండు; రామప్రభూ! 775

పనిగా నచ్చట నొంటిమై గపిల రూపం బొప్ప మౌనీంద్రుఁడొ
ప్పున నున్నట్టి ముకుందునిన్, గదిక మేపుంగొంచు నున్నట్టి వా
జిని, వారల్ గని. దానిఁ బోల్చుకొని, నిశ్చిన్వాన సంతుష్టులై
జనినా రంతిక భూమి కంచు, ముని ప్రస్తావించె; రామప్రభూ! 776

కపిలక్షీంద్రుఁడె తద్దయంబుఁగొని చిక్కంబట్టి నం చెంచి కో
ప పతీతాత్ములునైన సాగరులు, క్రేవం గల్గు తన్మౌనికిన్
విపదం దెవ్వెడి పల్గు పాఱలను నావేశంబుతో నెత్తి, దెబ్బెడి 'త
మ్మిపుడే' యం చని మీఁదికెత్తి రనె మౌనీంద్రుండు; రామప్రభూ! 777

కనులన్ జేగురు గ్రమ్మఁ గైకొనిరి నాగళ్లన్ మునిశ్రేష్ఠుపైఁ
బెను కేకల్ పెడబొబ్బలున్ నెఱపి, 'పాపీ నీవె! యజ్ఞాశ్వమున్
గొని బంధించితి విచ్చటం;దెలియు నీకున్ మాదు సామర్థ్య' మం
చనుమున్ మీఁదికి లేచి; రం చనియె మున్యగ్ర్యుండు; రామప్రభూ! 778

---

600 పుఁ గాఁదన్; 601 క్రుద్ధు;

కపిలుం డప్పుడు [502]చండకోపమును దాఁ గాన్పించె; దృగ్గోళముల్
విపరీతంబుగ నిప్పుకల్ సెలఁగ, నా విష్ణుండు నవ్వారి ని
ష్కృపుఁడై చూచుచు హుంకరించె; భసితం బేర్పాటుగా [503]రాసులై
యపుడే కూలిరి వా; రటం చనియె మున్యగ్రణ్యుండు; రామప్రభూ! 770



502 మన్యువేగమును; 503 గాఁ గుప్పలై, గా బుంగలై;

-౪౧-

తనయుల్ రామికి నెంతకాలమునకుం ద చ్చక్రవర్తీంద్రుఁ డున్
మనుమండౌ దన యంశుమంతుఁ గని ప్రేమన్, 'నాయనా! రారు, నీ
పినతండ్రుల్; మఱి యేమియైరో! యెటులోఁ బృథ్విన్ సమస్తంబునున్
గని, తెమ్మీ! హయ'; మంటఁ గౌశికుఁడు వక్కాణించె; రామప్రభూ! 780

'ధరణీ గర్భమునందు వీర్యయుతమై దర్పించుచుం, గల్గెఁ దా
మర తంపంబుగఁ బ్రాణికోట్లు', పరిమార్పన్ వానినిం బైకొనన్,
గరవాలంబును గార్ముకాదికముఁ బల్కుం బూని నీ వేఁగి నా
పరువున్ నిల్పుమి'! యంట తాత, ముని చెప్పం జొచ్చె; రామప్రభూ! 781

కరమున్ భక్తిని, మార్గమందున నమస్కారార్థులౌ వారికిన్
శిరమున్ వంచుచు, నష్టపచ్చపరులం జెండాడుచుం బోయి, మా
ర్తుర యొద్దం గల వాజిఁ దెచ్చినఁ గృతార్థుండై కనుంగొందు వ
ధ్వర సంపూర్తము; నంట తాత, ముని చెప్పం బూనె; రామప్రభూ! 782

వసువుం బట్టి యతండు వోయి కనియెన్ మార్గంబు, భూ గర్భమున్
వినతంద్రుల్ సౌరఁగల్గినట్టిది; కడున్ వేగంబునం జొచ్చి తాం
చెను దైత్యోరగ యక్ష దానవ పిశాచీ ప్రేత పూజాది ఖా
జనమౌ విక్కరి; నంచుఁ గౌశికుఁడు ప్రస్తావించె; రామప్రభూ! 783

పలచు ట్తాతఁడు సేసి దానిదగు క్షేమంబుం గనుంగొంచుఁ దా
తలనుం గూర్చియు వాజినింగుఱిచి ప్రస్తావించె; నా దంతియున్,
'గలుగున్ నీకుఁ గృతార్థతల్; వడిగ నేఁగం గల్గు దీ విందికిన్
దెలుపుండా!' యనె; నంచుఁ బల్కె ముని హస్తిం గూర్చి; రామప్రభూ! 784

వరుసం బూనిన నంశుమంతుఁడు, దిశా భాగ త్రయస్థంబులౌ
గరులం బూజలఁ బ్రీతిచేయుచుఁ, 'బితల్ గన్పించిరా!?' యంచు, 'స
ధ్వర వాజిం గనుగొంటిరా?' యనుచు, సంప్రశ్నించుచున్ వేగమే
యరుగం జొచ్చె; నటంచుఁ జెప్పె ముని శ్రద్ధాసక్తి; రామప్రభూ! 785

మనుజ శ్రేష్ఠుల భాషలం బలుకు వి గ్భాగస్థ హస్త్యావళిన్
గని, త ద్వాక్యవిధంబునం బనుచు, పీఁకం గాంచె, సీతాన్వ ది
క్కున నున్నట్టి గజేంద్రమున్, మను హయోద్ఘోషంబునున్, ధన్యమౌఁ
దనవా రందఱి నాతఁ; డంచు ముని ప్రస్తావించె; రామప్రభూ! 786

కనుటన్ జూచిద రాసులన్ వసనగాఁ గష్టంబుపా టయ్యె నా
తనికిన్; వారికిఁ దర్పణాల్ వదలు సద్ధర్మంబుఁ దోఁపంగ, నెం
దును నీరాశయమే గనంబడదు; క్రిందున్ మీఁదునుం జూచెఁ; దోఁ
చెను మింటన్ గరుడుండు తా; నని వచింపన్ మౌని; రామప్రభూ! 787

ఘనుఁ డాతండు పరాక్రమి ప్రముఖుఁ డాకాశాధిరాజౌను; బో
యిన యా యుర్వదివేల సొగసులనున్ హేరాళ మిష్టంబుగాఁ
దనుపం జాలిన [504]మేనమామ, ఖవికిం దా వచ్చి యా మన్మతిన్
'ఖనవంబోకు'; మటంచుఁ దేర్చె ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 788

వినుమీ! నీ పినతండ్రులం గపిలుఁ డుర్వీ క్షేమ మూహించి చే
సెను దగ్ధంబు; సుధీమణీ! యిహమునం జేయంగనౌ దర్పణా
దిని నేమాత్రము లేదు రార్యము; దివిన్ దీపించు [505]నాహార్యనం
దన పుణ్యోదయము తర్పణార్థ; మనియెం ద న్మౌని; రామప్రభూ! 789

విలస ద్గాంగ జలంబు [506]లెట్టయినఁ ద్వ త్పింగాళ్ళ నీ భస్మరా
సులపైనం బ్రవహింపఁగా వలయు; నిచ్చోనున్న మీ యశ్వమున్
జల పూరం గొనిపొమ్ము వేగమె; బలార్కన్ వారి తా పిమ్మటన్
సలుపన్ వచ్చునె నాతఁ; డంచు ముని ప్రస్తావించె; రామప్రభూ! 790

---

504 మాతులుండు; 505 కుత్కీలు; 506 లెట్లయిన;

గరుడుం డాడిన దెల్ల విన్న యతఁ డా గాంధర్వమున్ ధీరుఁడై
త్వరలోఁ దెచ్చెను, యజ్ఞదీక్షితుఁడునౌ దత్తాత మెచ్చంగ; సా
గర దుర్భాగ్యమునున్, ఖగేంద్రుఁ డొసఁగంగానైన సద్బోధమున్;
సరవిం దాతకుఁ దెల్పె; నంచు ముని ప్రస్తావించె; !రామప్రభూ! 791

సగరుం డా భయ వృత్త మెల్ల విని క్లేశం బొందె; ధీరుండు తా
నగుటన్ శాస్త్రము చొప్పునన్, విధి విధానాధారముం బట్టియున్,
ముగియం జేసె హయాధ్వరంబుఁ; బిదపన్ భూమీ స్థలిన్ గంగ నే
వగఁ బాతించుట? యంచుఁ జింతిలె ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ 792

హిమ శైలాగ్ర తనూజ గంగ నెటు లీ యిఖ్యం బ్రవర్తిల్లఁ దె
త్తు పటం బాతఁడు, మంత్రి సత్తమ హిత స్తోమంబుతో దీర్ఘ రా
త్రములున్ దీర్ఘ దివంబులుం జలిపె మంత్రాలోచనల్ పెద్దకా
లము వ్యర్థంబుగ, [507]మ్రుంగుదాఁక; ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 793



507 మ్రుందు;

కన నాతం డటు కాలధర్మము, మహాకాలంబు పాలించి, వెం
టనె [508]ధీమంతులు మంత్రిసత్తములు కట్టంగట్టి రా యంశుమం
తునకుం బట్టము, సర్వపాలిత జనాస్తుంకారముం బొంది, ధ
ర్మ నిరూఢంబుగ; నంచుఁ బేరుకొనియెం బ్రాజ్ఞుండు; రామప్రభూ! 794

ఒసరన్ ధర్మము నాల్గు పాదములఁ, నెంతో గొప్పఁగా రాజ్యపా
లనముం జేసెఁ, ద దంశుమంతుఁడును; దర్వాతన్ దిలీపుండు పొం
దెను రాజ్యంబు జగ త్ప్రసిద్ధుఁడయి కీర్తిం దండ్రి కోరంగ; నా
యన గంగన్ భువిఁ దేరఁ బూనె; నని మున్యగ్ర్యుండు; రామప్రభూ! 795

తన సంకల్పము దీరఁగా హిమ మహేంద్ర ప్రస్థ మాతండు చే
రెను; దానన్ ధృతితో దిలీపుఁడును సల్పెన్ దీర్ఘ కాలంబు దా
రుణ [509]దుష్కాంత తపంబు; ధన్యతయె పొల్పొవంగ స్వర్గస్థుఁ డ
య్యెను నాతం; డని పేర్కొనం దొడఁగె మౌనీంద్రుండు; రామప్రభూ! 796

ధరణీంద్రుండు దిలీపుఁడుం దినదు ముత్తాతల్ శతం బొటకున్
దురపిల్లెన్; భువి కెట్లు గంగ నిఁకఁ [510]దెత్తుం దా నటం చెంచుచున్,
బరమ క్లేశము నొందె; బాహు బల సంపన్నుండునై కూడ, సు
ద్ధరణోపాయ మెఱుంగలేక; యనియెం దన్మౌని; రామప్రభూ! 797

విదితాత్ముండు దిలీపుఁ డెప్పుడును జల్పెన్ ధర్మంబింతన్ ధనే
ప్రవిద్యై యజ్ఞ పరస్సహస్రములు; తీరన్ లేదు ముత్తాతలన్
ముదమారంగను సుద్ధరించు తృషయే! పొందెన్ మనోవ్యాధియున్
పుడిమిన్ స్వర్గతుఁ[511] డయ్యె నాతఁ; డని చెప్పెన్ మౌని; రామప్రభూ! 798

---

508 ధీశాలురు; 509 దుర్ధర్ష; 510 తెత్తున్ నే; 511 గు;

మునుపుత్త్రిన్ ధరణీశుఁజేసెను దిలీపుం డాధి సంపీడ నొం
దిననాఁడే! మఱి యా భగీరథుఁడు బొందెం దేజ మత్యంతమున్
దన ధర్మాధిక తత్పరత్వమున; సంతానంబునుం బొందఁ డెం
దుననో! గాని; యటంచు గాధిజుఁడు వొందుం జింత; రామప్రభూ! 799

తన సంతానముకోసమై [512]ధరణిమీఁదన్ గంగ తెల్పైన వ్యా
ప్తిని గల్గించు నిమిత్త మాతఁడు ప్రవర్తించెన్ మహా ఘోర రీ
తిని బంచాగ్నుల మధ్యలోఁ దపముఁ, బ్రీతిం బుణ్య గోకర్ణమం
దున సుక్షేత్రములోన; నంచు ముని పొందుం దృప్తి; రామప్రభూ! 800

కనలం జేసె జగాళి నా తపము బల్మాకన్; సుర జ్యేష్ఠుఁ డో
పనివాఁడై పలు కాక, దేవతలతోఁ బ్రత్యక్షమై యిత్తు నీ
కనియెం దాను వరంబు తుష్టుఁడయి; వీఁకం దత్తపో నిష్ఠచే
ప్రణతుం డయ్యె భగీరథుం; డనియెఁ బ్రేమన్ మౌని; రామప్రభూ! 801

పరమేష్ఠీ! నను ధన్యుఁ జేయఁగఁ దలంపన్ నీవు చూతేని, సా
గర భస్మోద్ధృత రాసులందునను గంగం బర్వఁగాఁజేసి, స
తర్పమే [513]వారికి గాంగ తర్పణము సల్పం జూచి, సంతాన సం
భరితుం జేయుమి న న్నటం చనె, ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 802

పరమేష్ఠీ! కృశియింపనీయవల దిక్ష్వాకాన్వవాయంబు; భా
స్వరమౌ నట్లుగ [514]దీర్ఘ కాలమును దీర్పంజూడుమీ! దీని, సు
స్థిర సంతానపు తంతు ధారణము సిద్ధింపంగ; నా కిమ్ము నీ
వరముల్ రెం; డని వేఁడె నాతఁ డనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 803

---

512 మున్; 513 నే నిఁక; 514 సర్వ

తనయా! నీ తొలికోర్కె దుష్కరము; సంధానింతు నట్లైననున్;
గొనలేఁడున్ భువిదీయవంక; మెఁకఁ గల్గుం బుత్త్రి రత్నంబు నీ
కనుమున్, భూమి భరింపఁజాలనిది గంగా పాతమున్, దాని మే
లును, నీవే దలపోయుమం టఁజూడు, తెల్పున్ మౌని; రామప్రభూ! 804

తలఁపన్ భూపతి నీవు; భూమి శశి చింతం బూని దివ్యోదక
స్థలనోద్భూత గరంబుఁ దాపవలయుం గాదే! హరుం డొక్కఁడే
యిలపైనం బడు తత్ప్రవాహమునుపదో పేలాళ వేగంబు ని
శ్చలుఁడై చూఁపు; నటంచు బ్రహ్మ, ముని ప్రస్తావించె; రామప్రభూ! 805

హరదేవున్ మతి నీవె యర్థిగఁ దలఁ! సంప్రార్థింపఁగా నౌను సు
స్థిరతం బూని, భగీరథా! యిఁక స్రవంతీ రత్నమా! గంగికా!
నెరపం బూనుమి నీని కోర్కెల యని, వానిన్ దానినిం జూచి ప
ల్కు, రహిన్ బ్రహ్మ తిరోగతుండగుటఁ దెల్పెన్ మౌని; రామప్రభూ! 806



ధరణిన్ బొట్టన వ్రేలిపై నిలిచి సుస్థైర్యంబునం జేసె దు
ష్కర దుర్వార గతిన్ భగీరథుఁడు ఘోరంబౌ దపం బొక్క వ
త్సర కాలం; బది మెచ్చి యా హరుఁడు ప్రత్యక్షంబునై, 'గంగికన్'
శిరసా దాల్చెద నంచుఁ బల్కుచు వచించెన్ మౌని; రామప్రభూ! 807

ఖరమై మూర్ధమునందు దూఁకిపడుచున్ భావించె నా గంగ శం
కరుఁ బాదాళముదాఁక లాగికొను పోకన్ బోవఁ; దద్గర్వమున్
హరుఁ డూహించి యమర్షియై శిరమునం దా గంగ బంధింప ను
ద్ధుర భావంబునుబూనె; నంచు ముని పొందుం దుష్టి; రామప్రభూ! 808

హరదేవున్ శిరమందు దూఁకుచునె యా యాకాశ సంచారి నీ
ర్ఝరిణీ [515]ముఖ్యము, తజ్జటాచ్ఛటలఁ జేరంబోవ, హైమాద్రి కం
దర తుల్యంబులు నయ్యె నవ్వి; యగుటం దద్గంగ తద్గహ్వరాం
తర నిర్బద్ధము నయ్యె; నంచు ముని హ్లాదం బొందె; రామప్రభూ! 809

తను బైటం బడలేకపోయెను జటా తండంబునందుండి పు
ణ్య నదీ తల్లజ; యట్లు దానికి నశక్యం బయ్యెఁ జేరంగ భూ
మిని; పేశాను జటాటవిం దిరుగుచుం బృథ్విం బడన్లేకపో
యెను బె కేండ్లు; నటంచుఁ జింతడె మౌనీంద్రుండు; రామప్రభూ! 810

కనరామిన్ [516]ధుని, యా భగీరథుఁడు నుగ్రంబౌఁ దపం బాచరిం
చెను నీ సారియు నీశ్వరున్ గుఱిచి; కాశీనాథుఁడున్ మెచ్చి, చె
ప్పెను గంగం దను బంటు పుష్కరిణిలోఁ బ్రేక్ష్యంబుగా జార్చ నం
చని, యంచున్ వచియించెఁ బ్రీతిమెయి మున్యగ్ర్యుండు; రామప్రభూ! 811

515 జ్యేష్ఠము; 516 నది;

మరలెన్ బిందు సరస్సునుండి యది సప్త స్రోతసోరూపమై
ధరణిం బర్వుచు; హ్లాదినీ నలిని లన్ ద న్నామముల్, పావనీ
పర నామంబును మూఁడు దాల్చి తత్వతలోఁ బాయక్ సనెం దూర్పుగాఁ
బరమ శ్రేయదమై; యటంచుఁ బలికెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 812

మరలెన్ గంగ యనే విధంబుగ శుభాంభస్సంవిధానంబుతోఁ
బరగం బూని 'సుచక్షు' వం చొకటిగాఁ, బ్రాపించు 'శీతా' మహో
దర నామంబున రెండుగాఁ, బిదప 'సింధూ' ప్రఖ్యతో మూఁడుగా,
సరవిం బశ్చిమటఁ బాయలై, యనె ముని [517]స్కంఘుండు; రామప్రభూ! 813

పయనం బయ్యె భగీరథున్ వెనుకన్ బ్రహ్మాండ వేగంబుగన్
బయితే జేడవ పాయ; యాయనవి [518]దివ్య స్యందన చ్ఛాయలో
బయనిస్ సాగుచు; నా రథం బెటులఁ బర్వెం బూనె నీ పాయయున్
బయనం బట్టులఁ బూనె; నంచుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 814

ఆకాశంబుననుండి యీశుని శిరం; బందుండి యీ [519]మేదినిన్
సోకన్ వీఁకను దూఁకు దేవ తటినీ స్రోతంపు ధ్వానంబుఁ దా
నాకర్షించె సమస్త లోకముల; దివ్య వ్రాతముల్ మూఁగె గం
గా కల్యాణినిఁ జూడ; నంచు [520]ఋషి వక్కాణించె; రామప్రభూ! 815

సౌరిదిం బేర్చిన పట్టణంబు లనఁగా శోభిల్లుచుం దోఁచు సుం
దర సౌవర్ణ విమాన రాజములునున్, దంతీంద్రముల్, దివ్య కిం
కరముల్ దేరఁగ దేవతల్ దిసటలోఁ గీ త్రాంచె మేషాళి; భా
స్వర మయ్యెన్ దివ మప్పు; డంచుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 816

పరమ ప్రస్థ మహస్సుచే వెలుఁగు దివ్యగ్రామ దేహంబులన్
ధరియింపం బనియున్న యాభరణ సంప్రాప్తీయ ప్రభల్, కోటి భా
స్కర భానూదయ కాంతి తోఁచినటు, లాకాశంబునం దోఁచె, దు
ద్ధర వైశద్యముతోఁ; నటంచుఁ దెలిపెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 817

---

517 ఘుండు; 518 దివ్యత్స్యందన; 519 భూమినిన్; 520 ముని;

తరమై పర్వెడి గాంగ నిర్ఝరముతోఁ దాఁజేర్ల మీనంబులున్
పురులోషం గల గ్రాహ సంచయములుం బొల్పారు సర్పంబులున్
బొరలన్ భూమిని వ్యోమ మార్గమున సొంపుల్ మీఱి శంపా లతల్
పరుగుల్ వాఱినయట్లుఁ దోఁచె; ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 818

వర గంగా సలిల ప్రవాహ పతన ప్రాకట్య మత్యంతమున్
నురుగుల్ పిండిరిఁజిమ్ముచుండి, సిత కాంతుల్ వ్యాప్తముం జేయఁగా,
వరటశ్రేష్ఠము లందు నఱి దెగురుచున్ వర్తించుచుండంగఁ, దా
శర దభ్రం బనఁ దోఁచె మి; న్ననెఁ బ్రశంసన్ మౌని; రామప్రభూ! 819

ఒకచో, వేగముగాఁ గఁ, మందముగ నిది కొక్కంట, వఱి పొచు వే
ఱొకచో, వంకరటింకరై సుడొకచో, నూగాడు చిఁ కొక్కెడన్,
ప్రకటంబౌ సువిశాలతన్ మఱొక క్రేవన్, పైఁకి బంధించు చిం
కొక చాయం బ్రవహించె గంగ; యనె మున్యుత్తముఁ; రామప్రభూ! 820

ఎగురం జొచ్చెఁ దరంగ భంగిముల నెంతే దర్శనీయంబుగా
వగలం జూపుచుఁ; బ్రై విధంబులుగఁ బర్వంజాలుటన్ గంగ, పోం
డుగ నిష్కల్మష మయ్యె; శంభు జడలందుం బర్వతం దాల్చెఁ బ్రా
తిగఁ బావిత్ర్య; మటంచు వాకొనియె నంతిన్ మౌని; రామప్రభూ! 821

మనుజుల్ దివ్యులుగూడ గాంగ సలిల ప్రఖ్యాత సుస్నాతులై
చని; రందాఁకను శప్తులై పుడమిపైఁ జైతన్యమేలేకయుం
డినవారెల్లరు పాప శాపముల రెంటిం బాసి రా పుణ్య వా
హినిలో గాహ మొనర్చి; యం చనియె మౌనీంద్రుండు; రామప్రభూ! 822

రుచిరార్కంబటె వార లెల్లరు యథా రూపంబులం దేజరి
ల్లుచు, నాతాళ పథంబునం జనిరి పీలుంబట్టి స్వ స్వ క్షితి
ప్రచురంబున్ బడి; దివ్య కాంతి యుతమై పర్వెత్తు నా గంగఁ జూ
చుచుఁ బొంగెం జన; మంచు మౌని యనె శిష్యుం జూచి; రామప్రభూ! 823

జనముల్ మూఁగి పవిత్రమైన జలములన్ స్నానార్థులై భక్తితో
మునుఁగం బూనఁగ, వారి మెల్ల శ్రమముల్ ముఖ్యంబుగాఁ బాసెఁ; గ
ల్గెను సౌఖ్యానుభవం బపూర్వముగఁ దల్లిక్కాశ్య జ్ఞాన శ్రేణికిన్
ఘనమై; యంచుఁ బ్రమోది గాధిజుఁడు వక్కాణించె; రామప్రభూ! 824

నడయాడంగ భగీరథున్ రథమువెంటన్ గంగతోఁ బాటుగాఁ
బుడమిం బూనిరి దైత్య దానవ సుర వ్యూహంబులున్, యక్షులున్,
బడయంగాఁ గ్రమమున్ మహోరగులు, నభ్యర్ణస్థులౌ నచ్చరల్,
వసి గంధర్వు; లటంచుఁ జెప్పెఁ దొడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 825

ఆపలంకుండగు జహ్నుమౌనిగల యా యజ్ఞంపు వాటంబు వెం
తపుఁ రాఁ బోయి, భగీరథక్షి రథమో! దబ్బాటుగా [521]నాఁగె; వా
రక వేగంబుగ వచ్చుగంగ యటులన్ రాదాయె నాగంగ; వా
టికనున్ ముంచెను జహ్నుయోగి; దని చాటెన్ మౌని; రామప్రభూ! 826

మునికిన్ వచ్చెను బట్టరాని [522]గతిలో మున్నాడి యావేగ; మా
యన యత్యద్భుత శక్తిమంతుఁడుసుమా! యా గంగనుం ద్రాగివే
సెను సర్వంబును నిట్టి; యెల్లరు మహర్షిం జూచి యాశ్చర్యమొం
దినవారై రమితంగా; ననియె సంతిన్ మౌని; రామప్రభూ! 827

---

521 నిల్చె; 522 దగుచున్;

కని యా యద్భుతమున్ భగీరథుఁడునున్, గంగా ప్రవాహంబువెం
టనె యా వచ్చినవారు, జహ్నువును వేఁడం జొచ్చి, రత్యంత పూ
జనమున్ సల్పుచు, "లోక శోభనపు శంసం బూని, యా గంగ నో!
మునిదేవా! విడు" మంచు, నంచు ముని దెల్పం బ్రీతి; రామప్రభూ! 828

'మునివర్యా! తమ కూఁతుగాఁ దలఁపుఁడీ! పూతాత్మ నీ గంగ'; నం
దుననే లోక హితంబుకోస మని ప్రద్యోతించు నద్దాని, న
త్యనఘన్ వీఁడు' దటన్న జహ్నుముని త ద్వాచ్చన్ మదిన్ మెచ్చి గం
గను వీఁడెం జెవినుండి'; యంచు ముని వక్కాణించు; రామప్రభూ! 829

ముని కుబ్రంబును వెంటనంటిన దదే మోడిన్ వియ ద్గంగ; యా
యనయున్ సాగరగామి యయ్యె; నటులే యయ్యెం జల ద్గంగ; యా
యన పాతాళములోనఁ జొచ్చె; నటులే యా గంగయుం జొచ్చె నం
దున వైషమ్యముతోడ; నంచు ముద మొందున్ మౌని; రామప్రభూ! 830

చని యచ్చోట భగీరథర్షి తన వంశ స్థాపకుల్ తాత లొం
దిన దౌర్గత్యముఁ దెల్పు భస్మమును నా డింగూర్చు త ద్రాసులన్
ధునికిం జూపఁగ, నద్ది తన్మనిచి చేతోభావ సాఫల్య సా
ధనమై పర్వెను వానిపై; నని ఋషీంద్రస్వామి; రామప్రభూ! 831

ఫలముం బొందె భగీరథర్షి కృత యాపద్యత్న, మా భస్మ రా
సులమీఁదం బ్రవహింప గంగ; సగరున్ సూనుల్ పరాభూత పా
పులుగా స్వర్గతులైరి యెల్లరును, దమ్ముం బొంద తల్లోక వీ
థు; లటంచున్ ముదమార గాధిజుఁడు మెచ్చన్ వారి; రామప్రభూ! 832



సుర గంగాంబువు భస్మరాసులను బ్రస్తుత్యంబుగా ముంచుచున్
బరుగెత్తన్, సరసీ [523]రుహా ననుఁడు ప్రేమన్ వచ్చి తా మెచ్చె సా
గరులం బ్రోచిన యా భగీరథుని దీక్షారూఢి, నవ్వాఁడినిన్
దఁతప్ సేసినదాని కంచు, ముని ప్రస్తావించె; రామప్రభూ! 833

నృపశార్దూల! భగీరథా! జలధిలో నీ రింకి పోనంతకా
ల పరిచ్ఛేదముదాఁక, దైవతగతిన్ రంజిల్లుచున్ దేవతా
నిపుణోపమ్యముతోడ వీరు సుఖముల్ [524]నిశ్చింతులై పొందుటన్
వృషనిష్టం బని బ్రహ్మ తెల్పె; నవియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 834

నిను భావింతురు గంగకున్ జనకుఁగా, నీ దీక్ష కెల్లారు మె
చ్చెన; రాజన్మమహేంద్ర! గంగయును బొల్చున్ నేఁటితో లోకముం
దున భాగీరథి యందుము నీదయుం బ్రిపథగానూనాభిధానంబుతో
నన; సంయన్ విధుఁ డాడె సుమ్మనియె వేడ్కన్ మౌని; రామప్రభూ! 835

అల ధర్మోదము లిమ్ము తాతల; కభీష్టావాప్తి నీ కౌను; పె
ద్దల కెవ్వారికిఁ [525]గూడిరానిపని శ్రద్ధం జేసినా వీవు, ని
ర్మల విఖ్యాతము, ధర్మకీర్తియు నినుం బాలించు; నం చాడె నా
తొలివే; ల్పంచు వచించె గాధిజుఁడు సంతోషాన; రామప్రభూ! 836

ఓ! రాజోత్తమ! గాంగవారి యెపుడున్ యోగ్యంబు పానాదికిన్;
పారావార జలంబు మావిరిది యేమాత్రంబునుం గాదు; నిన్
బారీణుం బొనరించు శుద్ధత సుపస్పర్శంబు గావింప; నిన్
గూరుం బుణ్యా; మనెన్ విధుం డసుమఁ బల్కుచున్ మౌని; రామప్రభూ! 837

---

523 రుహోద్భవుఁడు; 524 నిశ్చింద్రుఁడు, నిశ్శంకు; 525 జేతఁగాని;

తనకున్ క్షేమముగల్గు నం చనుచు నంతర్ధానమౌ నంబుజా
సను మాటం బది, యా భగీరథుఁడునున్ స్నానంబు గావించె నా
ఘనిలోనం, బవిత్రుఁడౌటకౌ లు! కందుం దాత తెల్లాయెన్
దని [526]ధర్మోత్సదము లిప్పు; నంచు ఋషి ప్రస్తావించె; రామప్రభూ! 838

అనివార్యాభినవ [527]ప్రసిద్ధిని నయోత్థ్యం జేరుచున్ రాజ్య పా
లనమున్ జేసె భగీరథర్షి, ప్రజలున్ రంజిల్ల, సర్వార్థముల్
వినియోగంబునకున్ సమృద్ధిగ, వినిర్వృతిన్ లభింపంగ, నా
జనముల్ సౌఖ్యము నొంద; నంచు ఋషి ప్రస్తావించె; రామప్రభూ! 839

ఆది సౌమ్యంబున మాఘమాస బహుళం బందైన సు ద్వాదశీ
విదితానర్ఘ దినంబు; గాంగ కథఁ దృప్తిం గొల్పఁగాఁ జెప్పి యా
సదయుం డంతట లేచెఁ గౌశికుఁడు తాన్ సంజన్ నిరూపించుచున్,
స్వదమే యెల్లరు సాంధ్య కృత్య విధులన్ సల్పంగ; రామప్రభూ! 840



526 దను; 527 ప్రతిష్ఠఁ దు;

మునిదేవా! బహువిస్మయంబుఁగొలుపున్ మామ్మాటికిం, దాము చె
ప్పిన గంగావతరంబు, సాగర మనోభీష్ట ప్రవేశంబుఁ; దా
వన గాథన్ వచియించినా; రనుచు విశ్వామిత్త్రునిన్, సోదరుల్
మనసా దాశరథుల్ నుతించి కయిమో[628]డ్పంజల్లె; రామప్రభూ! ౮౪౧

మునుబున్, దాశరథుల్, గురుం డగు మహాపుణ్యుండు గాధేయుఁ డున్,
దనివిం బుచ్చిరి నాఁటి రేయి యటనే; దత్సోదరుల్ ప్రొద్దుపో
యిసదాఁకం దమ విన్న యా త్రిపథగా వృత్తాంతమే యెంచుచున్
మునుఁగంజొచ్చిరి నిద్రలో నెటులొ! సమ్మోదాన; రామప్రభూ! ౮౪౨

తెలవాఱం దెలతెల్లఁగా, గురువు గాధేయుండు తా నాహ్నికం
బుల నిర్వర్తనమూఁ బొనర్చి పయనంబుంజేయ నుద్యుక్తతన్
జెలిబుచ్చెన్; నృప నందనుల్ సయుత మా వేళం బ్రవర్తించి య
గ్నులు, బ్రహ్మర్షి పదంబులం దిడిరి మ్రొక్కుల్ భక్తి; రామప్రభూ! ౮౪౩

మునినాథోత్తమ! పూర్వరాత్రమున మహా పుణ్య ప్రదం బందు; మా
వినసౌ సత్కథ యెల్ల వింటిమి; నిశిన్ మేల్కాంచి తద్వృత్తమే
మనసంబూఁ బొసరించుచుంటఁ దృటిలో వ ౘే వేఁకోక మాఁ;
కను నా రాఘవుఁ గాంచె గాధిసుతుఁ డాహ్లాదాన; రామప్రభూ! ౮౪౪

తమకోసంబయి నావ నిల్పినది సిద్ధంబై; యహర్పంబడెన్
శ్రమమూల్ వాపెడి యా స్తరంబు లట విస్తారంబుగా, నెల్లరున్
స్థిమితం బొందుచుఁ గూరుచుండుటకు; నీ త్రిస్రోతసున్ దాఁటిపో
చము వేగన్ మన; మంచు రాఘవుఁడు ప్రస్తావించె; రామప్రభూ! ౮౪౫

---

౬౨౮ ద్విప్వంత్రు; ౬౨౦ కనినస్;

మునులున్, గాధిసుతుండు, దాశరథులున్ మోదాన నా నావ నె
క్కిన, గంగానది నుత్తరించి యవి, యక్షీణంబు క్షిప్రంబునన్
గొనిపోయెం దనవారి నుత్తర దిశా కూలంబు నంటంగ, వా
రును దతీరంపు నైజ శోభయును మెప్పున్ మెచ్చ; రామప్రభూ! 846

మెలమెల్లన్ నడయాడి యా తటమునన్ మెత్తెల్లనున్ మెచ్చి వా
రలు వేగంబును బుంజుకొంచును విశాలాపత్తనానూన శో
భల దర్శించిరి; స్వర్గ ధామము వలెన్ భాసిల్లు నద్దాని శ్రీ
ల లసత్ప్రోధికిఁ గౌసలేయుఁ డెదలో రంజిల్లె; రామప్రభూ! 847

స్వామీ! స్వర్గముఁబోలు నీ పురము సౌభాగ్యంబుచేఁ; గాన, వి
శ్వామిత్రక్షితి [530]మహేంద్ర! దీని నెపు డే వంశంబువా రేలిరో!
ప్రేమం దెల్పుఁడి! నాకు; మీరు దెలుపన్ మిన్నంది యీ యెల్లవా
రామోదంబున విందు; రం చనె [531]రఘూద్యత్కీర్తి; రామప్రభూ! 848

తనయా! యిద్ది విశాల యన్ బురము; వృత్తాంతంబు నే దీనిదా
నిని దొల్లింటిది ముందు మీకు వినుకున్; నీతాత్ములన్ దేవతా
జనయిత్రీమణియున్, మహాబలులనున్ జైవాతృకుల్గాఁగఁ బొం
దెను రక్షః ప్రసువుం జుమీ! యనియె గాధేయుండు; రామప్రభూ! 849

వీరున్ వారును [532]నేకమై కొనిరి, తృప్తిన్ నిర్ణయం బొక్కటిన్
దూరంబుం బొనరింప మృత్యు రుజలన్ దుష్టంపు వార్ధక్యమున్
స్వారోపాయముచేతఁ; బా ల్కడలి తెస్సం ద్రచ్చి పీయూష సం
భారోత్పాదముఁ జేయఁగోరి; రనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 850

దితి సంతానముతోడ, నా యదిది సూతి వ్రాత మీ రీతిగా
జతనయ్యెం గృతనామకం బగు యుగ [533]స్వాచ్ఛంబునన్; వారు సం
తత పీయూష రస ప్రపానముమెయిన్ దాఁటన్ జరా మృత్యువుల్
గతిగా నెంచి! రటంచు గాథిజుఁడు వ్యాఖ్యానించె; రామప్రభూ! 851

530 వతంస; 531 ద్యన్మౌళి; 532 నొక్కటై; 533 స్వాస్థ్యంబు;

హా రా మందర [634]కందరాంగి నొక కవ్వం బట్లుగాఁ జేయుచున్,
దేరం గల్గిరి సర్పరాజమును బ్రీతిన్ వాసుకిం ద్రాడుగా;
బీరావేశముతో మథించి రెటులోఁ బెక్కేండ్లు [635]విశ్వాసులై,
క్షీరాబ్ధిన్ సుధఁ బొందఁగోరి; యని పల్కెన్ మౌని; రామప్రభూ! 852

ఊహగం బోవక మందరాద్రి గతమై యున్నట్టి యా జాళ్ల నే
ర్పడఁగాఁ గట్టిగఁ గాటువేయుటకుఁ దాఁ బ్రత్యేకమున్ బూనుటన్,
దొడఁ కెన్ వాసుకి సర్వ వక్త్రనిలయందుం గల్గు కాకోల మ
ప్పుడు గ్రక్కుల్ వలె; నంచుఁ జింతవడి చెప్పెన్ మౌని; రామప్రభూ! 853

అటు లా పాల సముద్రమం దెసఁగెఁబో! హాలాహలాగ్ని చ్ఛవి
చ్ఛటు; లా మంటలు దేవ దానవ మనుష్య శ్రేణికిం గొల్పె దు
ర్ఘట సంత్రాసము, సర్వలోకములు దగ్ధంబౌ నటం దోఁచుచున్,
బటు జృంభణంబున; నంచుఁ బొంగిపడియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 854

తదయం బోక నిలింప సంతతి, సమస్తప్రాణి సంఘంబుఁ బ్రో
చెడి రుద్రున్ శరణంబు వేఁడికొనె నక్షీణార్తిమై; విష్ణువున్
బొడసూపెం దగు శంఖ చక్రధరుఁడై పూర్ణానురాగంబుతోఁ
దడవన్ వారినిఁ గూర్చి శూలి; కనె వింతన్ మౌని; రామప్రభూ! 855

చిరు నవ్వొత్తఁగ శూలభృత్తుఁ గనుచున్ "శ్రీశర్వుఁడా! నీవు ని
ర్జర లోకంబున కెల్ల నగ్రజుడ! వీ సంద్రంబునుం ద్రచ్చుచోఁ;
బొరలున్ ముందుగ నెద్ది, యద్ది కొన [636]నొప్పున్ జ్యేష్ఠునై వేద్యమై
జరగన్ నీ; కనె విష్ణుఁ; డంచుఁ బలికెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 856

గమనించెన్ శివ దేవుఁ డా విబుధ సంఘ త్రాసమున్; విష్ణు వా
క్యములన్ యోజన చేసి చూచె; నటుపై నా భీకరంబైన క్ష్వే
ళము నిట్టే దిగజాఱ మింగెఁ; బొనుబాటన్ దివ్యులున్ రక్కసుల్
దమ యుత్కంఠము వెంఁడిఁబూని; రనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 857

---

634 పర్వతంబు; 635 ప్రత్యగ్రతన్; 636 నొప్పు;

తమికున్ మంథనమైన మందరము పాతాళంబు పర్యంతమున్
గ్రమకంబై దిగజాఱుచుండఁగ, సురల్ కంజాతునిం జూచి, యు
త్తమ బాహా! మముఁబ్రోవుమీ! [537]యిదియు నెత్తంజూచి, యన్యుండు క్షో
రమునం బోలునె? ని; న్నటం చని; రనెన్ [538]బ్రహ్మర్షి; రామప్రభూ! 858

కమఠంబై తన వీఁపునన్ గిరియుఁ దాఁకన్ శౌరి యా పాలసం
ద్రమునం జొచ్చుచు నిల్వఁజాలెను మహీధ్రంబుం గడున్వేగమే,
సమతం దాఁ బవళించు దా యుదధిలో; జహ్నూత్తముం డంత [539]గో
త్రము కొమ్ములఁగొని కూడఁ దోప్పడె; ననెన్ [540]రాజర్షి; రామప్రభూ! 859

ఒకచేతన్ దృఢ దండముం గొనుచు, వే ఱొక్కండు హస్తంబునన్
బ్రకృతిం గైకొనుచుం గమండలువు, జన్మంబొందె, [541]క్షీరాబ్ధి ఘం
జక కల్లోలములందునుండియును నస్వప్నాఽ గదంకారుఁ డు
త్సుకుఁడై; యంచుఁ గథించె గాధిజుఁడు సంతోషాన; రామప్రభూ! 860

తరువాతం గలశాబ్ధినుండి బయలొందం [542]జొచ్చె నత్యద్భుతం
పు రసం బొక్కటి; దానినుండి పడుచుం బుంఖానుపుంఖ క్రియన్
దొరయం జొచ్చిరి కన్యకామణులు సందోహంబులై యర్వదిన్
దొరయం గోటుబమంది; యంచు ముని చెప్పన్ వింత; రామప్రభూ! 861

పర వర్చిస్విను అప్సరోఽంగనలతోఁబా టుద్భవం బొందియుం
డిరి, కోట్లావిగ సేవికామణులు; పెండ్లిం జేసికోనెంచ రె
వ్వరు నా యచ్చర లేమలన్, దితిజులున్ పక్షిష్ణుతొ [543]దివ్యు; లె
ల్లరు నా కాంతలు వేశ్యలైరి; యనె మెల్లన్ మౌని; రామప్రభూ! 862

---

537 కుధర మె; 538 రాజర్షి; 539 భూధ్రము; 540 బ్రహ్మర్షి;
541 దుగ్ధాబ్ధి; 542 బూనె; 543 లా;

వరుణున్‌బుత్త్రిక వారుణీమణి యనం బ్రఖ్యాతయౌ నామె యా
తరణిం బుట్టె సుధాధిదేవతగ, దైత్యవ్రాత మిచ్ఛింపఁ దా
సుర సేవింపఁగ; నందుచే నసుర సంస్తోమం బనం జెల్లె; ఖే
చరులో! ద్రావిరి దాని; నంచు ముని ప్రస్తావించె; రామప్రభూ! ౮౬౩

సుర సేవించుటవల్ల వారు సురలై శోభిల్లి యానందమున్
బొరయం బుల్కలు దాల్చి; రా పిదప నం భోరాశి నుచ్చైశ్రవ
స్ఫురణం బయ్యెను; గౌస్తుభం బొడమె; నుద్భూతంబు నయ్యెన్ మహో
ద్ధుర పీయూష; మటంచు మోదమును బొందున్ మౌని; రామప్రభూ! ౮౬౪

అమృత స్వీకరణంబు కోసమని దివ్యాదివ్యులుం బోర, లో
కములే తల్లడ మొందె బెగ్గడిలె; శ్రీగర్భుండె తా మోహినీ
రమణీ రూపముఁ దాల్చి వచ్చి సుధ నెల్లన్ దాఁచఁగా, రేఁగె ఘో
రముగాఁ బో రిరువాగులం; దనియెఁ జెల్పెన్ మౌని; రామప్రభూ! ౮౬౫

తన కర్తంబుగ వచ్చు నా దితిజులన్ ధ్వంసంబు గావించివే
సె, నిరాహారుఁడు; దేవతల్ సయితముం జెండాడి; ర వ్వారి మా
రణముం జేసిరి; యింద్రుఁ డా పిదప స్వర్గంబున్. సుధం బొంది యే
లెను త్రైలోక్యము; నంచు గాధిజుఁడు వల్కెన్ హాళి; రామప్రభూ! ౮౬౬



—౪౬—

వెత నొందెన్ వితి, సంతతిం దలఁచి యాభీలంబుగా నద్ది తా
హతమైనందుకు; భర్త కాశ్యపునితో నా సాధ్వి, "యో! నాథ! నీ
సుతు లాదిత్యు లమేయ విక్రములు; నా సూనాళినిం దేర్చి: రీ
గతి నైతిన్ గతపుత్త్రి; నంట ముని వ్యాఖ్యానించె; రామప్రభూ! 867

"తలఁపన్ శక్రుని నోర్వఁగాఁగల కులాధారుం బ్రసాదింపఁగా
వలయున్ నా; కెటువంటి నిష్ఠనయినన్ వర్తిల్లుచుం జేయుదున్
జలముం బూని మహాతపం"; బన, "సతీ! సంతోషమా నీ"; కనెన్,
మెలఁతం దేర్చఁగఁ గోరి భర్త; యని తెల్పెన్ మౌని; రామప్రభూ! 868

అయినం బుత్త్రిని నీవు గాంచుమటఁ, కా యత్యర్థ నిష్ఠన్ శుచి
ప్రయతాత్మంబున నుండఁగా వలె; శుచి భ్రష్టత్వ మా నిష్ఠ క
వ్యయ నష్టం; బని పల్కి, కోర్కి సఫలంబౌ నంత పర్యంతమున్
నియమం బూనఁగ భర్త కోరె; ననె మౌని స్రష్ట; రామప్రభూ! 869

తుదిదాఁకన్ శుచివై మెలంగుమెడ నింద్రుంగూల్చ, నీకున్ జయ
ప్రదుఁడై, లోకము తెల్లి నేలెడు కుమార శ్రేష్ఠ నీ వొంద న
య్యెద; నం చామెను దేర్చి, మై నిమిరి, పోయెం గాశ్యపుం డంతఁ దా
ను దపంబుం బొనరింప; నం చతని నెన్నున్ మౌని; రామప్రభూ! 870

పరమానందముతోఁ గుశప్లవ మునన్ వర్తిల్లు నచ్చోటఁ దాన్
జరుపంగాఁ దప మామె చేరెను; సహస్రాత్ముం డు తత్సేవకై
జరిగెన్ సర్వ మెఱింగి యచ్చటికి విస్రంభంబునుం గొల్వుచున్
బరచిత్తజ్ఞుఁడు, నీతిమంతుఁ; డనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 871

జలముల్ వహ్ని(గుశాదులన్ సమిధలన్ సచ్ఛీల సంపన్ను(డై
ఫలముల్ నిత్యము( గందమూలములు( [544]గూర్చ(గల్గె; సేవార్థతిన్
బలుపో(కల్ సనె, విశ్రమంబు( గొలుపన్ వామాక్షి కింద్రుండు; మె
చ్చుల పై మెప్పులు గుప్పెనామె; యని యొప్పున్ మౌని రామప్రభూ! 872

చితికిం గానుపువేళ దగ్గఱిలె; నుత్సేకంబు నుల్లాసమున్
మితిమీఱెన్; "సురముఖ్యు(డా! పొడము(జామీ! నీకు(దమ్ముండు నా
వెత దీఱన్ ఖవదీయ వక్త్ర యొస(గెం బ్రేమన్ నినున్ మీఱెడున్
సుతునిన్ నా"; కనె నామె యంచు పగ నిందున్ మౌని; రామప్రభూ! 873

కనుకన్ నాతు( డ్రిలోక జేతయును విక్రాంతిస్థిరుం డయ్యెడున్
దనయుం; డైనను నిన్నెదుర్పని సమాధానంబు నే( గూర్తు, వా
నిని స్నేహంబున( ద్రిప్పి నీ దెసకు; [545]వానింగూడి నీ వేలుకో
జను ముల్లోకము; లన్న దంచు మని యంటం జొప్పె; రామప్రభూ! 874

అనుచుం గున్కిన దామే; యప్పటికె మధ్యాహ్నంబు గావచ్చుటన్
గునుకి గాంట(వు నిద్దు రయ్యె(; దల చొక్కుం బొంద పీడెం; దలా
పిని గాళ్లంచియు(, గాళ్ల[546]కట్టకడ( దృష్టిన్ మూర్ధమున్ జేర్చియున్
ముని(గెన్ నిద్దుర నామె; యంచు మని చెప్పం జిఅత; రామప్రభూ! 875

కనె దేవేంద్రు( డిదెల్లః సందు దొరికెం; గౌతూహలం బొందె నె
మ్మనమం దట్టి నిబంధనాత్యయమునన్; మాయావియై యోగ శ
క్తిని( ద ద్గర్భమునందు( జొచ్చి నఱికెం [547]దీంద్రించి వజ్రంబుతో
శన [548]గర్భార్భకు; నంచు నొందె మొగమోటన్ మౌని; రామప్రభూ! 876

తన గర్భస్థ శిశు ప్రలాపమున నిద్రాభంగమున్ బొందుటో
నన, "రోదింపకు" మంచు నా నిసుగుతో నాకేశు( డన్ మాటలన్
వినుచుం దల్లి, "వధింపవ" ద్దనుచు నా వృద్ధశ్రవున్ వేడె; నై
నను దేవ్త్రార్థన వ్యర్థ; మంచు మని విన్నందోయె; రామప్రభూ! 877

544 జేర్పం; 545 గ, 546 కూర్చు; 547 గిడెంచి; 548 నా యర్భకు;

దితి గర్భంబును సప్త ఖండములుగా దేవేంద్రుఁ డా వేళ తె

గతనం ద్రుంచెను వజ్రముం గొని; తుదిన్ జాలింగొనెం దల్లిపై
నతి సమ్మానముతోడ వజ్రి; జయలై యా యమ్మకున్ మ్రొక్కె; ద
ద్వృత విఖ్యాత్మయ ముగ్గడించె; ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 878

తనకున్ సందు లభించే నేనియు నమిత్రధ్వంస మెవ్వానికిన్

జను ధర్మంబయ్యు; నీదు గర్భమున నన్ జంపన్ సమర్థుండు నుం
డెను; నే వానిని సప్తఖండములుగా డీల్గొల్పితిం దల్లి! మ
న్ననఁ గోపం దగు; నన్న వజ్రి ముని యెన్నంజొచ్చె; రామప్రభూ! 879



౪౭

సతి దుఃఖం బిఁక నేమి సెప్ప? నయినన్ సాధింపలే దాతనిన్
దితి; తా శౌచ విదూర; సానునయ రీతిన్ 'నాయనా! యాత్మదో
షత నిల్లైతిని; నీవి దోష మగునే? సాయంబు నొక్కండు స
మ్మతితో మాత్రము సేయు; మన్నదనెఁ జుమ్మన్ మౌని; రామప్రభూ! 880

ఎటులున్ గర్భము సప్త ఖండములుగా నే పూర్వ [549]కర్మాననో!
చిటిలెన్; వానిని సప్తలోకములలోఁ జేయం దగున్ వాయు సం
పుటికిన్ నేతలుగా; మరుద్గణ మనం బూజార్హతల్ గల్గు వి
స్ఫుటతం గూర్చి, యటన్నతల్లినుడి మెచ్చున్ మౌని; రామప్రభూ! 881

ఒక రా బ్రహ్మ జగత్త్రనన్, మఱియు నింకొక్కండ్రు నీ యింద్ర నా
మక లోకంబున, వే ఱొకండు సురవర్త్మంబందునం, దక్కు నా
రొక యా నల్వురు నాల్గు దిక్కులను నత్యుత్సాహ సంచారతా
ప్రకృతుల్ గావలె; నన్న తల్లిఁ బొగడెన్ [550]బ్రహ్మర్షి; రామప్రభూ! 882

విని దేవేంద్రుఁడు, మ్రొక్కి తల్లిఁగనుచున్, 'వేగంబ వీకోర్కె చె
ల్లును; సందేహము మాను; నీమ తనయుల్ మున్మ్మాటికిన్ దేవతా
ఘనతన్ వర్తిలునట్లు చేయుమ' ననెం గాంతారమం దిచ్చటే
[551]వినయాచారుఁడు; నంచు [552]మెచ్చుదలఁ జూపెన్ మౌని; రామప్రభూ! 883

తనయా! యిద్దె తపోవనంబు; దితి మాతం దేర్చె నింద్రుండు నిం
దునసే! గల్గె నిలంబుసా సతికి నింపున్ ధార్మిక శ్రేష్ఠుఁడై
మన యిక్ష్వాకునివల్లనుం దనయుఁ డుద్భాస ద్విశాలుండు; క
ట్టె నతం డీ పురి; నంచు మౌని ముకిపెట్టెన్ గాథ; రామప్రభూ! 884

---

549 పాపానసో; 550 రాజ్ఞి; 551 వినయంబారఁగ; 552 మెచ్చుకొని చెప్పెన్;

ప్రణయిం బొందెను హేమచంద్రుని విశాలా క్ష్మాపతీంద్రుండు పు
త్త్రునిగా శౌర్యుని; హేమచంద్రుఁడు సుచంద్రున్ యోగ్యునిం బొందె జీ
వనుగా; నాతఁడుం బుణ్యుఁడై పడసె ధూమ్రాశ్వుం దనూజుండుగాఁ
దనయుం డాతని కయ్యె సృంజయుఁడు; తనెం దన్మౌని; రామప్రభూ! ౪౪౫

సహదేవుం డుదయించె సృంజయునకున్ శశ్వత్ప్రతాపాఢ్యుఁ, డు
ద్వహుఁడై; శ్రీలుఁడు, ధార్మికుం డగు గుణాఢ్య క్ష్మాపతీంద్రుండు ను
ద్వహుఁ డయ్యెన్ సహదేవ భూపతికి; దీప్త క్షాత్త్రతేజసుం డయ్యె ను
ద్వహుఁడై వానికి సోమదత్తుఁ; డనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౪౪౬

తమిఁ గాకుత్స్థుఁడు సోమదత్తుని కులాధారుండు; సత్పుత్త్రునిన్
సుమతిం బొందె నతండు; నాతఁ డిపు డీ శుంభ ద్విశాలాపురీ
రమణుండై పరిపాలనంబు సలుపున్ రంజిల్లఁగాఁ జేయుచున్
బ్రమత శ్రేష్ఠజనంబు; నంచుఁ బొగడెన్ ౫౫౩ బ్రహ్మర్షి; రామప్రభూ! ౪౪౭

సుమతిక్ష్మాపతి దేవతాపతిని బోల్చున్ దుర్జయుండై; మహో
త్తమ వైశాలిక వంశ్య లెల్లరు సదా ధర్మాత్ములున్, శౌర్య ధా
మము, లాయుష్కులు, దీర్ఘకాలముగనుం బాలించుచున్నారు రా
జ్యము; నం దాతను ముందె వానిని ప్రశంసన్ మౌని; రామప్రభూ! ౪౪౮

మన మీ రాత్రి విశాలలో సుఖముమై స్వాపంబులోఁ దేలి, ప్రొ
ద్దుననే బోవుద మా విదేహ నృప చంద్రుం జూడఁగాఁ నంచు నా
డిన గాధేయుఁడు, తా నటుల్ సుమతిపీఠిం జేరుచున్నాఁడటం
చును వాతం డెఱుఁగంగ నౌట, వినిపించుం గూర్మి; రామప్రభూ! ౪౪౯

తన బంధు వ్రజమున్, గురూత్తముల సంప్రాప్యంబునుం గూడి యా
యన, మా కా యెడ స్వాగతంబు పలుకన్ హార్దంబునన్ వచ్చి చే
సెను సాష్టాంగ సపర్యలం; గుశలముం జేసెం బరిప్రశ్నమున్
మనసా! యం చని ౫౫౪ మెచ్చుకోఁ దొడఁగెఁ ద ద్బ్రహ్మర్షి; రామప్రభూ! ౪౫౦

553 రాజర్షి; 554 మెచ్చి నాతనిని;

ముని వంద్యా! తమ కిత్తు స్వాగతము; మమ్మున్ ధన్యులం జేయఁగా
మనసై దర్శన పుణ్య మిచ్చితిరి, మాపై నాదరం బేర్పడన్
ఘనమై; యిద్ది యయాచితంబయిన భాగ్యం బౌటచే [555]ధన్యుఁడన్;
నను నేఁ బోలఁడు నన్న తేఁడు, మని యానందించె; రామప్రభూ! 891

తెలియం జెప్పఁగ నొప్పనేని గడుఁ బ్రీతిం జెప్పఁడీ! నాకు; వీ
ర లెవారల్? గడు చిన్నవారు; తమతో రా నేలనో! పాదచా
రులుగా, క్షాత్త్రవిభూతి యుక్తులగు వీరల్ తార యయ్యున్ మహో
జ్జ్వలతన్ వీఁరి; యటంచు నా సుమతి ప్రస్తావించె; రామప్రభూ! 892

కరవాలాది ధనుస్సులం బొలుచుటన్ గంభీర కంజారముల్;
పర దుర్దాంతతచేత సింహములునున్; పర్థిల్లుచుం దోఁచు త
ద్వర భీతాహతిచేత వ్యాఘ్రములునున్; వక్త్రిల్లు శైలాది ని
ద్వరముల్ బాలు; రటన్న తేని, మునియున్ వందించు; రామప్రభూ! 893

తన సిద్ధాశ్రమ యజ్ఞ మాదిగను వృత్తాంతంబు సర్వంబునున్
వినిపింపన్ ఋషి, విన్న యా సుమతి, తన్వింబొంది యర్ఘ్యాదిశా
ర్చనలం దేర్చెను దాను, దాశరథులన్ సత్కారముల్ సేసె నా
ముని సంఘంబున కెల్ల; నంచు ఋషి మెప్పున్ గుప్పె; రామప్రభూ! 894

మును తెల్లారు యథార్హ పూజనములన్ మోదిల్లి, యా తేయి భూ
పుని సౌధంబునయందు, దాశరథులన్ ముఖ్యంబుగాఁ గూడి, కు
న్కిన, సూర్యోదయ పూర్వమే పొసఁగెఁ గోర్కిం గాల్యాసుఁల వాటి; కం
చును గాధేయుఁడు నెల్లివారిదెస మెచ్చం జూపు; రామప్రభూ! 895

తరువాతన్ మిథిలాపురంబు దెసఁగాఁ ద ద్బృంద మే గంగ, నా
వరువాతం, గనుచూపుమేరఁ బడియెన్ వర్ధిల్లు నా చందు ప్ర
స్తర సౌధావళితోడి త న్నగర సౌందర్యంబు; త ద్బృందమున్
బరమానందము నొంది పొంగ నలరెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 896

---

555 నే;

మునిసంతోషము వొంగి, యా మిథిల యొప్పున్, దన్మహారాజు చొ
ప్పును [556] గీర్తింపెను; త త్పురీ సవిధమై పూర్వోన్నతిం దెల్పుచున్
గనుపింపన్ మునిచంద్రు నాశ్రమము తాఁ గాంతారమై యొక్కెడన్; దం
చును గాధేయుఁడు తెల్పి, దానికి వగర్పుం జింత; రామప్రభూ! 897

దని, మున్యాశ్రమవాటి పాడువడఁ, దత్ త్రైణ్యంబునుంగూర్చి వే
డను జెప్పం [557] దను జూచి, దాశరథి సూటిన్, దాని శ్రీమత్తపున్
బునరన్ భావనచేసి, యేల మును లా కల్యాణ భూమిన్ విడన్
జనఁగా నయ్యెనో! యంచు, నంచు ఋషి ప్రస్తావించె; రామప్రభూ! 898

మును పిల్చెఁగల గౌతమాశ్రమమునన్ మోహించియున్నాఁ డహ
ల్యను దేవేంద్రుఁడు; నాఁటి కీ పదము దివ్యంబై ప్రశంసార్హమై
గణుతింపంబడుచుండె దేవతల సంఘాతంబుచేఁగూడ; శ్రీ
దను సౌభాగ్యము దీని; దంచు ఋషి నిర్వేదించె, రామప్రభూ! 899

అన లే యాశ్రమమందె యప్పుట, నహల్యా గౌతమీంద్రుల్ దపో
వ్యసనంబుం గొనసాగఁ [558] బుచ్చిరి; ముని ద్వంద్వంబు తద్గౌతముం
దనమక్షంబుననుండ, నొక్కనాఁటి నా యాఖండలుం డొంటిమై
మునిరూపం దా నిట; నంచు నొకఁగొనెఁ [559] దెల్పన్ మౌని; రామప్రభూ! 900

పురుహూతుం డవు డా యహల్యఁ గని, యొప్పుల్ మెచ్చి, "కామార్థ [560] త్ర
వ్వను నేనిన్ ఋతుగాము రౌదు రని చెప్పన్‌రాదు; నే నిష్ఠ నిన్
వరియింతున్; మనకొల్పుచుంటి;" వన నా వామాక్షి తా నింద్రునిన్
గురుకారంబున మందలింప; దని యల్గున్ మౌని; రామప్రభూ! 901

మునివేషం బురుహూతుఁ డం చెఱిఁగియున్, బుద్ధిన్ మనం బోర్వ, నిం
ద్రుని బోలంగలవాఁ డటుల్ వొగడ, నొందున్ మోహ మా యి తి; వో
యెను బోకల్; వల [561] పొర్కెఁ; దా మురిసిపోయెన్; దారి తప్పంగ న
య్యె; నటంచున్ వెతనొందుమం దెలుపు మౌనీంద్రుండు; రామప్రభూ! 902

---

556 శ్లాఘింప; 557 సరుఁ; 558 గ నిచ్చిరి; 559 జెప్పన్; 560 ర్తు;
561 పూచె;

చరితార్థత్వము నొందితిం దమరి [562]యిచ్చాపూర్తికిన్ స్వామి యి
ప్పరి కంటం బడకుండ నేఁగుఁ డిఁక; మీ మర్యాదయున్ నాదియున్
ద్వరతో మీ గమనాను సారమునఁ గాపాఁడంబడున్ నాఁగ, ని
త్వరినిన్ పిడె బిడౌజుఁ; దంచుఁ గుటియున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 903

కదురన్ మోదను, బ్రోడినిం బరమ [563] సౌకర్తవ్య సుస్నాతుఁడై
యెదురయ్యెన్ ముని గౌతముం, డెలరుచుం గృష్ణార్చియై, పర్ణయుక్
సదన ప్రాంగణమందు నింద్రునకు, హస్తంబందునన్ దర్భలున్
మొదలై సట్టివి తాల్చి; యంచు ముని చెప్పం జింత; రామప్రభూ! 904

సదస ద్వేఁని గౌతమీంద్రుని దప స్సంపన్నునిన్ దివ్యులే

యెదిరింపం జన; రింక రక్కసుల పై రెత్తంగ నెట్లౌను? భీ
ప్రదుఁ డయ్యెం జలితేంద్రియుం డగుటచేఁ బాకారి; వర్చస్సునున్
బ్రదరెన్ భీతి; నటంచు మౌని తమకించెం జెప్ప; రామప్రభూ! 905

వెలుకంబాఱిన దంతవాని మొగమున్; బ్రీడాకులం బయ్యెఁ జిం
తలపాలై మది; త ద్దురాగతము చేతంబందునన్ భర్తకున్
మెలఁగెం; గ్రుద్ధుని జేసెఁ; జేసితివి నా వేషంబునన్ వచ్చి సి
గ్గిలనౌ దుష్కృతి; నన్ను [564]గౌతమున కుల్కెన్ మౌని; రామప్రభూ! 906

వగదెంపన్ శపియించె గౌతముఁడు తత్ స్వారాట్టు నండంబులే
తెగి భూమిం బడ; శాప వాక్య మది పూర్తిం బెందెనో! లేదా! వే
ముగిసెం గార్యము సర్వముం దెగిపడెన్ భూమిం దదీయాండముల్
వగతో నింద్రుని బోకఁగూర్చి ముని [565]యుబ్బుం జెప్ప; రామప్రభూ! 907

పడఁతిం జూచుచు, "నాశ్రమం బిది యిఁకం బాడ్వడ్డదై పోవలెన్;
బుడమిం గ్రుంకుచుఁ గూడు నీ వెలుఁగకే బొర్లాడుచున్ ధూళి, ని
క్కడ నెవ్వారికిఁ గానరాక తపముం గాడ్పానుచుం జేయుమీ
పడియుండంగ"; నటంచుఁ దిట్టె; ననె పీప్సన్ మౌని; రామప్రభూ! 908

---

562 యిష్టా, 563 సౌఖ్యాఢీన; 564 యా గృహికి నుల్కెన్; 565 యుమ్మం;

పవివేఁడెం బతి పాద సన్నిధిని ద ద్వామాక్షి రోదించుచున్;
విడివెం గోపము గౌతముం, "డిటకుఁ దా వేంచేయుఁ గౌసల్యకున్
గొమరుం డాఘవుఁ; డంత ని న్నతఁడు గన్గొంగల్గు; శుద్ధాత్మ వ
ప్పుడు నీవౌదు"; వటన్న మాట ముని చెప్పెన్ గొప్ప; రామప్రభూ! ౯౦౯

ఒకకాలంబున కీ పదంబునకు రానోపున్ మహాపుణ్యుఁ డ
ర్భక రూపంబునఁ గౌసలేయుఁ; డదియున్ భాగ్యంబుగా నెంచి, వా
రక సల్పం దగు నీ సపర్య తెలమిన్; రంజిల్లు నాతండు; త
ప్పక మోహాదుల వీడు ని; న్ననె నసెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౯౧౦

భయ మోహాది వివర్జితాత్మవయినం బ్రారబ్ధముం దీఱు; నం
త యథా రూపము వచ్చు నీకుఁ; దరువాతన్ నీవు నాతో సుఖో
చ్ఛ్రయతం బుత్తువు జీవితం; బనుచుఁ దచ్ఛాపాంతముంగూడ ని
ర్ణయముం జేసెను భర్త; యంచు మరిసెన్ [౫౬౬] బ్రహ్మర్షి; రామప్రభూ! ౯౧౧

ఇటు శాపాంతముఁదెల్పి గౌతమ మహర్షీంద్రుండు, తద్వాటి నం
తటు నిశ్చింతత వీడిపోయె, హిమవ త్ప్రస్థంబునం జేయ ను
త్కట సౌఖ్యంబు తపంబుఁ, జారణులునున్ గంధర్వులున్ సిద్ధులున్
బటుతన్ సాగుదు రెందు, నందు ననియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! ౯౧౨



౫౬౬ రాజా!

డిగుల్గొంచెన్ మఘవంతుఁ డా గతి మహోద్దీప్రంబులై యంతముల్
దెగి[567]పోవన్; సురలెల్లరం బిలిచి ప్రీతిన్ "వేల్పులారా! భవత్
సుగమ స్థానఁపు భ్రష్టహౌఁ దపమునున్, శోధ్యుండు తద్ఘాతముం
దగతిం బూనె"; నటంచుఁజెప్పె ననె మున్యగ్ర్యుండు; రామప్రభూ! 913

అదియున్ విన్న మొనర్పఁగాఁ జనితి, నే నా యాశ్రమంబున్న సత్
పదముం గూర్చెచి; యేమి మార్గమును దోఁపన్ లేదు తన్మోని కా
పదనుం గూర్పఁగ; నందుచే నసతిగా మౌనీంద్రు భార్యామణిన్
బదసం జేసితి; నం చతం డనె ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 914

తమిమీఱన్ శపియించె నాతఁడు నసున్ ధార్ష్ట్యంబునన్ రెండు నం
డములున్ నాయవి భూమిపైఁ దెగిపడన్ దబ్బాటుమై; యట్టులే
షమపీఁదం దెగిపడ్డ వవ్వి; తన యోషం గూడనుం దిట్టి యా
శ్రమమున్ వీడె నతం; డటంచనె ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 915

శ్రమియై కోపముచే దపోవ్యయము నోర్వన్‌లేక యింకొక్క యా
శ్రమ మేఁగెన్ ముని వేగఁ; బొందితిని సార్థక్యంబు నే దేవ కా
ర్యము సాధించుటఁ; గాన నండములు మీరల్ గూర్పనౌ నే యుపా
యముచే [568]నైనను, నంట కొల్పె మునికిన్ [570]హాసంబు; రామప్రభూ! 916

అతి వేగంబున నగ్నిహోత్రు గొని దివ్య వ్రాతముల్ సేరె నా
పితృ లోకస్థుల; వారి కెల్ల కథయున్ విన్పింప నా దేవతా
వితతుల్ మేషఁపు టండముల్ గొనుమరా వీలౌట నవ్వానిఁ దా
మతుకంబెట్టిరి శక్రి; కంచు నగె మున్యగ్ర్యుండు; రామప్రభూ! 917

---

567 ధ్వస్తంబు; 568 వడ్డన్; 569 నం గానియు; 570 హాస్యంబు;

అనిమేషాంగన నీ ప్రవేశమునయం దా గౌతమున్ భార్య, స
హస్రాబ్దాంతమున్ను ఘోర వీర తపమ్ము బూతాత్మ నీరాకకై
యెదురుల్ సూచుచుఁ జేయుచుండె; నీవు దా యిల్లాలు నీ భక్తి కా
స్పదమై దేవత యయ్యె; నంచు దొగడెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 918

తరియించున్ భవదీయ దర్శనమునం దన్వంగి; నీ వామెకున్
గరుణన్ దర్శన మీయనౌట యొక ముఖ్యంబైన కార్యం: బనన్
గుర గాధేయునివెంట సోదరులు కోర్కెల్ మీఱఁగా నేఁగి, రె
ల్లర నచ్చోటనె నించి, యుండుఁడని, [571]మెత్తం జూచ; రామప్రభూ! 919

ఛొరఁబాఱంగ మహాటవీ తటముగాఁ జొప్పిల్లు నా గౌతమే
శ్వరు జీర్ణోటజ, మందు నంతపటి కెవ్వారైననుం గానియున్
సురలున్ [572]ఫేరవులున్ [573]మఱిం గనులతో జూడంగ రానట్లు తే
జరిలున్ [574]ధన్యనుగాంచె [575]నాథుఁ; డనేఁ బెబ్బన్ మౌని; రామప్రభూ! 920

కనియెన్ రాఘవుఁ, డా కఠోర నియమాక్రాంతం, దపశ్చర్యచేఁ
దనుతం దాల్చిన మేనిఛాయగల యా తన్వంగినిం, దీగెలం
దునుముం బూల సముచ్చయాదికమునందుం బ్రుంగి, పెన్ మంచు మూఁ
గీన చాంద్రిం దలఁపించుదాని; నని ప్రస్తుత్యన్ మౌని; రామప్రభూ! 921

అతి యత్నంబున బ్రహ్మ సల్పిన తనూ యానస్మనోహారి రూ
పత, ఛాయా అవలోకమై, జలదముల్ మాటైన పూర్ణేందు నం
గతినిన్ నెమ్మదియందుఁ దోఁచునటులం గావించె; నా రాచ సం
తతి, కామెం గన; నంచుఁ దాను గనెఁ జింతన్ మౌని; రామప్రభూ! 922

---

571 మెల్లం దాము; 572 దానవులున్; 573 సహా; 574 బూజ్యను;
575 రాముఁ;

జలపూరంపు ప్రతిబింబితంబు లగు భాస్వంత ప్రదీపార్క రో
చులఁ బోలెన్ బహు దున్నిరీక్షణములై చూపట్టెఁ దద్దేహ కాం
తులు; ధూమావృత వీతిహోత్ర శిఖయై తోఁచెం దపోవృద్ధ మం
జుల సద్విగ్రహ; మంచుఁ గౌశికుఁడు నంజుం జెప్పు; రామప్రభూ! 923

కనియెన్ గౌతమ పత్నియున్ రఘుపతిం గన్నీరు నిండం; దప
స్వినిగాఁ బాప విముక్తయై యిపుడు తచ్ఛ్రీరామ సందర్శనం
బునఁ దా శాప విముక్త యైనయది, యా పూర్వ స్వరూపంబుతోఁ
గనిపించెన్ జగతీ త్రయంబునకుఁ, గాఁకల్ దేఱి; రామప్రభూ! 924

కని రాముం డ్రిజగంబువారలును, సీత ద్గౌతమీంద్రుండు, సె
ప్పిన రీతిం జరియించుచున్; సతియుఁ జెల్వొం దాఁ బ్రణామంబులన్
గనియెం బందఁగఁ బుణ్యముల్ దశరథ త్మజాని సూన ద్వయం
బునకుం, జూపఱ మెచ్చఁగాఁ దన తపంబున్ భక్తి; రామప్రభూ! 925

తను సత్పూజలను బాద్య మిచ్చి బహు సత్కారంబులం బ్రీతిఁ జే
సె నహల్యాపతి వారికిం; దెలిసి వచ్చెన్ గౌతమీంద్రుం డిదె
ల్లను సచ్ఛోటికిఁ; జూచె నా ప్రవిమలార్య శ్రేష్ఠ నత్యంతమున్
ధృతియై, దాశరథి ద్వయా ప్రణయినిం, గ్రేఁగంట; రామప్రభూ! 926

కురిసెన్ జల్లున మింటిమ్రాని పువుఁ జిన్కుల్; మొత్తమై దుందుభుల్
మొరసెన్ నిర్జర లోక నిర్గతములై; సొంపుల్ గుల్క గంధర్వులున్
బరమాహ్లాదతఁ గూడిపాడిరి; ప్రతి ప్రావీణ్య మేపార న
ప్సరలున్ లాస్యపు భంగిమల్ [576] నెఱపి రాప్యాయన; రామప్రభూ! 927

576 దెలిపి;

ముని జాయాపతు లంత, నెంతయుఁ దనర్పం బొంది, యా రామ ల
క్ష్మణులన్, భక్తి పురస్సర క్రమత విశ్వామిత్త్ర మౌనీంద్రునిన్,
ప్రణిధాన స్థిర బుద్ధితో మునుల సంభారంబునున్ సేవలన్
దనుపం గల్గిరి, వారు సంభరిత [577]సాంతము బొంద; రామప్రభూ! 928



577 మోదం;

-౩౧-

ముని గాధేయుఁడు, రామలక్ష్మణులునుం, బూజ్యుల్ మహర్షీంద్రులా న్
దన వెంటం జనుదేరఁగా మిథిలనుం దాఁకొల్పు నీశాన్య ది
క్కున సాగారెను; సత్వరంబె యెదుటన్ గొప్పైన యా యజ్ఞవా
టని దర్శించిరి వార లెల్లరును బాదెంబట్టి; రామప్రభూ! 929

ముని గాధేయుని జూచి, 'స్వామి! కడు నొప్పున్ యజ్ఞవాటంబు చ
క్కనిదై సర్వసమృద్ధమై; ద్విజులు పెక్కం డిందు షట్కర్మఠులై
కననౌచుండి రనేక దేశములఁ జుల్కం గాంచియున్నట్టివా;
రనుమున్ రాఘవుఁ డాడెఁ బూజ్యులను నభ్యర్చింప; రామప్రభూ! 930

మునివాటంబున వందలై శకట సంవ్యూహంబు లిం దెల్లెడన్
గననౌచున్నవి యెంతయుం గిటకిటై; కన్పెట్టుఁడీ! మీరు జ
య్యన నెచ్చో మన మిచ్చటన్ విడిది సేయన్ వచ్చునో! యన మఁ గో
రెను గాధేయునిఁ జూచి రాఘవుఁడు పేర్మిం జూపి; రామప్రభూ! 931

కనిపట్టెన్ గురుదేవుఁ డొక్కెడ వివిక్త ప్రాంతమై యొప్పుచున్
జన సమ్మర్ద విహీనమైన యొక కాసార ప్రదేశంబుఁ దాఁ
జనునంతం దమ రెల్లరున్ విడియ; విశ్వామిత్రు నా రాక వే
జనకుండుం విని వచ్చె నచ్చటకు శశ్వద్భక్తి; రామప్రభూ! 932

తతితోడన్ జనకర్షివెంటఁజనె సద్ధర్మజ్ఞుఁ డౌచుం బురో
హిత వర్యుండును గౌశికుం గొలువఁగా నేత శ్శతానందుఁ డా
తత భక్తిం; దరువాత బుత్విజులు శ్రద్ధాయుక్తి నచ్చోటికిన్
మతిమంతుల్ సనుదెంచి రా రెలమిమై మర్యాద; రామప్రభూ! 933

మధుపర్కంబును నర్ఘ్య పాద్యములు ధర్మం బొప్పఁగా, మంత్ర స
ద్విధి పూర్వంబుగ, గాధిపుత్త్రునకుఁ బ్రీతిన్ వార లర్పించినన్,
బుధు లా రీతిగ సల్పు సత్కృతులకుం బొందున్ మహానందమున్
సుధిత ప్రజ్ఞుఁడు, గాధినందనుఁడు, వాచోయుక్తి; రామప్రభూ! 934

జననాథా! కుశలంబె నీకును, భవ త్సర్వ ప్రజా శ్రేణికిన్;
బ్రణిధిన్ సాగునె? నీదు యజ్ఞ మిది నిర్వర్ణించుచుండంగ నీ
వును నీ బ్రహ్మలు నెల్లవారలును, నిర్వ్యాఘతంబుగా విఘ్నముల్
గనకుండం; దెలుపం గదయ్య! యనె వేడ్కన్ మౌని; రామప్రభూ! 935

నయ మేపారఁగ మౌనిచంద్రుని శతానందుం దదీయానుయా
య యజల్ బృందముఁ జూచి, "మీకుఁ గుశలంబా? యార్యులారా!" యనన్
నయశాలిన్ గురు గాధిజుం గని, తదానందంబునే గాక; స
త్క్రియనుం గూడను వారు మెచ్చుకొని రక్షీణాంతి; రామప్రభూ! 936

మునులుం గౌశిక శిష్యులుం బ్రముఖుఁడుం బూజ్యుండు గాధేయుఁ డా
సనముల్ సేరిరి, యుక్తమైనయవి యా క్ష్మాపాలుఁ దేర్పాటు చే
సినయంతం; బిదపన్ యథార్హములుగాఁ జెన్నొందుఁ బీఠంబులం
దునఁ గూర్చుండిరి కౌశికాజ్ఞ, జనకాదుల్ గూడ; రామప్రభూ! 937

మునిచంద్రా! తమ దర్శనంబు సఫలంబుం జేసె నా యజ్ఞమున్;
మును నే జేసిన యజ్ఞసంచయఫలంబున్ దేవతల్ కూర్చి యి
చ్చిన యట్లుండెను మీదురాక; యెటులం జెప్పంగనౌ నాకు మీ
యెనురాగం; బనెఁ జక్రవర్తి; జనకాఖ్యాతుండు; రామప్రభూ! 938

నను ధన్యుం బొనరింపవచ్చితిరి నా యీ యజ్ఞవాటంబులన్
గనుచున్, మీరు మహర్షిసత్తములతోఁ గారుణ్య మొప్పొంగఁగ; నా
జననం బిప్పుడు ధన్య మయ్యె; నిఁక నిజ్యా పూర్తిఁ బొంద్రెందు నా
క్లనుచున్నా; రనెఁ జక్రవర్తి, జనకాఖ్యాతుండు; రామప్రభూ! ౯

తమ రిచ్చోటనె యుండఁగా వలయునందా కం దప్పకుండఁగ ను
త్తమ వేదీశ మహర్షి! నా మనవి జిత్తంబందు మన్నించుచున్;
దమవెంటం జనుదెంచియున్న కొమరుల్ దా రెవ్వ? రందంబునన్
సము లా విష్ణులకున్, బ్రధిమమున; కనెన్ క్ష్మాజాని; రామప్రభూ! ౯.

కనులా! దామరపత్ర మిత్త్రములు; ముఖ్యంబైన తేజంబొ! దై
వ నిసృష్టంబు; కుమారు లాశ్వను లనన్ వైదగ్ధ్యముం బొంది; రా
ధనువుల్ దూణములంగృపాణములఁ బద్మాత్ముల దలంపించుఁ దే
జున; నంచున్ రఘువీరు [578]లిర్వురను నెంచున్ రాజు; రామప్రభూ! ౯౹

అరుదౌ యౌవనమందునన్ భువికిఁ దామై యిర్వురున్ వచ్చియుం
డి రమర్త్యాగ్రణు లంచుఁ దోఁచెడిని; ప్రౌఢిన్ రూప రేఖాదులన్
స్థిర వీక్షా గమన ప్రభావ వచన శ్రీలందు వీ రొక్కఁ టై
చిరిగా నుండి; రటంచు నా ప్రభుపు శొంచున్ వింత; రామప్రభూ! ౯౪

సభమందుండెడి సూర్యచంద్రుల విధానం గాంతులఁ బిమ్మ వీ
రుభయుల్ వచ్చిరి పాదచారులయి యెంతో భక్తి మీవెంట, నా
కభయం బీయఁగనో! యనం; దెలుపరా? వేరికిం బుత్త్రు లీ
ప్రభువుల్ దా; మని వేఁడఁజొచ్చె జనకక్ష్మాజాని; రామప్రభూ! ౯౪

578 లబ్దిదనమెంచున్, లొప్పిదములెంచున్, లందములనెంచున్;

వివరింపుం డని వేఁడ నా జనక పృథ్వీభర్త, గాధిప్రభూ
ద్భవుఁ, "డీ యిర్వురుఁగూడ దాశరథులో! ధాత్రీతలాధీశ్వరా!
సవరంగాఁ దగు రామ లక్ష్మణు లనన్ సౌమ్యాభిధానంబు లీ
యువ; కంచున్ గత వృత్తముం దెలిపివేయుం బూన్కి; రామప్రభూ! 944

జనకక్ష్మాపతిచంద్ర! నీ గృహమునన్ జానొందు [579]భర్గున్ ధను
స్సును జూడన్వలె నంచు నీ రిటకు నౌత్సుక్యంబు పొంగంగ వ
చ్చినవారల్ సనుగూడి; యంచును వచించెం గౌశికుం; డద్ది యా
ననమున్ మీఁదికి నెత్తుచున్ విని శతానందుండు; రామప్రభూ! 945

తనిగాఁ బండు తపఃప్రభావయుతుఁ డేత న్మౌని, యా గౌతమ
ముని జ్యేష్ఠాంగభవుండనున్, జనక రాజుం గొల్చు పౌరోహితుం
డునునై యుండెను; రామలక్ష్మణుల సందారున్ జోడునుం జూచి పొం
దె నతండున్ బహుళ విస్మయంబుఁ, గన గాధేయుంటు; రామప్రభూ! 946

పులకించెం గడు గౌతమాత్మభవుఁ; డాప్తున్ గాధిజుం జూచి, యు
జ్జ్వలు లా రాముఁడు లక్ష్మణుండు విన, "విశ్వామిత్ర మౌనీంద్ర" మీ
రలు జూపించిరె? రామచంద్రునకు ఘోరంబౌఁ డపంబందు ని
శ్చలయౌ నాదు పవిత్రి; కం చని ప్రశంసం జేసె; రామప్రభూ! 947

మును దుర్దైవ విపాక హేతువున నిమ్మం దప్పి, తా నా యశ
స్విని ఘోరాపకృతంబు నొందె, నని మీరా పేర్కొంటిరే? రామచం
ద్రునకున్; భూరి తపస్విని మణియు నేర్పుంజూపి యంతన్ సప
ర్యను గావించెనె? యం చతం డతని సంప్రశ్నించె; రామప్రభూ! 948

579 భర్గున్;

ఘన తేజోనిధియున్, బహు శ్రుతుఁడు, నిష్కాముండు, మౌనీంద్రుఁడౌ
జనకుం డీ బహు పూజనీయుని దయన్ శాంతించి మా తల్లినిన్
గనఁగా వచ్చెనె? తా మహామహుఁడు సత్కారంబులం జేసెనే?
దనియన్ రాముని గౌతముం; డనె సుత శ్రావ్యంబు; రామప్రభూ! 949

మనమందున్ వచనంబునందునను జెప్పన్ శాంతుఁ డీ రాముఁ డా
యనకుం దా నభివాదమున్ సలిపెనే? యార్యాగణీ! మిమ్ముఁ జెం
దును శ్రేయంబు; మహా శుభంబువును నౌదున్ నేను; సర్వంబునున్
నను బ్రోవన్ సెలవిం; డటం చనె శతానందుండు; రామప్రభూ! 950

తనయా! చెప్పితిఁ జెప్పనైనయది యంతం; జేసితిం జేయఁగా
నెనవౌ నద్ది సమస్త; మింక జమదగ్నింజేప నా రేణుకా
వనితా రత్నము వోలె, మీ జనకు సేవం జేసె మీ తల్లి ప్రీ
తిని; నంచున్ వినిపించెఁ దమ్మునికి గాధేయుండు; రామప్రభూ! 951

విని యా మౌని యదెల్ల, రాముఁ గని, స్వామీ! మీకు దైవానుయో
జనముం బట్టి లభించెఁ బూజ్యుఁడగు విశ్వామిత్రు వాచంయమీం
ద్రుని ప్రేమం; బపరాజితుం డితఁడు; వేరుం జేయరానట్టివా
నిని, సత్కార్యము లాచరించె, నని యెన్నం [580]జెక్కు; రామప్రభూ! 952

ఇలపై వేనిని నూహసేయుటకునున్ హేవాళ ముద్దండమై
చెలఁగం జాలునొ! యట్టివాని నితఁడే సేసెన్ మహాకార్యముల్,
పలుమాఱుల్[581];నెఱపంగఁ జాలుచుఁ దపః ప్రాబల్య మీతండు ని
శ్చలతన్ బ్రహ్మఋషీంద్రుఁ డయ్యె; ననెఁ జెల్పున్ బ్రహ్మ; రామప్రభూ! 953

నెల వీతండు తపఃప్రభావమునకున్; నీ కేదియో! గొప్పమేల్
దలఁచెం గావున, నిన్ను వెంటఁ గొనుచుం దా నిందు నేతెంచె; వే
రలు నీకందెను ధన్యు లందఱిలలో; రాజన్మహా తేజుఁ, డ
న్య లసద్దీప్తి హరుం డితం; డనె శతానందుండు; రామప్రభూ! 956

580 జాలం, బ్రీతి; 581 న్;

జగ దుద్ధర్త, బహు ప్రఖ్యాతుండు, మన విశ్వామిత్ర మౌనీంద్రుఁ డీ
మ్మగు శౌర్యాదియు, ధార్మికత్వముఁ బ్రజా వ్యాసక్తి హాయిత్వమున్
దగవుం గల్గినవాఁడు; తొల్లి ధరణిన్ ధర్మాత్ముఁడై యేలె మి
న్నగఁ దాఁ బెద్దయుఁగాల; మం చనె శతానందుండు; రామప్రభూ! 955

మును పక్షౌహిణిసేన వెంటఁగొని యీ పూజ్యుండు దేశాటనం
బును జేసెం, జతురంగ సంయుతముగాఁ; బొల్పారు దేశంబులున్,
ఘనమౌఁ బత్తన పుణ్యతీర్థములు, నుగ్రారణ్య భూభృన్మహా
వనముల్ గాంచె; నటంచు బ్రహ్మ పొగడెన్ వందించి; రామప్రభూ! 956

తనియం బుణ్య నదీ నదంబులను దీర్థం బాడె; మున్యాశ్రమ
ప్రణయిత్వంబు భజించె, భూమిపతులం బ్రోధుండునై యుండియున్;
దన సంచారమునన్ వశిష్ఠుని తప స్థానంబుఁ బుణ్యాశ్రమం
బును గూడం గనె దారిలో; ననుచుఁ జెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 957

మన భూలోకమునందు నెచ్చటను గానృన్‌రాని వృక్షాదులన్,

వన గుల్మాది లతా ఫల ప్రసవ సౌభాగ్యంబు నచ్చోట గాం
చెను గాధేయుఁడు; వైరభావ విడిచి పీచిన్ వన్యముల్ వర్తిలన్
గనియెన్ మోదిలి; యంచు బ్రహ్మ కనె [582]సౌఖ్య[583]వ్యాప్తి; రామప్రభూ! 958

నవకంబౌ ఖగ సంతతుల్ మృదు కుహూ నాదంబులం జేయుచు
న్నవి; యే వైపునఁ జూచినన్ మృగము లెన్నెన్ రాక, వర్థిల్లుచు
న్నవి యచ్చోటను, జంకు గొం కెఱుఁగనై నన్‌లేక, మర్త్యాళికిన్
సవిధం బందు; నటంచు బ్రహ్మ బహు హర్షం బొందె; రామప్రభూ! 959

---

582 భోగ; 583 వ్యక్తి;

ఒకచోఁ జారణ సిద్ధ సంతతులు, సత్యోత్సాహులౌ దేవతా
ప్రకరంబుల్ మఱి యొక్కచో యర, నొక క్రేవన్ దానవ వ్రాతముల్,
సకల బ్రహ్మ ఋషుల్ మ ఱొక్కెడఁ, దప స్సంసిద్ధ [684]దేవర్షు లిం
కొక చాయం, గల రందు; నంచు నుతిసేయున్ బ్రహ్మ; రామప్రభూ! 960

ఒకచో నుగ్ర తప స్సమాధి బల సంయుక్తుల్ విశేషంబుగాఁ
బ్రకటం బైరి; ఫలాది పత్రములు నీరం బాని యోగంబుచే
వికచ త్కాంతి వెలుంగువా రొకెడఁ గాన్పింపంగనై; రంచు వే
ఱొకచో వాయు భుజి ప్రసిద్ధి నుతిసేయున్ బ్రహ్మ; రామప్రభూ! 961

జిత రోషుల్, విజితేంద్రియుల్, [685]సంచిత రాశీభూత పుణ్యాత్ములన్
మితవాక్కుల్, గనిపించి రాశ్రమమునన్; వేఱింక సత్కార్య సం
చిత పుణ్యాత్ములు వాలఖిల్యులును, వాసింగన్న వైఖానస
ప్రతతుల్ గల్గిరి దానియందున; ననెం బ్రాజ్ఞుండు; రామప్రభూ! 962

సకలం బాశ్రమ మద్ది కన్పడియె విశ్వామిత్త్రు రాజేంద్రు దృ
ష్టికి, నా బ్రహ్మ జగం బనంగఁ; బరివేష్టింపంగఁ బా వన్నె హో
మికలో స్వర్గము త న్ననంగ; నతిభూమిం దోఁచు వైకుంఠ యా
నక మార్గం బన; నంచు నెన్నెను శతానందుండు; రామప్రభూ! 963



684 సంపన్న; 685 విత్త;

వినియోపేతతతో వశిష్ఠముని నుదీక్షించుచున్, ''మీదు ద
ర్శన భాగ్యంబు లభించెనా;" యనిన, "రాజా! నీకు నీ వారికిన్
ఘన సుస్వాగత:" మంచు మౌని పలికెన్ గాధేయుతోఁ, జూపి యా
సన మా వాఁ; డని బ్రహ్మ నాథున కనెన్ సద్భక్తి; రామప్రభూ! 964

వనకందాది ఫలంబు లిచ్చి ముని విశ్వామిత్రు రాజేంద్రు, నా
తనివారిం బరితుష్టులం జలుప సత్కారంబు తోరంబుగాన్;
జననాథుం డగు గౌశికుండు మునిదౌ స్వశ్రేయసంబుం దపం
బును నగ్నుల్ గుఱియించి పల్కుఁ; డని చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 965

తరు గుల్మ ప్రతతి వ్రజంబులు, సదా తా మార్తవానుస్మృతిన్
గుబాళించుం గద! సంట్లు పూవులును మీకుం బర్ణశాలన్; విధిన్
స్థిరులే శిష్యులు? సంచు రా జడుగఁగాఁ క్షేమంబె యన్నింట మా
కరయంగా; నని మౌని యాడె; నసె బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 966

తనివిం బొంకు వశిష్ఠ మౌని విధి కీ తత్త్వజ్ఞుఁడున్, మంత్రసా
ధన విద్వన్మణి, సిద్ధుఁడున్ జప తపోధ్యాత్మాన భావుండు నున్;
దనియంగా నుపవిష్టుఁడైన నృపతిన్ దర్శించు చా మౌని ప్రీ
తిని మర్యాదలఁ జూపె; నంచు నుడివెన్ శ్రేయుండు; రామప్రభూ! 967

ధరణీపాలక నీకు క్షేమమెగదా! ధర్మానుసంధాయివై,
పరగం జేయుదె? రాజ్యపాలనము సంపచ్ఛ్రేయముల్ గల్గ ను
ద్ధురమై నీ ప్రజ లెల్ల వేళలను; భృత్యుల్ తుష్టులై నిన్ను గొ
ల్తురె? యంచున్ ముని యాడినట్టులుగఁ దెల్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 968

నిను నీ యాజ్ఞల నెయ్యురే? యనుచరానీకంబు; నీ శత్రు తె
చ లను గ్రిందై యుంతురే? దళపతివ్రాతంబు, నీ కోశమున్,
మనునే? సర్వ సమృద్ధమై; సుతులు నీ పౌత్త్రుల్ సుహృద్వర్యులున్
గన నౌనే సుఖ? మన్న మౌనిఁ, గొను [586]శ్లాఘన్ బ్రహ్మ; రామప్రభూ! 969

తన సర్వస్వము క్షేమమే యని సమాధానింప నా తేను; మె
ల్లన యా యా విషయంబులన్ గుఱిచి చర్చల్ సేసి వా రిర్వురున్
మనఃఅపంబుగ, శోభనావహముగన్ బ్రహ్లాదు లైనార; లే
మన దై వేచ్ఛ? నటం చనెం బిరప బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 970

సము నీర్ణంబుగ సాగినంతఁ దను యిచ్ఛన్ గోష్ఠి, "యో! భూప! నే
సమకూర్తున్ సముఁడైన నీకును భవ త్సైన్యాళి కాతిథ్యమున్
సమయాచారముఁబట్టి;"నని విశ్వామి యంచు త్తురితో మౌని, యు
త్తమ రాజాతిథి యాతఁ డౌట; నని యెం దా బ్రహ్మ; రామప్రభూ! 971

మునిదేవా! త మ్మత్రిణ వాక్యములె గొల్పన్ మాకు సత్కారమున్;
గొనియేయుంటిమి యర్ఘ్య పాద్యములునున్, గొబ్బంత్తునున్ స్వాదువుల్,
మును పిచ్చో బనుదెంచి నప్పుడె; యుఁకం బోఁగోరుచున్నాము; ధ
ర్మనమే మీయది విం; డనెన్ నృపుఁ; డనెన్ నద్బ్రహ్మ; రామప్రభూ! 972

సెలవుం గొందుము; మీరు నాయెడ నిటుల్ స్నేహంబుతోనుండుటే
విలువౌ సత్కృతి; యద్ది చాలు; మిములన్ వేడ్కొందు వీడ్కొ లనన్
బలవంతం బొనరింపె భోజనము సల్పన్ రాజునున్ సైన్యమున్
నలి మీఱంగ వశిష్ఠుఁ; డం చనె శతానందుండు; రామప్రభూ! 973

ముని త న్నట్లు క్షమించి సందులకునై మోదిల్లి గాధేయుఁడున్,
దని కెన్ మౌనిని ద్రోసిపుచ్చుటకుఁ జిత్తం బొప్పమిం జేసి; "యో!
మునివర్యా! తపు కిచ్చవచ్చినటులే మున్మాటిచిం జేయుదున్
ననుపన్ విం; మ్మనె గాధిజుం; డనె శతానందుండు; రామప్రభూ! 974

---

586 లెక్కన్;

శివచింతాపరుఁ డా వశిష్ఠ ముని, వీచిం బిల్చెఁ దాఁ గామధే
నువునున్ రమ్మని వెంటనె; "శబల" యంచున్ శీఘ్రమే వచ్చి ధే
నువునున్ నిల్చెను సన్నిధిన్ మునికి: "ధేనూ! నీవు రాజర్షికిన్
సవరింపన్వలె విం; దనెన్ ముని; యనెన్ సద్బ్రహ్మ; రామప్రభూ!



ఆరితిం గూర్పుము షడ్రసాంచితములౌ నన్నాదు లీ వెవ్వ రె
వ్వరి కేయే విధి నచ్చునో! యటులుగాఁ బంచోక్త భక్ష్యాళితో
గరిమన్ శీఘ్రము; యంటయే దతవుగాఁ గావించె సిద్ధంబుఁ గ
న్నరగా నెంచక ధేను; వం చనె శతానందుండు; రామప్రభూ! 976

తరమల్ దేనెలు, నిక్షుపానకములుం దన్పించు నా యిప్ప పూ
ల రసంబుల్, ఖహల రుచ్య భక్ష్యములునున్ రంజించు శాల్యన్న ని
ర్భర రాసుల్, ఘృత పాయసాదికము, సూప[587]శ్రేణులున్, షాడబ
క్కర శాకంబులు, సిద్ధ మయ్యె ననియెం ద ద్ధృష్మ; రామప్రభూ! 77

అవధిన్ వేరికి నేవి యుక్తములొ! యా యా వాని వడ్డించె ధే
నువు పాత్రంబులలో సమస్తమును నన్నుం జూపుచున్ వేగమే;

యవలోకింప దధి ప్రవాహములు తా [588]మచ్చోట నుప్పొంగెనో!
నవకంబై యనిపించె; నం చనె శతానందుండు; రామప్రభూ! 78

చనపుల్ సెల్లఁగఁ గామధేను విధ విశ్వామిత్రుఁ డంతఃపురం
గనలున్, యాజ్ఞిక విప్ర సత్తములునుం గంద్రౌ సమాత్యాదులున్,
ఘన సేనా నివహంబు, నా యనుచర గ్రామంబునుం బొందెఁ బొం
తనముం దుష్టియుఁ బుష్టి; యం చనె శతానందుండు: రామప్రభూ! 979

పరమానందము నొంది యున్మనుఁడు, విశ్వామిత్రుఁ డాన కిం ని
ర్భరుఁడై, "నే మిము సత్కరింపనయినన్, మ మ్మీరు సంభావనా
పరులం జేసిరి, మృష్టభోజనమునన్ బ్రహ్మర్షిచంద్రా! మహేం
ద్ర రమం బ్రీతి;" [589]ననెన్ సుతా! యనె శతానంధుండు; రామప్రభూ! 980

---

587 ప్రక్రియల్; 588 మచ్చోట సాగారెనో! మచ్చో బ్రవాహిల్లెనో;
589ననెం జూమీ!

ఆయినం జెప్పద నొక్కమాట; వినఁగా నర్థింతు; మీ రన్ననో!
నయమున్ మాటల బొందునుం గలరు; విన్నాణంబు నా కేది? నన్
దయతోఁజూచినమౌనిచంద్ర! మిము శ్రద్ధాభక్తులన్ వేఁడెదన్;
భయమేలా? యనె రా; జటం చనె శతానందుండు; రామప్రభూ! 981

అలవోకం దమ రొక్క సా కయిన నయ్యా! చెప్పగా రాదు; నన్
జులుకం జేయఁగఁ ద్రోసిపుచ్చఁ జన దంచున్, లక్షలన్ మించి గో
వుల మీ కిత్తును గామ ధేనువును మెప్పం జూపి నా కిచ్చుచో,
నలు వేపార, ననెన్ నృపుం; డనె శతానందుండు; రామప్రభూ! 982

తలపోయంగ ననర్ఘ్య రత్న మిది; [590]రత్న శ్రేష్ఠముల్ రాజు సొ
మ్ములు; గానం దమ రీయఁగా వలయు [591]నేర్పుం జూపి యీ కామధే
ను లన రత్నము నాకు నిప్పు; డదియే నోతవ్య ధర్మం బనెన్
నలువంకల్ గని రా; జటంచనె శతానందుండు; రామప్రభూ! 983

జననాథా! యొక లక్షగాదు, పెఱు లక్షల్ నాకు నీయంగ నా
లను, జామీకర రాసులం దెగవు మీఱం గ్రుమ్మరింపంగఁ, జా
లను జుమ్మీయఁగఁ గామధేనువును వేరల్ గోరినం గాని, నే;
ననె బ్రహ్మర్షి యటంచు బల్కెను శతానందుండు; రామప్రభూ! 984

ఇది నా [592]దగ్గఱ నుండునట్టిదియెగానీ, యేరి కే నీయువ
ట్టిది యే మాత్రము గాదు; పౌరుషము [593]పెంపెంగల్గు నవ్వాని కే
పదునుం బట్టి యశోంబు వె న్దగులు, భూపా! న న్నటుల్ వేన్నుద
న్నదె? యీ గో; పనె మౌని, యంచనె శతానందుండు; రామప్రభూ! 985

ఉరుకాలంబుననుండి సల్పుదును వహిల్నల్, హవ్య కవ్యాదులున్,
బరగం బర్వ దినాగ్నికార్యములునుం, బ్రాణాగ్ని హోత్రంబులున్,
బెరిమెల్ మీఱఁగ నేను నీ 'శబల' యర్పింపంగ సర్వంబునున్
సరిగా; నం చనె మౌని; యం చనె శతానందుండు; రామప్రభూ! 986

---

590 రత్నాలన్నియున్; 591 నోర్పుం; 592 వాకిట; 593 పాడిం;

సవనంబుల్ బహు పుణ్యకార్యములునున్ స్వాహావషట్కారముల్,
వివిధంబైనవి మంత్రవిద్యలును భూమిన్ సర్వ ధర్మంబులున్
ప్రవయుండౌట సతం బనూనకముఁ గూర్పంగల్గు నీ యొక్క ధే
నువె నా; కంచని మౌని వేఁడె నని యెన్నన్ బ్రహ్మ రామప్రభూ! 987

జననాథోత్తమ యున్నమాటఁ దెలుపన్ సంత్రాస మిం కేల? తు
ష్టిని బుష్టిం గలిగించు నీ [594]శగవి ప్రసిద్ధిన్ నాకు; సర్వస్వ మం
దును నా కిద్దియె; యీయఁజాలఁజుమి! యీ దోగ్ధ్రిన్ మఱింకేరి కం
చనె నా మౌని; యటంచు జాలిపడె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 988

గొలుసుల్, కట్టెడిత్రాళ్లు, నంకుశములున్ గూడంగ బంగారువై,
పెలుచం [595]దంతుల నిచ్చువాఁడఁ దమకున్ వేలాదిగా; నశ్వముల్
కలధౌతాంచిత భూషణావళులతోఁ గ న్విందుగా నిత్తుఁ గో
టు; లనెన్ గాధిజుఁ; డంచుఁ బొందె వెనుబాటున్ బ్రహ్మ, రామప్రభూ! 989

జవనాశ్వంబుల బంగరున్ రథ సహస్రంబుల్, పసందైన ధే
నువులన్ పన్నెలు బిన్నెలుం గలవి సేనున్ మీకుఁ గోట్లాది ని
త్తు; పనిష్ఠుల దమరేమిగాక; యిఁక నీ దోగ్ధ్రిం గృపన్ మీర శ్రీ
య వలెన్ నా; కని రాజు వేఁడె; ననె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 990

గడియింపంబడినట్టివే యని యనంగా రాదు; మీ రెంత స
మ్మదులై కోరిన నంత కుందనముఁ జేర్పంగల్గుదుం గూడ; మీ
రు దయం గానుకగాఁగ నీ శబల నోర్తుం బెట్టుఁ; డందుం బదిం
బదిగాఁ గోరెను రా; జటం చనె శతానందుండు; రామప్రభూ! 991

అనఘా! యెన్నఁడుఁ గామధేనువును నీయం జాల, మీ రేమి యి
చ్చిననున్; నా కిది యొక్కటే ధనము, వాసిం గూర్చు రత్నంబునున్;
మనువున్ నిల్పెడి దర్శపూర్ణిమలు, క్షేమం బిచ్చు యజ్ఞంబులున్;
నను [596]మన్నింపుఁడి యంటఁ, దెల్పుమ శతానందుండు; రామప్రభూ! 992

---

594 యిడ; 595 హస్తుల; 596 నిందింపకుఁ డంటఁ;

ఇదె సర్వస్వము నాకు; దక్షిణలు నే నీయంగ, సత్కార్యసం
పదుపేతుండవుగాఁగ దోసపడెన్ పైరం బసం బైర మి
య్యదియే నాకు; సమస్త ధర్మముల మూలాధారముల
య్యదియే నా; కనె; యం చనియె బ్రహ్మజ్ఞుండు: రామప్రభూ! 993

వలు పల్కుల్ పలుకంగ నేమిటికి? సర్వాభీష్ట సంసిద్ధినిన్
సలుపంగల్గెడిదాని నే నొసఁగుటల్ సాధ్యం బనన్ వట్టిమా
టల్గా నమ్ము; మటన్న గౌశికుఁడు పట్టన్ రాని కోపంబునఁ గ
న్నులలో గ్రమ్మంగఁ జూచె; నం చతని నెమ్మన్ బ్రహ్మ; రామప్రభూ! 994



-౨౪-

విని నిష్కర్షగఁ బల్కె సంయమిని, బ్రుథ్వీభర్త యాజ్ఞప్తిఁ జే
సెను యోధాళిని బిల్చి, కామగవినిం జేకొం డటంచున్ బలం
బున్నఁ ద న్నాభటు లెల్ల రీడ్చుకొని కొంపోవంగ, "సంబా!" యటం
చును దుఃఖించెను గో; వటంచును వచించున్ బ్రహ్మ; రామప్రభూ! 995

మనమందున్ భయ మొంది, "నన్ విడిచెనా? మౌనీంద్రుఁ డా ప్రేమ పా
త్రుని కే కీడుఁ బొనర్చియుంటి? నెట్టు లే దోషంబులం జేసియుం

టిని? నే నా ముని కిష్టురాలనుగదా! నిక్కంబుగా;" నంచు నే
డ్చెను గో; వంచును జాలి నొందుచు వచించెన్ బ్రహ్మ; రామప్రభూ! 996

భటు లీ రీతిగ నన్ను లాగుకొనిపోవం జూచుచుం గూడ నీ
కటువున్ సైచునె? మౌనిచంద్రముఁడు; దుష్కార్యంబు నున్నంత దు
ర్ఘటమే? మౌనముఁ దాల్చియుండుటయు లక్ష్య ప్రక్రమం బౌనె? యి
ప్పటి; కం చా గవి యెంచె; నం చతఁడు సెప్పం జొచ్చె; రామప్రభూ! 997

అటులన్ యోజనచేసి, త న్నొడిసి యయ్యై రీతిగా లాగు నా
భట వర్గంబును నొక్క మాఱు విదలింపం గల్గి యడ్డంబుగాఁ
బటుతన్, వచ్చినవారి నందఱినిఁ [597]ద్రుబ్బుం దన్ని త న్నొని [598]ముం
గిట నిల్చెన్ [599]గవి; యంచు ధీరతను బల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 998

వళ నిల్పంబడి, దుందుభి స్వనము దోఁపన్ మౌని నీక్షించి, "యో!
వశివర్యా! నను పీడినాఁడవొకో! పాపం బేదియేనిం దమో
వశతం జేసితి నయ్య! రాజభట దంభం [600]బిద్దియుం జెల్లునే?
నశముంగాకయు; నంటఁ జెప్పెను శతానందుండు, రామప్రభూ! 999

597 ద్రావం; 598 వాకిట; 599 మహి, వళ; 600 బిట్టులం;

శబలా! సోదరివంటి దానవు; నినున్ స్తబ్ధుండనై వీడుటల్
ప్రబలాఘం బగుఁ; జేయ వీ వెపుడు నేరం బెద్ది; నీ శోకపున్
శబలత్వంబు, మదీయ చిత్తమును సంస్తంభించె నత్యంతమున్
సబలంబై యనె మౌని; యం చనియె [601]నార్ఘ్యాగ్రగణ్యుండు; రామప్రభూ! 1000

తెలియున్ నీ వ్యథ; సర్వముం గనుదు, నే దెల్లంబుగా; నీతఁడో!
బల సంపన్నుఁడు; భూమిభర్త; కరు లశ్వ వ్రాత నేత్రాదిగాఁ
గల దక్షౌహిణి సేన యాతనికి వెన్కన్; క్షత్రియున్ మార్కొనన్
దలమే? విప్రుస; కం చనెన్ ముని; యనెం దద్బ్రహ్మ; రామప్రభూ! 1001

తలఁపన్ సైన్య బలంబు లేదు; నెరపన్ ధర్మంబె? యెందుం దపో
బలమున్ భూపతిపైన నేను; పయిగాఁ బ్రత్యేక మాతిథ్యమున్
బలవంతంబుగ నిచ్చినాఁడ వల దన్నం గాని నే నిప్పుడే
సలితో; నం చనె మౌని; యం చనె శతానందుండు; రామప్రభూ! 1002

“చులుకం దోఁపద, యెమిసేయ;” నను దేజోవంతుతో, “బ్రహ్మ సత్
కుల సంజాతుఁడ వీవు, బ్రహ్మ ఋషివిన్; క్షుద్రంపు తత్ క్షాత్రమున్
నిలువం జాలదె? బ్రహ్మతేజ; మదియే [602]నిక్కంబు క్షాత్రంబునన్
దలమిం;” చం చనె [603]ధేను; వం చనె శతానందుండు; రామప్రభూ! 1003

అనుయోక్త్రీమణి, ధేనురాజము, “మహాత్మా! మీ తపశ్శక్తి యం
తని వర్ణింపఁగ నెవ్వ రోపఁగల? రీతం డెంత దోశ్శాలి యై
నను గాధేయుఁడు [604]శక్తి సంపదను మించం గల్గునే? మిమ్ము నె
న్నను; నం చాడుట మెచ్చఁజొచ్చెను శతానందుండు; రామప్రభూ! 1004

601 నోజన్బ్రహ్మ; 602 నే ఏందు; 603 గ్రో వటం; 604 సత్త్వ;

ఎదిరింపంగలవారె? యెవ్వరును మీ యాత్మప్రభావంబు; నే
నుదయం బొంచితి మీదు మంత్ర బల సంయుక్త ప్రభావంబునన్
గద! తా మిప్పుడు నన్నుఁ బ్రోవఁ దమరై కల్పించుకో[605] వద్దు మీ
ముదలన్ వేఁడెద; నన్న దా; వనుచుఁ జెప్పున్ బ్రహ్మ; రామప్రభూ! 1005

"తొడు కే నైనను, నోరు మూలినను, నీమర్మాగ్ని దర్పంబు నే
నడఁపం జాలుదు!" నన్న, మౌని, "శబలా! యత్యంతమున్ శత్రులన్
బడఁగూల్పంగల సైన్య మీ విపుడె ధర్మం బొర సృష్టించుకో
నడచుంజు!" మ్మనె; నంచు మెచ్చెను శతానందుండు రామప్రభూ! 1006

గవి, "యంభా" యని యంకెవేసినది; వేగన్ పందలున్ వేలు ప
ప్లవు లన్ సైనికు' లుద్భవం బయిరి; విశ్వామిత్రుని సైన్యంబులన్
బవిపాతం బన, వారు పైఁ బడిరి దబ్బాబేఁగి, నల్మూలలన్
గవియం జాలుచు; నంచుఁ జింతిలె శతానందుండు: రామప్రభూ! 1007

త్వనముం దా గతిఁ బస్లవుల్ సెలఁగుచున్ దేశోన్నతిం జూపుటల్
గనె గాధేయుఁడు, నాశ మొందఁ దన చక్రక స్తోమ సర్వస్వమున్;
జననాథాగ్రణి క్రుద్ధుఁ డయ్యె; రథియై క్ష్మామండలిం గాల్పనొ
నను, నస్త్రంబులఁ గూర్చె; నం చనె శతానందుంతు; రామప్రభూ! 1008

కవిసెం దాఁ దలక్రిందుఁజేయు జగతీ ఖండం బనం జాలి, ప
ప్లవులన్: దారుణ మస్త్ర వృష్టిఁ గురిసెన్ వా రెల్లరున్ మున్గ; నా
గవియున్ దానినిఁ జూచెఁ; బ్రగోధిని యయి సంకల్పించె వె న్వెంటనే
యవనాంచత్ శకసేన: లం చనియె బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 1009

---

605 నేల?;

యవనాంతక శక సైనికుల్, పరమ వీరావేశ సంపన్నులో
యుపకుల్; సంపెంగ తేకులం దొదరుచున్ ద్యోతింతు రవ్వారు; జా
తిన వస్త్రంబులవారు; పట్టి సమూలున్ యాశోర నిస్త్రింశముల్
దపులన్, శత్రుల బూదివేసి; రనెం జింతన్ బ్రహ్మ; రామప్రభూ! 1010

తన సైన్యంబులు దగ్ధమౌ నపుడు చింతన్ మంటలం జూచుచున్;
గినుకం బొందినరా, ఐమోఘ మగువాసిన్ వేసె నస్త్రాసిం, ద
క్షణమే పద్మవులున్, శకుల్ యవనులున్ దర్పోద్ధతుల్ కల్ల వె
ల్లిని బొందంగ!నటించు యాజకుడు పల్కెన్ బ్రుక్కి; రామప్రభూ! 1011



-౨౫-

కనుచున్ మౌని వశిష్ఠుఁ డీ యిడుమ, ''యోగ స్థైర మేపార నిం
కను సృష్టింపుమి! సేన లీ'' వనఁగనే! కాంభోజులన్ సృష్టిచే
సిన ''దంభా'' యని అంకె వేయుచు, ముఖశ్రీనుండి తద్ధేను; వం
చును నుత్సాహము మీఱ, స్థేయుఁడు వచించుం దాను; రామప్రభూ! 1012

వదనోద్భూతులు, కాంతిమంతు లెడలన్, వర్ధిష్ణులౌ పహ్లవుల్
పొమగందుండి సముద్భవిల్లిరి, మహా వ్యూహంబుగా నస్త్రశ
స్త్ర దురాధర్షులు; వారివెంట యవనుల్ తద్యోనియందుండి తా
ముదయంబొందె; రటంచు బ్రహ్మ యనెఁ దా [606]నుద్వృత్తి; రామప్రభూ! 1013

శకులుం గల్గ శకృ త్ప్రదేశమున, మ్లేచ్ఛ వ్రాతముల్ గల్గె దా
నికి రోమాంచిత కూప సంచయమునన్, నిర్గ్రంథనోరుల్ గిరా
తకులుం గూడఁగ; వీర లెల్లరును దద్గాధేయు సేనాంగముల్
వికలీ భూతము సేసి; రం చనియె [607]నావ్యేన్ బ్రహ్మ; రామప్రభూ! 1014

పగతుర్ సేసినదాని నెల్లఁ గని విశ్వామిత్రు కుష్ఠీంద్రుఁ డు నూ
ఱుగురా మౌని వశిష్ఠుపైఁ బడుటకుం ద్రోహించుచున్ రాఁగనే
యుగపన్మృత్యువు వారి కెల్లఁ గలుగన్ హుంకారముం జేసె మౌ
ని గరిష్ఠుం; డని యాడె యాజ్ఞికుఁడుఁ గన్నిచ్చెట్టి; రామప్రభూ! 1015

తన పుత్రుల్ చతురంగ యుక్తముగ దగ్ధం బౌటకున్ ఖిన్నుఁడ
య్యెను గాధేయుఁడు, సర్వమున్ గనులతో నిచ్ఛంది నీక్షించుచున్;
ఘన తేజస్వి, మహాయశస్వి కనె శ్రీమంబారఁగా సిగ్గు[608]చే
టు [609]నటం బాడెఁ బురోధ, రాజు నెడఁబాటుంగూర్చి; రామప్రభూ! 1016

---

606 నుద్వేగి; 607 నోవిన్; 608 పాటు; 609 నటంచుం గులవిప్రుఁ
డాడె వెనుబాటుం బొంది;

తొలఁకుల్ ద్రేళ్ళిడి నాటునొందిన సముద్రుఁ బోలె, యుద్ధప్రవృ
త్తులు డిందన్ నిలుచుండిపోయె నరనాథుం డప్పు డేఁపొప్పు కో
రలు తీయంబడు నాగువోలె నయి, ధైర్యం [610]బోడెఁ; బక్షంబులన్
దొలఁగం ద్రుంచిన పక్షి యయ్యెఁ; నని [611]వందున్ బ్రహ్మ; రామప్రభూ! 1017

ఉపరాగోపహతిన్ విదూర మగు సూర్యోజోగుణౌపమ్యమై
యుపనీతంబయిపోయెఁ గౌశికు నభిఖ్యా భాగ్య మత్యంతమున్
విపథం బూని; కుసూక్ష్మ భూపునకుఁ బేర్మిన్ సేనలున్, దర్పమున్,
విపరీతంబుగ దత్త యాటకును గుండెన్ బ్రహ్మ; రామప్రభూ! 1018

తన యుత్సాహము ప్రీలెఁ; రా జపుడు చింతం దూలెఁ; నా పిమ్మటన్
గనియెన్ స్వాస్థ్యము; నూర్గు రట్ల మడియంగాఁ దక్కియున్నట్టి యొ
క్కఁ-నికిం బట్టము గట్టి, పుత్త్రుని కనెన్, 'క్షాత్రంబుతో రాజ్య పా
లనముం జేయు' మటం చనెం దనివి తీరన్ బ్రహ్మ; రామప్రభూ! 1019

పరమార్థం బిటు దెల్సి తాఁ జనియె విశ్వామిత్త్రిభూభర్త స
త్వరమే ఘోర తప స్సమాధి మునుఁగన్ భావించి, నిత్యంబుఁ గి
న్నర కింపూరుష నాగ బృందు హిమవ న్నాగంబునుం జేరి, యా
శ్వరు మెప్పింపఁగ; నంచుఁ దెల్పె మూర మొప్పన్ బ్రహ్మ రామప్రభూ! 1020

చని యాతండు మహోగ్ర వీర తపమున్ సల్పంగ, నెంతో గతిం
చెను గాలం; బపు డా వృషధ్వజుఁడు మెచ్చెం గానఁ బ్రత్యక్షమై,
'జననాథా! గత మేమి? నీ విటు తప స్సంసిద్ధికై పూన;" నం
చని ప్రశ్నించుటఁ దెల్పె మోదపడి బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1021

610 బోడె; గోటాపనల్; బోడెఁ బత్రంబులన్; 611 కుందున్;

ఉదిలెన్ రాజు సమాధి; వేఁడుకొనె, "సాంగోపాంగ మౌనట్లుగా,
సదయన్ మీ చపవేళ గమ్యము, రహస్యంబైన మంత్రాళి కా
స్పదమౌనట్టి, ధనుర్ధ్రుతంబు సమకొల్పంజేయుఁడీ నన్ను మె
ప్పు దలిర్పంగ;'' నటంచు మ్రొక్కెఁ; యని చెప్పన్ బ్రహ్మ; రామప్రభూ! 1022

సుర రక్షో గణ యక్ష కిన్నర మహర్షుల్, మేటి గంధర్వులున్
బరగం దక్కిన దేవజాతులకునున్ స్వాధీనమై సాధనో
త్కరమై యొప్పెడు నస్త్ర శస్త్ర చయముల్ కాఁగోరుదున్ దేవ! సు
స్థిరమై నాకు నధీన; మం టతఁడు మెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1023

నానా దైవములన్ స్మరింపఁ; గృప సంధానింపుమీ! నాపయిన్;
బౌనఃపున్యమునన్ భజింతు, దయఁజూపంజాలు దైవంబుగా;
నీ నా వాంఛిత తేళ మీ వొసఁగవే యాదేర్పఁగా నౌదు, గౌ
రీ నాథా! యనె రా; జటంచుఁ దను బల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1024

అంతర్థానము నొందె నీశుఁడు ''తథా'' స్తంచుం; దదాదిం గడున్
బంతంబేర్పడెఁ గౌశిక ప్రభుకకున్ బ్రహ్మాండమా రీతిగాన్;
వంతు నవోపుట, పంతగింపుబునున్ గర్వాతిరేకం బొటబేఁ,
జింతల్ లేఁగెను వెంచి; యం చని పచింపెన్ [612] బ్రహ్మ రామప్రభూ! 1025

బలవంతుం డని యాదినుండియును గర్వ స్ఫూర్తి యత్యంతమున్
గలఁడా గాధిజుఁ; డవ్వి యుద్విధయును గల్గన్ మేటి శస్త్రాస్త్రముల్,
ప్రలయాగ్నిన్ బలె నా వశిష్ఠు కడకున్ దాఁగల్గి నిర్బంధ బగన్
విలస ద్దుఃఖ దుషార్తుఁ డాతఁ; డనెఁ [613] బల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1026

612 పూని; 613 డనె నోర్మిన్;

స్థిరుఁడై, పర్వ దినాబ్ధివోలెఁ గడు [614]నుద్రేకించె రోషాతి ని
ర్భరతం; దేజముఁ గ్రుమ్మరించు బహు శస్త్రాస్త్రంబులన్ వానిపైఁ
గురిపించెం; బొగలున్ సెగల్ గలఁగఁగా, "గుప్పించు" నా యాశ్రమం
బు రగుల్కొన్నది; యంచుఁ గ్లేశమునఁ జెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1027

సెగ లాకాశమునందు లేచినవి; లేవెన్ నిల్వఁగా లేక ప
క్షి గణంబుల్ మునితోఁటయందలివి పైకిం గస్తిఁ [615]గూజించుచున్,
పగ ఘోరం బగుటన్; మృగంబులును బర్వం జొచ్చె నిట్టట్టు ము
వ్వ గలంపంగ; నటంచు రోప్పు[616]మెయిఁ జెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1028

ముని శిష్యుల్, మఱి యాశ్రమంబునను గాఁపున్నట్టి ఋష్యాదులున్,
గన దప్పిస్నులఁ దట్టుకొంటియె యశేష్యం బౌటఁబర్వెత్త, "మఱి
చును సూర్యున్ వలె, నేను గాధిజు నొంతున్; నిల్వుఁడీ!" యంచు, వేఁ
డె నిరర్థంబుగ మౌని; యంచు వెత నాడెన్ బ్రహ్మ; రామప్రభూ! 1029

వన మెల్లం బరిదగ్ధ మయ్యె; నస లా ప్రాంతంబె శూన్యంబుగాఁ
గనిపించెం గడు నూషరంబు వలె; రక్త ప్రేక్షణుం డయ్యెఁ దాఁ
గనలుం బొంది వశిష్ఠ మౌని; "యిఁక నో! గాధేయ! యేమాత్రమున్
మనరా దీ"; వనె నంచు నొజ్జ వెతఁ జెప్పం జొచ్చె; రామప్రభూ! 1030

అనయం బజ్జుఁడ; వెంతకాలముఁగనో! యాసక్తిపై, పెంచియుం
డిన మున్యాశ్రమముం, దపోవనమునున్ డీలించి దగ్ధంబుఁ జే
సిన దుష్టుండవు; బ్రహ్మదండ మిదిగో! చేడ్పాటు నొందంగానో;
దని, యద్దానినిఁ గేలఁబూనె; వనె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1031

---

613 నోర్మి; 614 నుద్దీపించె; 615 స్తి రోదించు; 616 చను;

"సముదీర్ణాఘుఁడవున్, సముద్ధుర దురాచారుండ వీ" వన్న మా
త్రమునన్ ధూమము గీవు మేమియును బర్వన్ రాక యాబ్రహ్మదం
డము పుట్టెన్ యమ దండమో' యనఁ జాడం దన్మహర్షీంద్ర క్రో
ధమునుంబట్టి నృపాలుపై, నవియె నేత్రద్వంద్వ; రామప్రభూ! 1032



వని, యాగ్నేయమ్ముఁదీసె గాధిజుఁడు వేగన్; "నిల్వుమీ! నిల్వుమీ!
యునికున్నా!" యని నా వశిష్ఠు; నతఁడున్; "మూర్ఖా! యిదే నేను నీ
పనిబట్టన్ నిలుచుంటి; క్షత్త్రబలమున్ బ్రాహ్మత్వమ్మునుం దెల్పమా
జన లోకంబున;" నంచు నుండె; ననె నోజన్ బ్రహ్మ రామప్రభూ! 1033

అనుచుండంగనె [617]యేసె గాధితనయుం డాగ్నేయ; మద్దానినిన్
దన దండంబునఁజేసి పౌనియు నిరోధరం; బంత నా యస్త్రమున్
ఘనసారంబునఁబట్టె యగ్నిపలెనై కన్పించెఁ జల్లారి; యం
చనుచుం జెప్పె విషాద రేఖమెయి బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1034

వనలుం బొంది మఱింతగా నృపుఁడు, శక్త్యాత్మజుం డేసె, వా
రుణ రౌ ద్రైంద్ర మిషీక పాశుపతమ్ముల్ సూక్ష్మంబుగా నొక్కటన్;
చనియుంటోవకవానితో, మఱియు గాంధర్వంబు, మానంబు, మో
హన సంతాపన జాల మేసె; ననె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1035

ఘనమైనట్టివి బ్రహ్మపాశమును నింకం గాలపాశంబు, వా
రుణ పాశంబును దారుణంబు, తమికోల్పున్ జృంభణ, స్వాపన,
ప్రముఖ క్రౌంచ, విలాపనంబులు, లస ద్వజ్రంబు, పైనాక, మా
దన దైతంబుల నేసె; నంచుఁ దెలిపెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1036

తమి మీఱంగను నేసె శోషణమునున్, దండంబునున్, ధర్మచ
క్రముఁ, బైశాచము, మంథనంబు, మఱి యింకన్ విష్ణుచక్రంబు, భ
వ్యము వాయవ్యము, కాలచక్రమును దివ్యంబౌ హయగ్రీవ మ
స్త్రమునున్ గాధిజుఁ; డంచుఁ [618]దెల్పె బహు చింతన్ బ్రహ్మ;రామప్రభూ! 1037

---

617 వేసె, పిడె; 618 దెల్పు;

శ్రమమం దెంచక యేసె గాధిసుతు పెల్వన్ దారుణంబుం, ద్రిశూ
లముఁ, గంకాళముఁ, గాలమున్ మఱియు లీలన్ ఘోర కాపాలమున్,
సమతం జూపి మహాస్త్రమున్, ముసలమున్ వైద్యాధరంబైన య
స్త్రము, బ్రహ్మాగ్నిని నొంప; నంచు నుడివెం దద్బ్రహ్మ; రామప్రభూ! 1038

ఘనమౌ శక్తులఁ గూడ రెంటిని బ్రయోగంబుం బొనర్చెం దపో
ధనుపై గాధిజుఁ; డట్టి శుష్కమును నార్ద్రం బన్న నిర్ఘాతమున్
దునుమన్ వేసెను: మంత్రవేత్త ఋషి తాఁ దున్మాడె నవ్వాని నె
ల్లను దండంబున: నంచు యాజకుఁడు దెల్పం జొచ్చె; రామప్రభూ! 1039

తన దివ్యాస్త్రము లన్ని యా గతిని వ్యర్థం బౌటకుం గ్రాఁగి యే
సెను బ్రహ్మాస్త్రము నా వశిష్ఠుపయినన్ శీఘ్రంబుగా, గాధినం
దనుఁ డవ్వేళ; నయోపచి ప్రభృతులుం, దక్కైన దివ్యౌఘమున్
వెనుబాటొంది; రటంచు యాజ్ఞికుఁడు చెప్పెన్ భీతి; రామప్రభూ! 1040

చనె బ్రహ్మాస్త్రము బ్రహ్మదండమునను లక్ష్యం బేమియుం జేయఁబోఁ
క నలిన్, బ్రహ్మఋషీంద్రు మీఁదికిని; వేఁకన్ దానినిన్ మ్రింగివే
సెను దన్మంత్ర దృఢాగ్రిముండు, భువనశ్రేణుల్ మఱిం దల్లడి
ల్లె; నటంచుఁ గులవిప్ర తల్లజుఁడు తెల్పంజొచ్చె; రామప్రభూ! 1041

గరుడుల్ యక్షుల దేవదానవులునున్ గంధర్వ దేవర్షులున్
బరమ భ్రాంత మనస్కులై కసరి తద్బ్రహ్మర్షి, యేత త్త్రియా
స్థిర విద్యాబల యుక్తి మ్రింగుటను తుష్టిన్ బ్రహ్మ భూయోస్త్రమున్,
దురవాప్యం; బని యాజ్ఞికుండు మది నొందున్ భీతి; రామప్రభూ! 1042

అనుకంప్యుండగు వశిష్ఠుఁ డా కరణి బ్రహ్మాస్త్రంబునున్ మ్రింగ, నా
యన రూపంబు మహాభయంకరముగానై, రోమ రోమంబునం
దున లేచెం బొగ, లగ్గినిప్పుకలు; నుద్యోతించెఁ గాలాగ్ని సూ
పున నొక్కుమ్మడి బ్రహ్మదండ; మని చెప్పన్ బ్రహ్మ రామప్రభూ! 1043

అనయంబున్ జ్వలియించె నా ముని వరేణ్యాకార మవ్వేళ; నా
యన రూపంబున కెల్ల లోకముల యయ్యెల్ చేష్టలం దక్కెఁ; దం
తనె వన్యాదులం బృందముల్ గనుఁ బ్రమోదంబార, "నీశక్తి బ్రా
హ్మణ వర్యా! [619]గురు;" వంచు మెచ్చె ననె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1044

అల బ్రహ్మాస్త్రము తేజ మంతయును మీయందే లయం బొందఁగా
వలయుం; లేనియెడన్ జగత్త్రియము సర్వ క్లేశముల్ పొలుగా
వలయుం; దామప్రసన్నులౌటయును భావ్యం; బంచు నెల్లారు గో
రినఁ, దేజస్వియు డించెఁ గోప; మని పల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1045

పడసెన్ ఘోర పరాభవం బిటుల విశ్వామిత్త్రుఁ; డద్దానిచేన్
విడిచెన్ దీర్ఘముగాఁగ నిశ్వసనమున్ బ్రీడాకులుండౌచు; వే
ర్పడియెన్ బ్రహ్మబలంబె మేటి బల మన్ భావంబు; క్షాత్రంబునున్
బడఁదిట్టెం జుమ! యంచు వాకొనియెఁ జుమ్మన్ బ్రహ్మ; రామప్రభూ! 1046

సమయింపంగదె! బ్రహ్మదండమునఁ బల్చెం దా వశిష్ఠర్షి, య
స్త్రమునన్ నాయవి సర్వముం; దెలియఁగాఁ జాలంగదా! నేఁటికిన్
సముచిత్తంబున క్షాత్త్రతేజ లఘిమన్ సద్బ్రాహ్మ్యముం దారత
మ్యముచే; నం చతఁ డొందెఁ జింత; యను బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 1047

619 ఘనమంచు;

౫౨

పరితాపించెను నోడినందులకు విశ్వామిత్రుఁ; డాలోచనల్
పరిగాఢంబుగ, నాత్మనిగ్రహముదోఁపం, జేసె; నిట్టూర్పులన్
బరిగూఢంబుగ వీఁడె; వైరసమువెడం బాటించెఁ గౌకృత్య మ
బ్బుర మేపార; నటంచు మోదపడి [620] పల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1048

మనసా సంద్రృతుఁ డౌచుఁ దానును నికన్ బ్రహ్మర్షి గాఁగోరి, పో
యెను బ్రహ్మత్వ సుసిద్ధికై తప మొగిన్ హేరాళముం జేయఁగా,
వనితం గూడి నృపుండు దక్షిణ దిశా ప్రాంతంబు, నేమంబునూ
నినవాఁడై కఠినంబుగా; ననుచు నెన్నెన్ బ్రహ్మ; రామప్రభూ! 1049

అతఁడుం బూనెఁ దపంబుసేయుటకునై; యా కాలమం దొందెఁ దా
నతిజాతుం డ్రనఁదగ్గపుత్రుల; హవిష్యందుండు నవ్వారిలో
నతిముఖ్యుండగు జ్యేష్ఠుఁడయ్యెను; మధుష్యందుండు నా పిమ్మటన్
సుతుఁ డయ్యెం జాబి! యంచు నుబ్బుచు వచించున్ బ్రహ్మ; రామప్రభూ! 1050

తరువాతన్ దృఢనేత్రుఁ డన్ సుతుఁడు నుద్భావంబునుం బొందె; సు
స్థిర తేజుండు మహారథుండు జనియించెం బిమ్మటన్; వీరు స
ల్బ్యదనుం బొందిరి సత్యధర్మపరు లన్ లోకోత్తరంబైన వి
స్ఫురిత ఖ్యాతి; నటంచు మోదమునఁ దెల్పున్ బ్రహ్మ; రామప్రభూ! 1051

సలిపెం బెద్దయుఁ గాల మా తపము విశ్వామిత్రుఁ డత్యంతమున్
వెలయన్ శేషము నిష్ఠయుం గడకుఁ దృప్తిన్ బ్రహ్మ ప్రత్యక్షమై,
"యిల రాజర్షుల నెల్ల మించితి మహర్షీ! నిన్ను రాజర్షిగాఁ
దిలుతుం బో;" మ్మని మాయమయ్యె; నని తెల్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1052

620 మునుఁ జెప్పెన్;

ఇదియేనా? ఫల మింతకాలమును నే నీరీతిమై జూపఁగాఁ
బదిలం బేర్పడ ఘోర నిష్ఠను దపః ప్రావీణ్య మం బెంచుచున్,
బిదపం బూనెఁ దపస్వి కా తపసియున్ వేంద్రంబు తీండ్రింప, నం
గదయున్ మీఱ, నటంచు యాజ్ఞికుఁడు నుత్కంఠం జొప్పె; రామప్రభూ! 1053

పరమోత్కృష్ట తపంబు గాధిజుఁడు సల్పంగల్గు కాలంబుకోఁ,
గురు విఖ్యాతకుల వంశమందునఁ ద్రిశంకుం డన్ మహారాజు తాఁ
బరగెం దత్కుల దీపకుం డనఁగ, దీవ్యత్కాలిన [621]ప్రజ్ఞుఁడై
ధరలో; నం చని యాజకుండు మునమేదం [622]బెప్పెఁ; రామప్రభూ! 1054

ఉరు సత్యవ్రతుఁడున్, జితేంద్రియుఁడు, సత్యోత్కృష్ట తేజుండు, సు
ర్వర యం డెల్లఁ బ్రసిద్ధుఁ డాతఁ డొకఁడే! స్వర్గంబుఁ దా బొందితో
నరుగన్ వింతగు బుద్ధిపుట్టినది యా భూభర్తకున్ నెమ్మదిన్
బరుపై; యంచును జింతమీఱఁ గులవిప్రుం డాడె; రామప్రభూ! 1055

అది సిద్ధింపఁగ యజ్ఞమేదయినఁ జేయంగోరి, యా రాజు నిం
పు దలిర్పంగ వశిష్ఠమౌని కది చెప్పన్ మెప్పుగాఁ; గాని, యా
సదయుండైన పురోహితుం డది యెటుల్ [623]శక్యంబు గా దంచునున్
ముదలించెన్; నృపుఁ డంత నొచ్చె; నని చెప్పన్ బ్రహ్మ; రామప్రభూ! 1056

గురు వా రీతి నిరాకరించుటకు సిగ్గుం జెంది, తత్పుత్రులన్
గురు తేజోనిధు, లుండు దక్షిణపు దిక్కుం గూర్చి యా రాజు స
ద్గుర్వరమే పోయెను, వారి వేఁడికొనఁగా భావంబునం దెంచి సూ
తర; నంచుం గులవిప్రుఁ డాడె మొగమోడ్పుం జూప; రామప్రభూ! 1057

---

621 ప్రా; 622 జెప్పె; 623 సాధ్యంబు;

శిరసా వారికి మ్రొక్కి, 'నే నగుదు మీ శిష్యుండఁ; గార్యార్థికిన్
శరణం బీయ సమర్థు లీర యని పంచాడించుచున్ వచ్చితిన్;
గురుదేవుండు పరీక్షఁ జెందుండకొ! తగ్గుల్ సేసె నా కోరికల్
గర; మం చాతఁడు దెప్పుటన్ గురుపు వక్కాణించె; రామప్రభూ! 1058

తమ సోదర్యులు యజ్ఞ మేదయినఁ జింతం జేయనౌ నాకు; దే
హముతో స్వర్గముఁ జేరఁగా వలతు; శక్యం బద్దితా దం చనెన్
దమ జన్యుం, డొదఁగూర్ప నిచ్చఁ గొనుఁ డేత ద్యజ్ఞముం జేసి త
ర్షము నా; దం చతఁ డాడె; నంచు గురుఁ డోజం జెప్పెఁ రామప్రభూ! 1059

సకల క్షత్త్రియ జాలి తారకులు పెల్చన్ స్తేయుచే మార్గ ద
ర్శకు, లైక్ష్వాకులకుం బురోహిత వశిష్ఠ బ్రహ్మలే కా దనన్
వికతాంత[624]స్కృత వచ్చినాఁడ నిటకున్; మీరే యిఁకన్ నాకుఁ దా
రక; మం చాడెఁ ద్రిశంకు; పంచు గురుఁ దర్జం దెల్పె; రామప్రభూ! 1060



[624] వ్యండయి;

చెవిఁబెట్టిన్ నృపుఁ డాడు వాక్యముల వాశిష్ఠాకరం బెంతయున్
సువహంబై, వినినంత నా క్కొకరుసుం జోద్యంబునుం బొంది, మ
న్యువునన్, 'రాజ! వశిష్ఠుఁడే దమకు శ్రేయుం డౌను: సత్యప్రతి
శ్రవుఁ డాతం;' డనిరంచు వారొనియె నోజన్ బ్రహ్మ; రామప్రభూ! 1061

బుతి నిక్ష్వాకుల కేల? యజ్ఞముల [62]నేవేగాని చేయించు తత్
కృతియున్ యోగ్యుఁ డతండె; యాతఁ డిపు డేదేఁ గాదనన్ నీవు స
మ్మతితో నన్యుల నాశ్రయింపఁ దగునే?మా కాయనం గా దనన్
గతియున్నే? యనినారు వా; రనియెఁ జక్కన్ బ్రహ్మ; రామప్రభూ! 1062

సమచిత్తుం డతఁ డొక్కఁ యజ్ఞమును దుస్సాధం బనన్ మాకు శ
క్యమె? యద్దానిఁ జేయఁబూన; గురువాక్య వ్యత్యయం బంత సా
ధ్యమె? నీ కేనియు మాకు నేనియును; జింతం దక్కి పొ మ్మింటికిన్
శ్రమమేలా? యనినారు వా; రనియెఁ జెల్పన్ బ్రహ్మ; రామప్రభూ! 1063

గురువున్ సేసి రవజ్ఞ నా కనుచు, మీకుం జెప్పకో వచ్చినన్,
గురుపుత్రులె దమరుం బరాభవము నాకుం జేయుచున్నారు ని
ష్కారుణం; బెద్దలికతంబు రిపుర వీఁకన్ సాగింప భూపుండు; స
త్వరమే భానికి స్వస్తి; యం చనె ననుం దద్బ్రహ్మ; రామప్రభూ! 1064

గురు నింకొక్కని నేను జూచికొనుదున్; గొండాట యేలా? నిరా
దరమున్ సైఁపఁ ద్రిశంకువో పునె? యనెన్; తద్ధిక్కృతిన్ విన్న వా
రు రౌదన్ వంశపరంపరాగతము బౌరోహిత్యమున్ మానకొం
దు రె? యం చెంచి; రటంచుఁ జెప్ప వెత నొందున్ బ్రహ్మ; రామప్రభూ! 1065

---

62౯ నెందే

ఫలమే? మూర్ఖ! పురోహితత్వ మనుచున్ భావించి, వాశిష్ఠు లా ఫల
పల, నా ఘోర వచస్సులం దలఁచి, కోపం బుగ్రమౌటన్ వశి
ష్ఠులతో మీటి వశిష్ఠుఁ డౌటఁ, గనుఁ డిట్టుంబెట్టి, రా రాజు చిం
తిలఁ జండాలుఁడ వీవు గమ్మను; చనెన్ స్థైర్యుండు; రామప్రభూ! 1066

తెలవారంగనె రూపు మారె; బిరుసొందెన్ దేహమున్ నల్లనై;
వెలివాఁ డయ్యెఁ త్రిశంకు; డంబరములుం బె న్నీలివైపోయెనే? సొ
మ్ములు ని న్మయ్యెను; వెంట్రుకల్ గుఱుచలై పోయెన్; మెయిన్ ధూళి, పూ
పుల మాలల్ మెడ, పల్లకాటి; వని [626]చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1067

ఆపు డాతం డటు లౌటఁ [627]బ్రెగ్గడలు నయ్యో సేవకుల్ దప్పకో,
సపవృత్తం బగు సర్వమున్; నృపతి నష్టాభీష్టుఁడా! యయ్యెఁ; దా
నపహాస్యం[628]డయి యంత్యుఁ డయ్యె: నయినన్ హైన్యంబు నొందండు; త
న్నృపుఁడున్ ధీరుఁ; డటంచు బ్రహ్మ కొనుఁ దన్విం గొంత; రామప్రభూ! 1068

తుద కా ధైర్యమె దోడ్పడెన్ నృపతి; కెందున్ వేడికింగానియున్
సొద యీ రీతిది గల్గునే? యనుచుఁ దత్ చూరుం దహోరాత్రముల్
కుదిసెం; బిమ్మట గాధిజుం గలియఁగా రోషంబునం దోవ, నా
పద కా మౌని కలంగె; నం చనియె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1069

ఓ! రాజా! యిది యేమి ఘోరము? మహోంహోరూప మట్లుంటి వే!
భూరాగ్రేసరుఁడైన నీ కెటులఁ బొల్చున్ క్షుద్ర చండాల రూ
పారంభం? బిది శాపమే? యెవరు ని న్నా రీతిగాఁ దిట్టె? రే
లా? రానయ్యె ని; టంట మౌని, తను మెల్లం జెప్పె; రామప్రభూ! 1070

---

626 దెప్పెన్; 627 ఏ మంతులును; 628 డగు నంత్యుఁ;

విని, గాధేయునకుం ద్రిశంకువు మహా ప్రీతిన్ నమస్కారముల్,
వినతుల్ సేసి, వశిష్ఠుఁడున్ సుతులు నన్ మేకోలునన్ భంగపు
చ్చినయద్దానికి నే నచెన్; గురు సుతుల్ ఛీ! యంచు నన్నిట్లు పొ
పిన నే వచ్చితి; నంచుఁ జెప్పె; నని చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1071

గురుఁడున్ మద్గురుపుత్త్రిలుం గడకు నా కోర్కెం దిరస్కారమున్
స్థిరులై సల్పిరి; నేను గా దనఁగనే "ఛీ! నిన్ను చండాలతన్
పౌరపొచ్చెం బొనరించు; నంచు నను శప్తుం జేసి చూపించి రీ
పొరిచూ;" యంచుఁ ద్రిశంకు వాఁడె; నని చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1072

మును పెన్నండు నబద్ధమాడి యెఱుఁగన్; ముందైననుంగూడ నా
ద నటంచున్ శపథంబు చేసెదను; మాటల్ మాటలున్ వచ్చినన్,
ఘన కష్టంబులు వచ్చినన్ నెఱియు, ధర్మశ్రీయు, సత్యంబు నే
నెనిపం జేయుదు; నన్న రాజనుడి నెన్నెన్ బ్రహ్మ; రామప్రభూ! 1073

గురులన్ నమ్రతతోఁ జరిత్రము మెయిం గొల్వంగ సేవించి, యె
ల్లరుసున్ మెచ్చఁగ నూఱు యజ్ఞములు సల్పం గల్గితిన్; సత్కృతుల్
పరగం బెక్కులు సేసితిం; దనువుతో స్వర్గంబుఁ జేరంగఁ గో
ర్కి రహిం గల్గిన; దంచు రా జనుటఁ దెల్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1074

కనుకన్ యజ్ఞ మెదేని యొక్కటి ననుం గావింపఁగాఁ జేయుఁ డం
చని నే వేఁడితి మద్గురూత్తముని మర్యాదా ప్రకారంబుఁ; గా
దనఁగా నాతఁడు వాని పుత్త్రిలను సంప్రార్థించితిన్; వారుఁ గా
దనుచుం దిట్టి; రటంచుఁ దెల్పె; నని బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 1075

శ్రమ మి ట్లొందితి; నేను సల్పిన మహా సత్కార్యముల్ వ్యర్థమై
శ్రమమే దక్కెను; సర్వ మానాకా! సుపర్వాధీన; మెందున్ బలీ
యమొ! దైవంబె; యెఱుంగ దైవ హతుఁడన్; పౌర్దంబుఁ బ్రార్థించుచున్
దమరిం జూడఁగ వచ్చినా; నని నసెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1076

~~~

ఓసియెం గౌశిటు డా త్రిశంకుని గృపావేశంబునన్, "నాయనా!
ఘన సు స్వాగత మిద్దె నీకు; వినుదుంగాదే! భవ బ్రహ్మ ధ
ర్మ నిరూఢిన్, బహుల సత్యసంధతయుఁ; బ్రేమన్ నేను గాపాడెదన్
నీకు; నం బాడె" నటంచు గౌతముఁడు డెన్నెన్ మౌని; రామప్రభూ! 1078

క్రతు నిర్వాహక పుణ్యకర్మలను నే రాచింతు; నాపంతయున్
నెఱయున్ భీతియు నొందవద్దు;" దివిరిం బ్రేరిన్ మహర్షిట గనన్
సతనుండై చన నోపువాఁడ, ఎదియే చండాల రూపంబుతోఁ;
గృతకృత్యుం డ; టనెన్ మహర్షి; యని యుల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1079

పర మౌనీంద్రులు మెచ్చఁ జేసెదను జేవన్ నీకుఁగా నొక్క యా
ధ్వరమున్; స్వర్గము చేతఁజిక్కు నటులే భావింపుమీ! నీ విటుల్

శరణం బీఁగలయట్టి గాధిసుపునే చయ్యన్ సమీపించినా
వర యేంగా; నని గాధిజుం; డనియె బ్రహ్మర్షి[6] జ్ఞుండు; రామప్రభూ! 1080

అనుమం బ్రాజ్ఞవరిష్ఠుఁడుం బరమ ధర్మాత్ముండు, తేజిష్ఠుఁడున్,
మునివర్యాగ్రగనరుండు, గాధిజుఁడు పంపుం బుత్త్రులన్ వేగఁ దెం
డని సంభారములెల్ల యజ్ఞమునకున్ హార్దిక్రమున్ హ్లాదమున్
నెసఁగంగా; నని గౌతమాత్మజుఁడు దాఁ భీతిల్లి; రామప్రభూ! 1081

సుతులం బంపినపిమ్మటం బిలిచి, "శిష్యుల్! రండి; మీరల్ బహు
శ్రుతులై ఋత్విజులౌ మహర్షులను, ఛాత్రులల్ మిత్త్రబృందాది సం
యుతులై రమ్మని కోరుఁడీ! యిటకు, నా యుక్తరాజుగాఁజెప్పి యీ
క్రతువుం దీర్ప; ననెన్ ఋషీంద్రుఁ డనె వేడ్కన్ బ్రహ్మ; రామప్రభూ! 1082

---

6 (1) జ్ఞాని;
~~~

మున యాహ్వానము విన్న యా పిదప నెవ్వా రేమి యేమందు( బ
ల్కినవారో! యది యెల్ల నాకు( గడు నేర్మిం జెప్పు(గా( గోరెదన్
టంగా; నం చని గాధిజుం డనియె; నాపై వారు న ల్దిక్కులన్
జన, బ్రహ్మర్షులు వచ్చినా రనియె( జెల్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1083

అమరం గార్యము, వెన్కకున్ మరలి, 'దేవా! మీదు వాక్య ప్రకా
రమునన్ వచ్చిరి దేశదేశములవారల్, బ్రాహ్మణ శ్రేష్ఠు లు
త్తమ భక్తిం; బగ నా మహోదయు(డనుం ద త్సోదరుల్ సుజ్ఞురున్
శ్రమునై రా; రని శిష్యు లాడి; రనె( జెల్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1084

క్రతువున్ మాలు(డు సేయ, దానిని బతే! ఋత్త్విండు సేవింప, దే
వతలుం గొందురె? హవ్యముం; వినుడురే? భ్రష్టాన్నమున్ బ్రాహ్మణుల్,
మతిమంతుల్ దమ యొజ్జ సెప్ప; ననుచున్ వాశిష్ఠు లెల్లారు( గో
పితులై; రంచును శిష్యులాడి; రని చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1085

తమ యాచార్యునిమాట నమ్ముకొని యెంత్యాన్నంబు భక్షించి, స్వ
ర్గము సూజరిగొను విప్రసత్తములుగల్గిన్ వచ్చునే? యెట్టిలో
కములో నే; ననిరా మహోదయుని వెన్కం జేరి వాసిష్ఠులున్
దమలై; యంచును శిష్యులాడి; రనె( జింతన్ బ్రహ్మ; రామప్రభూ! 1086

వినుతం బొందెను గాధిసూను(డు; ''బహు క్లేశంబు లే నోర్చి చే
సినవా(డం దపమున్ మహోగ్రముగ; దూషింపంగ నెంచేమి చూ
పినవారల్ దమ?'' రంచు( గుంభజులన్ వే భస్మమైపోవ( ది
ట్టె; నటం బాడిరి మౌని శిష్యు; లని యాడెన్ బ్రహ్మ; రామప్రభూ! 1087

-౬౦-

తను దూషించితి రా దురాత్మ యను కక్తన్ గాధిజుం డట్లు బ
ల్కెను వాశిష్ఠుల; వారి నెల్ల హత మార్చెం; బిమ్మటన్ మౌనులన్
గని, యైక్ష్వాకువు సూ త్రిశంకువు, మహాకర్మజ్ఞుఁడున్ ధార్మికుం
డనియెం గౌశికుఁ; డంచుఁ దెల్పెను శతానందుండు; రామప్రభూ! 1090

ఘనద శ్రేష్ఠుఁ డితండు, స్వర్గమునకుం దాఁ బోవఁగా నెంచె, నీ
తనుఁబంపుండని; వసిష్ఠ యాజకుని, నేత త్పుత్రులం గూడ, వే
ల్మని జేయింపఁగ వేఁడె నందులకుఁ; దాల్మిం దూలి వాసిష్ఠ లి
తనినిం ద్విట్టి; రనెన్ మునీంద్రుఁ, డనెఁ జింతన్ బ్రహ్మ; రామప్రభూ! 1091

ఇన వంశోద్భవుఁడైన యాతనిని బోయెన్ క్షత్రి రూపంబు దా
నను; జండాలుని రూప మియ్యదియుఁ గ్రమ్మన్ వచ్చె; నట్లై నసునే
నను జేరెన్ శరణంబుఁ గోరికను మానన్ లేక; చేయింతు వే
ల్మిని నే; నం చనెఁ గౌశికుం; డనియె వేల్మిన్ బ్రహ్మ; రామప్రభూ! 1092

అతనిన్ దేహముతో దివం బనుపఁగా నే నింతకున్ మాట యి
చ్చితి నిచ్చం; దమ రెల్ల రీ ప్రతిన నాదే సిద్ధి నొందింపుఁడీ!
అతమై తోడ్పడి; యంచు గాధిజుఁ డనన్ సాగించి రౌహంబు సం
వతి నన్యోన్యము మౌను; లం చనియె శోభన్ బ్రహ్మ; రామప్రభూ! 1093

అను నీ కౌశిక మౌని యెంతయును గోపాటోపి; యే మున్నునన్
దగవౌ నీతని తోడ; నగ్ని సముఁడై దగ్ధంబు గావించెడున్
బిగమై శాపము నిచ్చి, శా దనినచో బంతంబు నీ మౌని; దో
గగు నెట్లా? యని, వార లెంచి రనె బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 1094

కనుకం గౌశికు మాట వింట యొకటే గర్తవ్య; మే శంకయున్
గనఁగా రా దిఁక, నీ సవంబు నెఱపంగాఁ జూచుటే తప్పు; ఱా
తని యోజన్నున నీ త్రిశంకు వెటులుం దా స్వర్గముం జేరు; సం
చని యాహూత గణంబు నెంచె; ననె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1095

క్రతు వారంభము నయ్యె; యాజకుఁడు త ద్గాధేయుఁ డద్దానికిన్;
మతిమంతుల్, పటు మంత్రకోవిదులు ప్రేమన్ ఋత్విజుల్ గాఁగ, సం
గతితోఁ గర్మలు సర్వమున్ సదుప యుక్తంబౌఁ బ్రకారంబునన్,
హితమై, మంత్ర హితంబుగా, యనియె వాహిన్ బ్రహ్మ; రామప్రభూ! 1096

పటు మంత్రంబుల గాధిరాట్తనయుఁ డాహ్వానించెఁ దాఁ జాల సే
పటిదాఁకం తమ హవ్యముల్ గొన సుపర్వ శ్రేష్ఠులం; గాని, యెం
తటికిం వారలు రారు; కోపమున నేత న్మౌని [681]స్రావ్యమ్మ న్
కిటిలెం జు; మ్మని స్రేయుఁ డొయ్యన వచించెన్ ఛీటి; రామప్రభూ! 1097

స్రువమ్ముం దాల్చి మహాన్ని, "వ్యర్థ ముపటన్ శోభించెడున్ సత్తతం
తుపు నా దియ్యది; యో! త్రిశంకువు! నినుం దోస్తోడ నా ప్రజ్ఞచే
దివికిం బంపెద బొందితో నిపుడె; సందేహింపఁగా నేల? నీ
యుపయూపంబున;" కంచు మెచ్చుకొనె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1098

శ్రమ కే నోర్చి భృశంబునున్ మునుపు సల్పంగన్న యేత త్తపః
క్రమ మేపారుచు సిద్ధిఁ గన్న యెడలన్, రాజుం ద్రిశంకుం బ్రభా
వము త త్సిద్ధిది బొందితో ననిపెదున్ స్వర్గాని కంచుం బ్రమా
ణము సేసెన్ ఋషి; యంచుఁ బేర్కొనె శతానందుండు; రామప్రభూ! 1099

---

681 భ్రూ యుగ్మమున్;

చని నెల్లావలు విస్తుపోవ, నతఁడున్ స్వర్గంబునుం జేర; నం
తని దేవేంద్రుఁడు, దేవతాగణముచిత్తం బెంచి, "యో! రాజ! యిం
చు నుపాధ్యాయుని శాప మొందిన నరుం డూరంగ రా దంచు నీ
వ్వ నెఱుంగం దగు;" నంచుఁ ద్రొక్కె నని చెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1100

"గురు శప్తుండవుగాన, నోయి! పసమీ! గోత్రంబుపై వెంటనే,
ధరణీంద్రా! తలక్రిందుగా," నవెను సుత్రామాభిషంగంబునన్,
ధరణిం గూలుచుఁ దల్లక్రిందులుగఁ దద్ధాత్రీశుఁ డార్చెన్, "ఋషీ
శ్వర! కాపాడుమి!" యంచు; నం చనె వినెన్ బ్రహ్మ; రామప్రభూ! 1101

విని గాధేయుఁడు రోదనంబుఁ; గొనియెన్ నేంద్రంపు రోషంబు; 'ధా
రణిపైఁ గూలకు; మచ్చటే! నిలువుమా! రాజేంద్ర!' యంచాతనిన్
వినువీథిన్ నిలిపెం దపోబలముచే ప్రేకంబుగాఁ జూచి; యం
చని, యుత్సాహము వొంగ వాకొనియె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1102

మునిమధ్యంబున నున్న కౌశికుఁడు పంబున్ బ్రహ్మయో! యన్నటుల్
గననై; యంతట నా త్రిశంకు ధరణీకాంతుండు ప్రేలాడు దీ
ర్చుకన, యోజించె సృజింపఁగా నతఁడు నిం కొక్కండు స్వర్గంబు; నం
చను మోదంబును నాస్థయున్ నెఱపె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1103

మని తా దక్షిణ దిక్కునన్ నిలిపె నేర్పుం జూపి సప్తర్షులన్,
వినువీథిం బట తిక్కులం దఱుగ దావేశంబు; వే రొక్క యిం
ద్రుని సృష్టించుటయా? కలట్టి యతనిన్ దున్మాడుటా? యందు; నం
చనలన్ మున్గె; నటంచు మోదిచెను బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1104

ప్రారంభించెను దక్క దేవతల నెల్లన్ సృష్టిచేయంగ దు
ర్వార [632]ప్రోషిమ; నంచు నెల్లరు భయభ్రాంతాత్ములై పోయి దై
త్యారి శ్రేష్ఠులు వచ్చి రా ఋషిని సంప్రార్థించి యావేశమున్
దేకంజేయఁగ; నంచుఁ దెల్పె ముద మొందెన్ బ్రహ్మ; రామప్రభూ! 1105

---

632 ప్రక్రియ;

మును లా యాడిన మాట లన్నిటికిఁ దృష్టం డౌచు నంగీకృతిన్
గనిపించెన్ గురు కౌశికుం; డటుల భాగ్యం బార యజ్ఞంబు నొం
దెను సంపూర్ణ సమాప్తి; నా మునులునున్ దివ్యుల్ దమంతన్ వెసన్
జని రెవ్వారల [633]దారి వా; రనె శతానందుఁడు; రామప్రభూ! 1112



633 త్రోవ

-౬౧-

తరువాతం, దన దక్షిణంపుఁ దప మత్యర్థంబు విష్నుంబులన్
బొరసెం గాన, నతండు పశ్చిమ కకుప్పం జేరి, యందున్నవు
ష్కర తీర్థంబునఁ దీర వాటికలలోఁ గావింపఁగా నెంచె ని
ర్భరమైనట్టి తపం; బటం చనె నహల్యా సూతి; రామప్రభూ! 1113

అనుజీవుల్ దన వెంట రాఁగ ముని యాహ్లాదంబునం, ద త్తపో
వనముంజేరి ఫలంబులె [634]దనకు సర్వాహారమై యొప్పఁగా,
ననివార్యంబు, మహోగ్రమైనది తపోవ్యాప్యత్వమం దుండె; నం
చని శ్లాఘన్ వివరింపఁ బూనెను నహల్యా సూతి; రామప్రభూ! 1114

అనుభావంబున నంబరీషుఁ డను రా జా నాళ్లలోఁ జేసెఁ బా
లన మత్యూహ నయోధ్యయం; దతఁడు సల్పం బూనె నొక్కప్ప డి
జ్యా నొకం; దద్దియు సాగఁ దల్ పశువు నా శక్రుండు గొంపోయె; నం
చనెఁ జింతాకుల చిత్తుఁడై [635]మన యహల్యా సూతి; రామప్రభూ! 1115

కనరామిం బశు వప్పు డా సపనముం గావించు స్థేయుండు గొం
కున; "రాజా! యిది నీ పరాకున కసుం [636]గ్రూరంపుఁ దార్కాణ; చే
యును నీ దోషము నిన్ను నాశనము; దుష్యుఁన్ దోషముం బ్రాపితం
బన నౌనే! యనె; నంచుఁ జింతిలె నహల్యా జ్యోతి; రామప్రభూ! 1116

కనుకన్ యజ్ఞ పశూత్తమంబును వెసం గన్పట్టనౌ; లేనిచో,
మనుజుం దేవలె నొక్కనిం బసుపుగా మున్ముస్ వడిస్ రాజు; యం
చనె నా యాజకుఁ; డైననున్ నృపుఁడు నత్యంతంబు దీరుండు గా
వున యోజించెను గొంత సే పనుచుఁ జెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1117

634 దన కద్రభాహార; 635 కడు న; 636 ఘోరంపు;

తెలిపిం జూపుచు నంబరీషుఁడు బవుద్రేఁగె సహస్రంబులై
మునియన్ సాగిన యాల వెంటఁగొనుచున్; బ్రహ్మాండమౌఁ బట్టణం
బులునుం బల్లెలు దేశదేశములునుం బుణ్యాశ్రమ వ్యూహముల్,
కలయంగాఁ బరికించె; నం చనియె శంకన్ బ్రహ్మ; రామప్రభూ! 1118

అయినం గన్గానలేకపోయి నతఁ డా యా పుణ్య దేశంబులన్
బ్రియమారం దన యజ్ఞపుం బశువు; నొక్కం గొండలన్ రోయఁగా
నయినం దుష్టితుడన్ గనుంగొనె ఋచీకాఖ్యున్, మహర్షీంద్రునిన్
నయ నిష్ఠాత్ము; నటంచుఁ బేర్కొనె శతానందుండు; రామప్రభూ! 1119

భృగుతుంగం బను బర్వతస్థలమునం బేర్మిం దపంబందునన్
సుగుణుం, డాతఁడు, దార పుత్త్రకులతో శోభిల్లుచుండంగఁ బెం
పుగఁ దా మన్ననఁజేసి, మ్రొక్కి కుశలంబుం బ్రశ్నఁ గావించి, మె
ల్లగఁ జెప్పెం దన గో; డటం చనె నహల్యాసూతి; రామప్రభూ! 1120

కనరా నైతిని నాదు యజ్ఞపశువుం; గాదృండనై యె ల్లెడన్
బని గాలించితి దానికై; విఫలమౌ జన్మంబు నా దింకఁ; బ్రా
ర్థన నా దొక్కటి కద్దు; మీ రవియు శ్రద్ధన్ విందు నంచన్నఁ; గ్ర
న్నన వి, స్తన్న నృపోక్తిఁ దెల్పెను శతానందుండు, రామప్రభూ! 1121

తమ పుత్త్రి త్రయమందు నొక్కనిని, జింతన్ మాని, నా యజ్ఞ వి
ఘ్నముఁ దప్పింపఁగ, యజ్ఞపుం బశువుగాఁ గారుణ్య సందీప్తులై
శ్రమమం చెంచక యమ్ముచో, నగును [687]నిష్టార్థ వ్యాప్తి యం చాతఁడున్
నమనుం దయ్యె; నటంచు డిందెను శతానందుండు; రామప్రభూ! 1122

నను ధన్యాత్ముని జేసినందులకు, నెన్నన్ గో సహస్రంబులన్
మునినాథా! తమ కిత్తుఁ గాసుకగఁ బంబున్ భక్తి సంయుక్తిమై
నన క్ష్మాపాలుఁడు, "జ్యేష్ఠు నీయ" ననె మున్యగ్ర్యుండు; "నే నీయ" నం
చనియెన్ మాత 'కనిష్ఠు;' నం చనె నహల్యా సూతి; రామప్రభూ! 1123

---

687 నిజ్యా, నిష్టా;

అటు నా తండ్రికి నిట్టు తల్లికిని గారవమ్మా! ననున్, నద్మునున్,
గటువుఁ దమ్మిక నయ్యె యయ్యెడు. మహా కూరంబుగాఁ; దల్లి తాఁ
బటు తాపస్వ నిధాన మయ్యెను, మహాభాగుండు నా తండ్రినే
గటుతం బోలు; నవెం దృతీయుఁ, దనె నల్కాన్ బ్రహ్మః రామప్రభూ! 1124

చెవియుం జెక్కు [638]చెఱుంగకుండఁగ శునశ్శేఫున్ నమం గొమ్ము ధే
నువులం దండ్రికి నిచ్చి యం తతఁ దనన్, నూఱ్వేలుగా వారి భూ
భవుఁ డుప్పొంగుచు నిచ్చివేసి, కొని, యెత నృర్ధ్యమ్ముం దేఱిపై
దవులందున్న యయోధ్యజేత; నని యెం దద్బ్రహ్మః రామప్రభూ! 1125

638 సెఱుంగ, నెఱుంగ;

౯౨

కాని యా మౌని కుమారునిన్ నృపతి యాగమున్ మట్టమధ్యాహ్నమౌ

టను దాఁ బుష్కర తీర్థమందునను చేర్కన్ సేద దేఱంగఁ; జు
ల్కన సూటం దలపోసి పోసెను గళాకాంతులఁ శునశ్శేపుఁ; డం
చని యప్పట్టునఁ జాలిఁ దూల్కొనె సహల్యాసూతి; రామప్రభూ! 1126

శ్రమమున్ గొల్ప ప్రయాణమున్ విగుడునున్ సంధిల్లి కొల్వంగ దా
హ మతం దేఁగెను నీరుఁ ద్రావుటకుఁ ద త్ప్రాంతంబునందున్న తీ
ర్థముదాఁకన్; ఋషి మధ్యముం డగు దపోధన్యుండు గాధేయు పా
దములం దాతఁడు చయ్య వ్రాలె; ననెఁ జింతన్ బ్రహ్మ; రామప్రభూ! 1127

"మునివంశాగ్రణి! తల్లిదండ్రులు, మహాపుణ్యాత్ములఁ డా యంబరీ
షునకున్ యాగ పశు ప్రతిగ్రహముగాఁ జుల్కన్ ననున్ విక్రయిం
చినఁ బోచుంటిని; కాని, నే బ్రదికి పేరిం బొందఁ గాపాడువా
నిని గన్గో;" నని యన్న బాలకుని నెవ్వెన్ బ్రహ్మ; రామప్రభూ! 1128

నను గాపాడఁగఁ దల్లివై నఁ బితవై నన్ జ్ఞాతివిన్ బంధువై
న నుపాధ్యాయుఁడవైన నొక్కఁడవె యున్నావయ్య! నీ వింక; వేఁ
డినవారిం బరిరక్షసేసెదు హృదాటీకంబుగాఁ బ్రేమ; నుం
చనె నా బాలుఁ; డటంచు జాలిపడె బ్రహ్మజ్ఞాని; రామప్రభూ! 1129

అనుకంపామతి వీవు; ప్రోదవు చయ్యన్ వేడినేఁగాని కా
దనకుండంగ నటంచు విందుసు, దపస్వున్ మేటివై యుంటచే;
నను నెట్లేఁ బ్రదికింపఁగా వలయు; నైనన్ లక్షణన్ గోవు లి
చ్చెను రా; జెట్లొకో! యం చతం డనుచు మెచ్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1130

నను దా విల్చినరాజు సేయునది జన్నంబుం గృపం బ్రోచి, నా
కును నాయుష్య మనుగ్రహింపఁగల మీకున్ మ్రొక్కెదన్; నేను గో
రను దీర్ఘాయువుఁ గానుభోగములఁ దేలంగాఁ; దపస్స్వార్థమే
నను బ్రోవుం; డనె నాతఁ; డంచెనె శతానందుండు; రామప్రభూ! 1131

దయనీయుండను; దిక్కుమాలితి; విప త్కాలంబులో గొల్చి ని
ర్భయతన్, నీ సుతుగాఁ దలంపు మనుచుం బ్రార్థించు నా చుర్భకున్
రయ మోదార్చిన మౌని, పుత్త్రికులఁ జేరం బిల్చుచుం బ్రాణ సం
శయుఁ డీతం; డని తెల్పె; నం చనెఁ బ్రశంసన్ బ్రహ్మ; రామప్రభూ! 1132

కామనల్ మీరలు; తండ్రి కక్కఱగు గోర్కుల్ దీర్తురో! లేదొ! యీ
సమయంబందునఁ దెలిపోఁగలదు; వత్సల్ దండ్రి వాంఛన్ సమా
ప్తము గావించుట సర్వథా పరమ ధర్మం బండ్రు; మీ నేక్క ధ
ర్మమము నేఁ జూ..ద; నన్ను మౌనిఁ గొను ప్రేమన్ బ్రహ్మ; రామప్రభూ! 1133

మునిబాలుం డితఁ; డీ సుపుత్త్రికుని నమ్ముం దండ్రి తా నొక్క రా
జునకున్ యాగ సమాప్తికై; మనుటకై జూకించు నీతండు; నీ
తనికై మీ రెవరేని యజ్ఞపశువై తన్పుందు న; న్నంచుఁ గో
రెను గాధేయుఁ; డటంచు మెచ్చుకొనెఁబేర్మిన్ బ్రహ్మ; రామప్రభూ! 1134

పరగన్ ధర్మ పరాయణుల్ సుతులు నావా; రంచు వేనోళ్ల వే
పురతోఁ [639]జెప్పుదు; నంబరీషు సవనంబుం బ్రోవ మీ రెవ్వరేన్
శరణార్థిం బదిరక్ష సేసి నటులో; వ్యాభర్త పుణ్యాత్ముఁడౌ;
స్థిరమౌ మీ పితృభక్తి; యంటఁ బిత; మెచ్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1136

---

639 లో;

పరునిం బ్రోవఁగ. స్వీయ పుత్త్రిదవి జంపం జూచువాఁ డయ్యెడన్
హరువౌ స్వాదు ఫలంబు దేవిడు శ్వ మాంసాహారి; యం చెల్లరున్
అవిహాసంబుగ స్వాభిమానముగ దెప్పన్ నందనుల్, మౌని తా
నురు [640]దట్టూనె; నటంచు బ్రహ్మ నుడివెన్ హాదాట; రామప్రభూ! 1136

కనుఁగన్ నిప్పులు రాలఁ "దంత్రి నిటు జుల్కం బల్కిరా దంచు భీ
తిని మీ కొందరుగారు! ధర్మ మెడరం [641]దంత్రవంబుగాఁ బల్కినం
దున వాసిష్ఠులఁబోతె ముష్టికులు నౌదుర్ మీరలుం దింటుసున్
తని మాంసం; బని తిట్టెఁ దంత్రి, యని నొచ్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1137

బసరన్ భీతి, ధరిత్రిఁగూలిన శునశ్శేపుండు తేలంగ బూ
చిన బంధించి సురక్షపెట్టి ముని "యాలోకించెదన్ మంత్రముల్
మనసంబుం బొసరింపు పుత్త్రక!" యనెన్, మాన్పింపఁ ద ద్భీతి, యం
చనె, సుల్లాసము గోచరింపఁగ సహాల్యాసూతి; రామప్రభూ! 1138

నిను యూపంబునఁ గట్టినప్పుడు వెసన్ నిర్దిష్ట మంత్ర ద్వయిన్
మనసారంగ జపింతు వేనియును, స్వమ గ్రక్ష నీ కౌను; జే
యుసుటో! జీవిత సిద్ధి యద్ది, తమ రింద్రోపేంద్రాలుం దోడుగా;"
సనిచెన్ బాలుని మౌని; యం చనె సహాల్యాసూతి; రామప్రభూ! 1139

ఉపదేశించెను మంత్రముల్ ఋషి; మనం బొందెం గడున్ స్వాస్థమున్
వ్యపవిష్టంబయి మార్గ మర్భకునకుం; బర్వోత్తుమం బోయి యా
నృపతిం జూచి, "ప్రభూ! వెసం జేసుద; మింకేలా? యిటన్ జా గ నెన్
గపటానన్ మునిబాలుఁ; డం చనె శతానందుండు; రామప్రభూ! 1140

640 దట్టుంగొనె నందు; 641 దీక్షంబు; 642 చెనయన్;

"తప మింకన్ ముగియింపవచ్చునగదా తద్యజ్ఞకర్మంబు, శీ
ఘ్రముగాఁ బోవుడు మౌనియున్ మన;" మనన్ వాల్మీకి ర్తి యుతాహితా
గమియింపెం దన యజ్ఞశాలకు, సురల్ గావింపఁగా సర్వ య
త్నము లావేళ నెఁ యుండ గుల్కెను శతానందుండు; రామప్రభూ! 1141

మతహాఁతీతిగ రక్తవర్ణమాలయ సన్మాల్యాంబర స్తోమ తో
ఖితునిం జేసిరి, పూసి చందనమునున్ మే నెల్లఁ; దర్వాత నం
చిత యూపంబున కంటఁగట్టి రతనిన్ శీఘ్రంబుగా; వాఁడు ని
ర్జిత చిత్తస్థితు; డయ్యె; నం బలినయింపన్ బ్రహ్మ; రామప్రభూ! 1142

వెనుకం దార్మిక సిశ్చలుం డయి శునశ్శేఫుండు, గాధేయు మం
త్రము లామ్నాయము చేసె; నింద్రుఁడు సురేంద్ర స్వామియుం దృప్తులై
క్రమ దీర్ఘాయువు లిచ్చి రాతనికిఁ; దత్ శ్మశానాటన్ యజ్ఞ సం
గమ సంపద్ఫల మిచ్చె; తదదయి వేడ్కన్ బ్రహ్మ; రామప్రభూ! 1143



సరవిం బుష్కరతీర్థమందునను విశ్వామిత్త్రుఁ డత్యంతమున్
బరపెన్ దీర్ఘ తపంబు; నందులకు నబ్జాతుండు సంతోష ని
ర్భరుఁడై దర్శన మిచ్చె నా ఋషికి గీర్వాణాళినింగూడి వే
గిరమే వచ్చి; యటంచు మెప్పునను బల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1144

జననాథాగ్రణి! నీ తపోవ్రత మిఁకన్ సంపూర్ణ సంసిద్ధినిన్
గనియెన్; నీకు శుభంబుగల్గెడిని; వీఁకన్ నీవు గావించియుం
డిన యీ కర్మల కెల్ల నిన్ను ముని కోటిం గొందొకం డంచు నెం
తు; నటంచుం బరమేష్ఠి పల్కెఁ; నని వందున్ బ్రహ్మ; రామప్రభూ! 1145

అనుచుం దాఁ బరివార యుక్తముగ మాయం [643]బయ్యె నప్పున్యుండు; పొం
దె ననంతృప్తిని గాధిజుండు; మఱలం దేజొంద నాతండు సే
సెను నిర్ధారణముం దపస్యకు మహా [644]స్ఫీతంబుగా; నంచుఁ జె
ప్పె సహల్యా తనయుండు గౌశికుని [645]దాల్మిన్ మెచ్చి; రామప్రభూ! 1146

పరహౌ రీతిఁ దపంబుఁ గైకొనియె విశ్వామిత్త్రుఁ డా వెన్కఁ బు
ష్కర తీర్థంబున దీర్ఘకాల మసుదాఁకం; ద న్మహా పుణ్య పు
ష్కరిణిం దోఁగ నొకప్డు మేనక వియత్కంజాక్షి యేతెంచె సు
ర్వర; కంచుం గళయుంచె మెల్లఁగ సహల్యాపూతి; రామప్రభూ! 1147

విలయించెం దప మా మహాత్మునిది తస్వీరూప, మంభోద సం
చర [646]దైరావతి కన్నులన్ మెఱసి దృష్టం బార్చు త ద్రీతిగా
స్థిర చిత్తంబె కలంగె; ముగ్ధుఁడయి న్వస్త్రీస్ఫ్రి కాంతికిం గౌశికుం
డు రహిం జూచె; నటంచు గౌతమజుఁ డోడుం జెప్ప; రామప్రభూ! 1148

---

643 బయ్యెఁ గంజుం; 644 స్ఫేయంబు; 645 నేర్మిన్, నోర్మి; 646 దాకాలికి;

బని, "యో! యచ్చర లేమ! స్వాగతము పల్కెన్ నీకు గర్వింతు; నీ
మని వాటంబున నుండఁగోరెద; శుభంబుల్ సౌఖ్యముల్ గల్గు; మో
హన బాణంబున మన్మథుండు నను నేయం జొచ్చె; నన్నేలు కా"
మ్మనుచుం బల్కెను గౌశికుం; డనె నహల్యాభూతి; రామప్రభూ! 1149

పరగన్ మేనక చేసె నచ్చటనె విశ్వామిత్రుతోఁగూడి కా
పుర మచ్చో పదియేండ్ల [647]పాటు; పిదప న బూజ్యుండు [648]మోహాగ్నికిన్
గరఁగంబాఱుట కొంచె సిగ్గు భృశముం; గ స్తింపదెం జాలి; నే
పెరవుం దోఁపద క్రోధనష్టి; దని తెల్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1150

కర మారోచనఁ జేసిచేసి తెలిసెం గార్యజ్ఞు లా దేవతల్
సరిగాఁ బన్నిరి యీ యుపాయముఁ దపస్యన్ మాన్పఁగాఁ దన్నటం;
చురు కాలంబు గతించెఁ దా నటుల మోహోద్రిక్తుఁడై యుండ నటం
చపసెం గౌశికుఁ; డంచు వందురె శతానందుండు; రామప్రభూ! 1151

రయమారం బదియేండ్లు లొక్కటె దివారాత్రంబుగాఁ గ్రుంగిలెన్;
నయ; మి న్నాళ్లకు నేనియుం దెలిసెనో! న న్నిట్టు మోహంబు ని
ర్దయతం గాల్చి తపోఘ్న హేతు వగుటన్; రావించుఁ గామాదు ల
త్యయ; మంచున్ ముని పందె; నంచనె నహల్యాజ్యోతి; రామప్రభూ! 1152

చం చిత్తంబును బొందినందులకుఁ బశ్చాత్తప్తుఁడై మౌని, యూ
ర్పులు దీర్ఘంబుగఁ బుచ్చుచుం గనుగొనెన్ రోషంబునన్ మేనకన్;
పిలిచెం జేతుల [649]నల్లుకొంచు; వణఁకెన్ నిట్టూర్పుచున్ భీతిచే
నలిగంబాఱుచు నామె; యం చనె శతానందుండు; రామప్రభూ! 1153

---

647 దాఁకఁ; బిదపన్; 648 మోహంబుచే; 649 గట్టుకొంచు;

హాని యీ వత్సర లేమ నే మనక, తపస్వం దృప్తి గుర్తించి, తి
ర్యాని పల్కుచు పచరించి, మెల్లఁగ నెటో యచ్చోటునుం బాసిపో
యెను దా నుత్తర దిక్కునకుఁ, దపముఁ బ్రాలేయాద్రి పార్శ్వంబునం
దునఁ జేయంగ; నటంచుఁ దెల్పె ముద మొందున్ బ్రహ్మ; రామప్రభూ! 1154

అటు లామెన్ వదలించుకొన్న ముని, కామాదుల్ విపక్షాల సం
జనితంబుల్ గనుకన్ మనంబు నిక స్వేచ్ఛం బర్వఁగా నీక, సం
కటమౌ నట్టులఁ జేసి, పూనె దృఢ సంకల్పంబుతోఁ దా దురా
ర్భటమైనట్టి తపంబు జేయుట; కనెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1155

ఉదయ భానుఁ బలెఁ గౌశికీ వహము తీరంబందుఁ ద న్మౌని, య
వ్వ్యయ యోగాంచిత దీప్తి మీఱఁ గడుఁ బ్రాభ్యంబైన కాలంబు; రా
ఘవ యమ్ముం బొందిన దేవతా గణము నజ్ఞాతోద్భవుం గూడి త
త్ప్రవహ తీరంబును జేరె; నంచు నొడివెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1156

పెరిమన్ నీ వొనరించునట్టి తపమున్ మే మెల్లరున్ మెచ్చి ప
చ్చిరి; నీదైన ఋషి ప్రకృష్టతయు, వాసిన్ నీ మహత్త్వంబునున్
గర మగ్గించుచు, నిన్ మహర్షి యని పల్కాఁడి తు నే నంచు నా
పరమేష్ఠిం దనె, నంచు సంతసిలెఁ జెప్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1157

అనహంకారము నొందె మౌని, ఏని య [650]య్యద్ధాత సంజాతునిన్;
వొసరన్ లే దల [651]ఖేద హిందువుల యూర్మిత్ మౌని చిత్తంబునన్;
జనవుం బొందిరి సన్ మహర్షి యను సంజ్ఞం బిల్చుటన్ [652]స్వామి! యిఁ
చనియెం గౌశికుఁ; డంచు మెచ్చెను సహాభ్యాసూలి; రామప్రభూ! 1158

---

650 య ద్యుంభోజ; 651 దాగి; 652 నేవ!;

లనవద్యుండవు; నన్ జితేంద్రియునిగా నంగీకరింపంగ నీ
కనుపౌనే? యనిమాత్ర మాతఁ డడిగెన్ హార్దిక్య సంయుక్తి బ్ర
పన్నను; 'గా విడ్డ'ని, ''యింక సాధనము సేయఁగూడదు నీ;'' కంచుఁ బ
ల్కెను గంజుం డటు మౌనితో, ననుట కుల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1159

దయితుల్ దివ్యులతోడఁ గూడుకొని యంతర్ధానముం బొందెఁ గ
ర్తయు; నాపై మఱలం దపంబునకుఁ బ్రారంభించె నా మౌని, త
ద్దయుఁ బంచాగ్నుల మధ్య [౬౫౩]యందు ననివర్తంబున్, మహా ఘోరమౌ
గ్రియ; నంచున్ వచియింప నా గురువు జంకెం జాలఁ రామప్రభూ! 1160



౬౫౩ నిల్చి యనీ;

విశ్వామిత్రు తపంబు దారుణమునన్ వ్రేఁ గయ్యెఁ; నద్దానికిన్
విశ్వామిత్రులు నైరి దేవతలు; రావింపంగ నింద్రుండు తత్
శశ్వత్కీర్తన యోగ్య రంభ, దివిజస్థానంబునుం బోలె, రూ
పైశ్వర్యంబు చెలంగ; నం చనె నహల్యాసూతి; రామప్రభూ! 1161

"ఓ! రంభా! నిను దేవకార్యమున నుద్యోగింపఁగాఁ గోరుచు
న్నా రెల్లారలు దివ్యు; లే గతిని నైనం దీర్పు మా కోర్కె; నా
ఘోరావేశిఁ, దపస్విఁ, గాధిజునిఁ జొక్కం గొల్పు నీయందు వి
స్తార ప్రక్రియ; నన్న యింద్రుఁ దెగడుం దద్బృహ్మ; రామప్రభూ! 1162

అది యెల్లం దనవల్లఁ గా దనచు లజ్జా విక్షిప్రియం బల్కి, నె
మ్మది సమ్మగ్ధముగాఁగ రంభ యెఱఁగెన్ వాస్తోష్పతిం జూచి; పెం
పు దలిర్పంగల మౌనినాథుఁ డతఁ డేపుం జూపు; నేనేమి చే
సెద? నచ్చో ననెఁగూడ నామె, యని మెచ్చెన్ బ్రహ్మ; రామప్రభూ! 1163

యముఁ డా సరియమి; యాతనిం దరమె! మోహావిష్టునిం జేయఁ; గో
పమునన్ మండుఁ బ్రచండ భాను పగు నా మార్తాండునిం బోలె; ఘో
రపుగా శాపముపాలు సేయు, భయ మారన్ నన్ను; సందేహ లే
శమునున్ లే; దనె రంభ; యం చువిదఁ దా శంసించు; రామప్రభూ! 1164

నను మీ రెట్లొ యనుగ్రహింపవలయున్; నాశక్తికిం గాని దీ
పని; యంచున్ వడఁకం దొడంగ, నపు డా వైకుంఠుఁ డా రంభనున్
గని, "భీతిల్లకు; మాను నీకు శుభమే! నా మాటఁ బాటింపుమీ!
యనె; నదియుం దెలిపెన్ భయంబున నహల్యా జ్యోతి; రామప్రభూ! 1165

దనుదేరంగల మీ వసంతమునఁ జెల్పన్ నేననున్ మన్మథుం
డును నీ వెంటను: నేను గోకిలగ నుందుం బ్రక్కనే నీకు; నీ
తను బోలెన్ నిను వెంటనంటు మదనుం దన్నన్, ననన్నమ్ముమీ!
యసె, వాస్తోష్పతి; యంచుఁ జింతిలె నహల్యాజ్యోతి; రామప్రభూ! 1166

బలు సింగారిని; కుస్తరింపవలె [654]దేవవ్రజ్య; నీ వందయ్యు
నిలుమీ! హూదు సమీపమందున నటన్, నీ స్నిగ్ధ శృంగార చే
ష్టలతో; నంతియ చాలు; గాధిజుఁడు నీ జాలంబులో [655]జిక్కు, ని
ట్టులె; యం చింద్రుఁడు కుస్తరించె; నని తిట్టున్ బ్రహ్మ; రామప్రభూ! 1167

లుగ మీరంగను రంభ, కౌశికు మరు ల్గొల్పన్ జగన్మోహనం
బుగఁ గైసేతల నల్వరించుకొని, యొప్పల్ గుల్కు చిర్నవ్వులున్
బుగులం, బైనము లయ్యె; నేమన నిఁకం? బూచెన్ లతా వృక్షముల్
మిగులంగా; నని యా యహల్యబుఁ డనెన్ వీక్ష్యాన; రామప్రభూ! 1168

అనశే యద్ది వసంత; మందునను గూయం జొచ్చెఁ; గెంగంటులున్
బసమీఱన్ వినుఁగొంద నుండ; నిఁక నా స్వర్వాసినీ శ్రేష్ఠ, యు
త్యసమానంబుగఁ జేయఁ జొచ్చె మృదురాగాలాపముల్, ప్రేమ స
ద్రస మొల్కంగ; నటం చహల్యజుఁడు వక్కాణించె; రామప్రభూ! 1169

మన ముయ్యాలగ నూఁగె మానిశిఁ; బిమర్చం జొచ్చె మే నెల్ల; వి
ప్పను గన్నుల్; గనిపించె రంభ యెమటన్; శీఘ్రంబుగా శంకలున్
గొన లొత్తెన్; బలభేది తంత్ర మది యంచుం బూనెఁ గ్రోధంబుఁ జా
ల; నటంచున్ ముదమార వాకొనె నహల్యాజ్యోతి; రామప్రభూ! 1170

---

654 దివ్య; 655 నం గూలు;

తీపపుల్‌గట్టి మరల్, వేలార్పెదవు సందేహంబు లే కుండ, నీ
తియగావంగల యా కటాక్షముల నింతీ! కామముం గ్రోధమున్
బరిపర్జింపఁగ నెంచియున్న నను బ్రేమ్సం జూపదో! రేఁ పెదో!
మన; లంచున్ ముని తిట్టుటల్ గురువు తెల్పం జొచ్చె; రామప్రభూ! 1171

తనుఁ దాఁ గట్టెను బ్రాణ్ణ దెప్పకొనె నా దౌర్భాగ్యులా లంప నిస్
జనముల్ దిట్టఁగఁ గమ్మ కాయి; వసుచున్ శాపంబుఁ గోపంబునన్
మునినాథుం డిడె రంభ; పట్టులనె పెంపుం బాసియుండంగఁ జా
లను గాలం; బని తూలెఁ దా నటె సహల్యాసూతి; రామప్రభూ! 1172

తరమున్ మీఱడి కోప వేగమున శాపంజేసెనేగాని, యు
త్తర లిప్తన్ ముని, రంభనుం గుఱిచి చింతం బొంది, "యో! రంభ! నీ
కుప తేఱుండుఁ దపస్వి, విప్రుఁ డొగిఁ జేయున్ శాప మోక్షం" బనెన్
గరగింపం గరుణంబు త; న్నని శిలాసంతమందు; రామప్రభూ! 1173

వినిరో! లేదో! మహర్షి శాపమును దేవేంద్రుండునున్ మన్మథుం
డును, నచ్చోటును బాసి పారి వనమందున్ దాఁగి; రా వెంటనే
పసుతానై కొనుకొన్న శాపమునఁ బొత్రం బయ్యె నా రంభ; యేం
చ్చనెఁ జెంచాకుల చిత్తతం గని యహల్యాసూతి; రామప్రభూ! 1174

క్రేశమునుం బొందెను గోస దూరతప దా సెంధింపఁగా లేమిఁ గ్లే
శముచేఁగూర్చిన త త్తపో బల మెటుల్ సర్వంబు వ్యర్థంబుగాన్;
దమకెన్ ఖిన్నత నొంది కాంతి నెడపెం దన్మౌని చిత్తంబు ని
ర్మమోహం జెందక; యంచుఁ జింతిలె సహల్యాజోతి; రామప్రభూ! 1175

ఎవ రే మన్నను నేమిచేసిననుఁ దా నేమాత్రముం గోప తా
ప వశాత్ముండగు టొప్పు; దం చసుకొనెన్ బ్రహ్మర్షి; యా మేరపున్
ప్రపసాయంబును బూనెఁ జిత్తము పశత్వం బొందఁగాఁగోరి తా
నవదాతంబుగ; నంచు మోదిలె నహల్యాసూతి; రామప్రభూ! 1176

మనమున్మాత్రమె గాదు; మేని నయినన్ మాడించిన క్లైంతఁగ
ట్టినఁగానీ, విజితేంద్రియత్వ మొక పాటిం గల్గ దం చాతఁ డెం
చెను; బ్రహ్మర్షితకోస మన్నమును గించి త్పానముం గూడ మా
న నెఱా కోరికఁ బూనె; నం చనె శతానందుండు; రామప్రభూ! 1177

వర శిక్షాంచితమౌఁ దసంబువలనన్ వర్షంబు నాళంబునున్
బొరయం బోదు, తపఃప్రభావ మని యెందుం గల్గుచో; నంచు నూ
ప్పిరియున్ వీడక చేయఁబూని తపమున్, వే వీడెఁ బ్రాలేయఁపున్
గిరి సామీప్యము; నంచు నుల్లసిలి పల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1178



శా

శపథం బూని తపంబు సేయుటకునై చయ్యం జనెం దూర్పుగా
విపరీతం బగు దూర దూరతఁ; [656]దచటన్ వ్రేఁగైన మౌన వ్రతం
బుపదానంబుగఁ బూని, దుష్కర మహోగ్రాసూన మార్గంబునం
దపరష్టై తప మూనె; నం చనె నహల్యాసూతి; రామప్రభూ! 1179

అపురూపంబు, సమస్త కోప యుత, మస్వాదృష్యమౌ రీతిగాఁ,
దపముం జేసె మహర్షి, విస్మయము సంతప్తుండు గాకుండ, ని
శ్చపలత్వంబున, ప్రాను పొదుకొను నా చందంబునన్, దీర్ఘకా
ల పరీతంబుగ; నంచుఁ బేర్కొనె నహల్యాజ్యోతి; రామప్రభూ! 1180

దన దీర్ఘోర తపంబు మెల్లఁగ సమాప్తంబైన, యా మౌని భో
జన కృత్యంబునకుం గడంగె నొక ఘస్రంబందు; నాలోన బ్రా
హ్మణ వేషంబున వచ్చి యన్న మనుచున్ యాచింప నింద్రుండు; వెం
టనె పెట్టెన్ ముని; యంచుఁ బేర్కొనె శతానందుండు; రామప్రభూ! 1181

చలనం బొందఁడు మౌని; కిక్కురుమనం డాలంతు; సంకోచమున్
వెలయింపండు; ధరామరేంద్రునకు సంప్రీతిల్లి సిద్ధాన్నమున్

బలుకం బెట్టె; ద్విజుండు భోజనముఁ దాఁ జాలింగొనెన్, శేషమున్
దలఁపం బోక మిగుల్చ; నం చనె శతానందుండు; రామప్రభూ! 1182

తినఁగా నేమి మిగుల్పనందులకు సందేహింపఁ డాతండు; పూ
నెను దా శాంత మనంతమై పెరుఁగఁగా నిష్ఠం దపం బాదటన్;

జనియెం బెద్దయుఁ గాల మా తపములో శ్వాసంబు బంధించి చే
సిన యౌగ్యంబున; నం చహల్యజుఁడు మెచ్చెన్ మెచ్చి; రామప్రభూ! 1183

---

656 దొకటన్;

అయినన్ మానఁడు త త్తపోవ్రతము ఋష్యగ్ర్యుండు; తా మందుచే
బయలై వచ్చె సెగల్ పొగల్ ఋషి శిరోభాగంబునందుండి; పై
మయి నా మంటలు మూఁడు లోకములలో వ్యాపించె; లోకాళికిన్
భయ మేపారె; నటించుఁ జింతితె శతానందుండు; రామప్రభూ! 1184

జగ మెల్లం బరిదగ్ధమౌ నటుల విస్పష్టంబుగాఁ దోఁచె, నా
వెగడింపంగల యగ్నిహోత్రుని శిఖల్ బీభత్సముం గొల్పఁగాఁ;
బొగిలెన్ దానవ యక్ష రాక్షస మరు త్పూగంబు, నిశ్చేష్టతల్
దెగటార్పన్ ధృతి, నంచు వాకొనుచు వందెన్ బ్రహ్మ; రామప్రభూ! 1185

పరగన్ మేము ప్రలోభపెట్టితిమి విశ్వామిత్రునిన్ వేయి మా
చిరులన్; యత్నము చేసినాము బహుధా తెప్పింపఁగాఁగోపమున్;
జరుపం గల్గితి మెన్ని ప్రక్రియలనో! స్రష్టా! తపోభంగమున్
నెరపన్ లే; మని దివ్యు లంట వినిపించెన్ బ్రహ్మ; రామప్రభూ! 1186

తరవన్ వెన్న సముద్భవించు గతి నుద్య ద్దీప్తిపై యిబ్బడిన్
నెరసెన్ మౌనికి, విఘ్న హేతు విలస న్నిస్తారముం బొందుటన్,
దరుణత్వంబును బాల్చుచుం దపము; చెందం బోదు సొం టాతనిన్;
నరి మీఁజుం; డని దివ్యు లంటఁ, దెలిపెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1187

మనసారన్ ఋషి కోరుకొన్నయది యా వాంఛం [657]దుదిం దీర్చుటల్
మనకుం జెల్లును; లేనిచో నతఁడు సల్పంగల్గు భస్మంబుగాఁ,
దన సందీప్త తపోగ్ని సంచయముచేతన్ మూఁడు లోకంబులన్
దనియంగా; నని దివ్యు లంటఁ దెలిపెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1188

---

657 ద్వరం;

పంతం జెంచెను దిక్కు లన్నియును; నల్కం జూపె నంభోధులున్;

చలియించెన్ గిరులున్; ధరాతలము పెల్పెం గంపముం బొందె; భీ
తిలఁగాఁ గొట్టె నెడం జెవం బ్రళయ ఖాతిన్ ఝుంఝుఁ లేవేళనున్;
దలమే? సల్పఁ; నటంచు వారని; శనెం ద ద్బ్రహ్మ రామప్రభూ! 1189

ఇన తేజంబును మందగింపె; జనముల్ హేరాళముం గర్మలన్,
పనరం జేయుట మాని; రే పనులు సల్పం గూడునో! యేరికిన్
మనమందున్ స్ఫురియింప రాదు; మతులున్ మౌఢ్యంబులం దాల్చె; నం
చనినారల్ సుర; లంచుఁ గుందెను శతానందుండు; రామప్రభూ! 1190

నయముం ద స్మని యగ్నిహోత్రుపలె, నెన్నన్ మంటలం గ్రక్కఁ; ఋం
చను లోకాళిని నాశనంబు సలుపంగా నెంచకున్నాఁడు తే

జున; మీ రిట్టు లుపేక్ష సేయ, వెడ చిచ్చుంబోలె లోకత్రయా

శిని గాల్చుం జుమి; యంచు వారనుటఁ దెల్పెన్ బ్రహ్మ; రామప్రభూ! 1191

పరమేష్ఠీ! యింకఁ దాన యేలుటకునై వాంఛింపసుం గూడ సీ
పరలోకంబును దేవరాజ్యమును ఖాపం జేసియున్ లేక; న
త్వరమే గాధిజు కోర్కెఁ దీర్పుటయ గీర్వాణాళికిన్ క్షేమమున్
జరణోపాయము; నంటఁ జేర్కొనె శతానందుండు; రామప్రభూ! 1192

పరమున్ దాటపు దేవతల్ గొలువ, విశ్వామిత్రుఁ జేరన్; మనో
హరతన్, "బ్రహ్మఋషీ!" యటంచు బిలి..న్; హార్దిక్య మేపారఁగాఁ
బర పెన్ స్వాగతముం; దపంబునకు గీర్వాణాళితో మెచ్చులన్

గురిసెం జు; మ్మని గౌతమాత్మజుఁడు పల్కెం బ్రీతి; రామప్రభూ! 1193

ఇపు డీ వై తివి బ్రాహ్మణుండవు మహర్షీ! నేను బ్రహ్మర్షిగా
నృపదేశంబును బొందినాను; నిను నోమన్ నేను నీ వేల్పులున్
గృప దీర్ఘాయువు నిచ్చుచుంటిమి; మనం గీర్తిల్లుమీ! యింక సౌ
ఖ్యంపు గాంతం; బనె బ్రహ్మ; యం చనె నహల్యాసూతి; రామప్రభూ! 1194

వినతుల్ సల్పుచు వార లెల్లరచుం దెల్పెం దాం గృతజ్ఞత్వమున్
ముని; యోంకార, వషట్కృతుల్, శ్రుతులు తన్నుం జేరుటేగాక, వా
నిని బోధింప ననుజ్ఞయుం బడసె వన్నెం; బిమ్మటం గోరె బ్ర
హ్మను, బ్రహ్మర్షి వశిష్ఠు మెచ్చనె నహల్యాజోత్రి; రామప్రభూ! 1195

మహితుం డాతండు, క్షత్త్రవేదవిదుడున్ బ్రహ్మజ్ఞులం గూడం; ద
న్మహిమ స్ఫూర్తిని నన్నుం జాలును ననున్ బ్రహ్మర్షియం చింక; నీ
విహితాపేక్షను దీర్పరేనిం బరితృప్తిం బొందు; నీకోర్కె నా
కిహమున్ సత్వర; మంటం బేర్కొనియె వాహిన్ బ్రహ్మ; రామప్రభూ! 1196

సుర లెల్లారలు గొంచువచ్చిన వశిష్ఠుండుం బ్రియం బేర్పడన్
గరిమన్ సఖ్యముం జూపి గాధిజుని యుత్కర్షించి, బ్రహ్మాదు లె
ల్లరు బ్రహ్మర్షివి నీ వ టం చనుట యెల్లం జెల్లుం; ద ద్యోగ్యతత్
బరగుం నీ; కనె నంచు గౌతమజుం డొప్పం జెప్పె; రామప్రభూ! 1197

సురలన్ బ్రహ్మను వీడుకొల్పుచు వశిష్ఠుం బూజలం దేల్చి, ని
ర్భర రీతిం దగు సత్క్రియల్ సలిపి పంపం, గర్తై వా గాధిరా
డ్వర సంజాతునకున్ ధరావలయ యాన ద్యాత్రం గావింపంగాం
దలితీ; పంచున దెల్పె గౌతమజుం డాత్మన్ మెచ్చి; రామప్రభూ! 1198

సరవిన్ సొగెను గోత్ర యాత్ర; [658]ఘన విశ్వామిత్త్రి మౌనీంద్రుఁ డీ
వరణిం బొందెను బ్రాహ్మణత్వ; మితఁ డక్షయ్యోరు తేజుండు; వా
సిరి రూ పొందు తప స్సితండు; మునులం బెంపారు, నగ్రస్యుం డనన్
బరగుం గాన; నటంచుఁ బేర్కొనె శతానందుండు; రామప్రభూ! 1199

ఘన యా బ్రహ్మఋషీంద్రుఁ డెంతయుఁగ ఘనానూన్యుండు; ధర్మంబునం
దున రౌండుండు; మహా ప్రబోధన ధనుండుం, గీర్తి నిస్తంద్రుఁడనన్,
ఘన వివోగ్ర పరాక్రమ స్ఫురణ విఖ్యాతుండు; నున్నుండు; నం
చని [659]మాటాడకయుండెఁ దా నిఁక శతానందుండు; రామప్రభూ! 1200

జనకుం డంతట గాధిపుత్త్రునకు సాష్టాంగంబుఁ గావించి, 'ధ
న్యుని, సమ్మాన్యుఁ, బవిత్రుఁ జేయుటకు నన్నుం, దాను విచ్చేసిరో!
యనఘా! బ్రహ్మఋషీంద్ర! నా మఖము ధన్యత్వంబునుం బొందె; నం
చనె నా స్వామిని మౌని సత్తమునిగా నంచెంచి; రామప్రభూ! 1201

పటం సత్సంగతు లీ కతంబున మహాభాగా! వినం గల్గితిన్;
దెలియం గల్గితి: మీదు దర్శనము వన్నెం గూర్చె నా కింక; ని
స్తులమౌ మీ తపమున్ గుణించియు, సదస్యుల్, మేము నీ చారుఁజన్
దెలియంగల్గితి; మం చనెన్ జనకుఁ డంతిం బొంది; రామప్రభూ! 1202

జనకుం డంత, "మహాత్మ! మీ యది తపస్సామర్థ్యమున్, దేజమున్
గణనీయం బగు సద్గుణంబు, బలయుక్తంబైన శౌర్యంబునున్
వినుచున్ విస్మయ మప్రమేయ మగుచున్; మే మెంతగా విన్ననున్
దనివోపం జన; మం చనెన్ ఋషిచరిత్రన్ మెచ్చి; రామప్రభూ! 1203

---

658 సుత; 659 తూష్ణీకుఁడు నయ్యెఁ;

మునిదేవా! యినుఁ డిప్పు డస్తగిరిశృం గోసుండె; నా కోర్కెకో
లను దీర్చన్ సెల విందు: మీ కెపుడు నో! బ్రహ్మర్షి! నే స్వాగరణ
బనుచుం [660]బల్కుదు; రేపు ప్రొద్దున నిఁకన్ మా కిందు మీ దర్శనం
బనె, నేత న్మిథిలాధిపుండు పరమాహ్లాదాన; రామప్రభూ! 120

జనకుం డట్లని, మౌనివర్యునకు నాజ్ఞల్ బంధులం గూడి చే
సెను మున్ముందుఁ బ్రదక్షిణంబులను; గూర్చెన్ భక్తి బ్రహ్మాంజలిన్;
వినయం బొప్పగఁ గైకొనెన్ సెలవు కూర్మిన్; మౌనియున్ శిష్యులన్
బని, రా నాఁటికి విడుపట్టునకు [661]సుత్సాహాన; రామప్రభూ! 121



660 దెల్పుదు; 661 నానందాన;

-ఊ-

తెలవారెన్; జనసంతు కాల్యములఁ బ్రీతిం దీర్చెఁ; బిల్పించె ని
ష్ఠుల గాధేయుని రామలక్ష్మణులనుం; జూర్ణీభవత్ శాస్త్రి యు
క్త లస న్మార్గమునన్ ఋషీశ్వరు నుపస్థానంబుఁ గావించె; శి
ష్యులనుం దాఁ దగ మన్ననల్ సలిపె మెచ్చుల్ గూర్చి; రామప్రభూ! 1206

విలస త్స్వాగత మో! మహామునివరా! విన్నింపుఁడీ! మీమ నా
శ్రిల నా కన్న ధరాధిపుం గనుచు, విశ్వామిత్త్రుఁ, డీ కుఱ్ఱవా
రలు త త్పంక్తిరథాత్మజాతు లని పూర్వంబందునం [660]జెప్పితిన్,
విలువిద్యానిధు; లంచుఁ బేరొ్కనియెఁ దృప్తింగొల్ప; రామప్రభూ! 1207

వితత ఖ్యాతము, చంద్రమౌళి ధనువున్ వీక్షింపఁగా వచ్చి రీ
సుతు; లివ్వారికి దానిఁ జూపినను స్వస్తుల్ గల్గు నీ కింకనున్;
గృత కామాంచితులై యథేష్టముగ మన్నింఁగూర్చి పే రేఁగుటల్
గతియౌఁ జు; మ్మని కౌశికుం డనియె యోగం బొప్పఁ; రామప్రభూ! 1208

జనకుం డంతట, ''నో! మునీశ్వర జన స్వాధ్యాయి! మా యింటి కా
ధను వే రీతిగఁ జేరెనో! మనవిఁ దొ్త్తం జేయుదున్ వింతు; నా
వెనుకం గల్గెను దేవరాతుఁడను బృథ్వీభర్త రంబా నేల; కా
యన నిక్షేపముగాఁగఁ బొందె; నవె నొయ్యన్ దాని; రామప్రభూ! 1209

మును దక్షాధ్వర నాళ వేళ సురలన్ మున్కంటి వీక్షించి, కో
పనకుండై యిది యెక్కుపెట్టుచు, ''సుపర్వ స్తబ్ధులారా! కడున్
మనసై వేఁడిన నాకు మీరలు హవిర్భాగంబు నీఁకుండుటన్
గనుఁడీ! తత్ఫల;'' మంట రాజు తెలుపంగా సాగె; రామప్రభూ! 1210

660 దెల్పి;

తల దేమానాకా! త్రైయ్యనో! యనెడి చింతన్ వేల్పు [661]లేశాపు ని
స్తుల భక్తిన్ స్తుతియింప, నీ ధనుస్సు నీకుం డిచ్చె నవ్వాటికిన్
గలుగన్ వారియొడం బసన్నత; సురౌఘం బుంచఁగా నొందె ని
మ్ముల నీ యుల్లడ దేవరాతుఁ; డని చెప్పెన్ రాజు; రామప్రభూ! 1211

అల [662]కోదండము నాఁటినుండియు మదీయాంతఃపురంబందునన్
గల; దిట్లుండఁగ, నే నొకప్డు క్రతువుం గావింపఁగాఁ గోరి, యా
యిల దున్నన్ లభియించె స్త్రీ శిశువు నా కేర్పాటుగా నున్న దా
కలలో; నం చని గాధిపుత్త్రునకుఁ జెల్పెన్ రాజు; రామప్రభూ! 1212

పెరిమం బెంతును గన్నకూఁతు వలెనే భృథ్వీజ నిన్నాళ్లలున్,
గరిమన్ సీత యటంచుఁ బిల్చుచును; ద త్కన్యా బలామంబునున్
బెరిగెం బెద్దది యమ్యె; నేఁ దలఁతు నామెన్ వీర్య సంపన్నుఁడౌ
వరునిం బంటఁగఁగూర్ప; నం చతఁడు సెప్పెన్ సాగె; రామప్రభూ! 1213

పలువుర్ రాజకుమారు లాయమను సుద్వాహంబుగాఁ గోరఁగాఁ
దెలుపం గల్గితి నా యయోనిజను ప్రీతిన్ వీర్యశుల్కాకృతిగాఁ;
దెలుపం గోరిరి వీర్యశుల్క మనఁగా దీపించు సర్థంబు వా
ర; లటంచున్ జనకుండు కౌశికున కెల్లం జెప్పె; రామప్రభూ! 1214

తెలియం జెప్పితి వీర్యశుల్క మన నుద్దిష్టార్థ, మీశాను పెన్
విలు నిద్దానిని జూపి, యెక్కుడుట దీనిన్ వీర్యశుల్కంబుగాఁ
దెలియుం డం చని; యెందఱో! నృపతు [663]లాధిక్యంబునన్ వచ్చియున్
విలు నెత్తం దగ నోపరై; రనుచుఁ జెప్పెన్ రాజు; రామప్రభూ! 1215

---

661 లాశర్వు; 662 యిష్వాసువు; 663 లౌద్ధత్యంబునన్;

సదుపంగూడను జాల్రైరి ధనువున్ క్ష్మాపాలు రెవ్వారలున్;
మది నూహించితి తత్పరాక్రమము సర్వంబుంచు; నా కూఁతురిన్
బదటం బొందను వారి కిచ్చుటకు; దానం గ్రుద్ధులై వార లా
పద పాల్పడసితి న; స్నటం బని ధరాపాలుంకు; రామప్రభూ! 1216

తమ శౌర్యంబును సంశయించి తమరిన్ దర్పాన నేఁ జాలం దే
పమునుం జేసితి నంచు వార లెదలో భావించి, నాయందుఁ గో
పమునన్ బుట్టిడి సేసి రీ మిథిల; నాపై సాగ వా రంతటే
కముగా స్పుట్టిడి యేఁడు జాం; మనె నల్కన్ రాజు; రామప్రభూ! 1217

చనె నా వత్సర కాలమందునను నా సైన్యంబు లు ప్వొత్తు నా
శసమై; యప్పుడు నేఁ దపంబునను మెచ్చంజేసితిన్ దివ్యులన్;
ఘన సేనం జతురంగయుక్తముగ వీఁరం బంపఁగా వారు, దు
స్సహవాఁడన్ రిపుకోటి నొంచి; నని చెప్పెన్ రాజు; రామప్రభూ! 1218

సుదృఢంబుం గడు భాస్వరంబగు ధనుస్సుం దేరఁగా[664]జేసి చూ
పెద మీకున్; [665]శివ దత్త మద్ది; మన యా వీరుండు రాముఁడు నె
మ్మది [666]నా వింటిని నెక్కు పెట్టునెడలన్ మా సీతకుం బెండ్లి చే
సెద నీ పుణ్యున కిచ్చి; యం చనియె వాసిన్ రాజు; రామప్రభూ! 1219



664 బుచ్చి; 665 భవ, బుధ; 666 నద్దానిని;

ఉ.॥

ఉన్నం దాపెన దంతయుక్ వినిన విశ్వామిత్రుండున్ వెంటనే
ధనువున్ రాముండు చూడఁగా వలె ననెం; దచ్చక్రవర్తీంద్రుఁ డా
ధనువున్ యజ్ఞ సువాటిఁ జేర్పఁగ నమాత్యశ్రేణి కాజ్ఞప్తి చే
సెను; వారల్ గొనితేర దాని మిథిలం జేరంగ; రామప్రభూ! 1220

అనపద్యంబు మహాపురాతనమునై యష్టోరు చక్రాంచితం
బు, నయోహ్యాంత సముజ్జ్వలంబునయి, యేపుం జూపు లోహంబునౌ
ననసోరాజము, నాదటం బయట కొయ్యన్వారు లాగింపఁ జ
య్యన యత్నంబులు సేసి రెన్నియొ, [667]యపళ్యంబౌట; రామప్రభూ! 1221

బరియుం గ్రొత్తను మించునుం బొడవునున్ బ్రహ్మాండ సామర్థ్యమున్
గల పెక్కండ్రను మందసంబుఁ గదపంగా వేగ రావింప, వా
రలు సద్దానిని నెట్టకేలకుఁ గదల్పంగల్గి మెల్మెల్లఁగా
నిలుపం జాలిరి చక్రవర్తి యెదుటన్ నిక్షించి; రామప్రభూ! 1222

అల రాజన్యులు పూజలన్ సలుపు విఖ్యాతమైన కోదండమున్
బలు యత్నంబునఁ దెచ్చినార మనుచున్ వారెల్లరుం దెల్ప, "సు
క్షత్రులుఁ దౌ బ్రహ్మఋషీంద్ర! మా కులములో వార్మాత్రమే గాక, రా
జులు నెల్లారలు దీని గా" [668]త్రిని వచించున్ రాజు; రామప్రభూ! 1 23

సరవేగాదు సుమా! సురాసురులునైనన్ యక్ష గంధర్వ కి
న్నర రక్షోరగ వర్గముల్ గరుఁడు లైనన్ దీని మోపెట్ట నే
రర యీ నాఁటికి; మేము దీనిని నసర్థార్చార్చిమ ద్వస్తు సు
స్థిర బుద్ధిన్ భజియింతు మం చని వచించెన్ రాజు; రామప్రభూ! 1224

---

667 యపార్యం; 668 త్రిసుచు మెచ్చిన్;

ధను విద్యానిధి పంచువారినయివన్, దక్షంబునన్ మౌర్విం గూ
ర్చిన యవ్వానినినైన, నిందుసు నేర్మిన్ ముల్కి సంధించువా
డినినైనం, దగం గూర్చి బాణమును బేర్మిన్ నాదినిక్ లాగువా
డినినైనం గన; మింతదాక; నని సుర్వీజాని; రామప్రభూ! 1225

హరదేవుం డిది దేని దేవతలు; కొయ్యన్ వారు మా వారికిన్
వరముం జేసిరి వేని, నా ధనువు భక్తిం బ్రీతి మీ ముందటన్
బరగం జేసితి; రామలక్ష్మణులకున్ బ్రహ్మర్షి! మీరే యిచ్చన్
బరికింపంగ నొసంగుం; డనెను ధరాపాలుండు; రామప్రభూ! 1226

“తనయా! విల్లిది యేమియోం! గను” మనెం దన్మౌని శ్రీరామునిన్;
మునియానన్ “వినిచూతుం దా గిరిజాధవున్ మోడైన పెన్ మూతనె
త్తెను: గంధాదులచే నలం కృతమునై దీపించు నా కార్ముకం
బును సమ్మోదముతోడం జూపె, నది యొప్పుం గొల్పు; రామప్రభూ! 1227

మునిదేవా! యిది లేప నెత్తెదను; నొప్పున్ గల్గు నీ దివ్య స
ద్ధనువున్ భార పరీక్ష సేసి బిడి సంధానింపంగా నెంతు నా
డని నిద్దాన; నటన్న మౌనియును నుర్వీభర్తయున్, “మేలు మే”
లని ప్రోత్సాహము సేసి రొక్కటయి యాహ్లాదాన; రామప్రభూ! 1228

ధనువున్ మధ్యను బూని, లేపి చులుకం దన్మౌనులున్ రాజులున్,

జన సందోహము విస్మయంబు; గనం బెల్చన్ నారి సంధించి, విం
టను బాణంబును గూర్చి, నారి, చెవి నంటన్ లాగ, నా విల్లు ఫె
ళ్లునం ద్రెళ్లెం, బిడుగంత ఘోషణ నౌచట్లల్ బ్రుళ్లె; రామప్రభూ! 1229

గిరి సందోహము బ్రద్దలై నటులునున్ క్షేత్రంబు కంపించి ది
గ్దిర మంటపం విరుగాడినట్లు, తెర లొందెన్ భీతిఁ; దా రెల్లరున్
ధరపైఁ గూలిరి; మౌనినిన్ జనకునిం దద్రాము సోదర్యులన్
దొరఁగన్, మూర్ఛిలి తెల్లవారలును గుందుం బొంది; రామప్రభూ! 1230

జనకుం డాపట విస్మయంపడుచు, విశ్వామిత్రునింజూచి, "యో!
మునిదేవా! భువి రామచంద్రుఁ డొకఁడే ముమ్మాటికిన్ వీరుఁ; డెం
చను దా నీ విలు వంచఁ జాలు నని నే; నాలింప నీపాటి వీ
రుని యున్కిన్ ధరలోన;" నం చనియెఁ బౌరుల్ [670]చూడ; రామప్రభూ! 1231

తలఁపంగా నిదియంత నా మదికి వింతంగొల్పు సత్యంతమున్;
సలుపం గల్గుదు నింక నుద్వహన సౌభాగ్యంబు మా సీతకున్[671]
విలస ద్రీతిని రామభద్రునకుఁ; బేర్మిన్ సీత మా వంశ మి
మ్ముల వర్థిల్లఁగఁ గీర్తిఁదెచ్చు; నని యుబ్బుం [672]దంద్రి; రామప్రభూ! 1232

మునిచంద్రా! మను సీత కుంకువగ నొప్పున్ వీర్య సంపత్తియే
యనుచుం జేసితిఁ బ్రత్యయంబు; శపథం బత్యంతమున్ నేఁడు తీ
ఱెను; నా ప్రాణము ప్రాణమై నెగడు పుత్రిన్ సీత, నీ రామ చం
ద్రున కిత్తుం, దమ దీవనం [673]గొని; యనెం బుబ్బొందు; రామప్రభూ! 1233

జతగూడం దగునట్టి యీ దశరథ క్ష్మాపాలు సంప్రీత స
మ్మతికై మంత్రుల నా యయోధ్య కిపుడే పంపంగలన్; హార్ద సు
వ్రత! మీ రీ గతి రామ లక్ష్మణులతో మా యజ్ఞముం జూడ సం
గతిమై వచ్చినవార్తఁ బుత్తు; ననియెన్ క్ష్మాభర్త; రామప్రభూ! 1234

670 వినఁగ; 671 తో; 672 యుబ్బున్ రాజు; 673 నన్ మెచ్చి;

మున రాముం డొడఁగూర్చినట్టివి ధనుర్భంగంబునున్, మోదు సీ
తను నే భార్యగఁ జేయఁగోరుటయు నేత ద్వారునిన్ మెచ్చుచున్,
వినయోపేతత విన్నవించెదను పృథ్వీజాని కీ మంత్రు; లం
చనియెం గౌశికుతోడ నా జనకుఁ డాహ్లాదాన; రామప్రభూ! 1235

వినతిన్ మంత్రులు గోసలాధిపునకున్ విజ్ఞాపనల్ సేసి, యా
జనపుఁ డిచ్చోటికి బంధు మిత్త్ర సహితుండై మోద మేపార శ్రీ
తిని రాఁగల్గెడు వట్లుచేయుటకు బ్రీతిన్ మీర లాజ్ఞప్తి యి
చ్చిన, సంతోషము గూరు నాకు; కని పలికెన్ రాజు; రామప్రభూ! 1236



-ఊరా-

పుని యంగీకృతి నొంది యా జనక భూపుం డంపఁ ద త్రీర్థులన్

జని రథ్యంబులపై నయోధ్యఁ గవియున్ క్రాంతిం గొనెన్ [674]టిప్పు టి
ప్పున మూన్నాళ్లులు రేఁబవళ్లు పయనంబుల్ సల్పి; మధ్యాఁడు ప్రొ
ద్దున సాకేతముఁ జేరి రెల్లరును మంత్రుల్ దస్సి; రామప్రభూ! 1237

చని, రా టొన్నెతము ద్వారవాటమున నాజానేయముల్ డిగ్గినన్,
గని యవ్వారిని రాజసేవకులు వేగం జొచ్చి సాకేత ప
త్తన భూనాథు ననుజ్ఞఁ గైకొనుచు నా ప్తత్వంబునన్ లోపికిన్
గొనిపోఁ గల్గిరి, మంత్రులా విధమునుం గొండాడ; రామప్రభూ! 1238

శతవృద్ధైనను దేవతుల్యుఁ డయి తేజస్ఫూర్తితో నొప్పు భూ
పతినిం బం క్తిరథుం బ్రసన్నవదనున్, భవ్య స్వరూపుం గనన్
మతి నిశ్శంకత నొంద, నా సచివు లాహ్వానంబునన్ భక్తి సం
భృతులై మ్రొక్కిరి వంగుచున్ వినయ మ్రుద్వేష్టింప; రామప్రభూ! 1239

దినకృ త్సన్నిభ పుణ్య సంయుత మహాతేజా! మముం బుణ్యుఁ డా
జనకుం డంపెను; వారి [675]దూతలము; మా స్వాముల్ మిమున్ స్నేహ భా
వనమై మీ గురుదేవ యుక్తముగ సంభావించి మీ క్షేమముల్
గనుగొం; డంచని రంచుఁ బ్రగ్గడలు [676]పక్కాణింత్రు; రామప్రభూ! 1240

తమ స్వాధ్యాయ నిరంతరాగ్ని కృతులున్ ధర్మాదులున్ సాగు స
త్క్రమముం గూడివిరాడ మ మ్మడుగ హార్దంబారఁ బుత్తెంచి రు
త్తమ పంక్తాగ్రణి! యంచుఁ బల్కి, మఱలం ద న్మంత్రు లింకొక్క యం
శమునుం గ ద్దని నమ్రులై యనిరి [677]విస్రంభాన; రామప్రభూ! 1241

---

674 నెం బర్వు పర్వున; 675 మంత్రు; 676 పల్కుం జెల్లె; 677 విశ్వాసాన

నరనాథాగ్రణి! గాధిసూను డు, శతానందాఖ్యమిత్రోత్తముల్,
నెరపన్ సమ్మతి నీ విశేషమును బేర్మిన్ విన్నవింపంగ మీ
దు రయం బేర్పడఁ బంపినార లిటకున్ గూర్మిన్ మమున్ మందు భూ
వర; యన్నం "దెలుపుం" డనెన్ దశరథ క్ష్మాజాని; రామప్రభూ! 1242

"అల సీతా సుత వీర్య శుల్క యని నెయ్యంబార మా రాజు బా
సలు మున్నాడుటయున్ నృపాలకులు తెన్నుల్ గాంగఁ జెక్కండ్రను నా
విలు ద్రుంపన్ దయచేసి తా రగుట నీక్షించ్చుల్ ప్రభూ! మీకును
దెలియన్ వ;" చ్చనినారు పెగ్గడలు భక్తిస్ఫూర్తి; రామప్రభూ! 1243

తమ పుత్త్రీల్ రఘురామలక్ష్మణులకున్ దగ్గాధిసూనుండు, య
జ్ఞము మా రాజుది చూడ దైవికముగాఁ జక్కంబియున్నారు; శౌ
ర్యమునన్ రాముఁడు వీర్యశుల్క యిదె మా రాజన్య సత్పుత్త్రి సీ
తను; కంబం ప్రియనారఁ బల్కిన దమాత్య శ్రేణి; రామప్రభూ! 1244

రఘువంశా! నృపులున్ మహర్షులును సద్యోత్సాహంబునం దేలు చే
ష్టడ, "మీ రాముఁడు వీరుఁ డా శివ ధను ర్మధ్యంబునుం బూని యె
క్కుడఁగా, నా విలు తున్క యయ్యె; సుత కెంతే నోలిగా వీర్యమం
దడుటన్ మా పతి [678]సంతసిల్లె; నని నా తెల్పారు; రామప్రభూ! 1245

నుకన్ వియ్యము గోరు మీరి; తను రా రాంక్షన్ ఫలం బొందఁగాఁ
బొనరింపన్ వలె నంచుఁ బ్రార్థనము సల్పెన్ మా ప్రభుం [679]డింతకున్;
జనుదేరన్ వలె బంధు మి త్త్రి గురు యోగ్యుల్ మీ పరీవారముల్
మునుగాఁగా; నని వేఁడి రా నచివు లొప్పల్ సూపి; రామప్రభూ! 1246

---

678 మన్మఁబంపె; 679 దీరలన్;

-ఉ-

తెలవారంగనె ఋత్విజోత్తముల మంత్రివ్యూహమున్ బంధులన్
బిలిపింపన్ బనుల వేగ నా దశరథోర్వీపాలుఁ; డంతన్ సుమం
త్రులతో, "మంత్రి వరా! ప్రయాణపుఁ ద్వరం దోరంబుగాఁజేయ, పై
బలు మంత్రీంద్రుల వేగిరింతు; రని యంతిం దెల్పె; రామప్రభూ! 1251

ఇపు డో! మంత్రిసుధీ! ప్రయాణమునకౌ నేర్పాటు లన్నింటినిన్
సపదిస్ఫూర్తిని నీవ సల్పవలయున్; జాగేల? మున్ముందు ర
త్నఁపు రాసుల్ వివిధంబులం గొని ధనాధ్యక్షుల్ సనన్ బంపుమీ!
విపరీతంబగు రక్ష; నం చనియె నుర్వీభర్త;రా మప్రభూ! 1252

తరువాతన్ ధన సంచయంబు ననుపన్ ధర్మంబు భద్రంబుగాఁ;
బరివారంబును, దానివెంట మనముం బ్రత్యేక యానంబులన్
దరలం జూడుము, నీవు యోగ్యగతి నేత ద్రక్షలం గూర్చి న
త్వరమీ; మంత్రివరా! యనెన్ విభుఁడు మోదంబార; రామప్రభూ! 1253

చనఁగా సాగిరి వామదేవుఁడు వశిష్ఠక్షీంద్రుఁడున్, వారి వె
న్కనె జాబాలి, చిరాయువై నెగడు మార్కండేయుఁడున్, వారి వెం
టనె గాత్యాయనుఁ డింకనుం గలుగు షట్కర్మ ప్రకాండాదు, లం
టిన సమ్మోదముతోడ, నాఁటి పరిపాటిం బట్టి; రామప్రభూ! 1254

వెనుకన్ స్యందనమందునన్ దశరథోర్వీంద్రుండు, నయ్యాయి వా
హన రాజంబులపైన రాణువలు, సైన్యాధ్యక్షులున్ రౌతులున్,
ఘన సేనా నివహంబుతోడి చతురంగ స్తోమ మూడార ఫ
క్కని సాగెన్ వెలయించి రాగ రస సంగీ భంగి; రామప్రభూ! 1255

ఉపమై వారలు నాల్గునాళ్ల పయనం బొప్పన్ విదేహాధరా
ధ్యము సేరన్, జనకక్షితిన్ దశరథ క్ష్మాజానిదౌ పర్తహా
నము వచ్చెన్; వెనువెంటనే యతఁడు సన్మానంబు మీఱన్ ప్రజో
త్తమ యుక్తుం బెదురేఁగె, నాయనకు మోదం బేద; రామప్రభూ! 1256

పరివారంబులు వెంటరాఁగ జనకక్ష్మాపాలుఁ డవ్వారలన్
ద్వరమై తెచ్చెను యజ్ఞవాటికకు; నంతన్ శాస్త్ర యుక్తంబుగా,
జరిపెన్ సత్కృతి వార లెల్లరకు నాచార ప్రకారంబు, సు
స్థిర సమ్మోదము, భక్తియుం బెనఁగొనం జిత్తాన; రామప్రభూ! 1257

స్థిరుఁడై కోసలుఁ డుండఁగా జనక ధాత్రేంయా విభుం డర్థి స్వా
గతముం బల్కి, మదీయ భాగ్య కలనం గాకేమి మీ రిందు రాఁ
గతమయ్యెన్; భవదీయ పుత్త్రకుని విక్రాంతంపు టుత్కర్ష సం
గతమౌ నీ విజయాన మీ కగు ననెన్ గర్వంబు; రామప్రభూ! 1258

చెనయన్ బ్రహ్మఋషీంద్రుఁ డిట్టుల వశిష్ఠబ్రహ్మ పెక్కంద్రు బ్రా
హ్మణులం దోడ్కొని, భూరితేజులు ధరాపాలాగ్రణుల్, మిమ్ములన్
దన వెంటం గొని, నా పురంబునకు శ్రద్ధన్ వచ్చుటల్, నేను జే
సిన పుణ్యంబని భక్తి మైథిలుఁడు మెచ్చెన్ వారి; రామప్రభూ! 1259

ఘన తేజోనిధులుం బరాక్రమ ధనుల్, గారుణ్య సంపన్ను లం
చని పేర్మోసిన యా రఘుప్రవరు వంశ్య శ్రేష్ఠుతో వియ్యమున్
మనసా పొందఁగ నుంటి; నింకయును మ ద్వంశంబు పూజార్హమా
ఘనమౌ; నం చని సంతసించె జనక క్ష్మాజాని; రామప్రభూ! 1260

అనఘా! మత్కృత పుణ్యపాకమున నీ యజ్ఞంబు రేపింతఁ బొం
దును సంపూర్ణత; నంత నీ ఋషుల సంతుష్టానుమోదంబు దొ
ప్పన సీతా రఘురామచంద్రుల లస త్పుణ్యోద్వహం బిమ్ములన్
బొనరింత్ర; ముం చనె మైథిలుండు, వరభూపుం జూచి; రామప్రభూ! 1261

చిర న వ్యేర్పడ, ''మీర దాతలరు; వాసిన్ దాన మెల్లప్పుడున్
బరగున్ దాతృ నధీనమై యనుచుఁ జెప్పన్ విందు రాజా! సుధీ
వర సంఘాతముపల్ల; నే దెపుడు ప్రేమన్ మీర లీ వచ్చినన్
సవరిన్ దానిని నష్టె గొందు; మనిమెన్ క్ష్మాభృత్తు; రామప్రభూ! 1262

జనకుం డెంతయుఁ బొంగె నా దశరథ క్ష్మాపాలునిన్ విందుఁ; బే
ర్మిని గల్యాణముఁ జూడవచ్చిన మహర్షి వ్రాత మా రాత్రి యం
దునసే యుప్పను స్వాప సౌఖ్యమునయందుం; దక్కు వారెల్ల రో
పిన రీతిన్ సుఖశాయులై, కొని రటన్ విశ్రాంతి, రామప్రభూ! 1263

తన పుత్త్రాళినిగూడి కోసలుఁడుసున్ దద్రాత్ర మచ్చోటఁ బు
చ్చెను బల్ ముచ్చటలందు; నా జనకుఁ డక్షీణ ప్రమోదంబునన్
మునిగెన్ దేపటి పెండ్లి యత్నములలో, మూర్ధాభిషిక్తాళి తా
నసుసారంబునఁ గార్యభారమును మోయన్ శ్రద్ధ; రామప్రభూ! 1264



వసరన్ సౌమ్యను ఫాల్గుణోపహిత శుద్ధంబైన పక్షంబులో
దన యజ్ఞాంచిత కర్మ మంతయుఁ ద్రయోదశ్యాఖ్య సంప త్తిథిన్,
జనకక్షోణీంద్రుఁడు పూర్తిచేసికొనియెన్ సద్ధర్మ సంపన్న మా
ముని పౌరోహిత మెంతయే ననుగలంబుం జేయ; రామప్రభూ! 1265

నరనాథాగ్రణి మైథిలుం డిక, శతానందున్ సమీపించి, 'యో!
గురుదేవా! పిలిపింపఁగా వలయు నాకుం దమ్ముఁడైనట్టి యా
పురుషశ్రేష్ఠుఁ గుశధ్వజుం; గ్రతువు సమ్మూర్ఛంబునుం బొందె సో
దర [633]సంప్రేషిత సాధనాదినె యనెన్ ధర్మేచ్ఛుఁ; రామప్రభూ! 1266

జరుగంబోయెడి పెండ్లివేడుకలలో సాబాలు, సమ్మోద సం
భరితాత్ముం డయి పాల్గొనన్ వలయుఁ బ్రేమన్ వాఁడునుం గూడ, సో
దరుఁడౌటన్; మఱి వాఁడు బంపినదెగాదా! యజ్ఞ సంభార సం
భర మెల్లన్, మన; యంచు మైథిలుఁడు సంభావించె; రామప్రభూ! 1267

ఘనవాహుంబు సుపేంద్రుఁ దోడుకొనిరాఁగాఁబంప వేగంబునన్
జను విప్రుల్ వలెనై, కుశధ్వజునకై సాగారి రా కాంస్య ప
త్తనముం జేరఁగఁగోరి వేగముగ గాంధర్వంబులం బూన్చి, యెం
పిన దూతల్, మది నించు గౌతుకము మిం పెత్తంగ; రామప్రభూ! 1268

తెలియంజెప్పఁగఁ జేరి దూత లటఁ బ్రీతిన్ సోదర ప్రేషితం
బులు వార్తల్, విని, యా కుశధ్వజ మహీపుండున్ ముదోత్సాహముల్
గలయం దాఁ బరివార యుక్తముగ రాఁగాఁ గన్గె వెన్వెంట మా
తులతోఁ; దోడ్పడఁగోరి సోదరున కుద్ధ్యాన; రామప్రభూ! 1269

---

634 సాహాయ్యము చేతనే యనియు శ్రద్ధాసక్తి;

జనకున్ జ్యేష్ఠుఁడు, ధర్మవత్సలుఁడు,నాత్మజ్ఞుండు ఋష్యుండునౌ
జనకక్ష్మాపుని, గౌతమాత్మజుని పజ్జం జేరి యర్థంబుగా
వినతుల్ సల్పి కుశధ్వజుండు నెగడెన్; వేవేగ సోదర్య యో
జనలున్ సాగె, వివాహమున్ గుఱిచి విస్తారంబు; రామప్రభూ! 1270

జనకుం డంత సుదామునుం గని, మహాశౌర్యా! ప్రధానీన్ద్ర! వెం
టనె శ్రీకోసల భూమిపాలు నిటకున్ రావింపు మాహ్వానముల్
ఘనతం బంపుమఁ బుత్త్రి మిత్త్రి జన యుక్తంబౌ గతిన్ మంత్రులున్
దన స్థేయుల్ బరివారముల్ గొలువఁగా; నంచాడె; రామప్రభూ! 1271

చని త న్మంత్రియు వేగ మా విడిది, కైక్ష్వాకాగ్రణిం జూచి మె
ల్లన నాహ్వానముఁ దెల్పెఁ; బంక్తిరథుఁ డుల్లాసించి యెల్లారితో.
జనకక్ష్మీంద్రు సభా సదంబునకు నుత్సాహంబు లుప్పొంగు చొ
ప్పున నేతెంచెను, రాచ వియ్యముల తీపుల్ వోయి; రామప్రభూ! 1723

జనకక్ష్మీంద్ర! వశిష్ఠమౌని యన, నైక్ష్వాకుల్ మదిన్ వేల్పుగా
గణనం జూపుదు; రీతఁడే గురువునున్; గారాన మా కెప్పు డీ
యనయే వక్త; మదీయ వంశ పురుషాయాన క్రమం బీతఁడే
వినిపించుం దమ; కం చనెన్ దశరథోర్వీజాని; రామప్రభూ! 1273

పటు ధాటిన్ వచియింపఁగా నిలిచి, ''యవ్యక్త ప్రభావుండు, సు
త్కటుఁ డా బ్రహ్మ; యతండు మున్ను మది సంకల్పించె; వెన్వెంట సం
తట భూలోకముతో మరీచి యను నాతం డుద్భవం బొందె;'' నం
చటఁ బే రోలగమందుఁ బల్కెను వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! 1274

జననం బొందె మరీచికిన్ సుతుఁడు కశ్యత్కీర్తి యా కాశ్యపుం
డనఘుం; డాతని కంశుమంతుఁడను వంశాధారకుం డయ్యె; నా
తనికిం గల్గెను బుత్త్రుఁడై మనువు; నేత త్పూజ్యుఁడుం బొందె జీ
వను వైవస్వతు; నంచు జెప్పఁ దొడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1275

మను వైవస్వతుఁ డన్నయట్టి మనువే! భూజ్యుండు గావించి పా
లనమున్, ధాత్రిఁ బ్రజాపతిత్వమున విభ్రాజిల్లె; న వ్వానికిన్
ఘనుఁ డిక్ష్వాకువు పుత్త్రుఁ డయ్యె; నతఁడుం బాలించెఁ బో ద్ధాత్రి మె
చ్చను బొంపంగ నయోధ్య; నం చనె వశిష్ఠుం డంత; రామప్రభూ! 1276

కనె, నిక్ష్వాకువు పక్షినిన్ సుతునిగాఁగం; బిమ్మటం గుక్షికిన్
జనియించెన్ సుతుఁడై వికుక్షి; బహు తేజస్వంతుఁడున్ శౌర్యమం
దు సమేయుం డగు బాణుఁ డాతనికిఁ బుత్త్రుం డయ్యె; నాతండుఁ దా
నవరణ్యున్ సుతు గాఁగ నొందె; ననె బ్రహ్మజ్ఞుండు; రామప్రభూ! 1277

అనరణ్యాత్మజుఁ డయ్యె నా పృథువుఁ దా నవ్వానికిం బుత్త్రుఁడై
జననం బొందెఁ ద్రిశంకు; వాతనికినిన్ ఖైవాత్పకుం డయ్యె న
ప్రణుత ఖ్యాతుఁడు దుందుమారుఁ; డతఁ డొందం గల్గె న త్పుత్త్రుకున్
జనవంద్యున్ యువనాశ్వు; నం చనె వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! 1278

యువనాశ్వ ప్రభుఁ డొందె నాత్మభువుగా యోగ్యుండు మాంధాతృనిన్;.
విపులత స్థైర్యుఁడు, కీర్తి సాంద్రుఁ డగు నా పృథ్వీంద్రుఁ డొందెం దనూ
ద్భవుగా భవ్య సుసంధి; నాతఁడు కులాధార ద్వయిం బొందె; నా
ధ్రువసంధి ప్రభుఁ డంతు జ్యేష్ఠుఁ; డని పల్కెన్ బ్రహ్మ; రామప్రభూ! 1279

పరిశేషుండు ప్రసేనజిత్తనుజుఁడై పక్తిస్త్రి నా యన్నకున్;
భరతుంఁడున్ ధ్రువసంధికిం దనయుఁడై భాస్వంత సత్కీర్తి సు
స్థిరుఁ డయ్యెన్; సుతగా నతం డసితు నొందెం; గాల కర్మంబుచేఁ
బరులన్ మాకొన్న నయ్యె నాతని కసెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1280

పనిగా, హైహయ తాలజంఘ శిశబిందాదుల్ పయింబడ్డ, వా
రిని దా నొంటిగ నివ్వారించియును బేరెల్వాతె నవ్వారి కో
డినవాఁడై యసితుండు; భార్యలును బాటెంబట్టి వెన్వెంటరాఁ
జనె నాతండు హిమాద్రి; కంచనియెఁ గించన్ బ్రహ్మ; రామప్రభూ! 1281

భృగు నామాంచితమైఁ ప్రస్రవణమున్ వేవేగమే జేరి యిం
పగు నా నిర్ఝర తీర వాసమున యాపత్కష్టముం బాసియున్
దగిలెన్ మృత్యువువాత నా యసిత గోత్రాభర్త, యా నాఁటికే
మగువల్ గర్భిణులై కుమారిల; ననెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1282

పనిబూనెన్ సవతాలికిన్ సలుప గర్భస్రావమున్ వేగ నా
చిన ప్రయోయాలు; త దర్థ మామె కిడె భక్షింపంగ శ్వేదంబు నిం
పిన భక్ష్యంబును, దానినిన్ మెసఁగి తెల్విం బొంది పింతిల్లి చే
సిన దాకోపస మొం; దటం జనియె తత్ స్నేయుండు; రామప్రభూ! 1283

అనుకాంక్షాను స్మృతిన్ నృపాలకుని యా యదూర్యాధ, తత్ప్రాంతమం
దున నా కాలములోన నున్న చ్యవనున్ స్తోత్రాలి మెప్పించె, ద
ర్శన భాగ్యంబును బొంది యా భృగువు వంశ్య శ్రేష్ఠుఁడౌ వాని, దిం
చిన మోదంబున; నంచుఁ దెల్పఁ దొడఁగెన్ స్నేయుండు; రామప్రభూ! 1284

“వినుమీ! యిప్పుడు పూజ్యురాల! ఫలమున్ పీడం దగున్, నీదు గ
ర్భ నిమిత్తంబుగ; నందు సద్వృత బల ప్రౌఢుండుఁ, దేజస్వియుం
దనవద్యుండు; పరాక్రమాధిపుఁడు, శ్రేయ సౌఖ్య సంపత్తి మిం
చిన పుత్త్రుండు గల్గుఁ దటం చనియెఁ దత్ స్నేయుండు; రామప్రభూ 1285

నరపన్ నీ శిషు వెంతయేనియును నాయుష్మంతుఁడై, తీక్ష్ణమున్
నినంగాని; తదీయ సంగరము త ద్దేహంబునన్ జీర్ణమున్
నయుం; గూడు నీకన్ సుఖ ప్రసవమున్ శీఘ్రంబుగా నీ కటం
నిచెం దత్ చ్యవనుం; డటం చనె వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! 1286

రపుశ్రద్ధను భక్తి నాయమ సమోవాకంబుఁ గావించి వే
రమే యేఁగె, వియోగ శోక భర ముక్తిం గూడనుం గాంచి; స
త్వరమే యామె సుఖ ప్రసూత యయి పుత్త్రానందముం బొందె; భా
స్కర వంశాగ్రణి యయ్యె వాఁ; డనె వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! 1287

రళంబుం దిని కూడ మన్న కతనం గావించి రబ్బాలు సు
ర వాంఛన్ సగరాభిధానునిగఁ; దచ్ఛ్రీమంతుఁడే గోసలం
బు రహిం బాలనసేసెఁ గీర్తిధనుఁడై, పుణ్యాత్ముఁడై, కోట్యహ
స్కర తేజుం డయి; యంచు వాకొనె వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! 1288

ర శాతండయి చక్రవర్తి పదసెం బా నశ్వముంజుండు నా
రగుం బుత్త్రి; నతంశునున్ సుతునిగాఁ బ్రజ్ఞాధురీణుం గనెన్
ర తేజోనిధి నంశుమంతు; నతఁడున్ వర్ధిష్ణునిం గాంచె దు
ర తేజున్ సుమతిన్ దిలీపు; ననియెం ద ద్బ్రహ్మ; రామప్రభూ! 1289

లిగెం బుత్త్రుఁడుగా భగీరథుఁడు తత్ క్ష్మాభర్త; కవ్వానికిన్
లిగెం బుత్త్రుఁడుగాఁ గుకత్థ్సుఁడును దత్ క్ష్మాభర్త: కా పిమ్మటన్
లిగెం బుత్త్రుఁడుగా రఘూద్వహుఁడు తత్ క్ష్మాభర్త; కవ్వానికిన్
లసెం బుత్త్రుఁడుగాఁ బ్రవృద్ధుఁ; డనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1290

పుష్పవంతుఁడును, గల్మషాదుఁ డనఁగాఁ బొల్పుం బ్రవృద్ధుండె; త
న్నరపాలుండు సుదర్శనుం దనయుఁగా నాంత్రార్థుఁడై పొందెఁ; ద
న్నరపాలుఁడును నగ్నివర్ణ సుతుఁగా నాంత్రార్థుఁడై పొందెఁ; ద
న్నరపాలాత్మజుఁ డయ్యె శీఘ్రగుఁ; డనెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1291

మరుఁ డనన్ శీఘ్రగ పుత్త్రుఁడై ప్రశుశ్రుక ధరా భారంబునుం దాల్చుచున్
బరగెన్, వానికినిం బ్రశుశ్రుకుఁడు ప్రేమం బుత్త్రుఁడై యొప్పెఁ; భూ
వరుఁ డవ్వానికిఁ బుత్త్రుఁడై నహుషుఁడున్ వర్ధిల్లె; నాభాగుఁడున్
దన పుత్త్రుండయి యొప్పె వాని; కనియెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1292

ధర, నాభాగ సుతుండుగా నజ మహా ధాత్రీంద్రుఁడుం గల్గెఁ; ద
ద్వర భూపాలక పుత్త్రుఁ డీ దశరథ క్ష్మాభర్త సత్కీర్తి సు
స్థిరుఁడై యుండెను; రామ లక్ష్మణు లనన్ దీపించు నీ వీరు లీ
శ్వరుసున్ దాశరథుల్, ధరావర! యనెం బూజ్యుండు; రామప్రభూ! 1293

చరితాది ప్రవిదూరు లీ భరత శత్రుఘ్నుల్, మహావీరు లీ
నరనాథాగ్రణియైన పంక్తిరథ సంతానంబె; మీ యా మహే
శ్వర కోదండ విఖండనుం డితని జ్యేష్ఠ జ్యోతి, యత్యంత భా
స్వర తేజుం, డని తెల్పె నెయ్యమునకున్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1294

వర సంవర్ధిత శుద్ధ వంశము సుమా! మా రాజ సంతాన; మె
ల్లరు వీరాగ్రణు, లిందు; ధార్మికులు; గోత్రక్ష్మాతి విస్మాపన
స్థిర దీక్షాపరు లౌచు, దాశరథులున్ దీపించుచున్నార లీ
శ్వరలో; నం చనుచున్ వచింపఁ దొడఁగెన్ బ్రహ్మర్షి; రామప్రభూ! 1295

సల సీపుఁ డనుపంప్రస దాశరథులం; గూర్మిం బ్రవర్తిల్లి కూఁ
తుల నీ యుప్పార, రామలక్ష్మణులకుం దూకొన్న వీ దాను భా
ర్యలుగా; వీరలతో డి బాంధవము శ్రేయం బౌను మీ; కంచు ని
శ్చలుండై యూరక హర్షమందెను వశిష్ఠ బ్రహ్మ; రామప్రభూ! ౹౩౯౪



౬౧

గురు విశ్వామిత్రుఁగూర్చి యీ గతిని వాకొన్నంత, మోదిల్లి, యా
శోపవాతన్ జనకర్షి, 'బ్రహ్మఋషిచంద్రా! కన్య నీగోరుటన్
బ్రతిపాదిన్ పడియింతు మా జనక భూప శ్రేష్ఠులం గూర్చియున్;
జిర మే పద్ధతి కుల్యధర్మ; మని సంక్షేపించె; రామప్రభూ! 1297

'నిమి' సమ్రాట్టు మహాబలుం డనుచు వర్ణింపంబడెం జుమ్మి! పూ
ర్వపుసం దాతఁడు ధార్మికోత్తముఁడునై రంజిల్లె; సత్కర్మముల్
విమలాంతఃకరణంబునన్ సలిపె నేర్మిం జెక్కు; లవ్వానిలోన్
గొమరుండై "మిథి" యుద్భవించె; నని పల్కెన్ రాజు; రామప్రభూ! 1298

'మిథి'యే యీ మిథిలన్ సృజించెను; మహావీరుం డతం డేర్పడెన్
బ్రథమానన్ జనక క్షితీంద్రుఁ డనఁ; దద్రాజన్య సత్పుత్త్రుఁడై
ప్రథ కెక్కెన్ నృపుఁ డా యుదావసువు; తత్ సార్థ ర్తనుం బుత్త్రుఁడై
ప్రథితుం డయ్యెను నందివర్ధనుఁ డనెన్ జ్ఞానాని; రామప్రభూ! 1299

జననం బొందెను నందివర్ధనునకున్ సత్పుత్త్రుఁ డొక్కండు, కీ
ర్తిని ౮౮౬ని స్తంద్రుఁ డనన్ సుకేతు; వతఁ డొందెన్ నందనుం గూర్మి, శ్లా
ఘన లభ్యుం డగు దేవరాతునిఁ, బరాక్రాంతి స్థిరున్, ధర్మ క
ర్మని, రాజర్షి; నటించుఁ బేర్కొనియెఁ బృథ్వీభర్త; రామప్రభూ! 1300

అనఘం డాతనికిన్ బృహద్రథుఁడు దాయాదుండుగాఁ బుట్టెఁ; బే
ర్మిని దత్ భూపతికిం దనూజుఁడు మహావీరుండు జన్మించె; నా
తనికిం గల్గెను సూనుఁడై సుధృతి; యాతం డొందె వీరున్ సుధ
ర్మని సత్పుత్త్రుగ ధృష్టకేతువు; ననెన్ భూభర్త; రామప్రభూ! 1301

---

౮౮౬ గోటీరుఁ;

వినుఁడై కాంచెను ధృష్టకేతువు మహోత్కర్షంబు రాజర్షిగా
మని; హర్యశ్వుఁడు వానికిం దనయుఁడై వర్తిల్లె; హర్యశ్వుఁడున్
గనియెం బుత్త్రుని సుత్తమున్ మరువునన్; క్ష్మాపాలుఁ డాతండు తా
ర్క్ష్య నిధిం బుత్త్రుఁ బ్రతీంధకుం గనె; వనెన్ రాజర్షి; రామప్రభూ! 130

అనఘుండైన ప్రతీంధకుండు గనె దాయాదున్ యశోభాస్కరున్ ధ
రణి రాజాగ్రణియైన కీర్తిరథు, విభ్రాజత్ దయా ధర్మ శీ
లుని; నాతండును దేవమీఢు గనెఁ బుత్త్రున్; దేవమీఢుండు కో
విని గాంచెన్ విబుధాఖ్యు; నం దనియె ధాత్రీభర్త; రామప్రభూ! 1303

అల సత్కీర్తి ధనుండు నా విబుధ సత్త్వస్వామి ధన్యుం దనన్
గలిగెన్ సూనుఁడు తా మహాధృతుఁడు; తత్ క్ష్మాభర్తకుం బుత్త్రుఁడై
యొలసెన్ ధన్యుఁడు కీర్తిరాతుఁ డను సత్యోత్కృష్ట రాజర్షి, తత్
బలభిత్తేజుఁడు, శౌర్యధుర్యుఁ డనియెన్ క్ష్మాజా : రామప్రభూ! 1304

కలిగెం బుత్త్రుఁడు కీర్తిరాతునకుఁ బ్రఖ్యాతిన్ మహారోముఁ డన్
విలస త్పుణ్యుఁడు; వానికిం గలిగెఁ బేర్మిన్ స్వర్ణరోముం డనన్
జెలఁగం గల్గిన సూనుఁ; డాతనికి వాసిన్ హ్రస్వరోమం డనన్
దుఃఖింపంగలఁ జ్యోతి కల్గె; ననిచెప్పెన్ రాజు; రామప్రభూ! 1305

అనఘుం డాపుత్త్రుఁడు హ్రస్వరోముఁడు మదీయారాధ్య జన్యుండు; ధ
ర్మ నిరూఢిన్ మహితుండు; నే నతని పుత్త్ర జ్యేష్ఠుఁడన్; నాదు త
మ్ముని భారం బిడి నాపయిన్ భువి భరంబున్ మోయఁ బట్టాభిషి
క్తునిఁ జేసెన్ నను నాదు తండ్రి; యని పల్కెన్ రాజు; రామప్రభూ! 1306

అనుజన్ముం డగు నీ కుశధ్వజుని నే నల్లాపముద్దా నటుల్
మనిపం బారఁగఁ బెంచి పెద్దసటు సల్పంగల్గినాఁడం; దపో
వనవాసంబున కేఁగి తండ్రి యటచే స్వర్గస్థుఁ డయ్యెం; గని
యుపై భావింతును విష్ణుగా; ననుఁ బుణ్యుం డాడ; రామ ప్రభూ! 1307

పను మార్గంబున రాజ్య పాలనము సల్పం గల్గితిం; బెద్దయున్
బనెఁ గాలం బోగి; నాదటన్ మిథిలనున్ సాంకాశ్య మన్ పట్టనం
బును బాలించు సుధన్వుఁ డన్ నృపతి యేపుం జూపుచున్ ముట్టడిం
చెను బేరాస; నటంచుఁ గించను వచించెన్ రాజు; రామప్రభూ! 1308

తనకున్ మద్గృహమందునున్న హర కోదండంబునున్ నాదు కూఁ
తును సీతన్ వెస నిమ్మటంచు చతఁను పంతుం గొల్పుచుం బుచ్చె వా
ర్తను; నే నందులకున్ నిరాకృతము సల్పన్ యుద్ధముం జేసి యో
డెను; నాశంబును బొందె; నంచుఁ జెడనాడెన్ రాజు; రామప్రభూ! 1309

ఆ సాంకాశ్యమునం గుశధ్వజున కాహ్లాదంబు సంధిల్లఁగా,
వాసిం గట్టితి పట్ట; మా పురమునున్ వర్థిల్లు నత్యంతమున్
భాస న్సొప్పఁగ; నద్ది యిక్షుమతి యన్ భద్రాపగాతీరమున్
జేసెన్ స్వర్గము వోలె; నంచును వచించెన్ రాజు; రామప్రభూ! 1310

సొరిదిం బేర్చిన శ్రీఫలీ తరువులన్ శోభిల్లు త ద్ద్వాపినీ
పర తీరంబున నిర్మితం బగుటచే వర్థిల్లు నా కాంక్ష్యమున్
సుర ధామం బనిపించు; మించు నదియున్ శోభాయమానంబునై
కరమున్ శ్రీదు విమాన; మంచుఁ బతి వక్కాణించె;రా మప్రభూ! 1311

ఈ తమ్ముండు కుశధ్వజుండు మహితాత్మ ప్రాభ వత్వంబునన్
స్తోత్రవ్యుండు; తదీయ పత్తనమునందున్ వాసముం జేయు నా
పూతాత్మున్ బహు దీప్తిమంతు నిటకున్ మున్ముందె రావించితిన్
ప్రీతిం బెండిలిఁ జూచు నీతఁ; డని చూపెన్ రాజు; రామప్రభూ! 1312

మునివంశోత్తమ! సీత నిచ్చుటకునై మున్నయ్యె శ్రీరామ భ
ద్రునితో నిశ్చయ; మామె చేపవరదన్ లోలాక్షి నిన్ వీర్యశు
ల్కను గాకుండఁగ, మద్ద్వితీయ తనయా రత్నంబునౌ నూర్మిళన్
జన నిమ్మంటిరి లక్ష్మణాఖ్యున; కనెన్ క్ష్మాభృత్తు; రామప్రభూ! 1313

వసు యాజ్ఞప్తిఁ బురస్కరించుకొనుచుం ద ల్లక్ష్మణ స్వామికిన్
సుఖకారంబుగ నూర్మిళా వధువునన్ మాసోదర ద్వంద్వమున్
సుమతం బెండిలిసేయువారలము ప్రేమం జిత్త సంతుష్టి భా
వమునతో, నం చని చూడె సంత జనక క్ష్మాజాని; రామప్రభూ! 1314

వినగా నల్పుఁడి! యింక నో! దశరథోర్వీనాథ! నీ సూర్తి పు
త్రి సమావర్తన మం చతెన్ జనక గోత్రాపర్త; నేఁ డుండె శు
ద్ధ సమావిష్ట మహా త్రయోదశియు; నాం డ్యాదుల్ ముగింపంగఁ దా
ననమౌఁగూడ; నటం చతం డనియె వియ్యం బొందఁ; రామప్రభూ! 1315

దల దెల్లుంట సుహూర్త; మిస్వరసుసుం గల్యాణముల్ సేయఁగా
దటఁతుం గోసలనాథ! మీ సుతులకున్ ధర్మ ప్రకారంబునన్
బొలుపౌ నుత్తర ఫల్గుణిన్; జరుపఁజెప్పం డిరు రేపంట స
త్ఫలదంబౌ గవిదాన; మం [686]చనియెఁ దక్ ష్మాభర్త; రామప్రభూ! 1316



686 చనియె గోత్రాని;

ఉ౨

పర మౌనీంద్రులు త ద్వశిష్ఠుఁడును విశ్వామిత్రుఁ డాలోచనల్
జరగం జేసిరి; కూడఁబ ల్కికొని; రాపై మైథిలుం జూచి, "యు
ర్వర నిక్ష్వాకులయున్ విదేహులయునున్ వంశంబు లెన్నంగ నొం
డిరే? యెవ్వారును నే; ర్పటం చనియె గాధేయుండు; రామప్రభూ! 1317

మీ వంశంబుల గొప్ప యింత యని నేర్మిన్ వేరనుం జెప్పఁగాఁ

బోవం జాలరు; మీకు సాటివి కులంబుల్ మీవియే సుం డికన్;
దాపన్మాత్రము లిట్లు వియ్యమను ధర్మం బొగ్గు బంధంబుననున్
జేవం జేరుట లెస్స; యం చతఁడు నాశీస్సొల్కెఁ; రామప్రభూ! 1318

సరిగాఁ గూరెను రూప సంపదలునున్, సౌహార్దముల్ నూ! వధూ

వరు లీ జంటల; కింక నేనును భవ ద్వంశోన్నతిం గోరు మీ
గురుఁడున్ యోజనచేసి చెప్పఁగలపల్కుల్ మీరు పాటించుటల్
దొరువౌ; నం చనె మైథిలుం గనుచు గాధేయుండు; రామప్రభూ! 1319

మీ తమ్ముండు కుశధ్వజుండు నెఱిలో మీ మ్మెంతయుం బోలు; నా
పూతాత్ముండును గోసలాధిపునితోఁ బొ త్తొందు సంబంధముల్
ఖ్యాతిం జేయుట యుక్తమౌఁ గతమునం గాఁగోరుచున్నార మీ
సీతారాముల పెండ్లితో నవి; యనెన్ [687]సిద్ధుండు; రామప్రభూ! 1320

మీ సోదర్యుని పుత్త్రికా ద్వితయుఁ బేర్మిన్ మీరు యోజించి, చే
తో సమ్మోదము గల్గ నీ భరత శత్రుఘ్నుల్ వివాహంబుగాన్
వాసిన్ నిశ్చయముం బొనర్చు నెడలన్ మా కోర్కు లీడేరెడున్;
ధీసంపన్నులు [688]సామిసామ; లనె గాధేయుండు; రామప్రభూ! 1321

687 సిద్ధర్షి, సిద్ధాంలి, శ్రేయుంను; 688 పెంన్లితుల్లో;

భరతుం డెంతటి సుందరుండొ! మతియున్ భ్రాజత్ పరాక్రాంతిపు
ష్టతుఁడో! యెంతటివాఁడె సుమ్మతని యా తమ్ముండు శత్రుఘ్నుఁ డౌ-నే;
నతఁడొంటంగలవయ్య! కోసలుని యా సంతాన మహోగ్రస్వమున్
స్థిర సౌందర్య సబాది; నం చనియె గాథేయుండు; రామప్రభూ! 1

మునుపున్ దాశరథుల్ పరాక్రమమునన్ సల్వారుచున్నారు వి
పులం బోలెం; దగ వైభవంబునను బుణ్యాల్ వీరు దిక్పాలకుల్;
వంశంబంగాఁ దమ రెండు వంశములలో ధర్మాత్ములే బుట్టుటల్
పొలయుం బుణ్య వశాన; నం చతఁడు సెప్పెం బ్రీతి; రామప్రభూ! 1

మరిఁ గన్నట్టివి మీదు వంశములు రెండుం బుణ్య సంపత్తి సం
స్తుతమై; లాభ్యుదయైన మీ రిపుడు పొందుం బొంది వియ్యాన బం
ధితులై శ్రేయములన్ భజించి కడు వృద్ధిం బొందుటల్ మాదు వాం
ఛిత; మంచున్ [689]ముగియించు నప్పుడు వచించెన్ బ్రహ్మ; రామప్రభూ! 13

జనక క్ష్మాపతియుం గురుభక్తుఁడునున్ సంతోష మేపార యో
జనలం జేసినయంత, నా జనకుఁడున్ సంవిత్తు సూచించుచున్
మును లా యిద్దరపన్ నమస్కృతులు సల్పున్, సల్పి, సోదర్యునిన్
గనుచున్ వారలతో ఎన్నముఁదయి పల్కెం జొప్ప; రామప్రభూ! 13

"మునులారా! మును జేసికొన్న [690]మనమాఁ బుణ్యంబు మా దిద్ది; తా
నని యిక్ష్వాకులతోడి వియ్యమును బొందన్ మమ్ము మీ రీ గతిన్
బ్రణయం బార[ఁ]గ నాజ్ఞసేయుటలు నేర్పాటయ్యె; శీఘ్రంబునం
మన నడ్గానిని దాల్తు; మం చతఁడు పొందుం దుష్టి; రామప్రభూ! 132

689 ముగింపునందున; 690 విలసత్ పుణ్యంబు;

భరతుం బన్ మఱి లక్ష్మణానుజుఁడునున్ మావాని బ్రాఁతైన యి
ద్వర కూఁతున్ద్రదను బెండ్లియాడఁగల; రొప్పున్ నాల్గు పెండ్లిండ్లనున్
ద్వరలో నొక్క ముహూర్తమందుననె సల్పం బౌర్ణమీ సత్తిథిన్
బర గెల్గొంటను నుత్తరాభము; నటెన్ క్ష్మాభర్త; రామప్రభూ! 1327

దగఁ డా యుత్తరకుం బతిష్ఠతను గొల్పంగల్గు నత్యంతమున్
పగఁ డా నందు నధిష్ఠితుం డగుటచేతం; గాన నెల్లుండియే
పగ లీ పెండ్లి ముహూర్తముల్ జరుగుటల్ బాగుండు; నీ ఫల్గుణిన్
బగలే యుత్తమ మందు రార్య, అనె భూపాలుండు; రామప్రభూ! 1328

అనుచున్ నిల్చి వశిష్ఠ గాధిజుల కత్యంతాభిముఖ్యంబుగా
వినతిన్ సల్పి, "మహర్షులార! యిటు లీ పెండ్లిండ్ల రూపాన, మా
కు నెటిం బూర్తిగఁ గూర్పఁగల్గుటలు మీకుం జెల్లు; పూర్వంబె మీ
కనుఁగున్ ఛాత్త్రిఁడు కోసలుం; డనియె నిజ్యాభర్త; రామప్రభూ! 1329

ఇదియే యాదిగ మేము భ్రాతలము మీ కెంతేని విస్రబ్ధతా
స్పదులౌ శిష్యుల; మింక మాఁ గురమునున్ భక్తి ప్రపత్తుల్ మదిన్
గదురన్ మీకు నధీను లైతి; మిపుడే కర్తవ్య కుర్వాణుతల్
గుదుర ద్విజాదుఁడి మా; కటం చనుచు మ్రొక్కెన్ రాజు; రామప్రభూ! 1330

జనకుం డిట్టులఁ బల్కుటల్ వినిన విశ్వామిత్త్రి మౌనీంద్రుఁడున్,
జనవుం బొందు వశిష్ఠుఁడున్ దశరథ క్ష్మాపాలుఁడున్ మోదమున్
బ్రణయం బొందిరి; రంతఁ గోసలుఁడు తత్ క్ష్మాపాలుతో, "మీదు స
ద్గుణముల్ భ్రాతల వెన్ననౌనె? యని పల్కెం బ్రీతి, రామప్రభూ! 1331

అనుమస్యుండుప మీర లెంత ఘను లయ్యా! యెన్న నా శక్యమే!
నిసి బృందారకు లింతమందిని, మహాపుణ్యుం డ్రనందెల్ల వీ
సనాఖాగ్రణు లింతమందిని గడున్ సత్కారముల్ మీరు గాం
ప్రసం ప్రేమంగనినా; వటం చతంను మెప్పం జూపు; రామప్రభూ! 1332

నస లెల్లారల నింతమందిని లస త్సత్కారము జేయఁగా
గ్రాసహ మీరలు గాపునన్; సుఖముగానుండన్ పలెన్ మీరు; పో
దుప నే నెప్పుడె పీడుపట్టునపు; నందున్ నాంది మున్నైన వా
నిసి పెలుంతును బూర్తిగా; ననియె వన్నెన్ రాజు; రామప్రభూ! 1333

ఒంచి విద్యాంకుల వీసుకొంచుఁ బదివారాదిన్ వశిష్ఠర్షినిన్,
మసి గాధేయునిగూడి యా విడిదికిన్ మోదంబునం బోఖు, దా
నె సముప్రీతిని సల్ప నేర్పరవెఁ ద న్నాందీ లస త్కార్యముల్,
సనతసె మెచ్చఁగ నెల్లరున్ దశరథ [691]ఘ్నాకృత్తు; రామప్రభూ! 1334

నవపంస్యుండను నా మహాప్రభువు చేయించెన్ సమావర్త
సంబసు నా పిమ్మటినాఁడు శాస్త్రవిహితంబుంగాఁగఁ బుత్రాళిచే
చను; పేసపేగల నాల్గి లక్షల ప్రశస్తం బైన గోబృందమున్
దనచయుల్ పేరిటఁ నేర దేఁ బనిచె యుక్తంబార; రామప్రభూ! 1335

శృగ శృంగంబుల బంగరుం దొడుగులం దాపించె, నా ధేనువుల్
పాగడొందం; దిదపం బయస్సు పిదుకన్ ముఖ్యంబుగాఁ గంచుచే
నగు పాత్రల్ పెలయంగఁ దేఁ బనిచెఁ; బుత్రార్థంబుగా వానిఁ బెం
పుగ దానం బిడెఁ దండ్రి, బ్రాహ్మణులు సమ్మోదిల్ల; రామప్రభూ! 1336

---

691 శక్త్రు;

తన పాపాదుల నట్టుగుం గొంటన పాతం దొప్పె, విశ్వాలకుల్
దను గొల్వం దగ నట్టురన్ సమిది తోడ్కర్ స్ఫూర్తితో నొప్పుచున్
మనుమన్నట్టి ప్రసన్న రూపుఁడగు బ్రహ్మం బోలుచుం దేజమం
దనమున్ నిందువనంబునందునను బొందుం బొంది; రామప్రభూ! 1837



తను సైతం వింక ధేను దావమును శ్రద్ధం గోసలుం దప్పదే
యొనరం జేయుచునుండె; నచ్చటికి నాయుష్మంతుఁ డా కేకయా
వనిపాలాత్మజుఁడౌ యుధాజితుఁడు ప్రేమన్ వచ్చె; నవ్వానినిన్
గనుచుం గోసలుఁ డాదరంబునను బల్కుం జొచ్చె; రామప్రభూ! 1338

భరతున్మాతులతోఁ సుతన్ దశరథ క్ష్మాజాని కన్యోన్యమున్
జరగెం బ్రేముడిమీరఁగాఁ గుశల సంప్రశ్నంబు; లా పిమ్మటన్,
"నరనాథాగ్రణి! వత్తునుం గనుఁగొనన్ నా తండ్రికిన్ వాంఛితం
బు రహిం గల్గుట నన్ను బంపె;" నని చెప్పన్ మామ; రామప్రభూ! 1339

తన రిపోటికి రామచంద్రునివి యుద్వాహంబునున్ నల్పఁగాఁ
గౌమనుల్తోడుత వచ్చియుండె రని నాపం గోసలం జెప్పఁగాఁ,
దమ నిధ్యానము సేయవచ్చు, భరతున్ దర్శింపనున్ వచ్చు, ఁగా
ర్యమునుం దీఱు, నటంచు వచ్చి తనె, మెల్లన్ మామ; రామప్రభూ! 1340

అనుచుం బల్కు యుధాజితుం బొగడె నర్ఘ ప్రక్రియన్ మెచ్చుచున్
జననాథాగ్రణి కోసలుం డుచితమౌఁ జందాన సన్మానమున్,
జనపున్, వావియు, నెమ్మదిన్ మెఱయ; నంచ త్తన్నిశం బ్రొద్దుపు
చ్చె నతం డంతట బంధు మిత్త్రియుతుఁడై చెల్వొంది; రామప్రభూ! 1341

మరునాఁ డా నృపుఁ డగ్రసంధ్య నఖిలంబౌఁ గర్మలం దీర్చి, స
త్వరమే మైథిలు యజ్ఞవాటికిఁ జనెన్, ధర్మంబు రూపొందె నాన్
బరగం గల్గిన మౌని బృందములు పార్శ్వంబందునన్ సాగ, బం
ధుర రీతిం దగఁ దెండ్లివారలును దన్నుం జేర; రామప్రభూ! 1342

పర సోదర్యులం దల్వురన్ మెలఁపుఁ దోఁపన్ మంగళ స్నాతులై
వరలం దాల్చిరి యుక్త భూషణములం; బాణ్యగ్రియంబందునన్
నరవిం దాల్చిరి తోరముల్; విజయ మన్ సంప స్ముహూర్తంబునన్
సురదేవాదులవెంట సాగి రెలముల్ గుల్కంగ; రామప్రభూ! 1343

జనకక్షీంద్రుని యజ్ఞవాటిఁ బితపట్టం జేరి కూర్చుండి రా
యనఘుల్ పెండ్లి కొమాళ్లు నల్వురు; వశిష్ఠాచార్యుఁ డా పిమ్మటన్
జనకుం జూచి, "కుమాళ్లతో దశరథ క్ష్మాభర్త మీకై నిరీ
క్షణముం జేయుచు నుండె;" నంచనియెఁ బ్రక్కం జూపి; రామప్రభూ! 134

అనఘా! మీదగు ధర్మమున్ నెఱపఁ గన్యాదాతగా వేఁ య
య్యె నటం చాడు వశిష్ఠుఁ గాంచి నగి, "యేరీ? యడ్డువా రాయనన్
మన యీ ద్వారకులందు; నిద్ది తమదౌ వాసంబునుం గాదె? యే
లను నీ లాంఛన? మం చనెన్ జనక గోత్రా[692]జాని; రామప్రభూ! 1345

మునివర్యా! కనుఁడీ! మదీయ తనయల్ పూర్వంబె సుస్నాతలై
మనసా మంగళ కార్యముల్ నెఱపి దీప వ్రాతముం బోలి దీ
ప్తిని గూర్చుండిరి నల్వు రా యెదుటనే వేదీ సమీపంబునం
దనె, నా బ్రహ్మను జూచి మైథిలుఁడు నెయ్యం బార; రామప్రభూ! 1346

మునుపే నే నిట సిద్ధమై తమకునై ముఖ్యంబుగా వేచియుం
టినిఁ; దాఁ గోసలభూమిపాలుఁ డిట నూటిన్ రాక, యాలస్య మే
లను జేయన్ వలె? నన్నఁ గోసలుఁడు పుత్రీ వ్రాత యుక్తంబుగాఁ
జనియెన్ మైథిలు యజ్ఞశాల కపు డొజ్జం గూడి; రామప్రభూ! 1347

692 భర్త;

నవరం దంత వశిష్ఠునిం గని మహార్షిగ్రణీయ! యీ పెండ్లి దీ
సు న న్నేలుచు నిర్వహింపవలె మీరత్ సాకతర బొప్పఁగా
నీనం, ద న్మని గాధినందను శతానందున్ ముదం బుప్పగాన్
నముం దుండఁగఁ బిల్చెఁ బరవిరికి మధ్యంబందు; రామప్రభూ! 1348

వ యీ మువ్వురుఁ గూడి పంక్తిరికి మధ్యంబందు శాస్త్రోక్తి నం
నిర్మించిరి వహ్ని వేదికను; దానిన్ గంధ పుష్పాదికం
రఁ గాత్రసర్వత పోలికా చయముతో, మూలంబు లేనట్టి పా
మొక్కల్ గలవానితో దీపమలఁచి రంచం బాళ; రామప్రభూ! 1349

రకల్ ముద్దుగ నెత్తు మూకుళులనున్, మూర్త్యాన ధూపాళి పా
, శంఖంబులఁ బోలు పాత్రలను, నర్ఘ్యం బీయనౌఁ బాత్రలన్,
పత్ ప్రసుకన్యవ సంపదన్, విమలమై వెల్గొందు నా యర్ఘ్య పా
పిలాలవి పాత్రలన్, నిలిపి రం దందాన; రామప్రభూ! 1350

పాదిన్షతలున్న పాత్రలను, నేర్పారంగఁ ద ద్వేదికన్
నిల్పిరి; యగ్నిహోత్రమును మంత్ర స్పష్టతన్ వేదికన్
రథ దగ నుంచి; రా పిదప దర్భల్ గాత్ర యుక్తంబుగాఁ
ల్లంగ నమర్చినారు, సుషమా ప్రస్ఫూర్తి; రామప్రభూ! 1351

నం బీన వధూవరాభ్యుదయమున్ వాంఛించి, వేదోక్త మం
లన్ హోమము సేయసాగెను లసత్ బ్రహ్మర్షి సద్భావ వి
దైనట్టి వశిష్ఠమౌని యొకఁడై, తన్మంగళారెల్లఁ ద
మున్ విన్నను జూడ, భక్తియుత శ్రద్ధాబుద్ధి; రామప్రభూ! 1352

---

లిపి; 694 పసపో;

జనకుం దాతట [695]శుభ్ర రత్నమయ భూషా దీప్తమానాంగి సీ
తను, వెంటంగొని తెచ్చి వేదికకుఁ బ్రాంతంబందునన్ వీతిహో
త్రుని చెంతంగల రామచంద్రునకు ముందున్ నిల్వఁగాఁజేసె, బ్రీ
డను మూర్ధంబును వాల్చినామెఁ గొనియాడన్ మంది; రామప్రభూ! 1353

ఇదిగో! సీత; మదీయ పుత్రి; యిఁక నీ కీ కన్య, ప్రాంచద్గుణా
స్పద, యౌతన్ సహధర్మచారిణి; వెసన్ శ్రీరామ! నీ వీమెనున్
ముద మేపారఁగ సమ్మతింపవలె; నోముల్ నిన్ను నిశ్శ్రేయ సం
పదఁ; యంచున్ జనకుండు నాశిషముఁ దెల్పెం బ్రీతి; రామప్రభూ! 1354

కరముం జావి వధూ కర గ్రహణముం గావింపుమీ! యీమె సు
స్థిర హర్షానఁ బతివ్రతా తిలకమౌ; శ్రీమంతురాలై ధరన్
బరగున్; నీడవలెన్ నినున్ విడక సర్వావస్థలన్ వెంబడిన్
దిరుగున్ నీ; కనెఁ గౌసలేయుఁ గని పృథ్వీజాని; రామప్రభూ! 1355

అనుచున్ రాముని చేతిలోఁ వదలి కన్యాదాత మంత్రాంబువుల్,
మన మొప్పంగఁగ నొప్పగించి మహిజం, బ్రాంతంబునందున్న ల
క్ష్మణునిం జూచి, "తనూజ యూర్మిళ నిదే సౌమిత్రి! నీ కిత్తుఁ గొ
మ్మనె, నంగీకృతితోడ జాగు నిఁకఁ జేయం బోక; రామప్రభూ! 1356

"సుముహూర్తం బిది మించిపోవు ననుచున్, శోభిల్లు నా యాత్మజా
ప్రమదా రత్నము చేయి పట్టుకొనఁగా బ్రార్థించి, యా లక్ష్మణున్,
గ్రమతన్ మాండవిఁ జూపి, 'యో'! భరతుఁడా! కావింపుమీ! యీమె హ
స్తమునుం దాల్చుట; యంచు వేఁడె జనక క్ష్మాభర్త; రామప్రభూ! 1357

---

695 సర్వ,స్వర్ణ;

"ప్రతకీర్తిం బ్రియమారఁ జేకొనుము శత్రుఘ్నుండ! నీ" వంచు, నం
చిత శాంతంబున వేఁడి యా జనకుఁడున్, "శ్రీమంతతన్ మించు సౌ
మ్యత నేపారు కుమారులార! యిదొ మా మానాత్మజల్ మీ కిఁకన్
సతులై వర్తిలువారు సుండి!" యని హర్షంబార; రామప్రభూ! 1358

4ం లగ్నంబున[696]కున్ విలంబనము లే దన్నంత, నా యన్నదమ్ములు నల్వుంద్రును నల్వు రప్పసెలియల్ముద్దైనహస్తంబులన్
వలస ప్రీతి గ్రహించినారు, తమవౌ విల్కాను హస్తంబులన్,
మెలమెల్లన్, గురుఁ డీయఁగన్ సయిగలన్ మేకోలు; రామప్రభూ! 1359

కరసంగ్రాహకులైన యా వరు[697]లిఁకం గాంతావళుల్ గూడిరాన్
చిరుగంజొచ్చిరి వహ్నికిన్, జనక ధాత్రీ జానికిన్ జ్ఞానబం
ధురమౌ బ్రహ్మఋషీంద్ర బృందమునకుం దోరంబుగా వల్లిలిం
చి రహిం జూపఱ కన్నులుం జెమరుపం జిద్భృత్తి; రామప్రభూ! 1360

కురిసెం బూవులవాన, శోభనముగాఁ గూటంబునందుండి; తా
మొరసెన్ దుందుభి బృందముల్ చదలఁ కాపుల్ మ్రోయఁగాఁ జేయ; న
చ్చరలున్ లాస్యముచేసి; రాకసమునన్ సంతుష్టి గంధర్వు లె
ల్లరుసుం బాడిరి; భూమి తెప్పితఱ మహాహ్లాదాన; రామప్రభూ! 1361

పలు నృత్తంబులు గీతవాద్యములుసుద జర్వంగ నా దంపతుల్
సలుపుర్ వహ్నులకుం బ్రదక్షిణము సల్పన్ మూఁడు మా ర్లయ్యెడన్,
జ్వాల దుద్వాహ కలాప మంతయు సమాప్తం బయ్యె; నా దంపతుల్
సలుపుర్ సాగిరి వీడుపట్టునకు నానందాన; రామప్రభూ! 1362

696 కింక నాలసము; 697 లటం;

చనఁగా వీటికి నల్వు రా పరమ తేజస్వంతు, [688]లా వారి వా
రి నవోఢా సముపేతులై, దశరథోర్వీశ త్రయున్ వారి దీ
పన శోభా విభవంబు మెచ్చుచు, ఋషి వ్రాతంబు, బంధు వ్రజం
బును మిత్త్రులిల్, పరివారముల్ గొలువఁ బోవున్ వెంట; రామప్రభూ! 1363



688 లన్;

కడపన్ రాలిరి యట్టి; "భక్ష" మని పీకం దెల్లవారంగ, న
ప్పుడు గాధేయుఁడు నూత్న దంపతుల బ్రాపుంజేరి దీవించె; నా
పుడమీశాధిపు వీడ్కొనెన్ దశరథున్; భూభృద్వరంబైన యా
పడఁకుంగొంచ సమీప భూములసుఁ ద్రోవంబట్టె: రామప్రభూ! 1364

వెనువెంటం బయనంబుకట్టెఁ బరివారాఖిల్లం, బరివారమున్
దను గొల్వంగ నయోధ్యకా దశరథానంతాధిపుం డయ్యెడన్;
జనక క్ష్మాపతి కూఁతు లెల్లర కిడెన్ జాల్వా పసందైన భూ
షణముల్, బల్ సరిగంచు దుప్పటులవలున్ జామార్లు; రామప్రభూ! 1365

వెలకున్ మీఱిన పట్టుచీరలను, దెల్విన్ మించు [699]నేరాజులన్,
బలు లక్షల్ ధవళాశ్వమ్ములన్, హరుల, కుబ్జ వ్రాతముల్, కుంజరం
బులనుం గాల్బర, దాసదాసులను బెంపుం జూపి తా నిచ్చె మై
థిలుఁ డా కూఁతులకుం బ్రియాబ తరుబోక్షిప్తుండు; రామప్రభూ! 1366

కలధౌ తౌజస నాణ్య సంచయములన్, గద్యాణ కోశంబులన్,
వెల యింతంచు తనరాని ముత్యములనున్ వేలాదిగా విద్రుమం
బులనున్, లక్షలుగాఁగ రత్నములనుం బుణ్యాత్ముఁ డా తండ్రి యి
మ్ముల నిచ్చెం దన పుత్త్రికాళి కరణంబుల్ గాఁగ; రామప్రభూ! 1367

ఘనహౌ రీతిగ సాగనంపె జనక క్ష్మాపాలుఁ డా కోసలున్,
దన సీమాంతముదాఁకఁ బోయి, యట నంతన్ వీడుకోల్చెప్పె నా
తన వా రెల్లరకుం; బదంపడి కడున్ దైవారు క్లేశంబునన్
వెను కంజం దగ వేసె, స్వీయ పురికిన్ వేళంబ; రామప్రభూ! 1368

---

699 హారాబుల(లు)న్;

ఇచటం గోసలరాజు పుత్త్రసుతతో, నిమ్మైన కోదండ్రతతో,
సచివ వ్రాతముతో, మహర్షి తతితో, సైన్యంబుతో సాగిపో
పుచుసుండం, బొడగట్టె నెట్టయెదుటం బొంపొరుచున్ దుర్నిమి
త్త చయం, బాతఁడు భీతుఁడై గురుని పొంతం జేర; రామప్రభూ! 1369

గురునిం[700]జేరి, "మహానుభావ! మిగులం గ్రూరంబులున్, భీకరో
ద్ధురముల్ పక్షి సమూహముల్ దివమునందుం గ్రామీనిం గూయుచున్
చెనుగున్; భూమినిఁగూడ జంతు తతి వర్తిల్లున్ గుమిం జుట్టి ని
ష్ఠురమై యెల్లర; కంచుఁ జింతిలి వచించున్ రాజు; రామప్రభూ; 1370

మిగులన్ గుండెలు నావి వ్రీలి యవియుం, బేరెమ్మ వెట్టుం; గడున్
దిగులుం గల్గెడు; నేమి హేతువనకో! తెల్పంగదే! యీ గతిన్
దగులం గల్గుట" యంచు వేఁడు నృపతిం దన్మౌని వీక్షించి యీ
ష్పుగఁ దెల్పెన్ ధవ, మా నిమిత్తములు చొప్పుం జూపి; రామప్రభూ! 1371

ఫలముం జెప్పెద నిప్పుడే ప్రభువ! యస్థిర భ్రాంత కీరాళి కృత్
వింయాఖిల రుతంబులో తెలుపు నూన్మైన్ మహాత నుపద్ధి సం
చలనం బీ మృగ; క్రైననుమ్ మసలు జెబ్బం జుట్టు గి బంతుపుల
దెలుపుం తత్ స్థితి పాయుసం; దనియెఁ బ్రీతిన్ మౌని; రామప్రభూ! 1372

ధరణిం గంపిలఁజేయు ఝంఝయు విసరెన్; ధాత్రిన్ మహావృక్షముల్
విరివిం గూలె హఠాత్తుగా; రవియు వి స్ఫీభిన్ మఱుం గమ్మె; దె
వ్వరమై క్రమ్మెను జీకటుల్; ధూళులు నేర్చన్ వీలుగా దమ్మె; భూ
సరమౌ ధూళిని ముగ్గి సౌమ్యసితెఁ దత్సైన్యంబు; రామప్రభూ! 1373

700 గాంచి;

మునులున్ బ్రహ్మఋషీంద్రుఁడున్ నృపుఁడు, నల్వుర్ పుత్త్రికల్ దప్ప. త
క్కినవా రెల్లరునున్ విచేతనులునై కీడ్పాటునుం బొంద, సిం
హను మూఁ గెం దమసంబు; లీ జగము లేకంబుం బొనర్పంగఁ గా
ర్కొనెఁ జేసెన్ మసి, య న్నటుల్ దిశలు నల్పున్ మీఱె; రామప్రభూ! 1374

మెర గల్గన్ జలదంబునన్ మెలఁగుచున్ మిర్మిట్టులం గొల్పు భీ
కర శంపా కళయో! యనం గటిక చీక ట్లందు ద్యోతించె దు
ర్భర [701]తేజోమయ పుంజ మొం; డదియుఁ గొల్పన్ సాగె వేంద్రంబు, ని
ష్ఠుర కాలాగ్ని శిఖా జ్వాల జ్వలన సంశోభాన; రామప్రభూ! 1375

కడు దుర్ధర్ష సుమేరువో యనఁగఁ జీకట్లందునన్ వాటికిన్
బొడఁగట్టెన్ బహు భీకరుం డొకఁడు; బొప్పం జూడ, నె త్తెల్లఁ గెం
జడ లుండెం దగ దట్టమై; నిశిత తేజః పుంజమున్ జిమ్ముఁగా,
మెడలోఁ దాల్చెను గండ్రగొడ్డలియుఁ దత్ వీరుండు; రామప్రభూ! 1376

అపరాద్ధేతర మొక్క బాణమును దివ్యంబైన కోదండమున్,
రపణం బొప్ప ధరించి, దాని ద్యుతు లెల్లం బర్వ సర్వత్ర, యా
త్రిపుర క్రవ్యదు మారణంబునకు భీతిం గొల్పుచుం బోవు ని
ష్కృపుఁ డా రుద్రుఁడొ! నా, వతం డెదుట నిల్చెం బిల్చి; రామప్రభూ! 1377

తెలియన్ క్షత్త్రియ లోక మీతఁ డొగి మర్దించెన్; మహావీరుఁడై
వెలయున్ భార్గవరామ నామమునఁ బృథ్విం గల్గు తేజస్విలన్;
జ్వలి దగ్నిం బలెఁ దేఁకిల్లు నితనిన్ క్ష్మానాథుఁడున్ మౌనులున్
గలయం బొల్చుకొనంగసాగిరి మహోకష్టాన; రామప్రభూ! 1378

701 తేజః ప్రద;

తన తండ్రిన్ వధియించె క్షత్త్రియుఁ డొకఁ డం చాపంబుచే మున్ను జే
సెను సంహారము నెల్ల క్షత్త్రియుల నిశ్శేషంబుగా నీతఁ; డీ
తని కోపంబును దీఱె క్షత్త్రియులపైఁ ద ద్ధింసతో; నేల? వ
చ్చెనొ! యీ తోనని వెంచె? యంద్రుఁ మును లాక్షేపాన; రామప్రభూ! 1379

ఆయినం జూపఁగఁజాల్లు నీయనకు నెయ్యం; బింక రాఁబోఁడు క్ష
త్త్రియ సంహార నిమిత్తమై యని, మహర్షి వ్రాత, "మర్యాదులన్
ప్రియమా భార్గవరామ! కొ" మ్మనుచు నర్పించెన్, మృదూక్తిన్, లస
న్నయముం జూపుచు, భీకరాకృతికినైనం గాని; రామ ప్రభూ! 1380

పౌనరన్ మౌనులు తన్ను ముద్దెలయ సంబోధించి, యర్ఘ్యాదులన్
గోనఁ బ్రార్థింప నతండు, వానిఁ గొనియుం గ్రూరంబుగాఁ జూడ సా
గెను దాఁ గోసల రామచంద్రుదెసఁగాఁ, గెంపెక్కు నా చూపులున్
జెనచేయం గడు ద్వేష రోషముల యావేశంబు; రామప్రభూ! 1381



ఓయీ! రామపరామ! యద్భుతమూ సేయున్ విన్న నీ విక్రమున్;
వేయంజాలితివంట భర్గు ధనువున్ వీరాధివీరుండవై;
యేయంజాడుము, తెచ్చి తీ ధనువుఁ బ్రత్యేకించి నీకోసమై,
చూయంజేసి శరంబు దీనఁ; దనెఁ దద్దోశ్శాలి; రామప్రభూ! ౧౮౮౨

ఇది నా తండ్రిది; దీనిలోన దర మీ వెక్కింపు; నీ పెంపుఁ జూ
చెద; నిన్ మెచ్చెద; నేను గోరిపటులం జేయంగ నౌనేనిఁ జే
సెద నీ యొక్కటితోడనే రణము వాసింబట్టి; [702]ఎలా జామద
గ్నిదియే పౌరుష మన్నఁ బౌరుష; మనెన్ నిస్స్పృహి; రామప్రభూ! ౧౮౮౩

వినుచున్ భార్గవరామునిన్ దశరథోర్వీనాథు మో మెల్ల వె
ల్లన యయ్యెం; గడు దీనుఁడై యతఁడు మెల్లన్, "భార్గవా! మున్న తీ
రెను నీ కోపము క్షత్రి జాతిపయి; నోలిన్ శాంతిఁ గొన్నట్టి బ్రా
హ్మణ వర్యుండవునున్, యశస్వివి; ననెన్ మర్మాన; రామప్రభూ! ౧౮౮౪

తలఁపన్ నా సుతు లెల్ల బాలకులు; సంక్రాంత ప్రవీణుండవై,
మలఁపంగా పతిఁ దప్పు లున్నయెడ; నేమం జొప్పఁగా నౌ నదీ
తులఁ, జాంద్రాయణకాదులం బొలుపు నొందన్ నీ కులం బెల్ల; నెం
దుల కీ కోపముఁ జూపె దీ; వనుచు పలుదుం దండ్రి; రామప్రభూ! ౧౮౮౫

అల శస్త్రాస్త్రము లన్నియున్ వదలినా వాయింద్రు ముందుం బ్రతి
జ్ఞలతో; ధర్మ పరాయణుండవు పయి యీ క్ష్మామండలిం గాశ్యపో
జ్జ్వలహస్తీంద్రున కిచ్చినాఁడవుగదా! వాగంబుగాఁగన్ మహేం
ద్ర లస ద్భూధ్రముపైన నుండ; ననియెం ద త్తాత; రామప్రభూ! ౧౮౮౬

---

702 నావంటివానిదియే;

చనుదెంతే! యిట కిప్పు డిట్టుల సమస్తంబైన మా నాశనం
బునకుం దగ్గిరిపైన సల్పెడి తపంబున్ మాని; నీ వొక్క రా
మునితోనే రణ మందు; వాతనికి నిమ్మందప్పు గల్గంగ, నుం
డునె మా యెవ్వరి ప్రాణ మేని; యని యాతుం దంగ్రి; రామప్రభూ! 1387

వినియుం దా విననట్టు లయ్యె నతఁ డుర్వీపాలు వాక్యంబు లె
ల్లి నలక్ష్యంబునఁ; బిమ్మటన్ "దశరథేలాభర్తృ స త్పుత్రికా!
మును నీ ద్రుంచిన విల్లు, నీ విలును నొప్పున్ దేవలోకంబుపై,
ఘనమైనట్టివియై; యటం చతఁడు పల్కన్ సాగె; రామప్రభూ! 1388

విను, కోదండము లివ్వి రెండును మహా వీరాగ్రణీ! శ్రేష్ఠముల్,
ఘనముల్ మాత్రమెగాక ముఖ్యములు, [708]కార్కశ్యంబునన్ మేటు; లొ
ప్పను సారంబున నివ్వి; నిర్జరుల మెప్పుంగొన్న యా శిల్పి చే
సెనుబో! వీనిని విశ్వకర్మ; యనె నా సిద్ధుండు; రామప్రభూ! 1389

సుర లా రెంటను నొక్కదానిని మహేశున్ వేఁడి, తా మిచ్చియుం
డిరి, నాఁ డా త్రిపురాసురాహితుల సృష్టిన్ సంహరింపంగ, వెం
పర నొర్వంగను లేక; రెండవది ప్రేమన్ వార లర్పించి ర
షరుఁడౌ విష్ణున; కంచు భార్గవుఁడు పల్కెం జొచ్చె; రామప్రభూ! 1390

విరుతాఖిలము నీవు ద్రుంచినది యా విల్లైశ్వరం బోయి! భా
స్వర ధన్వం బిది విష్ణుదేవునిది; మున్ స్వర్వాసు లా విష్ణు శం
కర సామర్థ్యములన్ గుణించి తెలియం గంజాతజున్ వేఁడి, ర
బ్బుర మం దెంచియు; నం దనెం బరశురాముం డంత; రామప్రభూ! 1391

---

708 విక్రాంతంబునన్;

తలఁపన్‌బ్రహ్మయు సత్యసంధుఁ డగుటన్ దైత్యారి కేదారులన్
బలశాలిం దనుఁదానుగాఁ దెలుప నేమాత్రంబు నుల్లంబునన్
దలఁపం; డందులకై సృజించెను విరోధం బీశ్వరందున్ జిగీ
షులునై పోరఁగ; నంచు భార్గవుఁడు మెచ్చుం జూపు; రామప్రభూ! 1892

పెరిఁగెన్ వారి విరోధముల్ గ్రమముగాఁ బెచ్చై; జిగీషల్ పర
స్పరమున్ వర్ధిలె; యుద్ధముం గలిగెఁ; ద త్సంగ్రామ ముగ్రంబుగాఁ
బెరరేఁపంబడె; హుంకృతిన్ సలిపె నా విష్ణుండు; నద్దాన నీ
శ్వరు వి ల్లయ్యది కద్దిపోరె; ననెఁ దత్ శాంతుండు; రామప్రభూ! 1893

అల ఫాలాక్షుఁడు స్తబ్ధుఁడై నిలిచె; న య్యాదిత్యులున్ మౌనులున్
గలఁతం బొందిరి; విష్ణు శంకరు లిఁకం గ్రౌర్యంబులన్ మాని శాం
తిలఁగా నెల్లరుఁ గోరి; రీశ్వరుఁడు తా నీఁగోరె దివ్యాశి నా
విలు బాణంబులు దేవరాతున; కనెన్ వీరుండు; రామప్రభూ! 1894

ఆ విల్లే సుమి! త్రుంచినాఁడవు మహాహంకారివై [704]రాముఁడా!
యీ విల్లచ్యుతు విల్లు; త్రుంపు మిది నీ యే పంతయుం జూపి; తత్
శ్రీవిష్ణుండు ఋచీక మౌని కిది నిక్షేపంబుగా నీయఁగా
నా విష్ణుం డిడె నాదు తండ్రి; కనె నయ్యార్యుండు; రామప్రభూ! 1895

వినుమోయీ! జమదగ్ని నా జనకుఁ; డుర్విన్ లేఁడు నా తండ్రితో
డను బోల్పంగఁ దపో బలాధికుఁడు; క్రోధం దాతఁ డెన్నంగ మే
దిని సత్పూరుషులందు; నేర్పఁ డెపుడుం దీర్పంగ వైరంబు, బొం
దిని నేనిన్ విడు గాని; యం చనియెఁ దద్ధీరుండు; రామప్రభూ! 1896

---

704 రాఘవా!!

శర సన్న్యస్తుని నా పితం దమకియై శశ్వ త్తమో బుద్ధియై,
పరిమార్చెన్ మును గార్తవీర్యుఁ; డటులన్ క్రమంబింప రెవ్వార లె
వ్వరినేసిన్ బహు దారుణంబుగను; నేర్వఁగల్గితిన్ శస్త్ర సం
హరణం; బందును జామదగ్న్యుఁ డనె రోషావత్తి; రామప్రభూ! 1397

కక్షంగట్టితి క్షత్త్రియాళిపయి, శిక్షంజేయ నద్దానికిన్;
నిక్షాత్త్రిం బొనరింపఁబూనితిని నే నీ యుర్వి సర్వంబునున్,
దీక్షాపూర్తికిఁ జేసికొంటి భువి స్వాధీనంబుగా నంతయున్,
[705]ప్రేక్షాదక్షులు దద్దరిల్ల; ననె నా వీరుండు; రామప్రభూ! 1398

ఒక యజ్ఞం బొనరించినాఁడ; నపు డీ యుర్విన్ సమస్తంబు, వా
రక నే దక్షిణగాఁగ నిచ్చితిని ధర్మజ్ఞుండు, బుణ్యుండు, వై
ష్ణికుఁ డా కాశ్యప మౌని; కా పిదపఁ గోటిన్ సంయతిం జల్పు న
మ్మికతోఁ జోతి ననెన్ మహేంద్రమున కా వీరుండు; రామప్రభూ! 1399

అటు శాంత స్థిర చిత్తతం దపముసేయంగల్గుచున్నాఁడ ని
వ్వటిదాఁకన్: వినియుంటి నీ శివ ధను ర్భంగంబు వార్తాదిఁ బ్ర
స్ఫుటతన్; వచ్చి తిదం ధనుస్సుఁ గొనుచుం జూడంగ నీ బాహు సం
పటుతన్ నేఁ; డనె నాతఁ డెల్లెడ మెదన్ భాసింప; రామప్రభూ! 1400

ఒసియో! వైష్ణవ చాప; మిద్దియును నెంతే బూజ్యమున్ శ్రేష్ఠమున్;
మది, సాంక్రామిక భవ్య పైతృక ధన ప్రఖ్యాతినిం గూర్చు ని
య్యది నా; కింతకు నీవు క్షత్త్రియుఁడవే యైయున్నచో ధీరతా
స్పద బుద్ధిం బదికింపు దీని ననెఁ, ద న్మాన్యుండు; రామప్రభూ! 1401

---

705 ప్రేక్షిల్లోకము;

ఈ వి ల్లెక్కిడఁ జాలు; మే గలిసిగాని! దీని సంధింపఁ గాఁ
జేవం జూపుదు వేని, ద్వంద్వ సమరోత్సిక్తుండవౌ భాగ్యమున్
నోవంగల్గుదు వీవు నన్ గదిసి; యెన్నో! జన్మముల్ గాంచియున్
మోవన్ లే వెటువంటి కీర్తి; యనెఁ దర్ పూజ్యుండు: రామప్రభూ! 1402



అపమంతస్ విని నోర్మి దాశరథి యొయ్యన్; జన్ము సాన్నిధ్య గౌ
రవముంజేసి మితంబుగాఁ బలికె, "నౌరా! భార్గవశ్రేష్ఠ! ని
న్ను పరీక్షన్ వినియుంటి, నే మును పవర్గం గాఁగ నీ తండ్రి ప్ర
స్తవమం; దం చని పల్కు నెంచె, నతనిన్ శ్లాఘింప; రామప్రభూ! 1403

అనయం బా విషయంబునన్ నిను ననన్యాదృతుగా నెంతు; ని
న్ననువర్తింపఁగ నౌదు నందునను; సత్యం బిద్ది; యౌఁగాని, హే
లనముం జేసెదు వీర్యహీనుఁ, డపరాక్రాంతుం డనన్ నన్ను; నం
నె నా రాఘవ రాముఁ డా పరశు రామాభిఖ్య; రామప్రభూ! 1404

నను క్షాత్త్రింబును జూపు మం చనెదు; కానం జూపుచున్నాఁడఁ నే
జును నాదైన పరాక్రమం బిపుడె యంచుం గోప సందీప్తి భీ
షణుఁడై, బాణము విల్లు లాగికొనియెన్, శౌర్యాన నా జామద
గ్న్యుని హస్తంబుననుండి యూడిపడ, లోగొన్నట్లు, రామప్రభూ! 1405

శర సంధానముఁజేసె వింటఁ, ద్రుటిలో జ్యావల్లి నెక్కించి; భీ
కరుఁడై యప్పుడు, 'భార్గవా'! వినుము, షట్కర్మండవై పోయి, మా
గురు గాధేయుని బంధువున్ సయితమై కొల్వొందుచున్నావు; దు
ర్భర బాణం బిది [706]పిడఁజాల; ననె నైష్ఠా ఘుండు; రామప్రభూ! 1406

జన సామాన్యము నేయునట్టిది నిను ౦పంగఁ. బ్రాణంబులన్
దిను నీ బాణము నేయఁజాలఁ, గుల వశిష్ఠ ప్రధానుండ! ం
ఘన కోదండము దివ్యమైనదిసుమీ! గర్వోర్వి భూఖండముల్
పొనుపుచ్చెం జుమి! యందు పీవ! యనె రాముం డంత; రామప్రభూ! 1407

706 యేయఁజాల;

ఖలదర్పంబుల వేరెపై ననుసరే! భ్రమించు నీ బాణ ప
త్కాలిన్ము ప్రౌఢిమ నంచుఁ బల్కితివిగాదా! నీవె యో! పుణ్యుఁడా!
యిలపాలై యిది వ్యర్థపోవఁదగునా? యేర్పాటుగాఁ జెప్పుమీ!
పలుకన్ నేర్చినవాఁడ వీవ; యనె నైక్ష్వాకుండు; రామప్రభూ! 1408

తిరుగన్ నేరని బాణ మిద్ది యనుటన్ ధీశాలి! నీ పాద సుం
దర సంచార సమర్థతన్ దిగుతునో! ద్రాఘిష్ఠమౌ నీ తపో
వర సామర్థ్యముకూర్చు పుణ్య జగతీ ప్రాప్తవ్య సామర్థ్యమున్
బొరిపుచ్చం దగునో! వచింపు; మనె రాముం డోర్మి; రామప్రభూ! 1409

ధనువున్ సజ్యముఁజేసి దివ్య రుచులన్ దాఁ దేజు లీసంగ, రా
ముని దర్శింప మహాబుధుల్ దివిజులుం బొల్పారు గంధర్వ చా
రణ సాధ్యుల్ గరుడోరగాది చయముల్ బ్రహ్మానుసంధాయులై
చని రచ్చోటికి; భూమి కల్లువడె, [707]జల్లల్లించు; రామప్రభూ! 1410

నిర్వీర్యుండయెఁ గార్త్తవీర్య రిపువున్; నిశ్ఛిద్ర తేజంబునున్
సర్వం బాతని దంతరించె; జడుఁడై, స్తబ్ధ స్వరం బేర్పడన్,
గర్వం బెల్లను ఖర్వమై పలికె, నైక్ష్వాకప్రతాపరవి దాఁ
బర్వన్, దిక్కులు పిక్కటిల్లఁగను ద క్రాంతాన; రామప్రభూ! 1411

మును రామా! భువి యెల్ల దానముగఁ బుణ్యం బంచు నే నిచ్చితిన్;

జనముల్ మెచ్చఁగఁ గాశ్యపర్షి: కతఁడో శాసించె నీ దేశమం
దున నే నుండఁగ రా దటం; చని మొదల్ తోపంగ, నేనుండ మే
దినిపై రాత్రులయం; దటం చనియెఁ ద ద్దీనుండు; రామప్రభూ! 1412

707 జల్లల్లొంచి;

గమనింపన్ వలెఁ జీకటుల్ పడకయే, గంభీరుఁడా! వాయు వే
గముతో నేను మహేంద్ర కూటమునకుం; గాఁబట్టి, నా పాద స
ద్గమ నావృత్తును నేయవద్దు; తపసో గాథ ప్రపుష్టంబు పు
ణ్యముసే నాయది త్రుంపు; సం చనియె నయ్యార్యుండు; రామప్రభూ! 1413

ఇపు డాలస్య మిదేలనో! వదలు మోంబా! బాణమున్ వెంటనే
వృషనిష్టం బగు బుణ్యసంపదపయిం; బ్రఖ్యాత మీ వింటి నీ
వెపు డారోపణముం బొనర్చి తపుడే యే నెంచితిన్ నిన్ బరం
తప! విష్ణుం డని; యం చతం డనియె సద్భావాన; రామప్రభూ! 1414

అసదృశ క్రవ్యుండవు; ప్రపతి ద్వయుఁడవున్ సాక్షాత్తు నీ వక్షయ
ప్రసమీకుండవు; లోకనాథుఁడవు; పరమాత్ముండవు; వో రామచం
ద్ర సమారూఢ లస ద్యశో విశద! భద్రంబౌను మీ కెప్పుడున్;
ప్రస్తుతాచారుఁడ! పం చనెం బరశు రామస్వామి; రామప్రభూ! 1415

నిను బోలంగలవానిచే నిటులుగా నే నోట కేమాత్రమున్

జన విప్పట్టున సిగ్గునొంద; దివిజ స్కంధంబు నిన్ జూడఁగా

జనుదెంచెన్ బహు సువ్రతా! శరము పెల్చన్ వీడుమీ! నిగ్రహిం
చుము నింద్రాద్రి; కటంచు భార్గవుఁడు పంతున్ వీడె; రామప్రభూ! 1416

వితత స్థావరుఁడైన నాథుఁడు దోర్వీర్యాన నేలంగ స్వా
ర్జితమౌ, బుణ్య తపః ప్రభావ మది వ్యర్థీభూతమై, సర్వమున్
హతమైపోయెను జామదగ్న్యునకు, నా యస్త్రింబునంజేసి; సం
తత పుణ్యుం డగు భార్గవుం డపుడు వింతం గొల్చె; రామప్రభూ! 1417

వినయానన్ రఘునాథునిన్ వలగొనెన్; విశ్వేశుఁ డన్ భావనన్
బ్రణుతిం జేసె; మహేంద్ర కూటమునకున్ మారాడ కాతండు సే
రెను; దిగ్జాలము చీకటుల్ విరిసె; సుశ్రీమద్ధనుర్ధారి రా
ముని, బృందారక బృందముల్ వొగడుచుం బూజించె; రామప్రభూ! 1418



-౭౭-

కౌసియెన్ రాముఁడు కాంతి; యమ్మును మహాకోదండముం గూర్చ ని
చ్చెన్ము మైత్త్రిన్ వరుణాదితేయునకుఁ; జేసెం దా వశిష్ఠాదికిన్
బ్రణతుల్; విహ్వలుఁడైన తండ్రిఁగని, దేవా! భార్గవుం బారఁ ద్రో
లినవాఁడం; బయనంబు సెప్పఁ; డని ప్రాతెం గాళ్ల; రామప్రభూ! 1419

తొలి వర్షాంబు ప్రవృష్టకర్షకాంబులకు సంతోషంబుచేతన్ నిరీ
క్షలలో మున్గెడి చాతకంబు లయి, యాజ్ఞార్థ మీవి వాంఛించి సే
నలునున్ సల్పఁ బ్రతీక్షణంబుఁ జనఁగా నానంద మేపారఁ గో
సల; కం చాడె సుతుండు గోసఁబని వాజ్ఞల్ గోరి; రామప్రభూ! 1420

విని యా పల్కులు ప్రీతిమై దశరథోర్వీనాథుఁ డా రామచం
ద్రుని గౌఁగింటను గ్రుచ్చి, మూర్ధమునయందున్ మూర్కొనెం; బుల్క లె
త్తెను దత్తాత శరీర మెల్ల; సుతుఁ దొందెన్ మాబు జన్మం బటం
చు నతం డెంచె; ముదంబునం బలికె మెచ్చుల్ పెచ్చు; రామప్రభూ! 1421

ఎలమిన్ సేనలు సాగ నాజ్ఞలు సనెన్; హేళిన్ మహారాజు కో
సలకున్ సూనులనున్ స్నుషల్ గొలువఁగా జన్దెంచుచున్నట్లు వా
ర్తలునున్ వచ్చెఁ బురీజనంబులకు; వారల్ వేగమే యెత్తినా
రలు, నానావిధ వర్ణ కేతుపుల నుల్లాసించి; రామప్రభూ! 1422

కలయంపిం జిలికించినారు పునుగుం గస్తూరినిం; ద్రు

మ్ముల నాణెంగల ముత్తియంబుల గమిన్ ముగ్గుల్ పచారించినా
రలు, పూలం గయిసేసినారు, పుర మెల్లన్ వీథి వీథిన్ జనం
బు, లయోధ్యాపుర మా కుబేర పురహాసం బొల్లంగ; రామప్రభూ! 1423

పురమెల్లం గయిసేఁతఁ దేలఁగ, మహాభూపాలునిం దేరఁగా
వసనం బౌరజనప్రధానులును బ్రాహ్మణ్య ప్రధానాదులున్
[708]దారకొల్పం జనినారు వేగముగఁ బ్రత్యుత్థానమున్, స్వాగతం
బు రహిం బల్కి నృపాలు నెమ్మదికిఁ [709]దన్పుం గొల్పు; రామప్రభూ! 1424

తన కోడండ్రు కొమార్తనున్[710]బలిసి చెంతన్ రాఁగ, శ్రీమంతులన్
గొని యవ్వారి నయోధ్యఁ జొచ్చె నపు డుత్కోమ్ముండు త ద్రాజు, హ్లా
దనముం దీఁగెలు సాగ; మంగళ సువాద్యంబుల్ శ్రవోరంధ్ర కేం
ద్ర నిహాఢిం గడు నేర్పు లేర్పడఁగఁ దార్కాణింప; రామప్రభూ! 1425

వరుసన్ జానపదుల్ పురీజనులు న్విన్ బారులై తీర్చి సుం
దర వీథీ ప్రకరంబునందు, ముదమొందం జిత్ర వృత్తంబు, లా
ధరణీకాంతుఁ, డజ ప్రియాత్మజుఁడు, మోదం బేదఁగాఁ జొచ్చె మం
దిర మాత్మీయము; నద్ది మందర మహాద్రిన్ దిద్ద; రామప్రభూ! 1426

ఆమితానందముతోడవచ్చి రెదురై యంతఃపురస్త్రీలు గం
ధముఁ బుష్పాదుల నిచ్చి గౌరవముతోఁ ద ద్రాజునుం బుత్త్రి యు
క్తముగా, నూత్న వధూ యుతంబుగను సంత స్సౌఖ్యముం జేర్చి; రి
ద్ధములం జింద విధంబునం దనీ పసందై యుంత; రామప్రభూ! 1427

ఆటఁ గౌసల్య, సుమిత్త్రియుం గయిక, మున్నై యున్న రాజాంగనా
పటలం, బాదర మేదురంబుగ స్నుషా వారంబునుం గ్రుచ్చి కౌఁ
గిఁటిలోఁ జేర్చెను; మాట మంతి ముగిసెం; గ్రీడా సరస్స్వాద హూ
దటఁ గోడండ్రను జేర్చు, వారలును స్నాతల్ గాఁగ; రామప్రభూ! 1428

708 దారయింపం; 709 దికి మెల్పుం; 710 నుం గలిసి;

ఘనత శ్వశురుఁ, డా వధూమణులకుం గల్గించి రందంపుఁ జం
దన చర్చన్; నును బట్టుచీరలను చెంతన్ నిల్చి కట్టించి; రొ
ప్పిన భూషల్ కయి సేయఁజేసి; రటుపైఁ బ్రఖ్యాత దేవాలయం
బునఁ జేయించిరి వారిచే విధివిధిం బూజాది; రామప్రభూ! 1429

ఆల దైవంబు సమక్షమందు, గుడిలో నా యత్త లెల్లారికిన్,
విలస త్పూజ్యనకున్ నమస్కృతులు పేర్మిన్ సల్పి యవ్వారితోఁ
గలయంగూడి, కుబేర మందిరమునన్ గాంతిల్లు రౌట్సౌధమం
దలి స్వ స్వౌకములందుఁ జొచ్చిరి స్నుషల్ దా మెల్ల; రామప్రభూ! 1430

ధన ధాన్యంబుల, గోధనాది నటకుం దా మా స్నుషల్ సేర్చి, బ్రా
హ్మణ వర్య ప్రకరంబు నచ్చటకుఁ బిల్వంబంచి దానంబు చే
సిన, నా బ్రాహ్మణ వర్యు లా స్నుషల వాసిన్ మించి రాశీస్సులం
దున, సౌభాగ్యముతోడ వర్ధిలఁగఁ గాంతుల్ మెచ్చ; రామప్రభూ! 1431

కలియం బోయిరి పిమ్మటన్ స్నుషలు నేతాంతంబులన్ భర్తలన్;
తెలఁగెం గొన్ని దినంబు లిట్టులనె, నా చిన్నారి కోదండ్రకున్;
మెలఁగెం దండ్రికిఁ గైకజుం బనుప నెమ్మిన్ భావమున్, వాని మా
తులతోఁ, బొందఁగఁ గేకయాధిపుఁడు సంతోషంబు; రామప్రభూ! 1432

భరతుం జూచి, "కుమార! నీకొఱకు మీ మాతామహుం డంపె, స
త్వరమే తేరఁగ నిన్, యుధాజితునిఁ బూర్వం బెన్నఁడో! మైనపున్
వరుఁ డీ వైన దినంబు లిచ్చి యగుటం బంపింపలేనైతి వే
గిరమే; యిప్డిఁకఁ బోయి ర మ్మనియె, సక్షిం దండ్రి; రామప్రభూ! 1433

'పరమానందము నొందుఁ దాత', యని తత్ శ్లాఘ శ్రద్ధ వర్ణింపఁగా,
భరతుండుం బయనంబుఁ గట్టె; జననీ వర్గంబునుం దండ్రినిన్
వరమున్ జ్యేష్ఠుని భక్తిమై వలగొనెన్; బ్రహ్మాంజలిం గూర్చె; సో
దరునిన్ లక్ష్మణుఁ గౌఁగిటన్ సలిపె బందాకోరు; రామప్రభూ! 1434

చనుదెంతుం ద్వరలో నటంచు సెలవుం జయ్యంగొనెన్ వారు మె
చ్చ నతం; డాదట వెంటఁగొంచుఁ జనియెన్ శత్రుఘ్నునిం బ్రీతితో
వినయోపేతు గిరివ్రజంబునకుఁ, గూర్మిన్ మామయున్ వెంటరాఁ
గ, సుపేంద్రేంద్ర నయూథతన్ మెఱపె నాఁగన్ రక్తి; రామప్రభూ! 1435

ఇరువుర్ పుత్త్రులు నల్వురై తనను దా మేవేళలం గొల్చుచున్
భరత భ్రాతలు లేనిలోపమును దీర్పం దండ్రియున్ రాగిలెన్;
దరువాతం బిత్రు వాక్కు రాఘవుఁ డయోధ్యన్ క్షేమ యోగంబులన్
గురిపించెం, బురవాస కార్య విని మగ్నుం డౌచు; రామప్రభూ! 1436

దినముం జిత్తములోఁ, బ్రజాహితములై దీపించు కార్యంబులే
జెనఁగం, దత్పరతన్ మెలంగియును, గావించున్ యథా వేళలన్
జననీ జన్య గురు ప్రసిద్ధ జన సంస్తోయ ప్రసేవాదులన్
మనముం జొన్పి తదీయ కార్యముల నైపుణ్యండు; రామప్రభూ! 1437

నడపం గల్గె నతండు నిత్యములునున్ నైమిత్తికంబుల్ పనుల్,
గడు శ్రద్ధం దగు కాలమందునన; తాఁ గార్యంబులన్ సల్పు నా
వడి దేశాంతర వర్తకోత్తముల క్షత్రం బయ్యెఁ; బౌరాళి, యా
కడిమిం జాతురినిన్ స్తుతించు టొక వీక్ష్యం బౌనె?; రామప్రభూ! 1438

ఎన్నో! రాచరికంపు( గార్యముల (దా నెంతో! పసం జేయుచున్,
మిన్నుల్ పడ్డను వాని నేమరక యోర్మిన్ వ్యగ్రుఁడై కూడ, నా
యన్నుల్ మిన్నను సీతనే మనమునం దాసక్తితోఁ ప్రేమ సం
పన్నత్వంబునఁ జేసి నిల్పు రఘురామస్వామి; రామప్రభూ! 1439

తన సౌశీల్య సుషు్ప్రవృత్త్వభావములు, సౌందర్యాతిసౌజన్య స
ద్గుణముల్ మాత్రమె సీత, వా పతి మదిం గొల్పంగఁబోలేదు ప్రే
మను; [711]జన్యుం దల యోజనల్ సలిపి సమ్యగ్భావనం గూర్చినం
దునసుం[712]గల్గెను ప్రేమ యాతనికి నన్నుంగూర్చి; రామప్రభూ! 1440

నలు వా జానకియందు నాథునకుఁగన్నన్, సీతకే భర్తపై
మొలవంజొచ్చెను నిబ్బడిన్ వలపు లొప్పంబట్టి; య ట్లయ్యనున్
దంఁపుల్ సీతవి యెంత గూఢములునున్ ద న్నాథుఁ డిట్టే మదిన్
దెలియంగల్గెడివాఁడు, ప్రేమ సవి నిర్దేశింప; రామప్రభూ! 1441

శతథా మైథిలి యామె; మైథిలులకున్ స్వత్వంబు గల్గం బరేం
గిత విజ్ఞాన మపారమై; మఱియుఁ [718][illegible]త నైమ్మిథిలో
ద్భృత రాజన్య కుమారి; యందుపలనన్ దీపించు నా యోజనా
ద్భృత సామర్థ్యము లామెయందు నెగడెన్ భూయస్సు; రామప్రభూ! 1442

పరగున్ రూపమునందునన్ దివిజ భామన్ మించి; ప్రౌగల్భ్య భా
స్వరతన్ లక్ష్మిని గ్రించుసేయు; పరుభావం బా వరున్ మించి ధీ
పరయై యామె యెఱుంగు; గాఢమగు ప్రేమం ద ద్రతిన్ మించు; సుం
దరియౌ నాయమ భర్తృభాగ్య మెవ రెన్నన్ వచ్చు?; రామప్రభూ! 1443

---

711 కన్నయ్యయు; 712 నే; 718 యు నా మీనాక్షి;

పతి యా పత్నినిగూడి యోగ్యమని చెప్పంజెల్లు శత్రుఘ్నుతూ
చిత భోగంబుల నొందుచుండె, మితమై చెన్నారు కీర్తిం దదం
చిత రాజాంగనతోడ, విష్ణుం డటు లక్ష్మీదేవితోఁ బోలె, న
ధృతుఁడై రంజిలు కౌసలేయుఁ డొకఁడే స్తుత్యుండు; రామప్రభూ! 1444

ః బాల కాండము సర్వము సమాప్తము ః



ఆనవ ద్యావుక భక్తి యుక్త యగు స్వాహాదేవి, వైద్యుత్ సు శా
స్త్ర నిగూఢార్థ విశారదా ప్రమద; మించన్ విద్యలోఁ గృష్ణమూ
ర్తి నిజ స్వామియుఁ గాఁగనున్, 'మహతి' యంతిం గూఁతురై, 'రాజు'నున్
దనయుండై తనరంగ, నా కగును సూన శ్రేష్ఠ; రామప్రభూ! 1449

అనుకూలంబుగ నాంధ్ర మందునను, వైద్యామేయ శాస్త్రంబునన్
గణుతిం గాంచిన యద్ధి, మ త్సుతల సంఖ్యం దాఁ దృతీయంబు; ల
క్ష్మణ సుస్వామికి భార్య; పేర్వడె 'సుహాబాలా' విదం 'బాపనిన్'
గనె 'శ్రీదేవి'ని నిర్వరన్ సుతలుగాఁగం దాను; రామప్రభూ! 1450

నిశ్చింతుం, డురు రాజ కార్య ఘటనా నిర్ణిద్రుఁడున్, ధర్మ దృ
ష్టిశ్చిన్వ ద్భవుల శాస్త్ర వాఙ్మయుఁడు; నిర్ణేతవ్య శాస్త్రార్థముల్
పాశ్చాత్యాంగ్లపు ఛందమందునను జెప్పం[721]జన్న ధీరుండు, భూ
యశ్చారిత్రుఁడు, వేంకటేశ్వరుఁడు నా [722]యర్భకుండు; రామప్రభూ! 1451

తనువుం బొందినయట్టి యద్వయమునుం, దర్కా స్వరూ[723]పుండు పం
చిన యన్నయ్య; సుసంతతిం గనిన సచ్చీలుండు; సుగ్రామణి
ప్రణుత ప్రజ్ఞుఁడు, సోదర ప్రియుఁడు రామారావు, తాఁ గష్టజీ
వనుఁ [724]డయ్యున్ సుఖజీవి, నీ జవిసి పే[725]ర్వాఁడౌట; రామప్రభూ; 1452

ఉరు బాహాబలిశాలి, సుందరుఁడు, ధైర్యోపేతుఁడున్, దీర్ఘ సు
స్థిర సంప ద్విభవుండు, వాగ్మియును, హిందీ వాఙ్మయాంభోధి మం
దరుఁ, డాచార సునిష్ఠితుం, డమిత సౌదర్య ప్రదీప్తుండు, వి
స్ఫురితేజోగ్రుఁడు, సుబ్బరావు, పెదతమ్ముం డౌను; రామప్రభూ! 1453

---

721 గన్న; 722 క; 723 పంబు; 724 డౌటన్; 725 వాఁడయ్యె!;

అనయంబుం బ్రతిభా సమన్వీక్షిత విద్యావేది, విజ్ఞాన శా
స్త్రీ సహోద్య ద్విషయ ప్రబోధన పరాచార్యుండు, సాంగ్గేయ వి
ద్య నధిష్ఠాత, సహోదర ప్రియుండు, భక్త్యంబోధి గంభీరుఁడౌ
జిన తమ్ముండు, త్రివిక్రముండు, సుగుణ స్నిగ్ధుండు; రామప్రభూ! 1464

:- బాల కాండము సమాప్తము :-

